MADRAS GOVERNMENT ORIENTAL MANUSCRIPTS SERIES No. 35.




# చొక్కనాథ చరిత్ర

పచ్చ కప్పురపు తిరువేంగళరాజ ప్రణీతము

# COKKANĀTHA CARITRA

BY

**PACCAKAPPURAPU TIRUVEṄGAḶARĀJU**

EDITED BY

T. CHANDRASEKHARAN, M.A., L.T.,
*Curator, Government Oriental Manuscripts Library, Madras*
*and the Staff of the Library.*

*Under the orders of the Government of Madras*

PRINTED BY THE SUPERINTENDENT
GOVERNMENT PRESS
MADRAS
1954

# INTRODUCTION

There are three manuscript copies of Cokkanātha Caritra in the Government Oriental Manuscripts Libray, Madras, bearing Nos. D. 1051, D. 1052 and D. 1053. Of these, the first is a paper manuscript and the other two are palm-leaf manuscripts and they are in much injured condition. The paper manuscript is a copy prepared from the two palm-leaf manuscripts under the instructions of C. P. Brown. The present edition is based on this paper manuscript.

The author of this work is Paccakappurapu Tiruvēṅgaḷarāju. He belonged to Bhaṭṭarāja community. The term 'Paccakappurapu' was at first a title conferred by the rulers of those days and subsequently it became the surname of that family. The author's grand father Timmarāju and his grand-uncle Ayyalarāju were conferred the title of Paccakappurapu by Prauḍhadēvarāja who was pleased with their scholarship. Timmarāju had a son called Tipparāju and the present author Tiruvēṅgaḷarāju is the son of this Tipparāju. He was a devotee of the Goddess Ēkavīrādēvī known as Orugaṇṭmma on the banks of the river Ceyyēru. At the request of Cinarāma Nṛpati, son of Gōḷḷa Basavabhūpāla, this work was dedicated to his brother Peda Rāma Nṛpati. These two persons were the chieftains at Tirupattur in Ramnad District under Acyutadēvarāya and they belonged to Kamma community and Pippala Gotra. They were the disciples of Vyāsatīrtha.

In the Śaka year 1460 Viḷambi (A.D. 1538) Peda Rāma Nṛpāla made a grant of the village Śāntamaṅgaḷa to the temple of Tiruttaḷi Nāyanār at Tirupattur in honour of his master Acyutadēvarāya. Further in an inscription dated Śaka year 1462 Śārvari (A.D. 31—12—1540) preserved at Tirupati, it is stated that Gōḷḷa Cinarāmappa and his elder brother Peda Timmappa made a grant of 15000 Paṇams to Sri Veṅkatēśvara of Tirupati. On the basis of the above two grants, the date of the donors who were also the patrons of the author of the present work is fixed as 1538—1540 which consequently is the date of the present author.

This work is variously called Cokkanātha Caritra, Cokkanātha-vilāsamu, Cauṣaṣṭilīlāvilāsamu and Madhurāpurāṇamu. This is the first Telugu rendering of the Sanskrit work known as Hālāśyamāhāṭmya and Madhurākhaṇḍa. The metre employed in this is Dvipada.

Later writers Mallampalli Buccikavi and Tirumalaśeṭṭi Jagannātha Kavi have written this in the form of a Campu. Kaluve Nañjarāja of Mysore has written this in prose. The well-known Sanskrit poet Nīlakaṇṭha Dīkṣita has written this in Sanskrit with the title "Śivalīlārṇava" in twenty-two cantoes.

The style and language employed in this work is elegant but a few metrical flaws have crept in some places.

This work deals with the sixty four divine deeds of Lord Śiva, i.e., sixteen in each of the four Yugas, including his marriage with Mīnākṣī Dēvī, daughter of Malayadhvaja Pāṇḍya of Madura. Hence the work is also known as 'Caușaṣṭilīlāvilasamu'. It is hoped that this work will be received in a deserving manner for its literary importance as well as the subject dealt with in this book.

T. CHANDRASEKHARAN,
*Curator.*

Government Oriental Manuscripts
Library, Madras-5,
*Dated, 28th September* 1954.

# పీఠిక

చెన్నపురి ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున ఈ "చొక్కనాథ చరిత్ర"కు మూఁడు ప్రతులు గలవు. అవి డి. నెం. 1051, 1052, 1053 రు లలో వర్ణితములు. మొదటిది కాగితఁపుఁబ్రతి. కడమవి తాళపత్త్రప్రతులు. తాళపత్త్రప్రతులు మిగుల జీర్ణావస్థలో నున్నవి. ఇవి మాతృకలుగ మొదటి కాగితఁపుఁ బ్రతి ప్రౌఢదొరగారిచే వ్రాయింపఁబడినది. అది యాధారముగ ముద్రణప్రతి సమకూర్పఁబడినది. మాతృకలోఁ గొన్నియెడల నాశ్వాసాంతద్విపదలు లుప్తములగుటను గ్రంథాంతమున "శ్రీ చొక్కనాథ చరిత్రమందున నిది నవమాశ్వాసమయ్యె" అని యుండుటనుబట్టి యథాయోగ్యముగఁ దిరిగి ఆశ్వాసవిభాగము చేయఁబడినది. ఈ—

## కృతికర్త

పచ్చ కప్పురపు తిరువేంగళ రాజు. ఈయన భట్టు రాజు.

> "నిటలాక్ష పదభక్తి నియతిఁ బెంపాఱు
> భటువంశమున మెచ్చు పచ్చకప్పురము"

పచ్చకప్పురము తొలుత రాజ సమ్మానప్రాప్తమై పిమ్మట గృహనామముగ స్థిరపడినది. ఈ కవి తాత "తిమ్మరాజును" దత్సోదరుఁడగు "నయ్యలును" వమ వైదుష్యముచేఁ గర్ణాటాధీశ్వరుఁడగు ప్రౌఢదేవరాయలను మెప్పించి యాతనిచేఁ బచ్చకప్పురపు రాజు అని ప్రశంసింపఁబడిరట!

> "అనఘుండు మీ తాతయగు తిమ్మరాజు
> తన తమ్ముఁడయ్యలు దాను నిమ్మహిని
> బ్రౌఢుఁడై విద్యలఁ బరగ మెప్పించి
> ప్రౌఢరాయలచేతఁ బచ్చకప్పురము
> రాజు నాఁబడె."

ఈ తిమ్మరాజు పుత్రుఁడు తిప్పరాజు. ఇతని కుమారుఁడే ప్రకృతగ్రంథకర్త తిరువేంగళరాజు. వీరు పారంపర్యముగ వైదుష్య సంపన్నులవలె తోఁచుచున్నారు. సామాన్యముగ ఈ కులస్థులే అట్టివారు. ఈ కవి చెన్నేటిదరిని ఓరుగంటమ్మ యను పేర వెలసిన యేకవీరాదేవి భక్తుఁడు.

ఈ కావ్యము గోళ్ల బసవ భూపాల పుత్రుఁడగు చినరామనృపతి యభ్యర్థనచే నతని యగ్రజుఁడగు పెదరామనృపతి కంకితముగ రచింపఁబడినది. ఈ సోదరు లిరువురు అచ్యుత దేవరాయలయొద్ద సామంతులు. కమ్మ వంశజులు. రామనాథులోని

తిరుపత్తూరు సీమకు నేలికలుగా నధికృతులు. వీరిది పిప్పాలగోత్రము. వీరు వ్యాసతీర్థ ప్రియ శిష్యులు. కృతిపతియగు పెదరామనృపతి గ్రంథాంతమున నిట్లు సంబోధింపఁ బడినాఁడు—

"అరుణాచలేంద్ర పూజామోద విభవ !
ధరమించు నన్నసంపలి పురాధ్యక్ష !
ప్రియ బంధుపేన ప్రైత ! పిప్పాల గోత్ర !
* * *
తగమించు వ్యాసతీర్థ ప్రియశిష్య !
గుణాఢ్య పరస్తీ సోదర చరిత !
అయతోన్నత శౌర్యుఁడచ్యుత దేవ
రాయ ప్రతాప కార్య ధురంధరుండ !
అంచిత కొదపు నాయంకరిగండ !
మించి వర్తించు స్వామి ద్రోహరగండ !
చేకొన్న యవనూరి సింహాభుజాంక !
* * *
చిన రామ విభువర జ్యేష్ఠ సౌభాగ్య !
బసవ భూపరతపః ఫల సత్కుమార !
వసుధ గల్గిన కమ్మ వంశ వర్ధనుఁడ !
భాగొప్పఁ దిమ్మ మాంబాదేవి గర్భ
సాగర సంభవ సంపూర్ణ చంద్ర !
* * *
లలిత కీర్త్యభిరామ లావణ్య సోమ !
విలసిల్లు పెదరామ విభవ సుత్రామ !"

* ఈ పెదరామ నృపాలుఁడు తమ యేలికయగు నచ్యుతదేవరాయల పుణ్యమునకై శా.శ. 1460 (క్రీ.శ. 1538) విలంబి సం॥ దక్షిణాయన పుణ్యకాలమునఁ దిరుపత్తూరియందలి తిరుత్తళి నయనారు దేవాలయమునకు "శాంతమంగళ" మను గ్రామమును దాన మొనరించి శాసనము వేయించినాఁడు.

మఱియును, ఈతని సోదరుఁడును ప్రకృత కృతి ప్రేరకుఁడునగు గోర్ల చిన రామప్ప, అతని యన్న పెద తిమ్మప్పయుఁ దిరుపతివేంకటేశ్వరుల తిరువీధి యుత్సవముల నిమిత్తము 15,000 పణములు శ్రీ భండారమున కర్పించినట్లు తిరుపతిలో శాసనము గలదు. శాసనకాలము శ. 1462 శార్వరి. (క్రీ. శ. 31-12-1540) ఈ శాసనకాలమునకు చిన రామప్ప రామనాడు జిల్లానుండి చంద్రగిరి రాజ్యమునకు మార్చఁబడినట్లు ని వేదికయందు సూచింపఁబడెను.

---

* చూ. 1949 జూలై 1 భారతి.
కవికాల నిర్ణయము—శాసనాధారములు.
శ్రీ నిడుదవోలు వేంకటరావు.

పై యాధారములనుబట్టి కృతిపతులకాలము (క్రీ.శ. 1538-40) నిర్ణీతమగుట వలనఁ దత్పోష్యుఁడగు నీ కవి కాలముగూడ నదియేయని యేర్పడుచున్నది.

ఈ కావ్యమునకుఁ "చొక్కనాథ చరిత్ర", "చొక్కనాథ విలాసము", "చౌషష్టి లీలావిలాసము", "మధురా పురాణము" నవియుఁ బేర్లు. హాలాస్య మాహాత్మ్యము, మధురాఖండము నని నామాంతరములుగల సంస్కృత పురాణ గ్రంథమునకు దొరకినంతలో నిదియే మొదటి తెనుఁగు సేతయని యూహింపనగుచున్నది. ఇందు సౌలభ్యమునకు వ్యాప్తికి ద్విపద స్వీకరింపఁబడినది. వస్తు సాదృశ్యమును బట్టియును.

అర్వాచీనులు మల్లంపల్లి బుచ్చికవి, తిరుమలసెట్టి జగన్నాథకవి ప్రభృతులు దీనినిఁ జంపూరూపమున ననువదించిరి. మైసూరు దొడ్డరాజు దళవాయియు నైకవచన ప్రబంధ కర్తయునగు కళువె నంజరాజు దీనిని వచనముగఁ జేసెను. (ఈ గ్రంథాలయమున డి. నెం. 1465, ఆర్. నెం. 215 రులలో వర్ణితము.) ఇది యముద్రితము.

సంస్కృతమున అప్పయదీక్షితుల తమ్ముని మనుమఁడును సుగృహీత నామధేయుఁడును నగు శ్రీ నీలకంఠదీక్షితులు దీని నిరువదిరెండు సర్గములలో "శివలీలార్ణవ" మను పేర రసోత్తరమగు సర్గబంధమునుగా రచించెను. ఈ తెనుఁగురచన విద్వత్పరితోషము కన్న తదితరజనసౌలభ్యమునే యెక్కువ దృష్టియందుంచికొని, సాగినట్లు కనుపడుచున్నను వస్తుగత మాధుర్యమును గథావైవిధ్యమును సర్వహృదయముల నాకర్షింపఁ జాలినవైయున్నవి.

ఇందలి యాఖ్యానశైలియు వర్ణనాశైలియుఁ బ్రౌఢము అనుటకన్నఁ బ్రసన్నము అనుట మేలు.

లాక్షణిక దృష్టికిఁ గొన్ని వైరిపదములు, విసంధులు తగులకపోవు. ద్విపదను బరిపాలించిన శివకవులే దానికి లక్షణములవలని జంజాటమును గొంత సడలించిరి. ఇతఁడును వారి మార్గమునవాఁడే.

కృతిపతులు మాధ్వమతానుయాయులైనను, కవి—"నిటలాక్ష పదభక్తినియతిఁ బెంపొందుఁ భటువంశ" జుఁడగుటయు, నితివృత్తరమ్యతయు దీనిని వస్తువుగఁ గైకొనుటకు హేతువులని తోఁచుచున్నది. ద్విపదయు శైవగంధము గలది.

కాని బసవపురాణకథలయందలి వీరవ్రతముగాని, ఊష్మలతగాని యిందలి కథలలోఁ గానరాదు. భక్తజనముల మ్రుంగిటి వేల్పుగిడ్డియగు శ్రీ సుందరేశ్వరుని నిర్వ్యాజ కృపాపరతంత్రభావమే యిందలి ప్రతి కథయందును వెల్లివిరియుచున్నది.

మలయధ్వజపాండ్యుని కుమారిక మీనాక్షీదేవిని వివాహమైనది మొదలు పరమేశ్వరుఁడు మధురాగృహమేధియయ్యెను. ఆయన పాండ్యవంశజులకు 'శ్రీ' యని పలుకును. మధురాప్రజల కుటుంబవ్యవహారములను పరిష్కరించి పెట్టును. భక్తుల మానప్రాణములను రక్షించుటకుఁ దానే పడరాని సిలుఁగులుపడును. రాజు మొదలుకొని సామాన్యునకు సంభవించు దైవికములు మానుషములునగు నాపదలను దొలఁగించుటకుఁ దానుపూట. ఇట్లు శ్రీ సుందరేశ్వరుఁడు యుగయుగమునకుఁ బదునారుగా నాలుగు యుగములయందు నఱువదినాలుగు లీలలను నెఱపెను.

ఇది చౌషష్టిలీలా విలాసము. ఈ కథలయందలి యకృత్రిమమాహాత్మ్యము పాఠక హృదయములయందు నైకవిధ లీలావినోదియగు శ్రీ సుందరేశ్వరుని సాన్నిధ్యమును ముద్రింపఁజాలినదైయున్నది.

మధుర దక్షిణకాశి. శివుఁడు పాండ్యప్రియుఁడు. శ్రీ నీలకంఠ దీక్షితులు చెప్పినట్లు—

"పాండ్యప్రియః త్వాం విదతి శివాऽపి
పాండ్యాత్మజా సీదతి కాశకథా నః
పాండ్యేషు జాయేమహి ఖంజరీటాః
కోయష్టయః కోకిలకోరకా వా"

ఇట్లు శ్రీ మధురామహిమాభివర్ణనాత్మకమై తెనుఁగునఁ దొలితొలుత వెలసి తీర్థభూతమైన యీ కృతి సకలజనసేవ్యమగుఁగాక యని యాశంసించుచున్నాము.

తి. చంద్రశేఖరన్

శ్రీరస్తు

# చొక్కనాథ చరిత్రము

## ప్రథమాశ్వాసము.

శ్రీ గణనాథుఁ బూజిత లోకనాథు
ప్రాగల్భ్యబుద్ధి సంప్రాప్తసంసిద్ధి
[1] మూఁడుమూర్తులచేతఁ బూజగొన్నట్టి
మూఁడుకన్నుల వాని ముద్దుల [2] పట్టి
దంతివక్త్రుని నేకదంతుని మదినిఁ
జింతించి యిష్టార్థసిద్ధిగాఁ గొల్చి
శ్రీ పార్వతీశు నాశ్రిత కృపావేశు
పాపౌఘవిధ్వంసనుఁ బరమయోగీశు
భక్త యోగీంద్ర హృత్పద్మ ప్రకాశు
భక్త సంరక్షణుఁ బరమయోగీశు
నాగాజినాంబరు నాగేంద్రహారు
వాగీశ చక్రి గీర్వాణేశ వంద్యు
భావజసంహారు పాపవిదూరు
పావనాకారు సద్భక్త మందారు
నా దేవదేవుని నానందభరితు
సాదర హృదయ పుష్కరమున నిల్పి
వేవేల సంఖ్యల వేడ్కలింపొంద
భావించి సేవించి ప్రార్థించి మ్రొక్కి
కరిరక్షణోల్లాసుఁ గలశాబ్ధివాసుఁ
బరమకృపావేశు భవదుఃఖనాశు
కౌస్తుభాంచితవక్షు కరుణాకటాక్షు
సంస్తుత మునిలోలు సత్యసంశీలు
తనరంగ మత్స్యావతారమై సోము,
కుని ద్రుంచి శ్రుతులఁ జేకొన్నట్టి వేల్పు
నమృతంబు [3] ద్రచ్చుచో నాధారముగను

---

[1] ఆదిమూర్తులచేత నర్చింపఁబడిన. [2] ముద్దు తొల్చూలి. [3] దర్చుచో.

కమఠమై నిల్చిన కారుణ్యవేల్పు
నాదివరాహమై యా హిరణ్యాక్షు
నాదటఁ బోరిగొన్న యాయాదివేల్పు
నాహ్లాదమున నృసింహావతారమునఁ
బ్రహ్లాదుఁగాచిన పరతత్త్వవేల్పు
బలిచక్రవర్తి నా బలిసద్మమునను
బలిమినిఁ బంపిన బలుగుజ్జువేల్పు
బాహుసత్త్వోన్నతి బాహుసహస్రు
బాహ్వుల ద్రుంచిన భార్గవు వేల్పు
దశరథు కుదయించి దశకంఠుఁ ద్రుంచి
విశదసత్కీర్తుల వెలసిన వేల్పు
బలుదైత్యుఁడగు ప్రలంబాసురుఁ గూల్చి
బలభద్రుఁడై మించు బలభద్రవేల్పు
ముగ్ధాంగనలకెల్ల బుద్ధులు గలుగ
బుద్ధరూపముదాల్చు బుద్ధుల వేల్పు
కలియుగధర్మంబు గలిగింప కొఱకు
కలికావతారంబు గాకున్న వేల్పు
కంసాదిరిపుల రాక్షసులఁ బెక్కండ్ర
హింసింపఁ గృష్ణుఁడై పొసఁగిన వేల్పు
నిన్నిరూపంబులు నెసఁగంగఁ దాల్చి
యున్నట్టి యా వేల్పు నురగేంద్రతల్పు
బద్మాక్షు నా మునిపద్మంబునందుఁ
బద్మాది సంఖ్యలఁ బ్రస్తుతి నేసి
ధవళదేహస్ఫూర్తిఁ దనరు కల్యాణి
బ్రవిమల శుకవాణి భాసురశ్రోణి
కలుషకంఠకృపాణి ఘనసత్యవాణి
యల ముక్తినిశ్రేణి యఖిలపారాణిఁ
జారుషట్పదవేణి జలరుహపాణి
వారిజోద్భవురాణి వాణిఁ బ్రార్థించి
శరజన్ముఁ గ్రౌంచారి శర్వాణిసుతుని
పిరుదూఁడు పౌకుల నెసఁగిన వాని
రాజశంకరపుత్రు రమణీయగాత్రు

రాజితంబుగఁ గుమారస్వామిఁ దలఁచి
వ్యాసు వాల్మీకి మహాకావ్యుఁ గాళి
దాసుని భవభూతి దండి మాఘునిని
బిరుదు వేములవాడభీము నన్నయను
నరయఁ దిక్కన నెఱ్ఱాపార్యు శ్రీనాథు
నిలఁగల్గు కవులను నెల్ల సద్భక్తి
విలసిత సద్వాక్య వినుతి నుతించి
యొక తి రచియింప నిష్టార్థ సిద్ధి
యాకృతి రచియింప నతిభక్తిఁ బూని
శ్రీకరంబై యొప్పు చెర్యోటిపరిని
వెనొరవాపాంద వారి యందోరుగంటమ్మ
పరమకల్యాణి శాంభవి యేకవీర
యావిపరంజ్యోతి యఖిలైకమాత
నాదరంబుగ భక్తి నాత్మ భావించి
యేఁ జేయు కృతికిని నిసుఁడైనవాఁడు
రాజపూజితుఁడును రణవిజయుండు
నమిత ప్రతాపసాహసముల మించు
విమతుల నపలీల విదళించువాఁడు
వినయ వివేక సద్వినుత సుస్థిరుఁడు
మనుజేంద్రుఁ డఖిలసామ్రాజ్య వైభవుఁడు
నిబిడ శౌర్యౌదార్య నిజకీర్తు లందుఁ
బ్రబలిన చినరామపార్థివేశ్వరుఁడు
నొకనాఁడు నాత్మ నుద్యోగంబు కలిమిఁ
బ్రకటిత వైభవపారీణుఁడగుచు
నమరభామలసాటి నమరినయట్టి
రమణులు వింజామరమ్ములు వీవ
నంచిత పూర్ణచంద్రాకారముఖులు
కాంచనోజ్జ్వల కంచ కాళంజు లిడఁగ
భరతాది గీత ప్రబంధముల్ చెలఁగ
దౌరకాని వేత్రహస్తులు సందడింప
కవి భట పాఠక గాయకులాది
దవుల చౌషష్టి విద్యలవారు గొలువ

లలిత చీనాంబరాలంకారుఁ డగుచుఁ
దెలివొంది భూలోకదేవేంద్రుఁడనఁగఁ
బొగడొందు సుచితజ్ఞ భోజుఁడనంగ
కవిబుధ శ్రీపాదకమల షట్పదుఁడు
ప్రవిమల హృదయ సత్పథ సుస్థిరుఁడు
నిటలాక్షపదభక్తి నియతిఁ బెంపొందు
భటువంశమున మెచ్చు పచ్చకప్పురము
తిప్పరాజనుతుండు తిరువేంగళుండు
చెప్పంగ నేర్చుఁ బ్రసిద్ధంబుగాఁగ
నని విన్నవించిన నా చిన్నరాము
మనుజేంద్రుఁ డధికసమ్మదముతో నపుడు
నను బిలిపించి మన్నన గారవించి
వినుతించి కర్పూర వీడ్యంబు లిచ్చి
యనఘుండు మీ తాత యగు తిమ్మరాజు
తన తమ్ముఁ డయ్యలు దాను నిమ్మహినిఁ
బ్రౌఢుఁడై విద్యలఁ బరగ మెప్పించి
ప్రౌఢరాయలచేతఁ బచ్చకప్పురపు
రా[1]జు నాఁబడెఁ దిమ్మరాజుకుఁ దప్ప
రాజుదయించె విరాజితమ్ముగను
రాజుల మెప్పించె రసికుఁ డాతని త
నూజుఁడ వార్య సన్నుత కవీంద్రుఁడవు
ప్రావీణ్య మతివి శోభనకా[2]వ్యలీలఁ
గావున నీచొక్క కావ్యంబు మాకు
ద్విపద భావంబునఁ దెలివొంది మిగుల
సుఖముగా సత్కృతు లుల్లంబు లలర
మధుర వాక్యమ్ముల మదిఁ గొనియాడ
మధురాపురేశు నిర్మల పుణ్యచరిత
చౌషష్టి లీలా విలాసంబు లాంధ్ర
భాషను బెదరామ పార్థివుపేర
సుచరిత్ర వైభవసుత్రాము పేర
రచియించి విఖ్యాతి రాఁజేయు మర్థి
నని యానతిచ్చిన యా మహారాజు

[1] రాజనంగాఁ దిమ్మరాజుకు.
[2] శోభన కవిత్వ.

ననుపమ మధుర వాక్యములకు మెచ్చి
మఱిఁ గాళిదాస భీమన తిక్కయజ్వ
లరయ నన్నయ్య శ్రీనాథుఁడ గాను
వి నెంతవాఁడను నీ కావ్యమునకు
నైనను మధురా పురాధ్యక్షు కృపను
ననఘ ! మీ యనుమతి నట్ల కావింతు
ననుచుఁ దత్కావ్యుల నర్థిఁ బూజించి
యయ్య లంఘ్రులను నా యాత్మలోఁ గొలిచి
వెయ్యేల నా నేర్చు విధమున వేడ్కఁ
జెలఁగుచు నుపనూరిసింహంబు పేరఁ
బురుషోత్తమ ధ్యాన పూర్ణాత్ము పేరఁ
దగు గోళ్ల బసవేంద్రు తనయుని పేర
సుగుణాఢ్య పరసతీ సోదరు పేర
ఘనత స్వామిద్రోహ గండని పేరఁ
జిన రామవిభునికి జ్యేష్ఠుని పేర
దీపించు నచ్యుతదేవ రాయ ప్ర
తాప దక్షిణబాహు దండాంకు పేరఁ
జతురత నీ కావ్యసారంబునకుఁ
బతియైన పెదరామ పార్థివు పేర
శ్రీకరనిధి పేర శ్రీరాము పేరఁ
బ్రాకటమ్ముగ సకలార్థ సంపదలు
బుధులు సర్వజ్ఞులు భూమిపాలకులు
నధిక సత్కావ్యులు నర్థితోఁ బొగడఁ
బద సంధు లర్థముల్ ప్రాసంబు యతులు
పదిలమై లక్షణ ప్రామాణ్యముగను
గల్పాంతరస్థాయిగా మించి వెలయఁ
గల్పింతు నా కథాక్రమ మెట్టి దనిన

## కథానుక్రమణిక.

వామదేవ వశిష్ఠ వాల్మీకి సురులు
రోమహర్షుండు గార్గ్యుండు కశ్యపుఁడు
గాలవ వ్యాస మార్కండేయ భృగులు
వాలఖిల్యులు భరద్వాజ కౌత్సకులు

శాండిల్య కపిల విశ్వామిత్ర పులహ
కౌండిన్య నారద కణ్వ పులస్త్య
లత్రి గౌతములును నా పరాశరుఁడు
మైత్రావరుణ శక్తి మాండవ్యఋషులు
జమదగ్ని దుర్వాస జహ్ను జాబాలి
సుజ్ఞాను లాంగిరసుండు శౌనకుఁడు
యాజ్ఞవల్క్య మరీచు లాది సన్మునులు
వరుస సాధ్యమి సమాధ్యస నందయును
జిరపుణ్యధనము సంచిత లీల నత్రుపు
బాలుపైన వేడ్కతోఁ బుణ్యైకరాశి
సలిఁ గర్మ పిశితము సంఘ రాకాశి
భక్తౌఘ సహవాసి భాగ్యాంబురాశి
ముక్తి మంటపవాసి మోహవోల్లాసి
మణి కర్ణికోద్భాసి మహిత ప్రకాశి
ఫణికుండలావాసి పరశు సంకాశి
కలుష సంహారాసి కైవల్యరాశి
ఫలిత పంచక్రోశి భర్గవిలాసి
యభవ రూపాధ్యాసి యర్క ప్రకాశి
యభిమత ఫలరాశి హంసనివాసి
యల గంగతో రాసి హరుఁ గృపఁ జేసి
విలసిత గుణరాశి వేద సద్భాసి
శాంతంబు కెడబాసి కరుణకు డాసి
కామితార్థ విలాసి గల పంచక్రోశి
యన్నపూర్ణా భాసియగు వారణాసి.
చెన్నొందు నప్పురిఁ జేరి యా మునులు
దేవవాహిని యందు దేవసన్నిధిని
నా పావనోత్తము లావేళ నందు
శ్రీ పార్వతీనాథు శ్రీ విశ్వనాథు
శంకరు సర్వేశు సర్వాత్మవాసు
పంకజాక్షప్రియు భక్తితోఁ గొల్చి
వేమారు సాష్టాంగవిధిని దండ ప్ర
ణామముల్ జేసి యానందాత్ములగుచు
శివశివ విశ్వేశ ! శ్రీగిరిజేశ !

శివ చంద్రకోటీర శివ శూలధార
శివ పితామహరూప శివ విష్ణురూప
శివశివ ఫాలాక్ష శివ జగద్రక్ష
శివ సితాసితవర్ణ శివ సర్వకర్ణ
శివ సర్వపరిపూర్ణ శివకృపాపూర్ణ
శివ భక్తమందార చిన్మయాకార
శివ రౌప్యగిరివాస శ్రీకృత్తివాస
శివ మోహనాకార జిహ్మగహార
శివ భూతిలిప్తాంగ శ్రీమహాలింగ
శివ నుతగీర్వాణ జితపంచబాణ
శివ జగత్పరిపాల శివ మహాకాళ
శివశివ గణనాథ శ్రీవిశ్వనాథ
దేవ శంకర నమస్తే జగన్నాథ !
దేవ తుభ్యంనమో దేవాదిదేవ
పాలించు మమ్ము గృపాదృష్టిఁ జూచి
నీలలోహిత దయానిధి భక్తవరద
అని సన్నుతుల్ సేయ నంబికానాథుఁడు
మునులార! మీ స్తోత్రములకు మెచ్చితిని
యడుగుడిష్టము లేమి! యనిన నాఋషులు
కడువేడ్కతోడ నా కఱకంఠుఁ జూచి
యోదివ్యసంకాశ ! యోవ్యోమకేశ !
మును సకలాభీష్టములు మీరు మాకు
ననయంబు గలుగంగ నానతిచ్చితిరి
యింకింకొక్కవరము మాకిప్పింపు మురగ
కంకణ ! నీదు కింకరుల రప్పించి
పరమాత్మ నీపాద పద్మముల్ మదిని
స్థిరభక్తి గలుగంగఁ జేయవే ! దేవ
యన విని సర్వేశుఁ డట్ల కాకనుచుఁ
దనమూర్తి యందు నంతర్ధానమయ్యె
ముక్తిమంటప మధ్యమునఁ బ్రమోదమున
భక్తవత్సలు పాదభక్తిఁ జెన్నొంది
సకలశైవాగమ శాస్త్రంబు లెల్ల
వికసిత హృదయులై వినుచు సన్మునులు

నన్యోన్య కౌతూహలాయత్తులగుచు
ధన్యులై యా గంగ దరి నుండి రంత
మఱి కొందఱంత నా మౌనిపుంగవుని
పరమాత్మ నారదబ్రహ్మ నర్చించి
మునికులోత్తంస ! యోగమునిలోక పూజ్య
మునిశిరోమణి ! దేవమునిలోకవంద్య !
భువనాంతరిక్ష సద్భువనపాతాళ
మవిరళ బ్రహ్మాండ మాదిసర్వంబు
దిరుగుచుందురు మీకుఁ దెలియు సంతయును
దిరమైన తీర్థముల్ దేవతీర్థములు
సకలవైభవములు; సర్వజ్ఞ చరిత
యకలంక మీరు నాకాన తిండనిన
మునినాథుఁడా దేవముని సంతసిల్లి
చనవిచ్చిపల్కె నా సంయమీంద్రులకు
తీర్థమాహాత్మ్యముల్ తీర్థదేవతలు
తీర్థవైభవములు తేజరిల్లగను
నాదృఢవ్రతచిత్తుఁడగు వ్యాసునకును
బ్రోదిగాఁ జెప్పితిఁ బూర్వమందేను
నతనికి నంతయు నవగతం బిపుడు
నతనినిఁ బ్రార్థింపు డతి వేడ్కతోడ
నని నారదుఁడు పల్క నమ్మహామునులు
ఘనుని సాత్యవతేయుఁ గనుగొని మ్రొక్కి
పరమ మహాభోగ ! పరమసంయోగ !
పరమపురాతన ! పరపురాణజ్ఞ !
లలి కావ్యనాటకాలంకారశాస్త్ర
విలసితాగమతత్త్వ వేదివి నీవు
శ్రుతు లేర్పరించిన సూక్ష్మవివేక !
సతతశివార్చన సద్భక్తి పరుఁడ
పంచాక్షరీమంత్ర పారాయణుండ
యంచితభూతి రుద్రాక్ష పూర్ణాంగ !
ప్రియముతో మీ పాదపీఠ సేవకుల
దయగల్గఁజూడు వేదవ్యాసమౌని !
మీ పాటి గానము నిఖిలమ్మునందు

శౌనక యతీ గీర్వాణకీర్తనుఁడ !
భావించి మావిన్నపం బొక్క టెలమి.
కావేరి తుదగాఁగ గంగ మున్నుగను
నంతయుఁ జూచితి మట దక్షిణంబు
వింత యెఱుఁగము మాకు వివరింపవలయు
ననినను బ్రియమంది యానందమంది
మునులను గరుణించి మునిపుంగవుండు
వివిధశాస్త్రార్థకోవిదులార మీకు
వివరించి చెప్పెద వేడ్కతో వినుడు
పూర్వకాలంబున భూతేశ్వరుండు
శర్వాణిఁ బెండ్లాడ సంభ్రమంబునను
కైలాసగిరి నుండి కమలజాచ్యుతులు
పౌలస్త్యవాసవ ప్రముఖదేవతలు
నర సిద్ధగంధర్వ నాగకిన్నరులు
గరుడ కింపురుషయక్ష శ్రేణిసురలు
నా నారదుండాది యఖిలదేవర్షు
లేను నగస్త్యుండు నెల్లలోకములు
నా బాణవత్సలుం డాడెడి పెండ్లి
కాబాలవృద్ధాదు లందఱు నడువ
నాభారమున నోర్వక తక్షణంబునను
నాభూమి యట వంగి యామ్యభాగంబు
నున్నతంబగుటయు నగ్రుండు కడఁక
మన్నించి ఘటజున్ మాహాత్మ్య మెఱిఁగి
యా దక్షిణమ్మున కనిచె నాతనిని
నా దేవు నానతి నట్లు కాకనుచుఁ
బోవుచో వింధ్యాద్రి పొడవడఁగించి
యావలఁ బోదియ మహామల నుండి
దక్షిణమ్మున మహాస్థలముగావించి
యీక్షితి రక్షించె నినసన్నిభుండు
నా తామ్రపర్ణియు నా వైఖనదియు
నా తీర్థదేవతలా మహత్త్వంబు
సుకరమై సకలంబు శోధించినాఁడు
ప్రకటితంబగు వేడ్కఁ బ్రార్థింపఁ డతని

ననినను బ్రియమంది యాసభలోన
మునిపుంగవుండన్న మౌనులెల్ల నతని
పాలికిఁ జనుదెంచి భక్తిఁ బూజించి
ఓ లోకపావన ! యోగమునినాథ !
పంచాక్షరీమంత్ర పఠనపారీణ !
సంచితోజ్జ్వలపుణ్య చారిత్రవిభవ !
ఆ పోశనంబుగా నబ్ధులేడింటి
శోషించి గుక్కగాఁ గొన్నట్టి వేల్ప !
జంకించి నహుషుని సర్పంబుగాఁగ
హుంకారమిచ్చిన యుగ్రగోపాఁడ !
కఠినుల వాతాపి ఘను నిల్వలాఖ్యు
జఠరాగ్నిఁ గాల్చిన సరసప్రవీణ !
వంధ్యగర్వోన్నతి వడిమించియున్న
వింధ్యాద్రి నణఁచిన వినుతప్రతాప !
ప్రత్యక్షముగఁ దామ్రపర్ణి తీర్థములు
నిత్యతీర్థములుగా నెరపు పాపఘ్న !
పరవుగాఁ దగు షోడశోపచారములఁ
బరమేశుఁ బూజించుఁ బరమమాహేశ !
ఘనతతో వృత్తలక్షణ మలంకార
మనఁగ వర్ణోత్పత్తి యిది యొప్పగాఁగ
ముదముతో ద్రావిడ మూలసూత్రంబు
కొదలేక శిష్యుఁడు మీకును నానతిచ్చెఁ
దనర నావాక్యంబు ద్రవిళదేశమున
వినుతిగా మీచేత విఖ్యాతమయ్యె
నదిగాక దక్షిణ మాద్యంతమెల్ల
విశదంబుగా మీరు వేడ్కఁజూచితిరి
మావిన్నపము విని మమ్ము మన్నించి
భావించి యానతి పరమయోగీంద్ర !
గంగాది నదులను గావేరి నుత్త
మాంగంబు దోఁగితి మావల మీరు
నరుదైన పోదియ మహాచల నెప్పుడు
నిరవందఁ దప మాచరింతురుగాన
వేగావతగు వైశ్య విఘ్నప్రవాహ

మాగమతీర్థమ్ములందుఁ బెంపొందు
మధురాపురేశ్వరు మహిఁ జొక్కనాథు
విధము లింపుగ మాకు వివరింపు మనఘ !
యాలోకనాథుని యరువదినాల్గు
లీలా వినోదానులీల లింపొందఁ
గ్రమమొప్ప మీరెఱుంగని పుణ్యకథలు
విమలాత్మ ! కల్గునే విశ్వంబులోన
నని మునులందఱు నర్థిఁ బ్రార్థింప
విని సంభ్రమంబుతో విస్మయంబంది
సద్గుణచిత్తుఁడా సంయమీశ్వరుఁడు
గద్గదకంఠుఁడై కాయమంతెల్ల
ప్రకటిత పులకాంకురమ్ములు వొడమ
వికసిత వదనారవిందుఁడై యపుడు
సంతోషబాష్పముల్ చక్షులఁ దొరుఁగ
నంత నామునులఁ జయ్యన గారవించి
వినుతింపఁదొడఁగెను వింధ్యశైలారి
మును నారదవ్యాసమునులు గ్రంథమున
నాది నుత్తర పురాణాఖ్యంబునందు
భేదించి చెప్పిరి ప్రీతి నేర్పఱిచి
యీ పుణ్యకథ మీకు నేర్పడ నిపుడు
చూపింతు సంక్షేప రూపంబుగాను
సార్థమై యేఁబదియాఱు దేశములఁ
బ్రార్థింపఁగల్గిన పాండ్యరాజ్యమున
నెల మూఁడు వానలు నెమ్మితో గుఱిసి
బలు పాడిపంటలు ప్రబలి వర్ధిల్లు
మఱి గిరిశిలలెల్ల మాణిక్యశిలలు
గరిమ భూతలమెల్లఁ గనకరజతము
గల మహీజమ్ములు కల్పభూజములు
పొలుపైన తీర్థముల్ పుణ్యతీర్థములు
వనములన్నియు మత్తవారణమ్ములును
ధనరాసులన్నియు ధరమౌక్తికములు
భావింప నింటింటఁ బద్మినీస్త్రీలు
నావాసమైయుండు నాదేశమునను

బురము లేడింటిలోఁ బురణింపఁగలుగు
పురమున నఖిలసత్పుణ్యముల్ గలిగి
వాసవాదులు శేషవాణులు మునులు
వ్యాసాదులకు నశక్యంబు వర్ణింప
నది లోకవిఖ్యాత మది తీర్థరాజ
మది వేదఫలసార మది పుణ్యసార
మది ముక్తిసాధనం బది సిద్ధసేవ్య
మది పాపసంహార మది శంభునిలయ
మాశ్రితఘనదరిద్రాద్రి సద్భిదుర
మాశ్రితమధురంబు నమ్మహామధుర
యందుండు శ్రీమన్మహాదేవదేవుఁ
డిందుజూటుండు సోముండీశ్వరేశ్వరుఁడు
సౌందర్యనాథుండు సర్వేశ్వరుండు
శ్రీచొక్కనాథుండా శ్రితలోకభర్త
వాచామగోచరు వాగీశవినుతు
నంగయర్కణ్ణిమ యనఁగల్గు సర్వ
మంగళాహృదయేశు మహితప్రకాశు
నహిరాజభూషణు నాది మధ్యాంత
రహితు నుతించి పరబ్రహ్మరూపుఁ
డతని పుణ్యచరిత్రమాత్మ నుప్పొంగి
చతురత వినుపింతు సద్భక్తి ననుచు
కుందకుప్ప మోదకాహారుఁ బ్రార్థించి
మదనారిఁ బూజించి మధువైరి నెంచి
వనజజుఁ గీర్తించి వాణిఁ బ్రార్థించి
మునులఁ బూజించి షణ్ముఖుని సేవించి
లాలించి దీపించ లక్షణల్ మించ
నా లీల లెఱిఁగింతు నాత్మ శోభిల్ల

చతుష్షష్టి లీలలు.

వృత్రాసురుని హత్య విబుధేంద్రునకును
చిత్రంబుగాఁబట్టి చెలఁగినలీల
తగఁ బొచ్చి యైరావతంబు శాపమ్ము
నగణితమ్ముగఁ దీర్చి యనిపిన లీల

చతురుఁడై యా పతంజలియు సన్మునులు
స్తుతియింప నాట్యంబు జూపిన లీల
ఘన్న పర్వతముల నా భూతములకు
నెన్నికగా భక్తి నిచ్చిన లీల
యమృతాన్న కూపమ్ము లావైఖ నదియుఁ
గ్రమ మొప్ప నచటి కాకర్షించు లీల
జలనిధు లేడును సరవితో నపుడు
వెలయ నప్పురికి రావించిన లీల
మలయధ్వజుండను మామ నయ్యెడకుఁ
బిలిపించి యతనికిఁ బ్రియమిచ్చు లీల
సమ్మదమ్మునభూమి జనులు శోభిల్ల
నెమ్మితో నుగ్రపాండీడైన లీల
వెలయు చక్రము జెంపు వేలాయుధమ్ము
నెలమి నా యుగ్రున కిచ్చిన లీల
చాల మీఱిన సప్తజలనిధు లడఁగ
వేలాయుధంబున వేయించు లీల
యనిమిషేంద్రుని చక్రమందు వేయించి
పెను మేఘములఁ జెఱవెట్టించు లీల
చేరి పాండీనిచేఁ జండాయుధమున
మేరువు గొట్టించి మెఱసిన లీల
వేదసంవేద్యుఁడై విశ్వంబులోన
వేషమ్ములర్థితో వెలయించు లీల
రతికెక్కు నవరత్న రాసులఁ దెచ్చి
యతివేడ్క సెట్టియై యమ్మిన లీల
కరమొప్ప నాల్గు మేఘముల రావించి
గుఱుతుగాఁ గూటమ్ముగూర్చిన లీల
సిద్ధమై యిష్టార్థ సిద్ధులిచ్చుచును
సిద్ధుఁడై యచ్చోటఁ జెలఁగిన లీల
భక్షింపఁ బాషాణ భద్రేభమునకు
నిక్షుదండము చేతికిచ్చిన లీల
యలరిన వృద్ధయౌవన బాల్య వేష
ములరించి వృషభ వాహనుఁడైన లీల
యుడుగక కుడిపాద మూని పాండీని

కెడమకాలను నటియించిన లీల
యవని విప్రుని భార్య కాయుష్య సుడల
వివశుఁడై నిందకు వెఱచిన లీల
ధరమాతృగమన పాతక సంగమ్ముల్లఁ
బరువడి నెడలంగఁ బాపిన లీల
యేకాంగవీరుఁడై యెల్లరుఁ బొగడఁ
జేకొని యుద్ధమ్ము నేసిన లీల
నాగమ్ము నొక్కటి నగన్ని లంపినను
వేగ నాగము దెగ్ర వేసిన లీల
మునుకొని పశువుగా బుద్ధి నంపినను
ఘనమైన వృషభాద్రిగాఁ జేయు లీల
యిరవొందఁ బాండ్య రాజేంద్రునకు తృష్ణ
తీరదిగాఁ బ్రజ తోడు చూపిన లీల
కడగి యారాజుకు గారవంబెసఁగ
నుడుగక బహుధనం బొసఁగిన లీల
వినుతింప సెట్టియై వీథులఁ దిరిగి
యనువందఁగా గాజులమ్మిన లీల
యష్టమహా సిద్ధులా మాతృకలకు
నిష్టమై యుపదేశమిచ్చిన లీల
తొలఁగి కాడ్వెట్టికి సేవ యొసంగి
తలుపుల బసవముద్రలు వెట్టులీల
యల పాండ్యపతికి నాహవరంగమునను
జలివేంద్ర వెట్టి రాజయ మిచ్చు లీల
యలరంగఁ బొన్నాయి యను వారసతికి
నిరవైన రసవాద మిచ్చిన లీల
పగగొని చోడనిఁ బడిగెలోఁ ద్రోసి
పొగడంది తన పురంబున కేగు లీల
యమరొప్ప వెలమకు నక్షయంబుగను
నొనర ధాన్యఁపుమడి యొసఁగిన లీల
సెట్టికి మామయై చేరుండి సభను
పట్టుగా ధర్మంబు పలికిన లీల
వరగుణ పాండ్యభూవరునకు వేడ్క
నిరవొందఁ గైలాస మిచ్చిన లీల

జ్ఞానులు మెచ్చ సంఘట్టనగాఁగ
భానుని గెలిపించి పాడిన లీల
యరయ బాణునకుఁ దానర్థమిమ్మనుచు
నెలమి నియామకంబు లిచ్చిన లీల
యింపుగా బాణుని యింతిఁ బాడించి
సొంపెక్క గెలిపించి సొబగైన లీల
కామించి యంగయ కణ్ణమ్మ నచటఁ
బ్రేమతోఁగలవేసి పెండ్లాడు లీల
దయ కందిపిల్లల తల్లియై వచ్చి
ప్రియముతోఁ జన్నిచ్చి పెంచినలీల
మేటిపక్షులకెల్ల మేటి వీవనుచు
నేటిరంతకును వరమిచ్చిన లీల
పరగ నారాయణ పక్షీంద్రునకును
బరువడి కైలాస పదమిచ్చు లీల
వలనుగాఁ దిరువాలవాయను వెల్లఁ
దెలియంగ మధురకుఁ దెలిపిన లీల
వెలయ నా పాండ్య భూవిభునకుగాను
నిల మించి వృషభాస్త్ర మేసిన లీల
సలలిత సత్కావ్య సంగంబునకును
బలు సంగపలకఁ దా పాలించు లీల
మఱి ధర్మి యనెడి బ్రాహ్మణుని పెండ్లికిని
పెరవొప్ప ముడుపు రా నీడ్పించు లీల
తిరముగా నక్కీరదేవుని వేడ్కఁ
గరుణతో దరిఁజేర్చి గాచిన లీల
కడువేడ్క ద్రావిడకావ్యంబు నాకు
నెడపక యుపదేశమిచ్చిన లీల
వివిధ సత్కావ్యాలు వినుతింప నపుడు
తివిరి పణ్ణులు మూఁగఁ దెల్పిన లీల
యరయ నెడక్కాడ డనుభట్టునకును
నరుదొందఁ దోడుగా నరిగిన లీల
పూని యా తిరువాదయూరదేవునికి
జ్ఞానోపదేశమ్ము గావించు లీల
ప్రియభక్తి నతనికి మృగధూర్తకులను

హయములుగాఁ జేయు నాశ్చర్య లీల
నా యశ్వములనెల్ల నా ఘోరవనులఁ
జేయించి వెరగొందఁ జేసిన లీల
పిట్టుకై మన్ను దాఁ బెట్టుగా మోసి
కట్టుకై పిట్టు దా గైకొన్న లీల
మండిత జ్ఞానసంబంధుని చేత
పాండిని జ్వరముల్లఁ బాపిన లీల
గట్టిగా సమయసంకల్పంబు జేసి
బెట్టు జైనులఁ గొఱ్ఱు వెట్టించు లీల
బార్త్రి సెట్టికినిదా నుద ముఖ్య భూమి
కీర్తి గల్గంగ నేలించిన లీల
వినుతింపఁ బశుపతి వేషంబు దాల్చి
ఘనశాల్యులకును మార్గముఁ జూపు లీల
జమ్మి కూపమ్మును సాక్షి రప్పించి
కొమ్మితోఁ దానంద నైగడిన లీల
యీ యరువది నాల్గు నేణాంకధరుని
పాయనిలీలలై భాసితంబుగను
దిరముగాఁ గృతయుగ త్రేతాయుగములఁ
గరిముప్ప ద్వాపర కలియుగమ్ములను
నొక్కొక్క యుగమున నొకఁ బదియాఱు
లెక్క నరువది నాల్గు లీల లైనట్టి
శ్రీ చొక్కనాథునంచిత విలాసములు
వాఙ్మాన గోచర వర్ణనమ్ములట్టి
మహనీయమగు పుణ్యమహిమ కింపొంద
విహితంబుగా వ్రాయ విన్నఁ బఠియింప
నా పుణ్యులకు నాయురారోగ్యములును
ప్రాపించి సర్వ సంపదలును గాంచి
సకలదాన విశేషసమితిఁ జెప్పంది
ప్రకటిత పుత్రపౌత్రాభివృద్ధులును
గలుగు నాధిక్యమై గంగ యాదైన
యల మూఁడుకోటులైనట్టి తీర్థములు
సేవించుకంటె విశేషమ్ముగాఁగ
గావించు భూప్రదక్షిణముల నైనా

బాగుగాఁ జేసిన ఫలమధికముగ
చేగంబె గల దిది వేదవాక్యంబు
నిదిసత్య మిదినిత్య మిది ముక్తి మార్గ
మిదిసిద్ధ మిది శుద్ధ మిది చోద్యమనుచు
ననువుగా నాగద వ్యాస సన్న్యాసులు
మును పురాణాంతరంబులఁ జెప్పిరనుచు
నాకుంభ సంభవుఁడా మహాఋషులఁ
జేకొని వేర్వేఱ శ్రీ చొక్కనాథు
చరితంబు మిగుల నాశ్చర్యంబుగాఁగ
విరచింపఁదొడఁగెను వేడ్కలింపెసఁగ

## మొదటి లీల.

వృత్రాసురుండతి విక్రమంబునను
గోత్రారి తోడ మార్కొని ఘోరమైన
యుద్ధమ్ముఁజేసి శౌర్యోదగ్రుఁడగుచు
సిద్ధమైనట్టి ప్రసిద్ధ ప్రజాల
మడరించి ఘనవజ్రహతిచేత నపుడు
పడియెఁ వా నతనిపై బ్రహ్మహత్య వైచి
యింద్రుఁడు వృత్రాసురేంద్రుని హత్య
సాంద్రమై తనయందు సంచరించుటకు
సకల మహాఋషుల్ సమ్ముఖంబు గొలువ
వికలుఁడై వారితో వివరించె నపుడు
ననఘాత్ములార! యీ హత్య నాకెపుడు
చనగలదంచు నాస్థానంబులోనఁ
బలికిన నా మునివరులును నాత్మఁ
దలపోసి తమలోనఁ దగ విచారించి
సుమహేశ్వరుని హత్య సుస్థిరంబుగను
క్రమమొప్ప నాల్గు భాగమ్ములు చేసి
జలముల ఫేనమ్ము జగతి నూషరము
జలజాక్షులను రజస్సులుగను వృక్ష
జాలమ్ముల పిశున జాలంబుగాఁగఁ
భావింప వటు వారు సంతోషమంది
యీ మహీంద్రులకడ కవని భూజములు
భామలు జలములు భయముతో వచ్చి

మ్రొక్కుచునో మునిగణములార మీరు
దిక్కేది యనుచుఁ బ్రార్థింప నారిసిగి
గ్రాలు ఫేనము నూపురంబుల పిడుస
జాలంబుగాని మీజాడను రాదు
ననుచు వారల బ్రహ్మహత్య వారిలొ
ననువొప్పఁ బంచియా యతిశలఁ జూచి
బుతుకాలములఁ బ్రవర్తించు గాక

సకతమ్ము మీను దోషములేదు పొండు
నన ప్రియపడి వారలప్లి కానిమ
చనిరి వేడుక నివాసములకు నంత
దోషంబు తనయందు దూరమైపోవ
భూషిత స్వర్గలోక పురమున

వాసవుఁడధికసింహాసనంబునను
భాసురంబుగ దివ్యభామలతోడ
కిన్నర గంధర్వ గీర్వాణయుత
పన్నగులా బృహస్పతియును గురువు
తెలివొంది తక్కినదిక్పతుల్ గొలువఁ
గొలువుండి వేడ్కలు కొనలుసాగంగ

నప్పుడు రంభాదులైన పాత్రలను
రప్పించి నాట్యసంభ్రమములు జూచు
నందులోపలఁ గొందఱౌరౌర నృత్య
మందలి వేడుకలందిందుఁగలవె

యనినను మఱికొందఱమ్మహాత్ములు
ఘనులార వేటమార్గము పోలు వేడ్క
గలుగునే! రాజసంఘములకు ననుచుఁ
బలికిన నప్పుడా పాకశాసనుఁడు
గడు వేడ్క వేటమార్గమునందుఁ దవిలి
గూడిగ వారల వేటలాడంగ మనసు
స్థలమేది యనిన నాసంయమీశ్వరులు
తెలిపిరి తగఁ బాండ్యదేశంబునందు
నాకాశమంటి యాకాశాంతరంబుల న
నేకశాఖలఁ బర్వి నిఖిలకాంతార

సంఘంబుమించి యసంఖ్యాత వృక్ష
షండములతాగుల్మ సంఘముల్ గల్గి
కొలఁకులందును వాపికూపంబులందు
స్థలదుర్గ వనదుర్గ జలదుర్గములను
బొలుపొంది గిరి దుర్గములు పిక్కటిల్లి
పెనఁగొని యండజ పిండజంబులను
మునుకొని స్వేదజ బుద్భిదంబులను
మృగపక్షి జంతుసమేతంబుగాఁగ
నగణిత సంకులంబై యొప్పమీఱి
కడమువనంబుఁ గలుగు నేమిటను
గడుపు లేకెప్పుడు కాంతార భూమి
సిద్ధసాధ్యులు నిష్టసిద్ధి చేకూర
సిద్ధంబుగా నందుఁ జేరియుండుదురు
వేఁట మార్గమునందు వేడ్కఁ గలదేని
వేఁట సన్నాహమై వెడలు దేవేంద్ర !
యని మునుల్ వినుతింప నతిసంభ్రమమున
ననుపమ ఘనమృగవ్యసనుఁడై యపుడు
కొలువు చాలించి పేర్కొని చతురంగ
బలముల రావించి పటహనిస్సాణ
సురదుందుభి మృదంగ శోభితధ్వనుల
ధరణి గ్రక్కదల దిక్తటములు వదర
బలు మృగంబులు చెదర పక్షులు బెదర
కులగిరు లదర దిక్కుల కిరుల్ పఱల
విషధులు గలఁగ నవ్విషధారి బెగడ
ఋషులుల్లసిల్లఁ బౌరుషము శోభిల్ల
నుచ్చైశ్శ్రవంబెక్కి యుత్సాహలీల
వచ్చుచో మునుకొని యచ్చిరింపెసఁగ
కోరమీసములు జేగుఱుబొట్లు మేను
చాఱలు నెఱ్ఱని చాయచూపులును
కావికోకలు నీలికాసెలు వలలు
చేవ విండ్లును దుప్పుపడని యంబులును
నందమై వేఁటసన్నాహంబుగాఁగఁ
గలిగి కొందఱు వేఁటకాండ్రతివేడ్క

బలిసి తగఁ గొలుపఁగాఁ బావనంబైన
వనమున కేతెంచి వలలు చుట్టించి
ఘనమైన తెరవేఁట కట్లు గావించి
తొడరి నల్దిక్కులఁ దోలుకవచ్చి
కడఁకతో నన్ని యొక్కటుకును దెచ్చి
గహ్వరంబులు చొచ్చి ఘనసింహములను
సంహరింపుచు సాహసంబునఁ జేర్చి
గండ భేరుండ సంఘముల కంఠముల
ఖండించి భల్లూకములను దండించి
సారంగముల నొంచి శశకాల నణఁచి
కారెనుబోతుల గళములు ద్రుంచి
కరులఁ బట్టించి సూకరముల మొట్టి
శరభంబులను ద్రుంచి శరములనించి
పులుల నిర్జించి దుప్పులను భర్జించి
బలు ఖడ్గమృగములఁ బట్టి కొట్టించి
కడు నేడ్కఁ జమరీ మృగంబుల నెల్లఁ
జెక్కు చెండాడి విచ్ఛేదంబుచేసి
తక్కిన జంతువుల్ దగఁ జంపి చంపి
వెక్కసంబుగ మించి వేడ్కగావించి
యాపుణ్యభూమి కొయ్యనఁ జేరవచ్చి
వేఁటలాడుట మది వేడ్కలేకున్న
వేఁట చాలించి యా విబుధేంద్రుఁడనుచుఁ
ఖలశాంతురత్నాలు పొడమె నా యొడల
నలమితోడను జీవహింస నాయందు
సహజమై పుట్టదు సందేహ మిందు
బహుళమై యానందబాష్పముల్ దొరుఁగు
చున్నవి యో మహాయోగీంద్రులార!
కన్నది విన్నదిగాదిట్టి వింత
యరసి రండని వారి ననిచి యచ్చటను
దిరముగాఁ గదలక ధీరుఁడైయుండె
నట్టి శాకని వారలచ్చోటు వాసి
గట్టిగా నా పుణ్యకాంతారమునను
గొరిదిమై వెదుకంగఁ జొచ్చిరంతటను

సురుతరంబైయుండు నొకమహాసరసి
గడు విస్మయంబుగాఁ గాంచి రయ్యెడను
తొడరి సంతోషమ్ము తోడ నా దివ్య
సరసి యందునఁ బుణ్యజలములఁ గ్రోలి
దురితమ్ము వెడలంగఁ ద్రోచి యా మునులు
నటకు నుత్తరభాగమందుఁ బెంపొందు
నిటలాక్షు నభవుని నీలకంధరుని
ఘన నీపవనవాసుఁ గరుణావిలాసుఁ
గనకాద్రికార్ముకుఁ గలుషౌఘవిముఖు
వటురూపధారు నా వాసుకిహారుఁ
డటు నున్న తావుకు నతిభక్తిఁ జేరి
చూచుచు వెరగంది సురమునుల్ మగిడి
ప్రాచీనపతికి సంభ్రమ లీల నపుడు
చెప్పిరి వేర్వేఱఁ బెలఁగి యాస్థలము
నప్పుడు సురనాథుఁ డాశ్చర్యమంది
తన మనోహ్లాదంబు దవిలి ప్రేరేపఁ
జనియె నచ్చటికిఁ దా సంభ్రమంబునను
మండూక క్రిమి కీట మత్స్య కర్కటక
కుండలి మకర సంకులములు లేక
వితతమ్ముగా వారు వినుతించునట్టి
యతి నిర్మలంబైన యా కొలన్గాంచి
మదిలోన నానందమగ్నుఁడై యపుడు
గదియంగ నటుపోయి కని సంతసిల్లి
నిల గంగ కాశి విశ్వేశులఁ బోలి
జలపావన స్థాన శంభు లింగముల
నందుఁ గృతస్నానుఁడై యతివేడ్కఁ
బొందిన పాతకంబులను పోనాడి
గాజుపూసకు వెదుకఁగా దివ్యరత్న
రాజమచ్చటఁ గాంచి రంజిల్లినట్లు
నదయుఁడై యట వేటలాడంగఁ బోయి
ముదలి వేల్పునుగాంచి మోదమ్ముతోడఁ
జూచి సురేంద్రుఁ డచ్చోటి కంతటను
నేచి దగ్గఱవోయి యీక్షించు నపుడు

దన్మయావస్థుఁడై తన్ను దా మఱచి
యున్మత్తభావంబునొ ని యయాంగాంచ
జిత్తమ్ముదెలిసి యా చిన్మయానందుఁ
జిత్తాబ్జమున నిల్పి సేవింపఁ దొడఁగె
జయజయ మహదేవ జయమహాదేవ
జయ నిత్యసత్యాత్మ జయ పరమాత్మ
జయ యాదిదేవతార్చిత పాదపీఠ
జయజయ త్రైలోక్య సామ్రాజ్యభాగ్య
జయ తారకాధీశ జయ జగదీశ
జయ యోగిహృత్పద్మ సదయ ప్రకాశ
జయ శాంభవస్థాంగ జయసత్యరూపాంగ
జయ సచ్చిదానంద సజ్ఞాని సంపన్న
జయ త్రిభువనకీర్త్య జయ హరిసేవ్య
జయ శైలకోదండ జయ విఘ్నశాంప
జయ పరభట్టార జయకృపాపూర
జయ జయ పరమేశ సకల ప్రకాశ

గుబ్బలైన పార్వతీ కుచకుంభయుగళ
మొరసి కందెడి దేహమా నిర్మలాంగ !
గాలివానల నెండఁ గసుకంద కుంది
చాలంగ మృగపక్షిజాలమ్ములెల్ల
రా యుండింపఁగ పిట్టరాయిడై కోర్చ
పాయకిందుండితే పార్వతీనాథ!
రూపంబులందు నరూపంబులందుఁ
వ్యాపించి సకలంబు నందున్న నీవు
నీ శాసనంబునం దీశాంత మగుట
నాకును వెరఁగయ్యె నాగేంద్రహార !
యని మ్రొక్కి యాదేవు నపసవ్య భాగ
మున నున్న రుద్రాణి ముజ్జగన్మాత
నంగయ కన్నమ్మ నటఁ బొడగాంచి
సాంగమ్ముగాఁగ సాష్టాంగమ్ముఁ జేసి
అంబ ! నీకంత సూత్రాధ్యత గాదె
పంచిన గరళాగ్నిఁ బ్రబలె శంకరుఁడు.
తల్లి ! నీ కరుణాంచితమ్మునఁ గాదె

యెల్లదానవులను హింసించె హరుఁడు
జనని ! నీ సద్వ్రతాచారత గాదె
ఘనతర పశుపతిఖ్యాతి శంభునకు
వమ్మ ! నీదగు సహాయమ్మునఁ గాదె
కమ్మవిల్తుని నీఱుగాఁ జేసె మృడుఁడు
నగజ ! నీవిల్లు తోడైయుండఁగాదె
జగదీశుఁ డొంటి నిచ్చట నుండఁగలిగె
మాత ! నీదౌ దివ్యమహిమచేఁ గాదె
భూతేశుఁడా మింటిపురములఁ గూల్చె
నని సన్నుతులు చేసి యా దివ్యసరసి
చని హేమఘటముల జలములు దెచ్చి
ముదమొప్ప శర్వాణి భూతేశ్వరులకు
విదితంబుగా నప్డు వేదమంత్రములఁ
బొసఁగంగ నభిషేకములు భక్తిఁ జేసి
యసమాన దివ్యాంబరాదు లర్పించి
సలలిత కర్పూరచందనం బలఁది
పొలుపొందఁ బూజింపఁ బుష్పముల్ వెదకి
వెదకియుఁ గానక వికలుఁడై యపుడు
మదిలోన వెరఁగంది మఱిఁ జాలఁగుంది
నాకేశుఁ డిట్లను నాక్లేశుఁడగుచు
నాకేటి పట్టంబు ? నాకేటిబ్రతుకు ?
నాకిట్టి యెడఁ బ్రసూనముల నీ దేవుఁ
జేకొని పూజింపఁ జేకూరదాయె
ననుచు శోకింపఁగా హాలాస్యవిభుఁడు
ఘనముగ సంతోషకలితుఁడై యపుడు
వేఁటు వచ్చుచు నిట్లు వేడ్క నాయందు
గాటమై నిజభక్తిగలిగెనే యనుచు
వేల్పు రాయల భక్తి వేగంబె మెచ్చి
కల్పించె నాకొల్నఁ గనకాంబుజములు
నటు చింతతో నతఁడటుయిటుఁ జూచి.
తటుకునఁగాంచె ముందటను శోభిల్లఁ
గడువిస్మయంబంది కడుసంతసిల్లి
మునులార ! గంటిరే మును మీరలిచట

ఘనమైన కాంచనకమలముల్ వేగ
నాజన్మఫలమున నగజాధవుని
పూజింపఁగల్గె నీ పుష్పాల ననుచుఁ
గందక కుందక కడు మస్పుతముగా
చెందుటగాక విచ్ఛిన్నముగాని
మును విచ్చినవిగాక మురువైనవిగాక
బహుళ సౌరభ్యఘుమ్మను వెల్లఁ గోసి
గుహుఁడు తల్లిదండ్రులఁ గోరి యర్చించి
యలరంగ ధూపదీపాది నైవేద్య
ములను గర్పూరతాంబూలంబు మరియు
నంగరంగముల నతివైభవముల
నంగయకణ్ణమ్మ కా దేవునకును
గూర్పించి నెమ్మదిఁ గోరిక చింతించి
యేర్పడఁ బుష్పకం బిచ్చోట నిప్పుడు
కల్పింతునని విశ్వకర్మ రప్పించి
శిల్పార్య! ఘనదివ్య సిద్ధివిమాన
మిప్పుడు రచియింపు మీక్షణం బనిన
నప్పుడు సురపతి కతఁడిట్టులనియె
విను దివిజాధీశ! విన్నవించెదను
గలదందు రత్నసంఘటిత సౌవర్ణ
విలసితోజ్జ్వల కాంతి విఖ్యాతమైన
దివ్యవిమానంబు దేవలోకమున
భవ్యమైయున్నది జలభేది యనిన
నా దేవపతి యని యపుడె తెప్పించి
సాదరహృదయుఁడై సద్భక్తితోడ
నష్ట కరులను బూన్చినట్టి పుష్పకము
నష్టమూర్తికి వేడ్క నర్పించి యపుడు
నా విశ్వకర్మతో నమరవల్లభుఁడు
భావింప మున్నొక్క పట్టణం బిచట
లాలిత వైభవాలంకారములను
గైలాసతుల్యమై కలుగంగఁ జేలు
నైనను నీ విద్య నతిరమ్యముగను
నీ నేర్పు మెఱయంగ నిర్మింపవలయు

ననిను బనిపూని యా విశ్వకర్మ
ఘనతర సంతోషకలితుఁడై యపుడు
బంగారు గోపుర ప్రాకారములును
నింగితో రాయు మాణిక్య కంభములు
పగడంపుఁ గంభాల పద్మరాగములు
జగతిపై మించుపచ్చల గవాక్షులు ను
మరకతోజ్జ్వల రత్నమంటపంబులు ను
గురుతర హరినీలకుట్టిమంబులు ను
బహుతర వజ్రసోపానపంక్తులు ను
సహజ నిర్మలరుచి స్ఫటికగేహములు
రమణఁ జతుర్గోపుర ద్వారములును
విమల హేమకవాట వితతులు గూడ
ధవళిత వృషభకేతనములు నమరఁ
బ్రవిమల ముక్తాతపత్రముల్ మెఱయఁ
జారు చామీకర చామరంబులును
భూరి రత్నాంచిత భూషణమ్ములు ను
పరగ సాంబ్రాణిధూపముల వాసనలు
నిర్మల ఘనసార నీరాంజనంబు
లర్మిలిఁ గాంతాసహస్ర మర్పింప
నప్సరస్సతులతో నమరిన సతులు
నీప్సిత నాట్యమ్ము లెలమితో నాడ
ఘన భేరి భాంకార ఘంటికారవము
లనుపమశంఖ కాహళ నినాదములు
దుందుభి ధ్వనులతోఁ దూర్యమృదంగ
సందోహ పటహ నిస్సాణవాద్యములు
నంచితంబైన వీణారవంబులు ను
పంచమహావాద్య పటహముల్ మొఱయఁ
గలితమై భూలోకకైలాస మనఁగఁ
బొలుపొంద వైభవస్ఫురణ శోభిల్ల
నంగయకన్నెమ్మ కతిరమ్యముగను
రంగైన గుడి గోపురద్వారములను
నగణితోత్సవముల నధికంబుజేసి
తగమించుచున్న తద్ద్వార కవాట

గోపురోజ్జ్వల రత్నకుట్టిమంబులును
వాపి కూప తటాక వనసరూహంబులు
ప్రణుతింపఁ దోరణ ప్రాకారములును
మణిమయ ఘనసౌధమంటపంబులును
నున్నతధ్వజముల నురుతరంబుగ నొ
ప్పెన్నొంది మునిసిద్ధ సేవితంబగుచు
పాతాళమున శేషభామలు వెడలి
భూతలి కరిగి యప్పురిలోఁ జొక్క
చదలేటిలోఁ గృతస్నానలై మగిడి
ముదముతోఁ దమ పురంబుకు బోను దెలియ
నగడిత లోఁతును నా కోట పొడవు
పొగడంగరాక యే ప్రొద్దు శోభిల్లు
కహ్లార కదళికా క్రముక పున్నాగ
మందార పనస నింబక చంపకోఘ
చందన ఖర్జూర సాల రసాల
శింశుపా మలక కౌశిక మాతులుంగ
కింశుక గుడపుష్ప కేతకాశోక
వాసంతి దంతధావన తిలక నాగ
కేసర న్యగ్రోధ గిరికర్ణ భద్ర
ధారుణి యజ్ఞాంక దాడిమ పిప్ప
లార కదంబ రుద్రాక్ష హింతాల
భల్లాత కేతకీ పాటలీ బిల్వ
మల్లి కారిష్ట మన్మథ జాతి నిచుళ
శామంతి శాల్మలీ జంబు జంబీర
హైమావతీ తింత్రిణా మ్లాతకాది
వృక్షలతా గుల్మ వితతుల నొండ
నక్షయమ్ముగ దట్టమై యొప్పుగాను
వెలయు నీ ఫలపుష్పబృందముల్ మించి
శార్కొని ఘోరాంధకారంబు గాఁగ
కీర శారిక శుక కోకిల క్రౌంచ
కాక ఘూక చకోర కలరవ కేకి
కారండ మధుకర గంభీర కలక
లారావముల మించు నారామములును

తమ పదంబులు బృంహితమ్ము వర్షించి
గములుగా నా శరత్కాలభయము న
నీలమేఘము లిందు నిగిడెనో యనఁగ
జాలెడు మత్తేభసంఘముల్ గలిగి
ఆయతోన్నత శక్తి నందఁ బెంపొందు
వాయువేగము గల వాజులు గలిగి
బలిసి యేమైనను బరగ నిర్మింపఁ
గలిగినందు రా విశ్వకర్మ వంశజులు
పరగఁ జతుర్వేద పారగులందు
శరణార్థిరక్షణ క్ష్మాతలాధిపులు
కోటికిఁ బడగెత్తికొను నూరుభవులు
వేఁటూరు తుండముల్ వ్రేయు రావుతులు
వినుతింప రణములో వెన్నీని భటులు
ననిమిషాచార్యుతో నమరు సన్మంత్రు
లురుతర సామంతులాగి ధనవంతు
లరుదైన దొరలు మహాకార్యపరులు
పరమపుణ్యాంగనల్ పరికింప మఱియు
నందమై కైలాసమందు రా దెంచ
బహు పురుషోత్తమ ప్రఖ్యాతిఁగాంచి
విహితమై వైకుంఠ విఖ్యాతి మించు
తగ మించి సత్తసంతానముల్ గల్గి
పాలుపొందు నమరేంద్రపురమున కంటె
నవ్యమై నవనిధానము లుండుకతన
భవ్యంబుగా దెంచ భావింప నలక
నధికాభిరామమై యా యయోధ్యకును
నధికమై దీపించు నా పట్టణమ్ము
గల్పింప నా విశ్వకర్మను బొగడి
యల్పమ్ముగాని పదార్థమ్ము లొసఁగి
యనఘాత్ముఁడా యింద్రుఁడా దేవు నపుడు
తనదు సహస్రనేత్రములను జూడ
కోటి సూర్యప్రభాకోటుల తోడ
వాటమై గాఢలావణ్యమ్ములందుఁ
జూచినఁ జక్కనై శోభిల్లుటకు ను

శ్రీ చొక్కనాథుఁడై శ్రీరంగరమ్యాఁ
జాల సౌవర్ణపుష్పము లుద్భవింపఁ
జాలంగ నాకొలఁకి బొత్తామరయ్యె
నప్పుడు సురనాథుఁ డాశ్చర్యమొంది
తప్పక వినుతించెఁ దగు వాక్యములను
సారంగవర్ణిత శ్యామలగ్రీవ !
సారంగలోచనా సారంగమాంగ !
సారంగ ఘనచర్మ శాటీ కటీర !
సారంగగుణ ధనుర్జయ శిఖాపాంగ !
సారంగరక్షణ ! సారంగశిక్ష !
సారంగధరజూట ! సారంగహస్త !
కైలాస్య పురనాథ యష్టాంగనాథ !
ఓ లోకరక్షణ ! యో చొక్కనాథ !
దేవ మహాదేవ ! దేవాదిదేవ.
దేవ ! మీ యాజ్ఞ నన్ దేవేంద్రుఁ డుగ్రుఁడు
నే మున్న వృత్రాసురేంద్రునిఁ ద్రుంప
నా మహాఘోరుని హత్య నా యందు
సంభవించుట చూచి సంయమీశ్వరులు
జృంభిత హృదయులై చేర రాకుండఁ
జేసిరి యొకకొంత శోషించి నేను
త్రోసి యింకొకసారి తొడరకయుండఁ
గాయజాంతక ! యిట్టి కలుషసంఘములు
నా కుండఁ బాపవే నాపాలివేల్ప !
యని విన్నవించిన నా మహాదేవుఁ
డనువందఁ బ్రత్యక్షమై యానతిచ్చె
నెఱుఁగక చేసిన దోసమైనఁ గాని
తెలియఁగ చేసినఁ బాప మేమియు నైన
చేకొని మముఁ బూజ సేసితి గాన
నీకు దోషము లేదు నీ లోకమునకు
నే భయమ్మును లేదు నే వెంట నిపుడు
నీ భువిఁ బొలుపైన యీ ముక్తిసరసి
పొత్తామరను మాకుఁ బొసగుఁ జిత్తమున
నత్తినయది గాన నతిభక్తి నీవు

చైత్రినిఁ జిత్త నక్షత్రంబు నందు
పుత్రపౌత్ర భ్రాతృ భూరి సన్మనుల
తో వచ్చి స్నాన మీతోయజాకరము
భావించి చేసి మా పాలికి వచ్చి
మముఁ బూజనేసి నెమ్మది నీదు పురికి
క్రమముతో నేగు సుత్రామ ! నీ వనినఁ
జాలంగ నప్పుడు సంతోషవార్ధి
నోలలాడుచు వేడ్క నుప్పొంగి చెలఁగి
ఆనందరసము దేహములోన నిండి
పూని పై వెడలంగఁ బోవునో యనఁగఁ
బులకాంకురమ్ములు పొడమ గాత్రమునఁ
బలుమారు సంతోషబాష్పముల్ దొరఁగ
దర్శించు నుతియించుఁ దన్ను దా మఱచు
హర్షించు నీ లీలలను గొంత తడవు
చొక్కనాథుని కృప శోభితంబుగను
జక్కఁగాఁ బ్రణమిల్లి సద్భక్తితోడఁ
గ్రమ మొప్ప నంగయకణ్ణమ్మ పాద
కమలంబులకు మ్రొక్కి కరములు మొగిచి
యమిత సన్నుతులచే నభివృద్ధి గాంచి
యమరావతికి నేఁగె నమరవల్లభుఁడు
దివి నుండి సురలెల్ల దేవదుందుభులు
భువిఁ జెలంగఁగఁ జేసి పుష్పవర్షములు
గురిపించి రప్పుడు కోర్కె లింపెసఁగఁ
బురహరుమీఁద నద్భుతలీల మెఱయఁ
గడు వేడ్కఁ జిత్త నక్షత్రమ్మునందు
సడలక హేమాబ్జ సరసిలో మునిఁగి
యేడాది కొకమాటు నింద్రుండు వచ్చి
పోడిగా నాస్వామిఁ బూజించి చనును
ఇదియుఁ బ్రథమలీల యిది విన్న వ్రాయఁ
జదివిన నట్టి యా సద్భక్తులకును
దొలగుఁ బ్రహ్మహత్యాది దోషముల్ మిగుల
బలియులై సౌభాగ్యపదవి నొందుదురు
అనుచు సన్మునులతో నా యగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె

దానందు నోర్వక తన మదంబునను
గనవిధి ప్రేరేపఁ దన దుష్కృతమునఁ
దన మస్తకంబునఁ దగిలున్న యట్టి
యా దండ నల్ దిక్కులందున విసరి
పాదంబులను మెట్టి పారంగ వైవ
వైచిన నమ్మని వడి లేచి వచ్చి
చూచి నివ్వెరగంది చోద్యంబు నొంది
హా! దేవ దేవేశ! హా మధురేశ!
ఆదిత్య సంకాశ! హా పార్వతీశ!
హా! చొక్కనాథ! మహాదేవ! యనుచు
నచ్చోట మలినమై యట్లున్న దండ
కరయుగంబున నెత్తి కన్నులనొత్తి
శిరమున పైకెత్తి తచ్చిత్తము న్నొత్తి
కటకటా యంచు నగ్గవను గెంటెఁస
కటములు నదర దిక్తటములు చెదర
నమ్మహాసభవార లందఱు బెగడ
హుమ్మని జంకించి యుగ్రుఁడై పలికె
నిక్కమై సర్వేశు నిజప్రసాదంబు
మక్కువ నీకు సమ్మతిఁదెచ్చి యొసఁగ
నకటా! దురాత్మ! యహంకారమునను
వికసితదామంబు వేడ్కఁ గైకొనక
ప్రల్లదంబున నీదు భాగ్యగర్వమున
నుల్లంఘనము సేయ నుచితమే నీకు
సేయుట గా కిభసింధురాగ్రము న
వేయుట నీవట్లు వేసినఁ దనదు
మదము పెంపునఁ గాల మట్టి మల్లాడి
విదళించి పోఁబార వేయుట యొట్లు ?
కావున నీమస్తకం బటు పాండ్య
భూవరు చక్రాసిఁబొందుచు వ్రక్క
లవుఁగాక యని జిష్ణు నట శపియించి
ధవళిత మ్రభవేదండంబుఁజూచి
గరిమతో నీ మస్తకంబున నిడిన
తరుణేందుధరు ప్రసాదము భక్తిఁ గొనక

తుదలేని గర్వానఁ దుది ముట్టి నీవు
మదమున నీకాల మట్టుట వలన
నడవి యేనుఁగ వౌచు నడవుల లోన
నుడుగక తిరుగాడుచుండుదు గాక
యని శాపమిచ్చిన నాగద్దె డిగ్గి
యనిమిషాధిపుఁడు సాష్టాంగమ్ముఁ జేసి
చేరి ముందట నిల్చి చేతులు ముగిచి
కోరిక లింపొందఁ గొనియాడఁ దొడఁగె
మునిసార్వభౌమ ! యో మునికులశ్రేష్ఠ !
మునిలోకపావన ! మునివంశతిలక !
పరమేశ్వరరూప ! పరమేశ్వరాంశ !
పరమేశ ! దుర్వాస ! పరగ నీవాగ
గడపి నన్ రక్షించు కరుణాసముద్ర !
యడరి నీకోపాగ్ని కలవిరు యేను
నని యింద్రుఁడును మునులర్థిఁ బ్రార్థింప
మనమునఁ గృపకల్గి మన్నించి నీదు
మకుటంబునకు గాక మస్తకంబునకు
శకలమ్ము లేదు నా చక్రాసి చేత
నెంతయుఁ జనుమన్న నిచ్చలో నవుడు
సంతోషచిత్తుఁడై సాష్టాంగ మెఱఁగి
మునినాథునకు నంత మెప్పుగా లమర
ననిమిషాధీశుఁ డిట్లని విన్నవించె
మునినాథ ! నా తప్పు మొంగి గాచితేని
నైరావతము శాప మాత్మ భావించి
కారుణ్య, మీ తప్పుగాచి రక్షింపు
మని మునులును దాను బ్రార్థన సేయ
మునిపుంగవుఁడు పల్కె మోదంబుతోడ
నా రీతి నీగజం బతిగర్వ మడర
ఘోరాటవులలోనఁ గుమ్మఱుచుండి
యా కదంబాధీశు నా చొక్కనాథుఁ
బ్రాకటంబుగ గన్నఁ బాయు శాపంబు
నని యురుతర శాపమర్ధితోఁ బాపి
చనియె దుర్వాసుఁ డాశ్రమభూమి కపుడు

అంతట సురనాథుఁ డమరుల మునుల
నెంతయు వేడ్కతో నెల్లర ననిచి
వెనుకొని పులి నాకి పడిచెనే ! యనుచుఁ
దన నగరికి నేఁగెఁ దదనంతరంబ
ఐరావతము తన యపరాధమునకు
నాహాప ముడిగి యయ్యపనికి డిగ్గి
వనగజం బగుచు దుర్వార వేపసల
వనమార్గముల యందు వర్తింపుచుండి
దినకరాంశుల డస్సి దేహంబు గ్రుస్సి
వనము లోపల నొచ్చి మానంబు డించి
మగటిమి దిగనాడి మదము వోనాడి
పగలను గుంది యవ్వనటులఁ జెంది
యాఁకటిచే నొచ్చి యలఁతయు హెచ్చి
వాఁకలందున నేఁగి వానలఁ దోఁగి
రాల రప్పలఁ గంది రాయిళ్లఁ బొంది
గాలిచేతను జిక్కి కర్మానఁ జొక్కి
యీవిధిఁ గాలమ్ము లెన్నేనిఁ గడిపి
పాపనస్థలి కడవవనంబు జేరె.
చేరి ముందటి కేఁగి శ్రీకరంబైన
చారునాళాబ్జ సరసిని జేరి
కాంచి యందుల దోఁగి కర్మంబు లీఁగి
పంచాస్త్రహరుఁ గాంచి భక్తితో మ్రొక్కి
చొప్పుగాఁ దగు షోడశోపచారముల
నప్పరమేశ్వరు నర్థిఁ బూజించి
సోమార్ధశేఖర ! సోమార్ధకాయ !
కామితఫల నాథ ! కైలాసనాథ !
చిత్తజాంతక రూప ! శేషకలాప !
మత్తేభ సంహర ! మధువైరి శర !
తారక బ్రహ్మేశ ! తారాద్రివాస !
తారాధిపతిధర ! తారాధిజనక !
శివ శివ ! గణనాథ ! శ్రీ చొక్కనాథ !
భవ ! మిమ్ముఁ బొడగంటి భవము వీడ్కొంటి
ధన్యుండ నైతిఁ గృతార్థుండ నైతి

మాన్యుండనైతి సన్మార్గుండనైతి
నని తన శోకమ్ము హరునకుఁ దెలియ
వినయమ్ముతో విన్నవించి యాగజము
మీరున్న రథమున మేకొన్న యష్ట
వారణంబులు పుణ్యవంతులుగాన
నీ యష్టగజములందే నొక్కటియుంగను
బాయక రక్షించు భక్తసన్మోద !
అని విన్నవించిన నా చొక్కనాథుఁ
డనువొందఁ బ్రత్యక్షుఁడై యానతిచ్చె
ననిమిషేంద్రునికంటె నధికభక్తుండవు
చనుము నీకును బూర్వజన్మంబు గలిగె
నీ యష్టగజములందే నొక్కండ గాను
పాయకయుండు మతిభక్తిమార్గమున
నని యానతిచ్చిన నా దేవునకును
పెనగిన వేడ్కతో దండమ్ము వెట్టి
గరిమతో నగయాసనమ్ము పాద
సరసిజమ్ములకును సద్భక్తి మ్రొక్కి
విడయక నా యభ్రదంతావళమ్ము
కడువేడ్క దేవలోకమునకు నరిగె
తనరిన యభ్రవేదండంబు లీల
విన గలిగినయట్టి విమలాత్ములకు సు
నజ్ఞానమడఁగి యా హరు కృపగలిగి
సుజ్ఞాన వైభవసుగతి నుండుదురు.
ఇదియు రెండవలీల యిటుమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార ! వినుఁడు.
అనుచు సన్మునులతో నా యగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనె రెం
వది సర్వజ్ఞ సత్యవీంద్ర పాదాబ్జ
విదిత పూజామోద విమలుండు పచ్చ
కప్పుర సౌరభ్య కలితమానాంక
తిప్పరాజ సుపుత్ర తిరువేంగళేంద్ర
విరచితంబగు లోకవిఖ్యాతమైన
సరసలక్షణ కావ్య సత్యవీంద్రాభి
నందిత శ్రీ చొక్కనాథ చరిత్ర
మందున నిది ప్రథమాశ్వాసము.

# ద్వితీయాశ్వాసము

## మూఁడవ లీల.

శ్రీ మహాదేవుండు శ్రీ కంధరుండు
సామజహరుణుండు సౌందర్యవిభుఁడు
నా శంభుఁ డభవుండు నంబికాధ్యక్షుఁ
డాశివిషాంగదుం డంధకాంతకుఁడు
శ్రీ చొక్కనాథుండు జితమన్మథుండు
నా చోటు నా కదంబారణ్యమున ను
నరుమగా నటు వినోదార్థమ్ము గాఁగ
గర మొప్ప సంగయకణ్ణమ్మ దాను
స్ఫురద్వైభవసమ్ముల సొంపుతో నుండ
నాల పోతును నెక్కి యజహరీంద్రాదు
లోలిమై గొలువ నత్యున్నతంబైన
యా పుణ్యకాంతారమందు విచ్చేసి
దీపించు వేడ్క వర్తింపుచునుండఁ
గలయంగఁ దమతల్లిఁ గాన కచ్చోటఁ
బలవించు హరిణడింభకములఁ జూచి
కరుణతో సంగయకణ్ణమ్మ దాను
పరమేశునకు విన్నపముఁ జేసె దేవ !
యీ హరిణడింభమ్ము లిటుఁ బ్రలాపింప
నే జూచకేగెనో ! యివి గన్నతల్లి
యట 'సర్వజీవ దయాపరత్వమ్ము'
నటులాడె ! నీయందు నిక్కమైయుండు
గావున వీటిని గాచి రక్షించి
పావనుంజగఁ జేయు సారంగహస్త !
అనిన నాస్వామి యాదేవి పలుకు
లనువొప్ప మన్నించి యా సమీపమునఁ
ఘోరమైనట్టి శార్దూలమ్ము గాంచి
యీ లేడిపిల్లల కెలమి నీచన్ను
పాలు ద్రావఁగ నిచ్చి బ్రతికింపవలయు
నని నా స్వామి ! మహాప్రసాదంబు
ననుచు నవ్యాఘ్రి యేణార్భకంబులకు

# ద్వితీయాశ్వాసము

## మూఁడవ లీల.

శ్రీ మహాదేవుండు శ్రీ కంధరుండు
సామజహరుణుండు సౌందర్యవిభుఁడు
నా శంభుఁ డభవుఁడు నంబికాధ్యక్షుఁ
డాశివిషాంగదుం డంధకాంతకుఁడు
శ్రీ చొక్కనాథుండు జితమన్మథుండు
నా చోటు నా కదంబారణ్యమున ను
నరుమగా నటు వినోదార్థమ్ము గాఁగ
గర మొప్ప నంగయకణ్ణమ్మ దాను
స్ఫురవైభవన్ముల సొంపుతో నుండ
నాల పోతును నెక్కి యజహరీంద్రాదు
లోలిమై గొలువ నత్యున్నతంబైన
యా పుణ్యకాంతారమందు విచ్చేసి
దీపించు వేడ్క వర్తింపుచునుండఁ
గలయంగఁ దమతల్లిఁ గాన కచ్చోటుఁ
బలవించు హరిణడింభకములఁ జూచి
కరుణతో నంగయకణ్ణమ్మ దాను
పరమేశునకు విన్నపముఁజేసె దేవ !
యీ మృగడింభమ్ము లిటుఁ బ్రలాపింప
నే మూకకేగెనో ! యివి గన్నతల్లి
యటు సర్వజీవ దయాపరత్వమ్ము
ఘటులాతే ! నీయందు నిక్కమైయుండు
గావున వీటిని గాచి రక్షించి
పావనుంజగఁ జేయ సారంగహస్త !
అనిన నా స్వామి యా దేవి పలుకు
లనువొప్ప మన్నించి యా సమీపమునఁ
దోరమైనట్టి శార్దూలమ్ము గాంచి
యీ లేడిపిల్లల నెలమి నీచన్ను
పాలు ద్రావఁగ నిచ్చి బ్రతికింపవలయు
గాన నో స్వామి ! మహాప్రసాదంబు
ననుచు నవ్యాఘ్రము మృగార్భకంబులకు

నామధురాధీశు నాజ్ఞ చేపట్టి
ప్రేమతోఁ బన్నిచ్చి పెంచిన నయ్యెడను
నాసురరంగమ్ములు నభివృద్ధిగాంచె
శ్రీసిరరంబైయుండఁ జెలఁగి వర్తింప
నత్తఱి నజహరింద్రాదు లాశ్చర్య
చిత్తులై వినుతింప శ్రీచొక్కనాథుఁడు
కరముప్ప సంగయ కల్యాణమ్ముదాను
పురమున కేగిరప్పుడు ప్రమోదమున
ఇదియ మూఁడవ లీల యిఁకమీఁద వరిత
ముదమునతోఁ జెప్పెద మునులార! వినుఁడి
అనుచు సమ్మదమునతో నాయగస్త్యుఁడు
మునులకుఁ దెలిపె నీలీలయు నిట్లు

## నాల్గవ లీల.

నంతట నా మధురాపురపట్టణంబు
పొంగను మణలూరుపురమునఁ గలసి
వినుతింప నప్పురి విఖ్యాతిగాఁగ
దనరంగ మలయకేతనుఁ డేలుచుండు
నాపుర చొక్కవైశ్యుఁ డతిధనాఢ్యుండు
వ్యాపారమునఁ బోయి వర్తకంబాడి
తగు వేడ్కతోడ నాధర్మవర్తకుఁడు
నగణితవస్తువు లధికమ్ముగొనుచు
మఱలివచ్చుచుఁ గదంబవనమ్ము త్రోవ
నరుగుచో నావనాభ్యంతరమ్మునను
దండిగా సింహపోతములను జేరి
తొండమ్ము ముక్కున దువ్వ నేనుఁగులు
నఖముల నెత్తి యేణమ్ముల ముద్దు
ముఖములాఘ్రాణించు పుండరీకములు
పాలుమైన యాల మేకపోఁతులఁ జూచి
చెలఁగి మిత్రత్వమ్ము నేయు తోడేళ్లు
శాఖలఛాయల సంచరింపుచు నుఁ
నాఖులతో నాడు నడవిపిల్లులను
గానకొని తగ కొండగొఱియల వేడ్కఁ

గని మేఁపడు శాఖామృగమ్ములును
గడు నెండఁబడకుండఁ గడఁగి పుంగలకు
పడగలు గొడుగుగాఁ బట్టు సర్పములు
నీ రీతిజంతుల నెల్లను జూచి
వైరమ్ము లేకుంట వైశ్యుండు గాంచి
యానందమును బొంది యాశ్చర్య మంది
యా నీపవనమున కరుగు నవ్వేళఁ
దప్తారకూటమై తరుణాతపంబు
దీప్తమై దిప సన్ము ధృతిఁ గల్కఁబాఱె
నటు సూర్యపటుపుటం బంబగమ్మున ను
ఘటితమై మేల్కట్లు గట్టినయట్లు
నొప్పగా రక్తవర్ణదగ్ర మగుచుఁ
గప్పె సంధ్యారాగ కములు నత్తటిని
చక్రాంగఁ జక్రపుష్కరిణిఁ గావించి
చక్రి యుద్ధశతపశ్చరణం బొనర్చ
నాలోనఁ బ్రజ్వలితమై వచ్చిచూచి
కాలకంఠుఁడు శిరఃకంపమ్ము నేయ
జవమునఁ గీలూడి జాఱిన యట్టి
నవరత్నకర్ణ కుండలములో యనఁగ
నరవిందములు ముక్క నసురు లింపెక్క
నరుణాంశుఁ డల పశ్చిమాంబుధి వ్రాలె
మృగపక్షిజంతు సమూహమ్ము లెల్లఁ
దగ మించునాశ్రమ స్థలములఁ జేరె
నంధకదైత్య గర్వాంధ్యవిధ్వంసి
కంధరచ్ఛాయ సంకలితాంధకార
పటలమ్ము బ్రహ్మాండ భాండమ్ముఁ జేరెఁ
దటుకున నక్షత్రతతు లెల్లఁ బ్రబలెఁ
బ్రాచివిగ్భామిని పాటించి నీడ
చూచు దర్పణమన శోభితం బగుచుఁ
దమ్ములు నొవ్వ నుత్పలములు నవ్వఁ
గ్రమ్మేలో నటఁ జకోరమ్ములు గ్రొవ్వ
జారచోరులు వెర్వ సస్యముల్ పర్వ
ఘోరాంధ్యపటలి యొక్కుమ్మడి లివ్వ

వేలుపులకుబువ్వ వెన్నెల కువ్వ
బాలచంద్రుఁడు పూర్వశైలమ్ము నెక్కి
మెలఁగెడు విటుజన మృగములఁ బట్టి
వలరాజు వైచిన వలయో యనంగఁ
బిండి చల్లినయట్లు పేర్చియెల్లెడల
నిండువెన్నెల భూమి నిండంగఁ బర్వ
నప్పుడా వైశ్యుఁడా యెడ నున్నత్రోవ
తప్పి యయ్యెడ నిల్చి తత్సమీపమున
నా రేయి శంఖ కాహళ ఘంటికాగ్ర
భేరీ మృదంగ గంభీరనాదములు
విని యచ్చటికిఁజని విశ్వేశు నగరు
గనుగొని తగ నమస్కారముల్ జేసి
యాలోని కటుఁ బోవు నప్పుడు పరుస
వేళల కేతెంచు విద్యలవారు
సంగనామణుల నాట్యక్రీడ లచటి
మంగళాలంకార మహిమలు చూచి
సౌందర్యనాథుని సన్నిధి నిల్చి
పొందుగాఁ దనదు నేర్పుల నెల్లఁబొగడి
బాణకావ్యత్రాణ! పరమకల్యాణ!
బాణారిబాణ! సద్భక్తధురీణ!
సురగిరిద్రోణ యో సుజనప్రవీణ
త్వరితభక్తత్రాణ! పాణితత్రైణ!
పురహర్త హరిభర్త భువనైకకర్త!
సురతార్తిహర! కీర్తిశోభితస్ఫూర్తి!
ధవళశరీర యో దశదిశాకార!
శివ భవానీనాథ! శ్రీచొక్కనాథ!
అని యివ్విధంబున హరుఁ బ్రశంసించి
ఘనుఁడు నా వైశ్యుఁడు కరమర్థి గుడియు
వెడలి వచ్చుచుఁ బురవీథు లంగళ్లు
గుడిగోపురమ్ములు కోటలు మేడ
లడర నల్దిక్కుల నమ్మహామధుర
దీపమ్ములను సోమదివ్యరత్నముల
దీపించురాత్రులు దీపమాయుండఁ

గలయ నాపురమెల్లఁ గనుఁగొనియున్న
నెలవున నొకచోట నిద్రించె నంతఁ
బొడిచె వేగురుఁ జుక్క పురుహూతుదిశను
నుడురాజు నటఁ బశ్చిమోదధి కేఁగె
గొక్కురో కో యని కుక్కుటమ్ములును
వెక్కసమ్ముగ మ్రోసె వినువీధి నంత
తెలతెలవారె నల్ దిశలు దీపించెఁ
గమలముల్ వికసించెఁ గాంతిశోభిల్ల
కమలారి సంపూర్ణ కళలొత్తిగిల్లె
నుగ్రాంధతతి వీడె నోషధుల్ వాడె
నగ్రజన్ములు వేడ్క నర్ఘ్యమ్ము లొసఁగ
రవికాంతశిలలంత రాఁజుచు నుండ
దివిజేంద్రు మేడపై దీపించునట్టి
పదియారువన్నెయౌ బంగారుతోడఁ
గుదురైనమాణిక్య కుంభమో యనఁగ
ముక్కంటివలచూపు ముగురైనరూపు
జక్కవలకువిందు జారులకుంచు
కలువలపగవాఁడు గ్రహములఱేఁడు
నలరి భానుఁడును నుదయాచలంబెక్కె
నారాత్రి యందుండి యమ్మఱునాఁడు
సూరఁ జూండటఁ దన యూరికిఁ బోయి
యామణులూరి పురాధ్యక్షుఁడధిక
భూమిపాలుఁడు పాండ్యభూపాలకుండు
కొలువున్న వేళను గొమరొప్ప నొక్క
జలజరాగంబు దర్శనమిచ్చి కాంచి
యతనిమన్ననచేత నచటఁ గూర్చుండి
యతివేడ్కతోడ నిట్లని విన్నవించె
అవనీశ ! యేను బేహారకృత్యమునఁ
దిరిగి యాపశ్చిమ దేశమ్ము కరిగి
యచ్చటఁగల భూములన్నియుఁ జూచి
వచ్చుచోటఁ గదంబవన మధ్యమునను
మధురాపురంబన మహితసంపదల
నధికమై విలసిల్లు నాపట్టణమ్ము

నందు సర్వేశ్వరుఁ డవతారమొంది
సౌందర్యవతి తాను సౌందర్యుఁడగుచు
శ్రీచొక్కనాథుఁ డాశ్రిత రక్షణార్థ
మై చనుదెంచి యయ్యెడ నున్నవాఁడు
దేవ ! నే నెఱుఁగని దేశముల్ లేవు
భావించి చూడని పట్టణముల్ లేవు
తివిరి నేనాడని తీర్థముల్ లేవు
నరసి కానని శివాలయముల్ లేవు
ధర నేను మ్రొక్కని దైవముల్ లేవు
నట్టి యాశ్రమమును నట్టి పట్టణము
నట్టి దేశములును నట్టి దైవంబు
గట్టిగా నెచ్చోటఁ గనికాన నెఱుఁగ
నా మధురకు సాటియైన పట్టణము
భూమండలమ్మునఁ బొడగాన నధిప !
తగు వేడ్క నిజరాజధానిగా నీకుఁ
దగును పాండ్య నృపాల ! ధర్మవిశాల !
యని ప్రియమొప్ప నా నృపాలకుఁడు
దనర నా సెట్టికిఁ దగఁ గట్ట నిచ్చె
నంతట సూర్యుఁ డస్తాద్రికిఁ జనిన
సంతోషమున మంత్రి సామంతవరుల
బలసమేతముగాఁ బ్రత్యూషవేళ
బలసి రండని వీఁడు పట్టికి నంపి
యపుడు మజ్జనము సంధ్యాదికృత్యములు
జపములు దేవతార్చనమును దీర్చి
బహుభక్షణములైన పంచామృతములు
బహుళమై పెక్కండ్రు పంక్తిఁ గూర్చుండి
కొసఁగఁగ భుజియించి కౌఁగిలి వార్చి
యమ్మనుజేశ్వరుం డందఱఁ బనిచి
నెమ్మితో నొక కొంత నిద్రించునంత
సోమసౌందర్యుండు చొక్కనాయకుఁడు
భూమీశ్వరుని స్వప్నమునను విచ్చేసి
యా కదంబాటవి నావిర్భవించి
యేకతంబున నుండ నింద్రుండు వేఁటు

గా వచ్చి మము వేడ్కఁ గాంచి యర్చించి
దేవాలయంబును దివ్యమంటపము
గావించి చనియెను గడువేడ్కతోడ
బంగారు గోపుర ప్రాకారములను
సంగీతసాహిత్య సౌఖ్యమ్ముగాను
గావించి చనియెను గ్రామాగ్రమున్న
నీవు [illegible]పూజలు నెమ్మితోఁ జేసి
తనర నాపురి రాజధానిగా నెపుడు
ననుపము పుత్రపౌత్రాభివృద్ధిగను
ననయమ్ముగా రాజ్య మచటఁ బాలింపు
మనఘాత్మ నీవు మా కధికభక్తుఁడవు
నని యానతిచ్చిన నారాజు మేలు
కని మంత్రివరుల నాహ్వానము రచించి
కలగన్న విధము వేడ్కలఁ జెప్ప నంత
జెలఁగి స్వప్నాగమ శ్రేష్ఠులనచట
నారాజుఁ జేరి యత్యానందమునను
నో రాజశేఖర ! యొక విన్నపంబు
కలయేర్పరింతుము కడువృశ్చికములు
జలగలుం గఱచుట జయములేదండ్రు
కప్పముట్టినఁ బాము గఱచిన నతఁడు
నష్టపుత్రత్వము నభివృద్ధిగాంచుఁ
దల పేను గనుట మధ్యము దధిక్షీర
ములు ఘృతంబును రక్తములు ద్రావుటయును
గండలు తినుట తక్కక ప్రేవులెల్ల
నుండలై పడ నివి యొగి మంచిదండ్రు
రుధిరంబు జలములు రూపించికన్న
నధిక మాయుష్యమ్ము నటు పంటఁగన్నఁ
గలిమి చేకూరును గలలందు మఱియుఁ
దెలుపులన్నియు మేలు తెలియంగ నినుక
వెలిమిడి రొంపికలు వెస నుప్పు ప్రత్తి
తలఁపంగ నివియెల్లఁ దక్కఁ దక్కినవి
మఱి గార్దభము మోటుమా నెనుబోతు
పరువడితో నెక్కి పట్టి రొక్కటియుఁ

దిలలు సన్నము పింపిలిన్నఁగేఁడోదళ్ళ
గలను నూనెయుఁబ్రావఁ గసురోగి యగును
మదకరియను నీలమణి సంఘమ్ముగను
మదమును సదకకుంభములు గోపురము
దైవ మంటపములు ధరణియు యమున
శావలి నలువెల్ల నప రొమ్ముపద్మము
ఖరములు శాఖామృగంబులుఁ ధూమ్ర
ఘోరయు భూత ప్రేతములు పిశాచములు
వాయస శ్రీవ శ్వాన గృధ్రములఁ
దా యొక్కఁగనుటయుఁ దవదు స్వప్నముల
నలరి నామూల దండారోహణంబు
లలముండనములు తైలాభ్యంజనములు
వెరసి యివ్విధమున విను విశాఖము
మరణసూచకములు మహిపాల యెఱిఁగియుఁ
బోలుపొందఁ మొదటిజాములఁ గన్న కలల
ఫల మొకయేఁటిలోపలఁ గానబడును
రెండవజాము లార్నెలల ఫలించు
నిండ మూఁడవజాము నౌరి గన్న కలలు
మూణ్ణెల్లఫలియించు మొదలివేఁకువను
బూనినకలలెల్లఁ బోరి పదినాళ్ల
కచ్చటు ఫలియించు ననువంద మెఱిఁగియుఁ
బిచ్చని వృత్తమ్ము బసవరాయనిని
ఘనతరాశ్వమ్ముల గజముల మెడ
నైనయంగఁ గలలోన నెక్కినయట్టి
మనుజోత్తముఁడు సౌఖ్యమహిమలచేత
ఘనమహీరాజ్యమ్ము గడు వేడ్కనేలు
నటుగాన వృషభవాహనుఁడైన స్వామి
నిటలాక్షుఁడిటువచ్చి నిన్ను రక్షించె
క్షితినాథ ! యిచ్చేయు శ్రీఘమ్మగాను
బ్రతిలేని యామధురకు వేడ్కనను చుఁ
గల యొర్పతించు నా గణితజ్ఞులకును
వలసిన ఘనదివ్య వస్తువు లొసఁగి
మలయధ్వజుండంత మది నిశ్చయించఁ

బలపల వేఁగె నాభానుఁడు వొడమె
నంత నావిభుఁడు సంధ్యాదికృత్యములు
నంతయుఁ దీర్చి బ్రాహ్మణులకు నిత్య
దానమ్ము లిచ్చి యా ధన్యుల చేతఁ
బూని మంత్రాక్షతంబులు గొంచు నపుడు
జయభేరి వేయించి జగతి గ్రక్కదల
హయ కుంజర స్యందనారూఢు లగుచు
మండలాధీశ సామంతభూపాల
మండల మ్మతిసంభ్రమమ్ముతోఁ గొలువ
నధికమృదంగమహావాద్యములను
బధిరిత దశదిశా భాగుఁడై కదలి
యాయుపవనమున కరిగి సౌవర్ణ
తోయజాకరమునఁ దోఁగి సౌందర్య
నాయకు శ్రీ చొక్కనాయకుఁ జేరి
పాయక సద్భక్తిఁ బ్రణమిల్లి మఱియు
దేవ ! మహాదేవ ! దేవేంద్రవంద్య !
దేవసన్నుత ! మహాదేవతారాధ్య !
జగదీశ రాజస సాత్త్విక తామ
సగుణత్రయంబున జగము లీరేఁడు
సృష్టింప మనుప శిక్షింపఁగ వలసి
స్రష్టయు హరియును శంకరుం డనఁగ
మూర్తిత్రయంబుగాఁ బొలుపొందు నాది
మూర్తివి నీవు సన్మునిలోకవంద్య !
నీ పాదములు గంటి నీ రూపు గంటి
నా పాపపటల మంతయుఁ బాపుకొంటి
నని సన్నుతించి సాష్టాంగమ్ము చేసి
జననాథుఁ డత్యంత సంతోషమునను
నగణితగతిని నంగయకణ్ణియమ్మ
నగరికి నేఁగి యా నగరాజతనయ
పాదపద్మములకుఁ బ్రణమిల్లి నిలిచి
వేదమంత్రములను వినుతింపఁదొడఁగె
త్రైలోక్యరక్షిణి ! త్రైలోక్యమాత !
త్రైలోక్యపావని ! త్రైలోక్యవంద్య !

మూర్తిత్రయాకార ! మూర్తిత్రయాంబ!
మూర్తిత్రయత్రాణ మూర్త్యాగ్ర్యకారి
యని సన్నుతులుచేసి యచ్చోట నాసి
కనకరత్నాపణ ఘనవైభవముల
రాజిల్లు నా మధురాపురిఁ దనకు
రాజధానిగఁ జేసి రాజశేఖరుఁడు
క్రూరభల్లూక శార్దూల భీమ వ
వారణ కంఠీరవ క్రోడ శరభ
కాంతారమంతయు ఖండించి ప్రైచి
నునుపటి కంతు విస్ఫురణము గాఁగఁ
దనరంగఁ బురము విస్తారమ్ము చేసి
నాముకోదేవుని యనుమతి వలన
గామితభోగ మోక్షప్రదాయకులు
కాపుందు రెప్పుడు కాలుని నాశను
చాముండి బ్రాహ్మి వైష్ణవియును నింద్రాణి
కౌమారి వారాహి ఘనతమాహేశి
లనుసప్తమాతృకలవటు నుండుదురు
పనివడి పశ్చిమభాగమ్ము నందు
నళిననేత్రుండు జగన్నాథుండు గూడ
నళగియపెరుమాళ్లు నరసి రక్షించు
నుత్తరోత్తర కాల ముత్తరదిశను
హత్తినప్రేమ దుర్గాంబిక ప్రోచుఁ
బూర్వదిగ్భాగ భూషణం బగుచు
సర్వేశుఁ డభవుండు సౌందరేశ్వరుఁడు
శ్రీ చొక్కనాథుఁడాశ్రితరక్షకుండు
కాచి రక్షించును గల్పాంతరములు
వలనుగా ఖరవేశ్వర వినాయకులు
తలవరులగుచు నాస్థలిని నడుపుదురు
నట్టి సంపదలచే నమరు మాధుర్య
పట్టణమ్మున నుండి పాండ్యభూవిభుఁడు
నా నీపవనవాసుఁ డధిపతిగాను
దానుప్రధానియై ధరణిఁ బాలించె
నిదియు నాలవ లీల యిటమీఁది చరిత.

మాదనాతోఁజెప్పెద మునులార ! వినుఁడి
అనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె

## ఐదవ లీల

శ్రీ మహాలక్ష్మీ కాశ్రితస్వామి యైన
యా మధురాపురాధ్యక్షత మించి
మలయకేతనపాండ్య మహిమపాలకుండు
నలరంగ సింహాసనాసీనుఁ డగుచు
మూర్ధాభిషిక్తుఁడై మిక్కంటి కృపను
వార్ధి వేష్టిత మహీవలయ భూపాల
మకుటాంతఘటిత సన్మాణిక్యదీప్తు
లకలంక పదయుగ మందు శోభిల్ల
ఘనతరసంతోష కలితుఁడై యపుడు
జనులు తల్లఁ బొగడ రాజ్యము నేలుచుండి
చొక్కనాథుని సేవ చొక్కంబుగాను
మిక్కిలి సద్భక్తి మించి చేయుచును
తరుణప్రాయమున నెంతయు నెక్కు మించి
పరికామినీరతి ప్రాప్తుఁడై తిరిగి
వారాంగనలఁ గూడి వర్తించు టెల్ల
నేరుపు గాదంచు నీతి వాటించి
తనమదిఁ దలపోసి తద్ధర్మ రోసి
యనఘాత్ముఁ డపుడు నిట్లనివితర్కించెఁ
బట్టానకును వంశపారగుఁడైన
పట్టి యొక్కఁడుగల్గి ప్రాపింప వలదె
పుత్రులు లేకున్నఁ బుణ్యమ్ములేదు
పుత్రులులేనింట భుజియింపరాదు
పుత్రులులేనింటఁ బొందదు లక్ష్మి
యును సకలైశ్వర్యమును సౌఖ్యభాగ
మొనరంగ సంతాన మొక్కభాగంబు
శ్రుతి నపుత్రస్య గతిర్నాస్తి యనుచు
శ్రుతులందుఁదగఁ జెప్పుచుండుట వినమె
యనుచు సంభ్రమముతో నాపాండ్యవిభుఁడు

తన మంత్రివరులతోఁ దగ విచారించి
నానా దిశావనీనాథు లేతేరఁ
దా నతివేడ్క సంతానార్థమాగను
కులమును రూపము గుణమును గలుగు
నళినీలవేణిని నంబుజపాణి
నవయౌవనాంగిని నధికలావణ్య
భువనమ్ము నగుపుణ్యభామినిఁ జూచి
ప్రతిసేసి సకలసంపదలు చెలంగ
నతివేడ్కతో వివాహంబయ్యె నప్పుడు
పుడమియు నారాజు భావజుకేళి
నుడుగని సౌఖ్యాప్తి నోలలాడుచును
నావంశపావని యందు సద్భక్తి
గావించి యొకనాఁడు కల్యాణిఁ జూచి
సంతానమునకునై చాలంగ వేడ్క
నెంతయు గలిగున్న దేమి సామ్రాజ్య
మంత భోగింపంగ మనవంశమునకు
సంతతిలేకున్న, సమాజమై యిపుడు
శ్రీచొక్కనాథునిఁ జేరి సత్పూజ
లాచరించిన మెచ్చు నతిసంత తిచ్చు
ననుచు నాసక్తితో నతిసంభ్రమమునఁ
జని యా మహేశు నర్చనములు సేయఁ
బదియాఱువిధములఁ బరగఁ బూజించి
మదనాంతకునిఁ దన మగువతోఁ గొలిచె
నప్పుడు సర్వేశుఁ డాత్మ నుప్పొంగి
యిప్పుడీతని కోర్కెలిత్తు గాకనుచు
నత్యంతకరుణతో నగ్రభాగమునఁ
బ్రత్యక్షమైయున్న పరమేశుఁ జూచి
రంజిల్లి పులకాంకురంబులు వొడమ
నంజలిపుటము ఫాలాగ్రమునఁ జేర్చి
హరహర పురనాశ యఖిలలోకేశ
హరహర పరమేశ యంబరకేశ
హరహర సర్వేశ యద్రిజాధీశ
స్మరహర భూతేశ ! మధురాపురేశ !

నీ పాదములఁగంటి నీ సేవఁగంటి
నా పాపపటలము ల్బాయంగఁ గంటి
మూఁడుం మూర్తులు నీవె మూలమ్ము నీవె
మూఁడుమూర్తుల కాది మూర్తివి నీవె
యఖిలకామ్యార్థమ్ము లతిదయ తోడ
నఖిలార్థులకు నిత్తు వర్థి నీవెపుడు
నట్టి నీ మహిమలు నట్టి నీ రూపు
గట్టిగా నేఁ జూడఁగంటి లోకేశ !
యని సన్నుతుల్చేసి యాత్మ నుప్పొంగి
కనుఁగవ నానందకణములు దొరుఁగఁ
దన పత్నియును దాను దండప్రణామ
మనువొందఁ జేయ నాహరుఁ డానతిచ్చె
జననాథ ! నీ పుణ్యసతికి సంతాన
మునఁగోరి యిచటికి నరుగుదెంచితివి
గాలమిఁ గోరికలు నీకిచ్చెద నీదు
పాలఁతిని గూడుక పొమ్ము నీవనుచు
నంతర్హితుండయ్యె నా చొక్కనాథుఁ
డంత నాదంపతు లాత్మ నుప్పొంగి
కంటిమి మధురేశుఁ గైలాసవాసుఁ
గంటిమి సౌందర్యుఁ గరుణాతిధుర్యుఁ
గంటి మ్మాశ్రితనాథు ఘను చొక్కనాథుఁ
గంటిమి మనకోర్కెఁ గంటిమి యనుచు
నగరి కేతెంచి యా నరనాయకుండు
మగువతోఁ గూడి సౌఖ్యమ్మునుండె నపుడు
గడువేడ్కతోఁ గొంతకాలమ్మునకును
నెడపక మధురాపురేశ్వరు కృపను
మఱి యంతటను నెలమసలె నాసతికి
నరుదుగాఁ గోరిక లగ్గలంబయ్యెఁ
దెలివొందు నెమ్మోము తెలతెలవాఱెఁ
గలకంఠి నూఁగారు కాటుకతోఁ దొడఁగె
గురుకుచాగ్రములపై నొనికప్పు గప్పె
హరిమధ్యకును మధ్య మధికమై పొదలె
నంబోత్తరీయమ్ము నంతంత సడలె

లీలావినోదకు లేమ ముమ్మాలయ
బాలిక యనుపేరు పరగంగ నిడిరొఁ
బ్రేమతో నీ రీతిఁ బెరుగుచు నున్న
కోమలిఁ జూచి యా కువలయేశ్వరుఁడు
నప్పుడు వేడ్కతో నక్షరాభ్యాస
మొప్పగాఁ జేయింప నొజ్జల యొద్దఁ
బ్రణవ పంచాక్షరీ పఠనంబు నేర్చి
ప్రణుతింప వేదముల్ బాగొప్పఁ జదివి
భాట్ట మీమాంసా ప్రభాషమ్ము లెఱిఁగి
నాట్యశాస్త్రము లెల్లనయ మొప్పఁ జూచి
గణిత జ్యోతిశ్శాస్త్ర కావ్యముల్ గఱచి
పఠిఁగి పౌరాణిక గ్రంథముల్ దెలిసి
శేషభాష్యమ్మును జెవికింపు జేసి
చౌషష్టి విద్యల జాడ లెఱింగి
గజ రథాశ్వారోహ కార్ముకవిద్య
ప్రజలు మెచ్చఁగ నేర్చి ప్రౌఢత మెఱసి
విద్యలన్నియుఁ జెంది విమతల నొంది
చోద్యమ్ముగాఁగఁ బ్రస్తుతి మించఁ గాంచె
నంతట పాండ్య భూపాగ్రణి బుద్ధి
మంతుల మంత్రిసామంతుల కనియె
వయసుప్రాయము వోయె వార్ధక మాయెఁ
ప్రియభోజనము సేయఁ ప్రీతి లేదాయె
దృష్టిముష్టులు దరిగె దేహమ్ము సడలె
నష్టభోగములపై నాసలు నుడిగెఁ
దల వణఁకఁగఁ జొచ్చె దంతముల్ వదలె
పలుమాటలకుఁ జెవుడ్పడె వినరాదు
నటుగాన మీరలు నాలస్య ముడిగి
తటుకున ముమ్మాళత్తాయికి వేగ
పట్టాభిషేకమై ప్రజలఁ బాలింపఁ
బట్టమ్ము గట్టుఁడీ ! పట్టణంబునను
ననుచు మంత్రులతోడ నతిసంభ్రమమున
ఘనదివ్యరత్న సంఘటితకిరీటు
మభిరామముగ శిరమందున నుంచి

ప్రభవింప సామ్రాజ్య పట్టమ్ముఁ గట్టి
నంత నా లేఁబ మహాదేవు నగరి
కెంతయు భక్తితో నేతెంచి మ్రొక్కి
దేవసన్నుత హర ! దివ్యసంయముల
భావమ్ములోపలఁ బాయని వేల్ప !
శ్రీమధురాధీశ శ్రీచొక్కనాథ !
నీ మూర్తిఁ గొనియాడ నే నెంతవాఁడ
నని సన్నుతులు చేసి యా దేవుకృపను
తన నగరికేఁగి తగ నెమ్మితోను
బలిమిగా నేకాతపత్రమ్ముగాను
చెలువొప్ప రాజ్యమ్ము నేయుచు నుండ
నంతట నా రాజు నాత్మజఁ జూచి
సంతోషమున నోబోటి సౌందర్యవతివి
పాలింపు మీ భూమి పార్వతీశ్వరుని
లీలావినోదమ్ము లేమి ! నీ వనుచుఁ
దగుమంత్రులను జూచి తగువారిఁ జూచి
యగణితంబుగ నీతులన్నియుఁ గఱపి
నొగి స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్ర
ముగు దుర్గబలముల ననెడి సప్తాంగ
ములవడఁ జేసి బాహాంతరంబుగ
నులఁ గొల్వఁ బంచి సమ్మోదమ్ముతోడ
స్థిరకీర్తిగా నేలు చిరకాలమనుచు
నరిగె నప్పుడు కదంబారణ్యమునకు
నందుఁ దపముఁ జేసి యా చొక్కనాథు
నందమ్ముగాఁ గొల్చి యా దేవుకృపను
మఱిరొంచి దివ్యవిమానమ్ము నెక్కి
సురలోకమున కేఁగె సురలు కీర్తింప
నపుడు సాంగమ్ముగా నాజనకునకుఁ
గృపఁ బరలోక సత్క్రియ లెల్లఁ దీర్చి
శ్రీచొక్కనాథుని సేవ యేమఱక
నా చంద్రముఖి తానె యవనిఁ బాలించె
నది తటాతక జన్మ మీలీల నెపుడు
విదిత మనస్కులై విన్న పుణ్యాత్మ

లతిశయ పుత్రపౌత్రాభివృద్ధి గను
క్షితి మించి సౌందర్య కృప నుందు రెపుడు
నిదియు నైదవలీల యిటు మీఁది చరిత
ముదమంతోఁ జెప్పెద మానసులార వినుఁడి.
అనుచు సన్న్యాసులతో నాయగస్త్యుండు
మునమానఁ బలపోని మఱియు నిట్లనియె.

## ఆఱవలీల.

అంత నా పుష్కరలో నా తటాకయు
సంతోషమున సర్వజనులు నుతింపఁ
బ్రాభవం బెసఁగంగ వసుధ నేలుచును
శోభిల్లఁ బా పురుషుని గాంచుకొఱకు
గణితజ్ఞు లాదిగాఁ గల మంత్రివరులు
గుణమతి సదగునట్టి బాంధవోత్తములు
చతురంగ బలములసంఖ్యములఁ గొలువ
నతులిత గాఢ ధ్వజాయత్తమైన
ఘనతర నవరత్న కాంతుల మించు
కనకరథం బెక్కి గంభీరలీల
జయభేరి వేయించి శంఖ మొత్తించి
పయనమై వెడలె దోర్బల శౌర్యమునను
ధరఁ బూర్వ పశ్చిమ దక్షిణమ్ముల ను
నగిరాజవరుల సంహారమ్ముఁ జేసి
యంగవంగకళింగ యవనసౌరాష్ట్ర
వంగాళ మళయాళ పాంచాళ చోళ
కాళింగ నేపాళ కర్ణాట గౌళ
మాళవ మగధాంధ్ర పురహూటు లాట
గాంధార కాంభోజ కాశ్మీర కుకురు
సింధుకుంతల ఘోర సేనాదులైన
భిన్నన్న దేశ రాజన్యుల చేత
కప్పముల్ దెప్పించి గర్వించినట్టి
శత్రుల మర్దించి శరణార్థి న్వాళులు
గోత్రసమేతులై గొల్చి రా నపుడు
కైలాసగిరి చెంత కరిగి నిశ్చింత

లతిశయ పుత్రపౌత్రాభివృద్ధి గను
క్షితి మించి సౌభాగ్య కృప నందు రెపుడు
నిదియ నైదవలీల యిటు మీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి.
అనుచు సన్న్యాసులతో నాయగస్త్యుండు
మునమానఁపేలపోని మఱియు నిట్లనియె.

## ఆఱవలీల.

అంత నా మధురలో నా తటాతకయు
సంతోషమున సర్వజనులు నుతింపఁ
బ్రాభవం బెసఁగంగ వసుధ నేలుచును
శోభిల్లఁ దా పురుషుని గాంచుకొఱకు
గణితజ్ఞు లాదిగాఁ గల మంత్రివరులు
ప్రఖ్యాతిఁ జెందగునట్టి బాంధవోత్తములు
చతురంగ బలములసంఖ్యములై గొలువ
నతులిత నానా ధ్వజాయత్తమైన
ఘనతర నవరత్నకాంతుల మించు
కనకరథం బెక్కి గంభీరలీల
జయభేరి వేయించి శంఖ మొత్తించి
పయనమై వెడలె దోర్బల శౌర్యమునను
ధరఁ బూర్వ పశ్చిమ దక్షిణమ్ముల ను
నరిరాజవరుల సంహారమ్ముఁ జేసి
యంగవంగకళింగ యవనసౌరాష్ట్ర
బంగాళ మళయాళ పాంచాళచోళ
కాళింగ నేపాళ కర్ణాట గౌళ
మాళవ మగధాంధ్ర మరహట్ట లాట
గాంధార కాంభోజ కాశ్మీర కుకురు
సింధుకుంతల శూరసేనాదులైన
ఛప్పన్న దేశ రాజన్యుల చేత
కప్పముల్ దెప్పించి గర్వించినట్టి
శత్రుల మర్దించి శరణార్థి నృపులు
గోత్రసమేతులై గొల్చి రా నపుడు
కైలాసగిరి చెంత కరిగి నిశ్చింత

నాలేమ విడియించె నా పౌరుష బలము
శ్రీమహాదేవుండు శిష్టరక్షకుఁడు
నా తటాతక శౌర్య మూర్తి భావించి
ప్రమథులు గొల్వఁగా భక్తమందారుఁ
డసురవంశ్యుఁడు మధురాధినాయకుఁడు
చిత్తజాంతకమూర్తి శ్రీచొక్కనాథుఁ
డత్తన్విఁ బెండ్లాడ నఖిలాఘ గలిగి
ఘనమైన యాత్రల సంబరమ్మునను
దనకును నెమరుగాఁ బగ దంచువిడిన
నప్పుడు నాయింతి యధిక కోపమునఁ
దప్పక వీక్షించి తన సేన పనిచి
శత్రుల నెల్ల సక్షత్రముఁ జేసి
శత్రులు లేరంచు జయముగా నుండ
శత్రువుల్ గలిగిరి చనరాదు మనకు.
చిత్రమ్ముగాను నిగ్రహించంగ వలయు
నని సేనలందీర్చి యని పుంపటి దీర్చి
తన సారథిని చెల్వి తగు రథంబెక్కి
నడపుము సూత సన్నాహమ్ము గాఁడ
తడయక నీవతి [illegible]ర్యత నదిన
నతఁడు నామాట కట్లు కాగనుచు
సతి చేరఁ బనిచె నాహవరంగమునకు
నప్పు డప్పరమేశుఁ డాశ్చర్య మంది
యప్పుడు ప్రమథగణావళిఁ జూచి
యుద్ధమ్మునందు శౌర్యోగ్రత మెఱసి
యుద్ధమ్ము సేయుడీ యువిద యంచనక
యని యానతిచ్చిన నాభూతగణము
లని సేయఁదొడఁగిర యా సేనతోడఁ
దలకొని ద్వంద్వయుద్ధము సేయునపుడు
బలుకార్ముకమ్మునఁ బటుశక్తిఁ బూని
విలు గుణధ్వనిచేసి పేర్కొన్న ప్రమథ
గణముల నెల్ల మార్గణముల ముంచి
యలఘు తేజోమూర్తియై సాహసమున
యలివేణి తగనట్టహాసమ్ము చేసె

నా యట్టివాసవత్సు కతిభీతు లగుచు
నేఱుడఁ జూచిన నెదురఁగ లేక
సాహసంబుడిగి యా శర్వాని బలము
లాహవమ్మున నోడి హరుని కిట్లనిరి
యీశ ! మీ రానతియిచ్చిన మేము
బాసి యుద్ధము నేయ లలన యంతటను
హాస్యమ్ము జేసిన యంతమాత్రమున
హాస్యమైపోయె మా యాహవంబెల్ల
నని విన్నవించిన హరుఁడెల్ల నవ్వి
తన సేనలన్నియుఁ దగ నంపు నిల్పి
భస్మావనీధరగోత్రాటవోదగ్ర
ధర్మహస్తప్రశస్తంబైన ఘనుఁడు
పేటోకపుత్రుని విల్లు చేఁబూని
సార ప్రసూనాస్త్రజాలముల్ పూని
మన్మథరూపుఁడై మన్మథాంతకుఁడు
మన్మథబలములే మక్కువ గొల్వ
కడఁకతో నప్పుడా కల్యాణి మీఁద
నడచి చక్కఁగఁ జొక్కనాఘంబు గడఁగె
నంత నా ముగువ కోపాటోప మెసఁగ
పంతంబు నెరపి దోర్బల శక్తి మెఱసి
వచ్చినబలిమి నాకెదురుగా నిపుడు
నిచ్చోటు గల్గుట యిది చోద్యమనుచుఁ
గయ్యాన కెదిరి యాకామారిఁ జూడ
జయ్యన మూఁడవచన్ను నణఁగె
నప్పుడా యింతి లజ్జాస్యయై యున్నఁ
దప్పక యాగణితజ్ఞు లిట్లనిరి
తరళాక్షి నీకును ధవుఁడీ భవుండు
నరుదుగా నీ కోర్కె లార్పెడు ననినఁ
గడు వేడ్క నరదమ్ము గ్రక్కున డిగ్గి
యుడురాజధరున కా యుడురాజవదన
దండప్రణామమ్ము దగ నాచరించి
నిండిన వేడ్కతో నిలిచి యిట్లనియె
శ్రీ రజతాద్రీశ శ్రీశైలవాస

వారణాసురహర వరద సర్వజ్ఞ
క్రతువైరి పురహర ! కామాంగదహన !
పతిదేవతానాథ ! భక్తమందార
భూరియశస్స్ఫూర్తి ! బుధచక్రవర్తి !
కోరినయట్లు నాకోర్కెలీడేరె.
నిజభక్తులకు దక్క నీప్రభావము
నజహరి సన్మునీంద్రాదులకైనఁ
దెలియంగరాని నీ దివ్యరూపమ్ము
దెలియంగఁ గనుగొంటి దేవదేవేశ !
యని పెక్కుభంగుల నా తటాతకియు
ననుపమ మధురవాక్యములఁ గీర్తింప
నప్పుడు సర్వజ్ఞుఁడా యింతిఁ గరుణ
దప్పక వీక్షించి తగ నానతిచ్చెఁ
గల్యాణి వచ్చితి గారాన నన్ను
కల్యాణమై నాదు కాంతఁ గావింపు
మని నిరూపించిన నా యిందువదన
కనుగవ న్నవ్వుచుఁ గలికి చికురు
సర్వేశ నీపొందు చాల నింపొసఁగు
సర్వేశ నీతోడ చల్లని త్రోవ
సర్వజ్ఞ నీరూపు సౌభాగ్యరూపు
సర్వేశ నీ కల్మి సహజమ్ము కలిమి
తరుణేందుజూట ! మా తల్లి యీ మధుర
నిరవుగా నున్నది యిచ్చలో నాకుఁ
దగిన సత్పురుషునిఁ దగువేడ్కఁ గోరు
తగ, నట్లుగాన మాతల్లి మోదింప
పన్నగకేయూర ! ఫల్గునోత్తరను
నన్ను పాణిగ్రహణమ్ము గావింపు
మని విన్నవించిన యతివపల్కులకు
మనమునఁ గడుమెచ్చి మదనాంతకుండు
నింతి మీతల్లి కిట్లెఱిఁగింపు మనుచు
సంతోషచిత్తుఁడై చనె పురమ్మునకు
నతివేడ్కతోడుత నా తటాతకయు
మతి మంత్రిబలముతో మగిడి వచ్చుచును

సరవితో హిమవంతశైలమ్ము నొరసి
పరగ సాలగ్రామ పర్వతం బరసి
తిరమైన కేదారతీర్థమ్ము గ్రోలి
మాదనుతోడుగ నాగమోక్షమ్ము నరసి
యీశుని క్షేత్రమై యు[illegible] ముక్తిస
కాశమై వెలుగొందఁ గాశినిఁ జూచి
చేరి దివ్య ప్రతిభంగ శీకరోత్తుంగ
రాజితాంబుధురంగ రంగత్తరంగ
రాజమౌళి కిరీట రమ్యానుషంగ
సరిదు కృపాపాంగ భవభయ భంగ
హరదేహజనిరాంగ నాకాశగంగ
సపరివారమ్ముగా సంభ్రమంబునను
నపవర్గపదవి : హ్నాని నోలలాడి
యష్ట విఘ్నేశుల నర్థిఁ బూజించి
యష్ట భైరవులను సచ్చించి వేడ్క
శ్రీ విశ్వనాథుని సేవ సేవించి
పురుషోత్తముని జగత్పూజ్యు నర్చించి
రమణ మార్కండేశు రజతాద్రివాసు
నమితవైభవముల నలరిన స్వామి
గిరి యెక్కి పక్కజాగిలి మ్రొక్కి మఱియు
దక్షుని తలద్రుంచి దైవతకోట్ల
శిక్షించి శరణన్నఁ జేకొని కాచి
పరగిన శ్రీవీరభద్రేశు పాద
సరసిజమ్ములకును సాగిలి మ్రొక్కి
కమలాక్షసంస్తుత్యుఁ గమలకపర్ది
నమరేశ్వరస్వామి నర్థిఁ బూజించి
సకలతీర్థములను సానుశృంగముల
సకలౌషధములను సడిసన్నదాని
నట్టి శ్రీగిరియుఁదా నతివేడ్క నెక్కి
నెట్టన గాంచి యా నీరజవదన
సేవితగీర్వాణు శ్రీపతిబాణు
భావనాతీతు సద్భక్తసమేతు
శిఖి రవి శశినేత్రు చిత్రచరిత్రు

నఖిల లోకాధీశు నభవు విశ్వేశు
పాతాళగంగ శ్రీపర్వతాధ్యక్షు
స్నాతత్వముగ మల్లికార్జును గొలిచి
యర్ధచంద్రకలాపు నమితప్రతాపు
నిర్ఘాతకీనాశు నిఖిల లోకేశు
విదితమ్ముగాఁ బంచవిరుపాక్షదేవు
మదినిల్పి యా స్వామికెల నున్న గుహుని
యానతికేగి యా యంగణ యందు
మానితభక్తి కుమారు నర్చించి
ఖ్యాతిగాఁ బెన్నలోఁ గమతీర్థ మాడి
జ్యోతిసిద్ధేశు సంస్తుతిచేసి మఱియు
సరిలేని మహిమల చాల నింపొందు
పరమాత్మ భూలోకవైకుంఠ మనఁగ
చెలువైన శేషాద్రి శ్రీవెంకటేశుఁ
దలరుచు నున్నట్టి యాగిరి నెక్కి
యాకాశాది వర్గేంద్రియాసూన కలుష
నాశంబు పాపవినాశినిఁ దోఁగి
భవరోగసంహారి పరమోపకారి
ప్రవిమలతను మీఱి పరగు కోనేటి
యందుఁ గృతస్నాతస్నై యతివేడ్క
నిందిరారమణు నా యింద్రారివమనుఁ
దిరువేంకటాద్రీశు దేవదేవేశు
పూజించి యాశ్వాసమునిఁగి గోవింద
రాజుల సేవించి రాజీవనేత్ర
గరిమతో దక్షిణకైలాసశిఖరి
తిరుకాళహస్తికేతెంచి సౌవర్ణ
ముఖరి తీర్థమాడి ప్రమోదమ్ముతోడ
నఖిల దైవతకులాధ్యక్షు ఫాలాక్షు
నభవుని శ్రీకాళహస్తీశుఁ గొలిచి
శుభకీర్తి యవ్వలఁ జూచుచు నేఁగి
సప్తాద్రు లవ్వల సత్కీర్తి మించి
సప్తపురములలోనఁ జాల నింపొంది
కాంచిపురనివాసుఁ గైలాసవాసుఁ

గాంచి దండము వెట్టి కరమర్థిఁ గొల్చి
యంబ విశాలాక్షియైన కామాక్షి
పంబిన వేడ్కతో భక్తిఁబూజించి
యంచితమహిమతో నా తటాతకయు
గాంచి కైటభవైరి కరుణ పెంపొంది
యణ్ణామలేశు శోణాద్రినివాసు
నుణ్ణామలందు మనోల్లాసుఁడైన
దైవరాయని గొల్చి తగ విశ్రమించి
యా వైభవముఁ జూచి యంతంత నేఁగి
వేదపురీశ్వరు వెలయంగ మ్రొక్కి
యాదట త్యాగప్ప నాత్మ భావించి
మధ్యార్జునిని నాదిమధ్యాంత రహితు
గుంభకోణము కేఁగి కుంభేశ్వరాది
శంభులింగముసు విశ్వంభరుఁ గొల్చి
వరగంగ జానకీపతి పూజ సేయు
కరియ మల్లేశ్వరు ఘనతతోఁ గొల్చి
శ్రీరంగనాథుని శ్రీరంగపతిని
జేరి యాదేవుని సేవించి యచట
చిరుతనాపల్లీశుఁ జెవ్వందినాథు
దరిసించి మఱియును దాత్పర్య మెసఁగ
గరిమ తోడుత నళగరిపురి కేఁగి
యరిది తీర్థంబాడి హరిపూజ చేసి
ఘనమైన వేడ్కనా కల్యాణి యపుడు
తనకును నిజరాజధానియై పరగు
పురముల కాది సత్పుణ్యల ప్రోది
పరమేష్ఠి సంపాది భక్తసమ్మోది
యగునట్టి మధురకు నతి వేడ్క వచ్చి
నగరు ప్రవేశించి నలినాయతాక్షి
తనతల్లికిని సాగి దండమ్ము వెట్టి
తనదు వృత్తాంతయు విన్నవించె
నత్తఱి మీచేత నంపించుకేను
చిత్తము రంజిల్లఁ జేకొని వేడ్కఁ
బొల్చుచో నట శత్రుభూపాలకులను

గాపురమ్ములు మాన్పి కనకాద్రికేఁగి
వాసుదేవుని నాకు వరునిగాఁ గోరి
భూమండలమ్మెల్లఁ బొగడంగ పులివి
వచ్చుచో నెదుర నెవ్వరు నిల్వఁబడరు
విచ్చలవిడి పుణ్యా విపులతీర్థములు
కోటిత్రయం బగ్గ కోటి సేవించి
కోటి సంఖ్యల దైవకోట్ల నర్చించి
వచ్చితి నని వేడ్క వరుసతోఁ బూస
గ్రుచ్చినయట్లు పేర్కొని విన్నవింపఁ
బడయక నాతపాతక గన్నతల్లి
కడు వేడ్క బిగియారఁ గౌఁగిటఁ జేర్చి
ఘనభాగ్యమున గాదె మహనీశ్వరుండు
ననుఁ బొంద నిను వివాహంబాడఁ దలఁచె
నని పెక్కుభంగుల హర్షించి మఱియుఁ
దనయను వెనుకొని తద్దయుఁ బ్రీతి
వచ్చిన యారాజవర్యుల నెల్లఁ
బుచ్చెను తమతమ పురముల కనిన
నరసి యాకోసలి యాగాక యనుచు
సరసతోఁ దుతఁ గట్టు పట్టమ్ము లిచ్చి
పొండు మీ మీ దేశములకును బోయి
రండు వివాహసంరంభంబుఁ జూడ
నని యానతిచ్చిన నతిసంభ్రమమునఁ
జని రంతఁ దమదు రాజ్యములకు వారు
మఱియు నాయమ తన మంత్రులఁ జూచి
పురమును నగరును భూషితమ్ముగను
గడువేడ్కతోడ శృంగారింపుఁ డనినఁ
దడయక వారేగి తగ నప్పురమ్ము
బంగారుటరఁటి కంబములు శోభిల్ల
రంగుగా మకర తోరణములు వెలఁగ
నురుతర పీతాంబరోజ్జ్వలధ్వజము
లరుదుగా నాకసం బంటి శోభిల్లఁ
గనకమంటపములు కనక వేదికలు
కనకకుట్టిమ కనకద్వారములును

గనకమంచకములు ఘనముగా నపుడు
వినుతింప నగరును వెలయ నప్పురము
చూడ నొప్పఁగఁ జేసి సురుచిరలీల
కస్తూరి కర్పూర కాశ్మీర గంధ
వస్తుసౌరభ్య సువాసితంబైన
పరిమళద్రవ్యముల్ బహుళమ్ము నించి
మఱియు గల్గిన పట్టి మహిత వస్తువులు
చిత్రభూషణములు చిత్రముగాను
చిత్రగేహములు విచిత్రత నుంచి
తక్కిన శోభనద్రవ్యము లెల్ల
పెక్కుసమ్ముగఁ గూర్చి వేవేల గతుల
మృదుల రాజాన్నముల్ మేలోగిరములు
నొదవిన మంచి సద్యోఘృతమ్ములును
బ్రోఁదిగాఁ బాయసాపూపసూపంబు
లాదిగా భక్ష్యభోజ్యాహారములును
నొకటియుఁ గడమగా కుండఁగఁ జేసి
సకియతో వేడ్క నా సచివు లిట్లనిరి
ఓ దేవి నగరుప నొగిఁ బట్టనంబు
శ్రీ దేవి కిరవుగా శృంగారమయ్యె
నని విన్నవించిన యవసరమ్మునను
ఘనమహీరాజసంఘములకు నెల్లఁ
గర్పూర తాంబూలగంధాక్షతలను
బనిచిన నా భూమిపతు లెల్ల నపుడు
బహుదివ్య వస్త్రముల్ బహుభూషణములు
బహువస్తువులు గొంచు బహుళ తేజమునఁ
దమతమతూర్య నాదములతోఁ జెలఁగి
రమణతో వచ్చిన రాజీవనేత్ర
కనుగొని తనమంత్రిగణముల కనిపె
వచ్చిన యీరాజవరుల నెల్లరిని
గడువేడ్కతోడుత ఘనమందిరముల
విడిపింపుఁ డిష్టాన్న వితతులతోడ
ననినను వార లయ్యవనినాయకులఁ
దనరంగ విడుదులఁ దగ నిల్పిరంత

సకల పుణ్యాంగనాజనముల తోడ
సకలబుధ వ్రాతసమితి యేతేర
నెలమితో బుధ పురోహితు లతివేడ్క
గలిగిన పుణ్యాహకర్మముల్ దీర్ప
భాసురసైరంధ్రి భామలు నంతఁ
గైసేసి రపుడలంకారముఁ గాఁగఁ
బద్మాక్షికిని మనఃపద్మమింపొందఁ
బద్మమహాపద్మ బహుళసంఖ్యలను
బద్మరాగోజ్జ్వల ప్రభ మించు పసిఁడి
పద్మనూపుర మంఘ్రిపద్మాన నిడిరి
యంభోజవదనకు నంచపన్నెలను
జృంభించు వెలిపట్టుచీర నమర్చి
తలఁచగు నురుకుచద్వయమున నడుము
విఱుగునో యని కట్టు వేసినయట్లు
నవరత్నకింకిణీ నవమౌక్తికములు
రవళిల్లు పసిఁడియొడ్డాణము నిడిరి
బలుశైలముల మించు ప్రబలెనో యనఁగ
జెలుఁగు పయోధర యొప్పెఁజెలువకు నపుడు
జలజమృణాళ హస్తద్వయమ్మునను
గలిత మాణిక్యకంకణములు చెలఁగెఁ
గంఠపూరితముగాఁ గమ్రాయతాక్షి
కంఠహారముల నుత్కంఠత దాల్చె
నాసాగ్రమున నాణె నవమౌక్తికమ్ము
భాసిల్లె నధరబింబమ్ము శోభిల్లె
కర్ణతాటంకముల్ గ్రక్కునఁ దాల్చె
స్వర్ణ కపోలదర్పణములు చెలఁగఁ
జంద్రునందటఁ గప్పు చందమ్ము దోఁప
చంద్రాస్యతిలకమ్ము చతురత నొప్పె
పసగల్గు ముత్యాలపాపట బెట్టి
ప్రసవముల్ కేశగర్భమునను ముడిచి
తక్కినాభరణముల్ తనువెల్ల నిండఁ
చొక్కమై ధరియించి శోభిల్లుచుండ
నినసుధాంశుల రూపు లెసఁగిన యట్టి

ఘనరత్న శుభ సూచకంబు ధరించి
పంచవక్త్రస్తోత్ర పఠనమ్ము చెలఁగఁ
బంచమహావాద్యపటలమ్ము మ్రోయ
మంగళాక్షతగంధ మాల్యముల్ విడెము
లంగనామణులకు నలర నిప్పించి
కల్యాణవేదిపై కనకపీఠమునఁ
గల్యాణికిని గౌరి కల్యాణమొసఁగఁ
గంకణంబతివేడ్కఁ గట్టిరి హస్త
పంకజమ్మున మించి బ్రాహ్మణోత్తములు.
అప్పుడు సర్వేశుఁడా చొక్కనాథుఁ
డొప్పుగాఁ బెండ్లికి నుత్సాహమొసఁగ
భానుకరప్రభా భాసురంబైన
మానితమాణిక్య మకుటమ్ము దాల్చి
నెమ్మితోఁ దనఫాలనేత్రమ్ము మూయఁ
గమ్మ క్రొవ్విరి బాసికంబు ధరించి
కలిమి లేఁదేఁటి రెక్కలకప్పు గప్పు
గళమునఁ బూనె ముక్తాహార వితతి
వర్ణిత ధళధళోజ్జ్వల వజ్ర ఖచిత
కర్ణకుండలములు గరమొప్పఁదాల్చి
చిలుకల పైడాలు చిలుకుపచ్చలను
పొలుపు మించిన బాహుపురులు గీలించి
దివ్యగంధమ్ములు తెలుఁగొప్పఁ బూసి
దివ్యమాల్యమ్ములు చెలివిగా ముడిచి
హరియును రమయు బ్రహ్మయు శారదయును
సురపానలాంతకాసుర పాశి పవన
కిన్నరేశ మహేశ గీర్వాణ యక్ష
పన్నగసిద్ధదంపతులును మునులు
భైరవేశ్వరుఁడును బ్రమథవర్గమ్ము
వీరేశషణ్ముఖవిఘ్నేశవరులు
సప్తమహాఋషుల్ సప్తమాతృకలు
సప్తాశ్వచంద్రులు సకలగ్రహములు
తాండవప్రియుఁడు పతంజలిమునియుఁ
గుండోదర నికుంభ కుంభులు గొలువఁ

చండికేశుఁడు భుజాస్తంభమ్ముఁ జాచి
పుండరీక మనోజ పురదైత్య విజయ
విరుదవృత్తులఁ గైవారమ్ము సేయ
నిరతమ్ము దగ భృంగి నృత్యమ్ము సలుప
సప్తగజేంద్రంబు లష్ట సింహములు
సప్తగోరాజులు సప్తాశ్వములును
గ్రథిత మహావృషభధ్వజ ఘటిత
రథమెక్కి తన మనోరథము పొంపెక్క
కరమణికంకణక్వణన మింపెసఁగ
సరవి నచ్చరలు వింజామర లిడఁగఁ
బటహభేరీశంఖబంధురధ్వనులు
చటులతరబ్రహ్మాండభాండమ్ము నిండ
కలితమై కరదీపికాకోట్లు వెలుఁగఁ
జెలఁగి పుణ్యాంగనల్ సేసలు చల్ల
రంగుగా యతిసారంగలోచనలు
మంగళ గానముల్ మహిమతోఁ బాడ
ఘనతర రాజమార్గమ్మున నేఁగి
చనుదెంచు సర్వేశు సకలలోకేశు
పరమపుణ్యాంగనల్ ప్రమథులు బుధులు
గురులీలతో నెదుర్కొని తోడితేర
రమణతో నేతెంచి రథ ముయ్యల డిగ్గి
క్రమమొప్ప నింద్రుని కైదండ పట్టి
యల్లనల్లన లోని కరుగుచో సేసఁ
జల్లిరి పొదుపుగా సకియలు వారయఁ
దరుణేందుధరుఁడంత దరహాస మెసఁగ
విరచిత కల్యాణవేది నింపొందు
హాటకోజ్జ్వల పీఠమందుఁ గూర్చుండి
పాటించి సతులు శోభనములు పాడ
వేదశాస్త్రోక్తి నవ్వేదవేద్యునకు
మోదమ్ముతోడుత మునులొప్పఁ జదువ
సుముహూర్తమునను రాచూలిని హాలి
క్రమమొప్ప దేవతాగణములు నవుడు
తనరంగ ఫల్గునోత్తరఁ బటాంతకను

ననువందఁ బాణిగ్రహణము గావించెఁ
జతురత నప్పుడా జయమంటపమున
ప్రతిలేని నవరత్న భద్రపీఠమున
మకుటమ్ము ధరియించి మస్తకమ్మునను
ప్రకటిత భూలోకపతియైన శివుఁడు
పాలించె సౌందర్యపాండ్యఁడనంగ
దగు వేడ్క నిట్లయిఁ దరుపారు లింగ
మును దేవపూజగాఁ బూజించునపుడు
తలఁపున నా తటాతక వేడ్కతోడ
సొలుపొంద ఛప్పన్న భూపాలకులకుఁ
బోసగంగ నిష్టాన్నములు విందువెట్టి
వెస గంధ కర్పూర వీడ్యమ్ము లొసఁగి
వరరత్న సౌవర్ణ వస్త్రభూషణము
లరుదుగా నిచ్చి తా నతి వేడ్క నినిచె
నిదియు నాఱవ లీల యిది విన్న వ్రాయ
సదయాత్ము లైశ్వర్య సంపన్ను లగుచు
శుభశోభనమ్ములు శోభిల్ల నెపుడు
సభవుని కృపచేత నమరియుండుదురు
ననుచు నమ్మునులతో నా యగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.

## ఏడవ లీల.

సటుఁ జొక్కనాథ మహాదేవుఁడపుడు
తటుకున నాతటాతకఁ బెండ్లియాడి
బాగొప్ప సౌందర్య పాండ్యఁడనంగ
రాగిల్ల బ్రహ్మనారాయణేంద్రాది
సురముని సంఘముల్ సొరిది వేర్వేఱ
నిరవైన పెండ్లి కానిక లిల్లఁ దెచ్చి
యర్పింప వారికి నతిసంభ్రమమునఁ
గర్పూర తాంబూల గంధాక్షతమ్ము
లిప్పించి భోజనం బెలమితోఁ జేసి
యిప్పు డనుష్ఠాన మిందఱుఁ జేసి
యరుగు డిచ్చటికని హరుఁడానతీయ

సరవితో వారనుష్ఠానముల్ దీర్చి
వచ్చిన వారిని వరుస సేర్వాలి
వచ్చుగాఁ బిలిచిన నా పతంజలి పు
పారుషియను నతఁ డతిభక్తి తోడ
నారుషంబైన పొన్నాంబలంబునను
పోయి దర్శింపక భోజనంబిపుడు
సేయనన్నను నట్ల సేయును యనుచు
భక్త సంరక్షణ పారీణుఁ డతని
సరసత నప్పుడా సౌందర్య సాంద్య
నరనాథుఁడగు చొక్కనాథుఁ డుగడఁగ
యాతని కోడ్కొంచు పత్ని ప్రభావమున
ఖ్యాతిగా నమరేంద్రుఁ డర్పించినట్టి
యింద్ర విమానంబు హేమాబ్జ సరసి
సాంద్రమై యతనికిఁ బయ్యనఁ జూపి
లాలించి పొన్నాంబలంబున కెనయు
లాలిత పంచకృత్యముల నందుఁ గల్పించి
వేధోచ్యుతేంద్రాది విబుధులు మునులు
బోధింప నా మునిపుంగవు లెదుట
కడు వేడ్క నంగయకణ్ణమ్మ చూడ
నా హరిబ్రహ్మాదు లాశ్చర్య మంది
హాహా మహాదేవ ! హా దేవదేవ !
నీ మహత్త్వమ్ము వర్ణింపఁగఁ జూడ
నేమెంత యని వారు నిటలమ్ములందు
నంజలి పుటముల ననువొప్పఁ జేర్చి
మంజుల వాక్య సంభ్రమ ముల్లసిల్ల
స్తోత్రమ్ము సేయ నా సన్మునీశ్వరుఁడు
నుత్యనుపూర్వసంస్తుతులు వెలంగ
ఓ నీరవనవాస ! హా కృత్తివాస !
నీ నృత్యమీక్షింప నే నెంతవాఁడ
నిర్మల ! నిర్ద్వంద్వ ! నిత్యస్వరూప !
నిర్ముక్త నిజభక్త నిశ్చలాసక్త
యని సంస్తుతులు సేసి యతి మోదమునను
దనువునఁ బులకాంకితమ్ములు వొడమ

నా దేవతలు దాను హర్షాశ్రుజలను
పాదాబ్జములు దోఁగఁ బ్రణమిల్లి రపుడు
కరుణించి వారికా కలకంఠుఁడపుడు
కరమొప్ప భోజనాగారమ్ములందు
రాగిల్లి వృద్ధపురస్సరమ్ముగను
బాగుగా వేర్వేఱఁ బంక్తి సాగించి
యంతఁ జతుర్విధాహారంబు లందు
సంతుష్టి గావించె సంభ్రమంబుగను
హరిని విరించిని నమరవల్లభుని
సురముని ప్రతతుల శోభిల్లు నట్లు
మణిమయభూషణాంబరము లిప్పించి
కణఁకతో వారలఁ గరుణించి పంపె
ననిపిన వారలు నతిభక్తితోడ
ననుపమాండజవాహనారూఢులగుచు
వైకుంఠమున కేఁగె వైకుంఠవిభుఁడు
లోకేశుఁడా సత్యలోకమ్ము కరిగె
నాగాజ మహిష సన్మత్స్య సద్ధరిణ
వేగాశ్వవృష వాహ విధృతులై వేడ్క
నమరావతికి నేఁగె నమరవల్లభుఁడు
నమర నర్చిష్మతి కరిగెఁ బావకుఁడు
నంతకుఁ డేఁగె సంయమిపురమ్మునకు
నంత నైరుతియుఁ బుణ్యవతికి నరిగె
నాయంబుపతి యేగె నమలావతికిని
వాయువు చనె గంధవతి పురమ్మునకు
నా శంభుసఖుఁడు దానలకకుఁ గదలె
నీశానుఁడరిగె నా యీశానపురికి
హర్షమ్ముతోడ సంయమిముఖ్యులెల్ల
నరిగిరి తమతమ యాశ్రమంబులకు
సకల భూచరులును సకల ఖేచరులు
సకలాంతరిక్షగుల్ సచరాచరముగ
ఘనతర సంతోష కలితులై యపుడు
చనిరంతఁ దమ యథాస్థానమ్ములకును
నిదియు సప్తమలీల యిట్టిది చరిత

ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి.
అనుచు సన్నుతులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియెం.

## ఎనిమిదవ లీల.

అంత నా హరియు బ్రహ్మాదులు మునులు
నెంతయు సురలు సురేంద్రుండు ప్రమథ
గణములు కిన్నర గంధర్వ యక్ష
ఫణి సిద్ధసాధ్యులు భరితంబుగాఁగ
భోజనంబులు సేసి పోవఁ బదార్థ
రాజాన్న పరమాన్నరాసులు మిగిలి
బహుళమైయున్న సంభ్రమలీలఁ జూచి
యహికంకణునకును నాతటాతకయు
విన్నపంబొగిఁ జేసె వినయమ్ము మెఱసి
పన్నగకేయూర ! పరమానుసార !
లోకేశ ! నీవెంట లోకమ్ములెల్ల
నేకమ్ముగా వత్తు రెందఱో యనుచుఁ
దలఁగని యట్టులోదన పర్వతములు
నరుదుగఁ గావింతు నధికమ్ముగాఁగ
దేవ ! మీవెంట సేవించిన లోక
దేవసంఘము లెల్లఁ దృప్తాత్ములగుచు
భుజియించు మఱియును భూధరోన్నతిగ
భుజియించుమన్నవి ప్రోఁది నన్నములు
కండ చక్కెర సార కజ్జాయములును
దండిగాఁ బరమాన్నతతు లాజ్యములును
జున్ను మీగడలును జుంటితేనియలు
నెన్ని పదార్థమ్ము లెన్నెని మఱియు
ఫలరసావళులును బక్ష్యాళ్ల మిగుల
కలవంటకములు దుగ్ధంబులు దధులు
ననువైన యూరుగాయలు మజ్జిగలును
ఘనముగానున్నవి కరుణింపు మభవ
యని విన్నవించిన నభవుండు నవ్వి
తనదు భృత్యులలోనఁ దగ మించినట్టి

కుండోదరునిఁ బేరుఁగాని నీవు కుక్షి
నిండంగ భుజియింపు నీకాంక్ష దీఱ
నని యానతిచ్చిన నట్లకాకనుచుఁ
జని యన్నరాసులచ్చటి భుజియించి
యాహారి లోకుల నధికదుఃఖులైన
వాపీసరసీకూప వారిపూరములు
కలవెల్లఁ గ్రోలి యాఁకలి దప్పి చెడక
మలమాఱు పడఁ గేఁగి మఱి విన్నవించె
నీయన్నపానాము లెల్ల లోఁగొనియుఁ
గాయమ్ము నాక్షుత్పిపాసావలసిన
నప్పుడా పురజనులా తంతకయు
నిప్పుడీ లాగున నిఁకొక్కఁడైన
సర్వేశు వెంటను జనుదెంచెనని
నిర్వహింపఁగఁగలఁడా నెమ్మి నిచ్చటను
నని తమలోఁగుల నాశ్చర్యమంది
వినుతించి రప్పుడా విశ్వేశు మహిమ
యిదియు నద్భుతలీల యిటు మీఁద నింత
యుతముగాఁ జెప్పెద మునులార వినుఁడి.
అనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.
కందర్ప మధురాపురాధ్యక్షుఁడైన
సౌందర్యపాండ్య భూచక్రేశునకును
కుండోదరుఁడనఁ గోర్కులు మీఱ
ఖండేందుమకుట శంకర నీలకంఠ!
ఆ వంటకములు నాయాఁకలి చెడదు
దేవేశ! నాక్షుత్తు దీర్పవే యనుచు
విన్నవించినఁ జూచి వెలయంగ నాట్లు
నన్నకూటమ్ము నకలమ్ము మట్టి
నుంతంగఁ జేసి కుండోదరు నపుడు
నిండంగ భుజియింపు నీకాంక్ష దీఱ
నని యానతిచ్చిన నా ప్రమథుండు
తన కాంక్షదీఱ నెంతయు భుజియించి
మఱియును వచ్చి యా మధురేశు నాదట

కరములు మోడ్చి తాఁ గడు విన్నవించె
దామహత్త్వ వశగాదు ధవళాంగ ! యనిన
నూపించి యట వేగ నోల రమ్మనిన
వేగవతీ నామ విఖ్యాతి మించి
బాగొప్ప వైఖరిఁ బరగె నచ్చటను
నందు రక్తాబ్జంబులందుల తూండ్లు
నందు సైకతములు నందు శైవాల
మందు జక్కవలును నందుల బిసము
లందుల వెలిదమ్ము లందు బేడిసలు
నందుల జలవేణు లందు బిందువులు
నందుల జల్లెంత లందుల సుళ్లు
నందుల పుష్పమ్ము లలరు పుష్పాళ్లు
నందంద నందును నంచమ్ముగాఁగ
వరుస పాదమ్ములు వసి నూరువులును
నరుదైన జఘనమ్ము నాభియు గుచము
లా బాహువుల్ ముఖమా నేత్రములును
నా బాగు లగు వేణు లా మౌక్తికములు
నా నూపురంబులయందు నాదములు
నానాభి గాంభీర్య మాచిత్రవస్త్రి
మనువందఁ దనయందు నటుఁ గలవెల్లఁ
దన రొప్పిద మునకుఁ దానకంఁగుచు
లాలిత శృంగార లక్ష్మిని రొప్పఁ
గూలంకషా నూన ఘుమ ఘుమ ధ్వనులు
మార్గంబు నొరసి దిక్కులఁ జెప్ప వెలసి
నిర్మలోన్నతముక్తి నిశ్రేణి యగుచు
నిత్యాశ్రితుల కిచ్చు నెమ్మితో నెపుడు
నత్యంత పుణ్యౌఘ యమరు నావైఖ
యందుఁ గృతస్నానులైన వారలకుఁ
జెందవు దురితముల్ చేరు పుణ్యములు
నా రేటిదరి నున్న యా భూమి జనులు
నే యాపదలు లేక రోసఁగి రే ప్రొద్దు
ధనధాన్యముల చేత ధర్మంబుచేత
ఘనసీతివర్తన గలిగియుండుదురు

నా పుణ్యనది మహిమాతిశయంబు
లా పరమేష్ఠికి నలవియె పొగడ!
నా పరమేశ్వరుండానదిఁ జూచి
యోపినంతయును గుండోదర! నీవు
జలము గ్రోలుమటన్నఁ జయ్యన నపుడు
వలసినంతయుఁ ద్రావి వడిఁ గాంతిఁ దీఱి
యా దేవునొద్దకు నతిభక్తిఁ జేరి
యో దేవ సర్వజ్ఞ! యో చొక్కనాథ!
యా యాఁకలియు దప్పి కన్నియు నిపుడు
పాయంగఁ గర్గెనో భక్తమందార!
యని విన్నవించిన నల్లన నవ్వి
తన భృత్యు మన్నించె తద్దయా వేడ్క
నా యన్న కూపంబు లచ్చోట నాల్గు
పాయకెప్పుడు నుండుఁ బరమేశ్వరాజ్ఞ
యపుడా తటాతకయాశ్చర్యమంది
త్రిపుర సంహరుఁ జూచి దేవ! సర్వేశ!
యర్ధ చంద్రకలాప యమితప్రతాప!
నిర్వ్యాధకీనాశ నిఖిలలోకేశ!
యని సన్నుతులు సేయ నపుడు దేవతలు
మునుకొని కురిసిరి పుష్పవర్షములు
నిదియు నష్టమలీల యీ లీల విన్న
సదయాత్మ శైశ్వర్య సంపన్నులగుదు
రనుచు సన్మునులతో నా యగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.
నిది ర్వ ఘనసత్కవీంద్ర పాదాబ్జ
విదిత పూజామోద విమలుఁడు కచ్చ
కప్పుర సౌరభ్యకలిత మానాంక
తిప్పరాజ సుపుత్ర తిరువేంగళేంద్ర
విరచితంబగు లోకవిఖ్యాతమైన
సుసరసగుణ కావ్య సత్కవీంద్రాభి
నందిత శ్రీ చొక్కనాథచరిత్ర
మందున నిది ద్వితీయాశ్వాసము

# తృతీయాశ్వాసము

## తొమ్మిదవ లీల.

మఱియును నమ్మహా మధురాపురమునఁ
బరగంగ సౌందర్య పాండీఁడనంగ
నటుఁ జొక్కనాథ మహాదేవుఁడపుడు
నటునలు మఱియేమి నటియించె ననిన
మునులకుఁ దెల్పె నామునిపుంగవుండు
వినుఁడు తటాతక విమలత మెఱసి
లోలత భక్తి శుశ్రూషలు చేసి
కాలాంతకునిభంగి గలుగుటచూచి
మఱి విన్నవించె నా మంజులవాణి
కఱకంఠ ! మాతల్లి ఘనవార్ధియందు
ననువందగా స్నానమాడంగవలయు
నని విన్నవించిన నాదేవుఁడపుడు
వినియును విననట్టి విధమున నుండ
వనజాక్షి యతని భావము గానలేక
ఖిన్నురాలగుచుఁ జెక్కిటఁ జెయ్యిచేర్చి
యున్న సాధ్విని జూచి యుర్వీశుఁడనిరాఁ
జాలంగ నీకును సంతోషమైన
వేళల వదనంబు వికసించుగాని
యీ విధమ్మున నుండు టెఱుఁగ మేమనుచు
జలనిధు లేఁడు ఘోషముతోడ నపుడు
పిలిపింప భయమంది భీతిల్లెఁ బురము
జనులెల్ల వెఱఁగంది సర్వేశునకును
వినయమ్ముతో నంత విన్నవించినను
నయ్యేఁడు జలనిధులయ్యేఁడు వాఁక
లయ్యగ్నికూలను నందొక్క సరసి
గానుండఁ బంచె నా కాలకంధరుఁడు
కాన తటాక యాస్వామికి భక్తి
ధరఁజక్క సాగిలి దండప్రణామ
మనువందఁగాఁ జేసి యతివేడ్క నంత
సనకాది సన్మునిసంఘ సంస్తుత్య

ఓ ప్రమథాధ్యక్ష! ఓ జగద్రక్ష!
నీ ప్రయత్నమ్ము వర్ణింపఁగ వశము
నీ దక్షిణాంగమ్ము నీరజాసనుఁడు
నీదు వామాంగమ్ము నీలవర్ణుండు
పొలుపొంద నీ భుజమ్ములు నెల్లదిశలు
సలలితోజ్జ్వల ఘర్మ జలములు నదులు
పొందుగా నీ కర్ణములు గంధవహుఁడు
నిందుసూర్యాగ్నులు నీ యీక్షణములు
నీ యూర్పులామ్నాయనివహమ్ము లలరు
నీ యాననమ్ములు నిఖిల భూదేవు
లురు బాహువులు రాజులౌనరంగ నీకు
వరుస నీ యూరులు వైశ్య సంఘములు
వరగ శూద్రులు నీదు పాదపద్మములు
నెరయ నీ కేశముల్ నీలమేఘములు
ముందు నీదు ప్రకృతి పురుషరూపమును
జెంద బ్రహ్మాండమ్ము సృజియింతు వీవు
సర్వ భూతమయుండ! సర్వభూతములు
నిర్వహింపఁగ నీవ నిశ్చలాకార!
యని సన్నుతులు చేసి యానందమంద
వినువీథి సురలెల్ల విస్మయంబంది
పరమేశు మీఁదను బహుపుష్పవృష్టి
గురియించి రప్పుడు కోర్కె లింపెసఁగ
నా సప్తజలనిధు లా కొలని లోన
రాశిగా వారాసులై యుంచె నంత
నిదియు నవమలీలయిట మీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి.
అనుచు సన్మునులతో నా యగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.

## పదియవ లీల.

అప్పుడు సర్వేశుఁడా వార్ధు లేడు
రప్పించి తనదు భార్యకు నానతిచ్చెఁ
బా తటాతక సముద్ర స్నానమునకు

మీ తల్లిఁ బంపుము మించినవేడ్క
నని యానతిచ్చిన నట్ల కాకనుచుఁ
దనతల్లి తోడుతఁ దగఁ జెప్పె నపుడు
నీ శోక సాగరం బెలమి వేడితివి
భావింప స్వామి ప్రభావంబువలన
జలనిధు లేడును సాగె నిచ్చటికి
గడువేడ్క స్నానమ్ము గావింపు మనిన
నతిమోదమునఁ బొంది యతిప యిట్లనియెఁ
బతిఁగూడి స్నానంబు భక్తితో నాడు
టది యుత్తమంబగు నంద్రు సద్బుధులు
నదిగాక సుతునితో నాపుట మధ్య
మాపు డాడను గూడి యాడుట యధము
మా వేదశాస్త్రోక్తు లట్టివే యనుచుఁ
దన పుత్రితోడుతఁ దగఁ జెప్పినంత
విని తటాతకయును వేడ్క లింపెసఁగ
నప్పుడా విధ మెల్ల హరునకుఁ దెలియఁ
జెప్పిన తన పత్ని చిత్తమ్మునకును
సంతోషకరముగా సౌందరేశ్వరుఁడు
నింతి మీ తల్లికి నీప్సితంబుగను
దడయక మలయకేతన పాండ్యవిభుని
రప్పింతు నిచటికి రాజుతోఁ గూడి
నొప్పుగా స్నానంబు నొనరఁ జేయింపు
మనుకొని సురలోకమున నున్న పాండ్య
జననాథుఁ బిలిపించె జనలోకమునకు
నిశ్చింత నప్పుడు నీలకంధరుని
నాశ్చర్యముగఁ జూచి రమరులు మునులు
నంతట నా మలయధ్వజేశ్వరుఁడు
సంతోషచిత్తుఁడై సాష్టాంగ మెఱఁగి
వేదశాస్త్రోక్తి సర్వేశ్వరు నపుడు
సాదరంబున భక్తి సన్నుతియించె
ప్రణతాచ్యుత బ్రహ్మ పర పరబ్రహ్మ !
ఫణిరాజభూషణ ! పార్వతీరమణ !
ప్రాఁతిగా నేఁడు నాభాగ్యమ్ము కతన

భూతేశ నినుఁగంటి ముక్తిఁ గైకొంటి
నని కరమ్ములు మోడ్చి హర్షమ్ము నొంది
వినతుఁడైయున్న నా విశ్వేశుఁడపుడు
నాతనిఁ గరుణించి యాతని పత్ని
నాతతంబుగఁ జూచి యాదేవుఁ డంతఁ
దన కాంత తోడుతఁ దగ నానతిచ్చె
వనజాక్షి ! యీయబ్ధి వారిపూరముల
స్నానమ్ము సేయ నీ జనకుని జననిఁ
బూని పంపుము నీవు పోయి రమ్మనిన
నాగాక యని వారి నటఁ దోడుకొనుచు
నేఁగి స్నానంబు సేయించి తా మఱలి
వారును దానును వరుసతో వచ్చి
చేరి సాగిలి మ్రొక్కి చేతులు మోగిచి
జయ తారగిరినాథ జయ చొక్కనాథ
జయ హరికంకాళ జయ కృపాలోల
జయ సర్వ లోకేశ జయ పార్వతీశ
జయ బ్రహ్మ శిరహర జయ దేవదేవ
యని సన్నుతులు సేయ నా దంపతులకు
మనమున హర్షించి మధురేశ్వరుండు
కాయమ్ముతోడుతఁ గడు వేడ్క నపుడు
పాయక సాలోక్య పదవి గావించె
యా తటాతక గూడి యా చొక్కనాథుఁ
డాతత సౌందర్యుఁడై రాజ్యమేలె
నిది పదియగు లీల నీ లీల వినిన
విదితమానవులకు విశ్వంబునందు
సిద్ధించు మఱియును శ్రీ చొక్కనాథు
సద్ధర్మ చరితలు సకలమ్ము దెలియ
నా కుంభసంభవుఁ డా మునీంద్రులకు
చేకొని వేర్వేఱఁ జెప్పంగఁ దొడఁగె

పదునొకండవ లీల.

వరగ నా సౌందర్య పాండ్యభూవిభుఁడు
చిరకీర్తి రాజ్యమ్ము సేయుచునుండ

పరుస నంతటఁ గొన్ని వాసరంబులకుఁ
దరుణి ముమ్మాల తటాతక పుణ్యసతికి
పతికిని సంతోషభావంబు గలుగ
సతి వేడ్క గర్భచిహ్నాలు దోఁచె నపుడు
తమ్మిమొగ్గలఁ దుమ్మెదలు ప్రాలినట్లు
కొమ్మకుచముల ముక్కులు నల్లనయ్యెఁ
దనవంశమెల్ల వర్ధన మొందు కరణి
వనితకు మధ్యమ్ము వర్ధిల్లఁ దొడఁగె
భవు వంశమగుట నా భవు మెడకప్పు
నవకమై గంభీరనాభిక వెడలి
యమున నాఁ గాళిమ నందెనో యనఁగఁ
గమలాక్షి నూఁగారు గార్కొనఁ దొడఁగెఁ
దనకుమారుని కీర్తి ధరనిట్లు పర్వ
ననునట్లు వెల్లనాయెను గాంతి మోము
భూమెల్ల నేలు నీ పుత్రుఁడఁ జూడ్క
భామకు మృత్తికపైఁ గోర్కెలెసఁగె
నడపు జాడ్యంబాయె నళినలోచనకుఁ
గుడుపులు దఱఁగెఁ గోర్కులు ఘనమాయెఁ
దళుకొత్తు వేడ్క సౌందర్యనాయకుఁడు
జలజనేత్రకును బుంసవన సీమంత
కర్మానుకృత్యముల్ గావించి మించి
కూర్మి పుత్రుఁడు గల్గఁ గోరుచునుండెఁ
దలఁప ముమ్మాలతటాతక పుణ్యసతికి
నెలలు తొమ్మిదియును నిండిన పిదప
నుత్తమాంగంబున నొక జడతోడఁ
జిత్రజాకృతిఁబోలు చెలువంబు దాల్చి
వెలయంగ శుభలగ్న వేళలయందుఁ
గులదీపకుండైన కొడుకుద్భవించె
నాకుమారుని జన్మ మలరఁ దామెలను
జేకొని విన్నవించిన వార్తికపుడు
నిండిన వేడ్కతో నెమ్మి సౌందర్య
పాండ్యభూపాలుఁ డాభరణాంబరాదు
లిప్పించి ధరణీసురేంద్రుల నెల్ల

రప్పించి ధనము హేరాళంబు లొసఁగి
దనర షోడశ మహాదానంబులిచ్చి
ఘనతరసంతోష కలితుఁడై మెఱసె
కడక పదాఱు నాళ్లు గడచిన పిదపఁ
దడయక జాతసూతకములు దీర్చి
హితవు గల్గిన పురోహితుల బాంధవుల
మతి మంత్రులాప్తుల మఱి పిల్వ నంపి
వెలయ గంధాక్షత వీడ్యంబు లిచ్చి
యిల నామకరణ మెయ్యది చెప్పుఁడనిన
నుగ్రు నంశంబున నుదయించు కతన
నుగ్రపాండియ నామ మొనరించి రపుడు
నలరంగఁ గొన్నాళ్లు కా కుమారునకు
నలువొప్పఁ జౌలోపనయనముల్ దీర్ప
లలిని సాముద్రిక లక్షణాన్వితులు
తలఁచి యాతని యొప్పిదంబులు జూడ
నడిపించి రమ్మని నఖశిఖాద్యంత
మడరి వీక్షించి వాక్యజ్ఞులఁ దెలిసి
కోర్కె నాయుగ్రునిఁ గూర్చుండు మనుచుఁ
బేర్కొని సౌందర్య పృథివీశు కనిరి
వెస నూటయెనిమిది వ్రేళ్ల సూత్రమునఁ
గొసరక నిలువెల్లఁ గొలిచి చూచినను
నెన్నంగ నొక్క వ్రే లెక్కుడున్నతఁడు
మన్నగా సామ్రాజ్య పట్టంబు నేలు
ముక్కు గన్నులు భుజంబులు జాను హనువు
లొక్కంట దీర్ఘమై యుండగవలయు
గళమును జంఘాయుగంబు మేఢ్రంబు
లలవడ హ్రస్వంబులై యుండవలయు
నధరోష్ఠ జిహ్వాలు హస్త మంఘ్రులును
నధికనఖములు గెంపైన ధన్యుండు
మొగము గటిస్కంధములును గరోరు
యుగము గుక్షియు ఫాల మున్నతి మేలు
నెడపక భ్రూమధ్య మెవరికి నైనఁ
గడు ప్రదక్షిణ రేఖ గలిగిన నతఁడు

చేకొని చతురబ్ధి సీమలు జేర
నేకాతపత్రమై యేలంగఁ గలఁడు
పదములు మృదువయ్యెఁ బాణిద్వయమ్ము
నది కఠినమ్మును నైయుండె లెస్స
కటియు నిటలము వక్షస్స్థల మట్టు
లటు విస్తృతములైన నధికుఁడౌ నతఁడు
గడు నాయురవసానకాలమ్ము దెలియఁ
దొడరి చెప్పెద మది తో యమ్ముగాఁగ
వలనొప్ప నెడమపార్శ్వము నాసికమున
నిలువక యుచ్ఛ్వాసనిశ్వాసములును
నడచుచు నా దక్షిణపుదిక్కు గాలి
నడువక యున్న నా నరుఁడు మూఁడేండ్ల
కాయుష్యమెడలును నదిగాక రెంటు
వాయువు సరియొక్క వాసరంబెడల
నెరవుగా మువ్వది నెలలలో వాఁడు
మరణమ్ము నొందును మనుజాధినాథ !
ప్రాణానిలమ్ములు పాయ కెవ్వనికి
ఘ్రాణరంధ్రములఁ బాఱక నోర వెడలు
నాకర్షి మూన్నాళ్ల యమపురి కరుగు
నాకసమ్మున మఱి యదరిపాటునను
గాంచనకృష్ణ పింగళవర్ణ రూప
మంచితమ్ముగ నెవ్వఁడఁటు గాంచెనేనిఁ
దడయక వత్సరద్వయములో వాఁడు
పడిపోవు గాలుని పట్టనంబునకు
తొండ యూసరవిల్లి తొడరి పాదముల
నుండి యాతొడదాఁక నొఁగ్రాకెనేని
జలకమ్ములాడగా జలమొంచు కేని
నిలువక దేహ మందెక్క నేనియును
దక్షిణం బటుజూడఁ దలలేక తోఁచె
మేర్పడఁగాన్పించు నెవ్వరి కేని
వారెల్ల నార్నెల్ల వైవస్వతాఖ్యుఁ
జేరుదు రందంద సిద్ధించు నిదియుఁ
బరగ నిందొక్కటి ప్రాపించువార

లరుగంగవలెఁ దీర్థయాత్ర సేవింప
నని లక్షణమ్ములు నటఁగొన్ని చెప్పి
వినతులై సౌందర్యవిభుని కిట్లనిరి
ఉర్వీశ ! యీ యగ్రసుఁడుత్తమోత్తముఁడు
సర్వలక్షణ భాగ్యసంపన్నుఁడితఁడు
పొగడొంద నీకును బుత్రుండు గానఁ
దగ నీ కుమారుండు ధరయెల్ల నేలు
నని విన్నవించిన హర్షమ్మునొంది
ఘనముగా వారికిఁ గట్నమ్ములిచ్చి
యప్పుడు గ్రసునిఁజూచి యా సౌందరేశుఁ
డొప్పగా విద్యల నొనరింతు ననుచు
సరవి నొజ్జలయొద్దఁ జదువఁబెట్టినను
వరగంగ నక్షరాభ్యాసంబు సేసి
పాఁడి పరాక్రమ ప్రతతులేర్పడఁగ
వేఁడుకతో నాల్గువేదము ల్చదివె
నంగంబు లాఱును నాత్మలోఁ దెలిసి
సాంగముగా నాఱుశాస్త్రము ల్చదివె
దనరిన భరత మృదంగాది విద్య
లను కావ్య నాటకాలంకారములను
నాగమ శాస్త్రంబు లంద సంఖ్యాది
యోగవాదముల సంయోగంబు తెఱిఁగి
యొసఁగ సంగీత సాహిత్యవిద్యలను
రసికత మెఱసి యా రాకుమారుండు
తాళాల చెమట చిత్తడి మేన నింక
గాలు సేతులు డంగ కలు నాల దిరుగఁ
గడిమిమై పోల సంగడము సాధించి
గజ హయారోహణ ఖ్యాతిఁ బెంపొంది
ప్రజలకుఁ గన్నుల పండువై యుండ
భాషలు లిపులెల్ల బాగొప్ప నెఱిఁగి
చౌషష్టి విద్యలఁ జతురుఁడై వెలయు
నక్కుమారునిఁ జూచి యతివేడ్కతోడ
మక్కువ సౌందర్య మహీపాలకుండు
వరుస బ్రహ్మ క్షత్ర వైశ్య శూద్రులకు

ధర శర్మవర్మ గుప్తులు దాసు లనెడి
నాలుగు నామముల్ నాల్గు జాతులకు
వాలాయమని శ్రుతుల్ వర్ణించు కతన
రమణ గోచర్లవర్మ యను నామంబు
క్రమమొప్ప నిడి తన ఘనకిరీటమ్ము
ధరియించి చిరకీర్తి ధరయేలు మనుచుఁ
బరగంగ సామ్రాజ్య పట్టమ్ముగట్టె
నిదియా నేకాదశంబిటు మీఁదిచరిత
ముదముతోఁ జెప్పెద మునులార ! వినుఁడి.
అనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియెం.

### పంద్రెండవ లీల

అంతట సౌందర్యుఁ డధికలావణ్య
వంతుఁడైన కుమారవర్యున కనియెం
నిటు మీఁదఁ గొన్నాళ్ల కింద్రుండు వార్ధి
పతులమ్ము మదిలోన భయమంద కడగి
రా యుగ్రపాండీంద్ర రెయొనర నీపురము
రాయిఁడి నేయంగ రాఁగలవాఁడు
బలభేది యిచటికిఁ బ్రబలి వచ్చినను
వళచక్ర మతనిపై వడిఁ బ్రయోగింపు
వనధులన్నియు మీఱి వచ్చిన యంత
ఘనశక్తివలన నా ఘనశక్తి విడుము
గండు మీఱి సురాద్రిఁ గదియంగఁ బోయి
దండాయుధమ్మునఁ జెండాడుమనుచు
క్షితిమించు పలెవేళల్ చండాయుధములు
మతినుగ్రపాండ్య కుమారునకిచ్చి
యతని యౌదార్యంబు నతని ధైర్యమ్ము
నతని తేజోమూర్తి యతని సత్కీర్తి
గనుగొని యాత్మలోఁ గడు సంతసిల్లి
తనయునికిని బెండ్లి తగ జేయఁదలఁచి
భాను వంశంబున బాగైనయొక్క
భూనాయకుని పుత్రిఁ బూర్ణేందువక్త్రి)

రమణీయశుభగాత్రి రాజీవనేత్ర
సమితకోకిలవాణి నళినీలవేణిఁ
గులశీల సౌందర్యగుణములయందు
విలసిల్లుఁ బుణ్యసాధ్విని సత్వరమున
గెలిమితోఁ జెప్పించి యెల్ల దిక్కులకు
నలవడ శుభలేఖ లనిపిన వారు
గంధసింధురములు గాంచనావళులు
గంధర్వ హయములు గామినీమణులు
రత్నభూషణములు రత్నాంబరములు
రత్నరాసులు నపారములుగా మఱియుఁ
గస్తూరి కర్పూర గంధ హిమాంబు
వస్తువు లెన్నేని వరుసతోఁ గొంచు
సమిత రథారూఢులై వచ్చి కాంచి
క్రమమున వేర్వేఱఁ గట్నముల్లిడుచు
నష్ట దిక్కులనున్న యవని పాలకులు
సాష్టాంగములు సేయ సౌందర్యపాండ్య
కువలయేశుఁడు వారిఁ గుశలమ్ము లడిగి
యవి యెల్లఁజూచి తానర్థిఁ గైకొనుచు
దండిగా వారినందఱ వీఁడుపట్ల
నుండంగ నియమించి యుత్సవంబెసఁగ
ఘనముగా నగరు శృంగారింపఁ బంచి
తన నగరెల్లఁ జిత్రములు దీర్పించి
చంద్రకాంతోపలోజ్జ్వలవేది యందు
నింద్రనీలంపు గద్దె నెసఁగఁ బెట్టించి
మరకత శిలలు గంబములుగా నిలిపి
పరగ వజ్రాల సోపానముల్ దీర్చి
పగడంపు లతికలపై పట్టె లమర
నొగి మించు బంగారు నోడు బిల్లలను
నలరించు మైమించు నబ్జరాగంపుఁ
గలశంబు లాగి నిల్పి ఘనమౌక్తికముల
సున్నంబు తోడఁ గస్తూరియుఁగూర్చి
పన్నీటితోఁ గల్పి పయి గారఁబూసి
కనకకుట్టిమములఁ గాంతి పెట్టించి

ధర శర్మవర్మ గుప్తులు దాసు లనెడి
నాలుగు నామముల్ నాల్గు జాతులకు
వాలాయమని శ్రుతుల్ వర్ణించు కతన
రమణ గోచర్లవర్మ యను నామంబు
క్రమమొప్ప నిడి తన ఘనకిరీటమ్ము
ధరియించి చిరకీర్తి ధరయేలు మనుచుఁ
బరగంగ సామ్రాజ్య పట్టమ్ముగట్టె
నిదియా నేకాదశంబిట మీఁదిచరిత
ముదముతోఁ జెప్పెద మునులార ! వినుఁడి.
అనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.

## పంద్రెండవ లీల

అంతట సౌందర్యుఁ డధికలావణ్య
వంతుఁడైన కుమారవర్యున కనియె
నిటు మీఁదఁ గొన్నాళ్ల కింద్రుండు వార్ధి
కుటిలమ్ము మదిలోన భయమంద కడగి
రా యుగ్రపాండీంద్ర యొనర సీపురము
రాయిఁడి నేయంగ రాఁగలవాఁడు
బలభేది యిచటికిఁ బ్రబలి వచ్చినను
వళచక్ర మతనిపై వడిఁ బ్రయోగింపు
వనధులన్నియు మీఱి వచ్చిన యంత
ఘనశక్తివలన నా ఘనశక్తి విడుము
గండు మీఱి సురాద్రిఁ గదియంగఁ బోయి
దండాయుధమ్మునఁ జెండాడుమనుచు
క్షితిమించు తఱివేళల్ దండాయుధములు
మతినుగ్రపాండ్య కుమారునకిచ్చి
యతని యౌదార్యంబు నతని ధైర్యమ్ము
నతని తేజోమూర్తి యతని సత్కీర్తి
గనుగొని యాత్మలోఁ గడు సంతసిల్లి
తనయునికిని బెండ్లి తగ జేయఁదలఁచి
తాను వంశంబున బాగైనయొక్క
భూనాయకుని పుత్రిఁ బూర్ణేందువక్త్రి

రమణీయశుభగాత్రి రాజీవనేత్ర
సమితకోకిలవాణి నళినీలవేణిఁ
గులశీల సౌందర్యగుణములయందు
విలసిల్లుఁ బుణ్యసాధ్విని సత్వరమున
చెలిమితోఁ దెప్పించి గొల్ల దిక్కులకు
నలవడ శుభలేఖ లనిపిన వారు
గంధసింధురములు గాంచనావళులు
గంధర్వ హయములు గామినీమణులు
రత్నభూషణములు రత్నాంబరములు
రత్నరాసులు నపారములుగా మఱియుఁ
గస్తూరి కర్పూర గంధ హిమాంబు
వస్తువు లెన్నేని వరుసతోఁ గొంచు
సమిత రథారూఢులై వచ్చి కాంచి
క్రమమున వేర్వేఱఁ గట్నము లిడుచు
నష్ట దిక్కులనున్న యవని పాలకులు
సాష్టాంగములు సేయ సౌందర్యపాండ్య
కువలయేశుఁడు వారిఁ గుశలము లడిగి
యవి యొల్లఁజూచి తానర్థిఁ గైకొనుచు
దండిగా వారినందఱ వీఁడుపట్ల
నుండంగ నియమించి యుత్సవంబెసఁగ
ఘనముగా నగరు శృంగారింపఁ బంచి
తన నగరెల్లఁ జిత్రములు దీర్పించి
చంద్రకాంతోపలోజ్జ్వలవేది యందు
నింద్రనీలపు గద్దె నెసఁగఁ బెట్టించి
మరకత శిలలు గంబములుగా నిలిపి
పరగ వజ్రాల సోపానముల్ దీర్చి
పగడంపు లతికలపై పట్టె లమర
వాగి మించు బంగారు నోడు బిల్లలును
సలరించు పైమించు నబ్జరాగంపుఁ
గలశంబు లాగి నిల్పి ఘనమౌక్తికముల
సున్నంబు తోడఁ గస్తూరియుఁ గూర్చి
పన్నీటితోఁ గల్పి పయి గారఁబూసి
కనకకుట్టిమములఁ గాంతి వెట్టించి

కనకాంబరముల మేల్కట్లు గట్టించి
సరసతఁ గురువేఱు చప్పరంబులును
దఱచుగా మరువంపుదళ్లు గట్టించి
నగరు శృంగారించి నానావిధముల
నగరంబు వీథుల నవహేమరచిత
మంచకంబుల మీఁద మానినీమణులు
నంచితగతుల నాట్యములాడుచుండ
ముకురపంక్తుల కాంతి భరమొల్ల నెగడ
మకర తోరణములు మహి సొంపు మిగులఁ
బౌరోహితామాత్య బంధుసన్మిత్ర
పౌరాణికోత్తముల్ పండితోత్తములు
కవి గాయకానేక కామినీమణుల
నవిరళ సమ్మర్దమయ్యె నానగరు
కుహూరాభ్రముల మహాఘోషమై మ్రోయ
బహుళమై చెలఁగె శోభన వాద్యరవము
లప్పుడా కన్యకు నా కుమారునకుఁ
గప్పుర గంధంబు గలిపి వేశ్యలుఁ
ప్రాభవంబులతోడఁ బ్రౌఢ కామినులు
శోభనంబులు పాడుచును వేడుకలర
సౌరభ్య జలముల జలకముల్ దీర్చి
సైరంధ్రి జనము లా జలజలోచనకు
నెఱి వెండ్రుకల కొప్పు నేర్పొప్పఁ బెట్టి
సురభిమందార ప్రసూనముల్ దుఱిమి
కప్పుకస్తురి మేనఁ గలయంగ నలఁది
కొమ్మకు నొసలఁ గుంకుమ బొట్టు దీర్చి
వెలసిల్ల సీమంతవీథి యేర్పఱచి
చెలువైన ముత్యాల చేర్చుక్క నిలిపి
తరుణి కాంచనరత్న తాటంకయుగము
ధరియింపఁగర్ణావతంసమై యొప్పఁ
దరుచైన నక్షత్రతార హారములు
సరములు మెడనిండ సరవిమై వైచి
పంకజాక్షికి హస్తపంకజముల ను
గంకణమ్ములు నూడిగములు ధరించి

వెలియకు నాభిపై సింహమధ్యమున
వెలిపట్టు పుట్టమ్ము పేర్మితోఁ గట్టి
యసియాడు నడుమున కాధారముగను
బసిఁడి యొడ్డాణమ్ము బాగొప్ప నుంచి
యప్పుడు సుముహూర్త మాసన్నమైన
నప్పురోహితులెల్ల నతి సంభ్రమమునఁ
దగ విన్నవింప సౌందర్య భూవిభుఁడు
నగరిలోపలఁ జని నవకమై చెలఁగు
నంగనఁ గనుగొన్న యప్పుడా సర్వ
మంగళాలంకార మహిమఁ జెన్నొందె
నంత నావిభుఁడును నక్కుమారకునిఁ
గంతు సన్నిభమూర్తిఁ గైసేయఁ బనిచె
మూర్తిభావంబని మూఁడు లోకములు
గీర్తింపఁదగు భుజకీర్తులు వెట్టి
మాండలికస్తవ్య మహనీయ రాయ
గండపెండెంబు డాకాలను బూని
తనరఁ గట్టాణి ముత్యాలచౌకట్లు
ననువందఁ గర్ణమ్ములందు ధరియించి
మఱియును దేదీప్యమానమై చెలఁగు
వరభూషణమ్ములు వరుసతోఁ దొడిగి
విమలచందన చర్చ వేడ్క తా నలఁది
రమణ దుకూలాంబరం బొప్పఁ గట్టి
భాసిల్లి రత్నప్రభా పూర్ణమైన
బాసికమ్ము ధరించి భాసురమ్ముగను
బుష్పకంబెక్కి యా పుష్పాస్త్రు లీల
పుష్పగంధులు వేడ్కఁ బుష్పముల్ చల్లఁ
గరదీపికాకోట్లు గరము దీపింపఁ
బురవీథులందు సొంపుగ నేఁగుదెంచి
సరసత మెఱయ రాజద్వారమునను
గర మొప్ప నా పుష్పకంబొగి డిగ్గి
మందమందమ్ముగ మత్తేభగమన
లందందఁ జామర లర్థితో నిడఁగ
వినుతింపఁ గల్యాణ వేదికై నుండు

గనక పీఠమ్మున ఘనతఁ గూర్చుండి
పుణ్యాహకర్మముల్ భూసురుల్ నడప
పుణ్యాంగనాజనమ్ములు సొంపుతోడ
శోభనమ్ములు పాడ శుభలగ్నమునను
శోభిల్లు నప్పుడా శోభనవతికి
మంగళాష్టకములు మహిసురుల్ చదువ
మంగళ సూత్రము మహిమతోఁ గట్టై
నప్పుడా సౌందర్యుఁ డధికమోదమున
ఛప్పన్న దేశ రాజన్యులకెల్ల
కప్పుర విడియముల్ గంధాక్షతములు
నిప్పించి యుడుగర లిచ్చి షడ్రుచుల
విందులు పెట్టించి వెలయ నందఱను
పొందుగాఁ దమతమ భూముల కనిపె
నక్కుమారునకును నభిషేకమొనర
మక్కువ శిరసున మకుటంబు నిలిపి
పౌరోహితామాత్య బాంధవాశ్రితుల
గారవంబునఁ బ్రోచి కరుణ రాజ్యంబు
పాలింపు మీవని పట్టంబుగట్టి
బాలికామణిఁ జూచి పతిభక్తి గలిగి
వర్తింపుమని చెప్పి వరచొక్కనాథ
మూర్తిలోఁ గలసె నా మూర్తీశ్వరుండు
పొంగిన వేడ్క ముమ్మొలె తటాతకయు
నంగయు కణ్ణమ్మ యందైక్యమయ్యె
సౌందర్యపతి దేవసంవత్సరములు
నందంబుగాఁ బదియాఱువేలవని
మధురాపురమ్ము సమ్మతి నేలుకతన
నధికమై శివలోకమయ్యె నప్పురము
నా కొండ నా స్వామి యభిషేక చొక్క
నాయకుండనియెడి నామంబుదాల్చె
నంత నాయుగ్రుండు నాశ్చర్యమంది
సంతోషచిత్తుఁడై సర్వకాలంబు
నా చొక్కనాథ మహాదేవు కృపను
భూచక్రవాళ మింపుగ నేలుచుండె

నీ లీల విన్నట్టి యెల్ల పుణ్యులకు
హాలాస్యనాథుని యతిభక్తి వలన
నిత్య శోభనములు నెమ్మితోఁ గలిగి
యత్యంత సౌభాగ్యులై యుందు రెపుడు
నిదియు ద్వాదశలీల యిట మీఁది చరిత
ముదకముతోఁ జెప్పెద మునులార ! వినుఁడి.
అనుచు సన్మునులతో నా యగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.

### పదుమూఁడవ లీల.

సౌందర్య నాథుండు సర్వేశ్వరుండు
నిందుజూటుఁడు పరమేశుండు కదమ
వాసుండు తిరువాలవాయుండు కృత్తి
వాసుఁడా హాలాస్యవాసుఁడై నట్టి
శ్రీ చొక్కనాథు నంచితకృప గాంచి
రాచ చిహ్నలచేత రసికుఁడై మెఱసి
తగ నుగ్రపాండీఁడు ధర్మంబు దయయు
నగణితంబుగ నీతులన్నియు నెఱిఁగి
శాస్త్రవ జయమున శరణార్థులైన
శత్రుల మనుచుచు జగతిఁ బాలింప
నట్టికాలమ్మున నబ్ధు లుప్పొంగి
పట్టున మధురపై బ్రబలి యేతేఱ
నప్పుడా పురజను లతిభీతి నంది
యత్పురమర్దను నాత్మలోఁ దలఁచి
శ్రీ చొక్కనాయక శ్రీ మహాదేవ !
ఓ చంద్రశేఖర ! యో నీలకంఠ !
యిమ్మహోపద్రవం బెల్లను బాపి
మమ్ము రక్షింపవే ! మాపాలి వేల్ప !
అని పెక్కు భంగుల నార్తులై వారు
వినుతింప నప్పుడా విశ్వాధికుండు
విని యుగ్రపాండ్యేంద్ర విభుఁడు నిద్రింపఁ
జని యప్పు డాతని స్వప్నంబునందు
గానతి యిచ్చె నాహాలాస్య విభుఁడు

భూనాథ! సాగరంబులు మేరఁ దప్పి
యేకార్ణవంబుగా నెల్ల లోకములు
భీకరాకారమై పేర్చి లోఁగొనుచు
వెల్లిగా నిటువచ్చె వెఱచి యీ ప్రజలు
తల్లడింపఁగ నీకుఁ దగునె! నిద్రింప
జననాథ! క్షత్రియ శబ్దంబు వినవె
తగ నెదిర్చిన శత్రు దండించుటయును
శరణార్థి రాజన్య సమితిఁ బ్రోచుటయుఁ
దగఁ జెప్ప వినవె పెద్దలు శాస్త్రములను
దగ నృపాలకుఁడను తచ్ఛబ్దమరయఁ
బొగడొంద మనుజులఁ బ్రోచుటగాదె
పోరిదిగా నీ ధర్మ సూక్ష్మమ్ము లెఱిఁగి
స్థిరముగాఁ బ్రజల రక్షింపు మీ యెడను.
అందుకు నొక యుపాయంబు సెప్పెదము
ముందు నీకొక శక్తి ముదముతో నేము
నొసఁగితి మా శక్తి యుదధుల మీఁద
వెసఁ బ్రయోగింపుము విక్రమం బెసఁగ
నని యానతిచ్చిన నంత మేల్కనుచుఁ
దన మంత్రివరులతోఁ దగ వేడ్కఁ జెప్ప
నా మంత్రు లప్పుడు హర్షమ్ము నంది
భూమీశ! సేయు మీ భూతేశు నాజ్ఞ
ఇప్పుడు జయమబ్బు నీ క్షణమ్మునను
ఇప్పుర జనులెల్ల నెలమి శోభిల్ల
నని వార లందఱు నతి వేడ్కతోడ
వినుతింప నప్పు డుర్వీతలేశ్వరుఁడు
సంభ్రమంబున ఘనశక్తిఁ జేకొనుచు
జృంభితహృదయుఁడై చేరి యత్తటిని
కనుగొనలందు రక్తచ్ఛాయ పొడమ
ఘనతరోత్తుంగ నక్ర క్రూర మత్స్య
కుండలి ఘనశంఖ కూర్మ కర్కటక
మండూకముల చేత మహి మించుదాని
నీఁటి యంగనలును నీఁటి గుఱ్ఱములు
నీఁటి మానవులచే నెగడెడు దాని

పరమణి హరి నీల వజ్రప్రవాళ
మరకత వైడూర్య మాణిక్య పుష్య
రక్త గోమేధిక రాజిత రాగ
మౌక్తికముల చేత మలసిన దాని
ఘనతరార్భటులను ఘనతరంగముల
వినువీధి కెగయంగ వెసఁ బర్వుదాని
వదలక ఘుమఘుమధ్వనుల నుప్పొంగి
పది దిక్కులను నిండి పఱతెంచుదాని
కడలేని ధర్మార్థ కామమోక్షంబు
లడరి పుణ్యక్షేత్ర మది చొఱరాక
మితిలేని కోపాగ్ని మే కొన్నయట్టి
గతి బడబాగ్ని లోఁ గరఁగిన దానిఁ
గని యమ్మహారాజు గర్వితోదగ్ర
ఘన మహాంభోరాశిఁ గడిమి తోడాసి
యట్టాలనాయకుఁడా చొక్కవిభుని
గట్టిగా హృదయ పంకజమున నిల్పి
తన బాహు బలశక్తిఁ దనరిన శక్తిఁ
గొని వైవ నది మహాక్రూరత గదిసి
వేలాయుధము సూఱు వేలాయుధముల
లీల వార్ధుల నవలీలఁ బోఁ ద్రోల
నప్పుడా దేవత లతిపుష్పవృష్టి
రొప్పుగాఁ గురియించి రుగ్రునిమీఁద
మఱియును బాండ్య భూమండలేశ్వరుఁడు
పరమ సంతోషసంభ్రమ కేళి మెఱయ
సౌందర్య విభుని యాశ్రమమున కరిగి
సౌందర్యపతికిని సాష్టాంగ మెఱఁగి
కైలాస గిరినాథ ! గంగాధినాథ !
హాలాస్య పురనాథ ! యట్టాలనాథ !
మూర్తి త్రయీనాథ ! ముజ్జగన్నాథ !
యార్త రక్షణ నాథ ! యఖిలైక నాథ !
సర్వ దైవతనాథ ! సౌందర్య నాథ !
ఊర్వీ భుజగనాథ ! మాధుర్యనాథ !
యావనతావన నాథ ! యఘవర్గనాథ !

శివలోక పురనాథ ! శ్రీ చొక్కనాథ !
యని సన్నుతులు సేసి యా స్వామి కృపను
తన నగరికి నేఁగి ధన్యత మెఱసి
సకల ధాత్రీతలేశ్వరులును గొలువ
న కుటిలమతిని రాజ్యము సేయుచుండె.
ఇది త్రయోదశలీల యిటు మీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార ! వినుఁడి.
అనుచు సన్ములతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.

## పదునాల్గవ లీల.

అంత నా యుగ్రపాండ్య క్షితీశ్వరుఁడు
సంతోషచిత్తుఁడై సౌందర్య కృపను
సర్వ సర్వంసహాచక్ర మంతయును
నిర్వాహశక్తుఁడై నిజశక్తి మెఱసి
బహుత రైశ్వర్య సంపన్నుఁడై యతఁడు
మహిని బాలింపఁగ మఱి యొక్కనాఁడు
నోలిగా నట చేర చోళ పాండీలు
పాలించు రాజ్య భూభాగంబులకును
దొడరె ననావృష్టి దోషంబు లందు
కడఁకతో నొక కొంతకాలమ్ము పోవ
నప్పుడు మువ్వురు నవనివల్లభులు
తప్పక తమ యాజ్ఞ దగ విచారించి
విప్రుల రావించి విహితంబుగాను
క్షిప్రంబు గ్రహశాంతి సేయుఁడీ యనిన
వారు జ్యోతిశ్శాస్త్రి వాసనల్ దెలిసి
యా రాజవరులకు నప్పు డిట్లనిరి
గ్రహ వక్రములు గావు గణుతించి చూడ
మహి నింద్రుఁడొనరించు మహిమలు గాని
యీ దోషములు మాన్ప నింద్రుండు దక్క
కాదు నొండొకనిచేఁ గడువేడ్క నతని
పాలికిఁ బోయినఁ బాటించి వర్ష
జాలముల్ గురియించు చయ్యన నరుగుఁ

డని బ్రాహ్మణులు పల్క నా భూమిపతులు
మనమున హర్షించి మహిమలు మించి
యమరంగఁ గనకరథారూఢు లగుచు
నమరావలికి నేఁగి రతివేడ్కతోడఁ
బురుహూతు నర్చ్యుడఁ బొడగన్న నతఁడు
వరుసతో సన్మాన వస్తువు లొసఁగి
యిచ్చ మీ కెయ్యది యిచ్చోటి కిపుడు
వచ్చితమని చెప్పవలయు మీ రనిన
చారు చోళులు హస్తజలజముల్ మోడ్చి
చేరి సంస్తుతు లొప్పఁ జేసి జంభారి
వృత్రాసురాంతక విబుధలోకేశ
గోత్రారి మా కోర్కె కొనసాఁగఁ జేయు
దేవ ! మీ యాజ్ఞ వర్తించు మేఘములు
భూవలయంబు సొంపుగను వర్షించు
తడయక మా యేలు ధారుణీ స్థలిని
దొడరి యనావృష్టి దోషమ్ము గల్గె
నీ యుపద్రవమెల్ల నిచ్చ నూహించి
పాయఁగఁ జేయు మాపాలిటఁ గల్గి
యనిన నాగాశని యమరవల్లభుఁడు
ఘనమేఘములఁ బిల్చి ఘనముగా వీర
లిరువురదేశమ్ము లెల్లకాలమును
తరగని సస్యముల్ ధాన్యసమృద్ధి
గలిగియుండంగఁ దత్కాలంబు లెఱిఁగి
తలకొని వర్షముల్ దగఁ గురియింపు
డని మేఘములఁ బంపి యాయిరువురకుఁ
జనవిచ్చి దివ్యభూషణములు మెఱయఁ.
దగినయంతయు నిచ్చె తదనంతరంబ
మగఁటిమితో పాండ్యమండలేశ్వరుఁడు
వేఁడుట కష్టమ్ము వినతులై యొరులఁ
బోడిమి చెడి వేఁడఁ బోలునే యనుచు
మహి మానిగావున మడి నూరకున్న
సుమానిత్తు యప్పుడా కులిశాయుధుండు
నతఁడు ధరింపరానట్టి భూషణము

లతులితమ్ముగ నిచ్చె హాస్యమ్ము నేయఁ
దలఁచ నాసొమ్ము లాతఁడు పుష్పమాలి
కల భాతితోడ నంగములను దాల్చె
నపుడు నా దివిజేంద్రుఁ డారాజుఁ జూచి
కపటమనస్కుఁడై గారవం బెసఁగ
నగ్రగునంశంబున నుదయించుకతన
నగ్రపాండీశత యొనరెడు నిపుడు
నీభూషణమ్ములు నెల్లయంగముల
శోభనకరముగాఁ జూపట్టు కతన
సౌందర్యపాండీని చందంబు నీకు
నందమ్ము గాఁగల దవనీశతిలక !
యని సన్నుతులు నేసి యారాజు నపుడు
యనిమిషాధిపుఁ డంత నట సంతసించి
యలర నామువ్వుర నవనీశ్వరులను
పొలుపొందఁ దమతమ భూతుల కనిచె
ననిచిన వారలు నతివేడ్కతోడ
మనుకొని తమ రాజ్యముల కేఁగి రంత
నాచారచోళ రాజ్యములకు నపుడు
ప్రాచీనపతియాజ్ఞఁ బ్రబలి మేఘములు
క్రమకాలమ్మున శత్రువుమీఁద
నామని దండెత్తు నవసరమ్మునను
జయభేరి మ్రోయించు చందమ్ముగాఁగ
రయమున మంద్రగర్జనముల నడరె
బలిమైన చతురంగ బలముల మాడ్కి
బలువన్నె మేఘముల్ ప్రబలె నల్దెసల
దారుణ కరవాలధారలో యనఁగ
శాతమెఱుంగులొక్కట పిక్కటిల్లె
వరుణుండు పట్టిన జడికార్ముకంబు
సరవిని దగ నింద్రచాపంబు దోఁచె
మనుకొని చాప వినిర్ముక్తంబులైన
ఘనతర సితసాయకంబులో యనఁగ
ఘనసిత శంపాజాలములు గాఁగ బట్టి
కొనకొని వర్షించె కుంభవర్షములు

సాంద్రమై రక్తమాంసంబుల రీతి
యింద్రగోపంబులు నిల నిండఁ బర్వె
క్షామంబు బోఁదోలె సంతోషముగను
నామని యుప్పొంగి హర్షించినట్లు
నదులు తటాకముల్ నవసరోవరము
లుదకపూరమ్ములై యొప్పె నల్గడల
నా చారచోళరాజ్యము లెల్లఁ దనిసి
యేచిన సస్యము లెసఁగ వర్ధిల్లెఁ
గాఁడికుంటల చేత పాయక యెపుడు
పోఁడిగా నుండిరి భూప్రజలెల్ల
సొంపుతో నా చారచోళభూపతులు
సంపద లెసఁగ రాజ్యము లేలుచుండఁ
దిరముగా నాపాండ్యదేశమ్మునందు
దొరసి యనావృష్టి దోషమ్ము వాయ
కుండిన నా పురుహూతుపై నగ్ర
పాండీఁడుకోపంబు బలియింపు చుండె
నా రాజు తను వేఁడనట్టి మత్సరము
మీఱి వర్తించు ననిమిషనాయకుండు
నీరీతి వాగల యిరువురియందు
వైరంబు ప్రాపించి వర్తింపుచుండి
రనిన నమ్మనులెల్ల నాకుంభభవుని
వినవయ్య యట్లనావృష్టి వాటింప
నెవ్విధంబున రాజ్యమేలె నా రాజు
నా విధంబెల్ల మాకానతిమ్మనిన
విదితంబుగా మౌని వినిపించెనంత
పదిలుఁడై యా యుగ్ర పాండ్యభూవిభుఁడు
వలనొప్ప నొకకొన్ని వాసరమ్ములకు
మలయాద్రికిని వేఁటమార్గమ్ము గాఁగ
వెడలి యచ్చోటను వేఁటలాడుచును
పొడగాంచె నక్కడఁ బుష్కలావర్త
జలధరమ్ములు నాల్గు సంచరింపఁగను
వలనుగా దన పరివారంబుఁ బిల్చి
యీనాల్గుమేఘము లీక్షణమ్మునను

బోనీక పట్టియిప్పుడు గొనిరండు.
అనిన శౌర్యోదగ్రులై సేనలపుడు
ఘనమేఘములను నాసర్వేశుకృపను
గట్టుకవచ్చి భూపతిసమ్ముఖమునఁ
బెట్టిన నటుచూచి భీషణాకృతిని
నా రాజ్యమెల్ల ననావృష్టిదోష
కారమ్ము సేసిన కపటమేఘములఁ
గ్రూరుఁడై పురమునకును గట్టి యనిచె
ననిచిన విని యింద్రుఁ డత్యంతరోష
మున యుద్ధ సంరంభమునకు నేతెంచె
నతఁడును సన్నద్ధుఁడై యుగ్రముగను
జతురంగబలముల సంఖ్యతో నిలిచి
పడమటఁ దూర్పునఁ బ్రాపించినట్టి
జడధులు దలపడు చందమ్ముదోఁప
2 లభేది సేనలు పాండ్య సేనలును
దలకొని ద్వంద్వయుద్ధము సేయుచుండ
నా దేవమానవు లాహవ గరిమ
యా దేవరాక్షసులగను లేదయ్యె
నప్పుడు దేవేంద్రుఁ డతిరౌద్ర మెసఁగఁ
గ్రూరాస్త్రములనేయఁ గుపితుఁడై యతఁడు
వారుణాస్త్రమ్ములఁ దనువెల్ల నించె
నాగ్నేయబాణమ్ము హరిహయుఁ డేయ
బ్రజ్ఞతో వారుణాస్త్రమ్మునఁ ద్రుంచె
నురగాస్త్ర మాజిష్ణుఁ డుగ్రుఁడై యేయ
గరుడాస్త్రమున నది ఖండించివైచె
నెన్ని బాణమ్ముల నింద్రుఁ డేసినను
నన్ని బాణమ్ముల నవి యెల్ల నణఁచె
నసి యెత్తినను నతఁ డసియెత్తి దునిమె
ముసలమ్ము నెత్తిన ముసలానఁ దునిమె
దనర భ్రిశాయుధంబు లేసినను
మనుజేంద్రుఁ డవియెల్ల వ్యర్థంబు సేసె
నంత వజ్రాయుధం బతిశక్తిఁ బూన
కంతమ్ముతో నది బయలుగాఁ జేసి

యా చొక్కనాథుని నాత్మలో నిల్పి
ఖేచరులెల్ల నద్భుతమంది చూడ
శక్రుపైనత్యంత సాహసమ్మునను
వజ్రాయుధము పాండ్యజనపతి వైచె
నద్రిశైల మగలించు నశనిచండతనుఁ
త్రిదశనాయకుని యూర్జితశౌర్య ముడుగ
హాటకరత్న దీపాకీర్ణమౌళి
కోటీర మగల నగ్గలు గాఁగఁ గూల్చె
నప్పుడు దేవేంద్రుఁ డాశ్చర్యమంది
తప్పక యాతని ధైర్యమ్ముఁ జూడఁ
బరమేశ్వరాంశ ప్రభావంబుగాని
ధరణీశ్వరుల కింత ధైర్యమ్ము గలదె
యనుచు లజ్జించి యా యమరవల్లభుఁడు
చనుచుండి దూర్వాసు శాపంబునపుడు
మనమునఁ దలపోసి మగటిమి వాసి
తనపురమ్మునకు నెంతయు నోడి చనియె
నంత నారాజు వృత్రాంతకు గెలిచి
సంతోషమునుబొంది జయమును జెంది
యధికశౌర్యమ్ముతో నందఱుగొల్వ
మధురాపురమ్మున మగుడ నేతెంచి
యుగ్రపాండీంద్రుఁ డా యుగ్రలోచనుని
యగ్రభాగమునకు నతివేడ్క నరిగి
యో దేవ సర్వేశ యో చొక్కనాథ !
యో దీనరక్షార్తి యో కృపామూర్తి !
యర్థితోఁ బాశుపతాస్త్రమర్థింపఁ
బార్థునకిచ్చిన భక్తమందార !
చక్కనయనముఁ బూన్పఁ జక్రిని మెచ్చి
చక్రంబునిచ్చిన చక్రివందితుఁడ !
మధుదైత్యునకు శత్రుమథనమ్ము నేయ
నధికశూలమ్మిచ్చి యమరిన వేల్ప !
చక్రమ్మునాకుఁ బ్రసాదించి యనిని
శక్రుపై నేయించి జయము పాలించి
నన్ను ధన్యునిఁ జేసి నన్ను మన్నించి

యున్నతసౌభాగ్య మొసఁగిన వేల్ప!
యనినన్నుతులుసేసి యతివేడ్కతోడఁ
దననగరికి నేఁగి తగనుండె నంత
మఱియు నా పాండ్య భూమండలేశ్వరుఁడు
సంతోషచిత్తుఁడై జగతిఁ బాలింప
బలభేది యప్పుడా పార్థివేంద్రునకుఁ
బరఁగ నీవిటు నుగ్ర పాండీంద్రుఁడనఁగ
నా రాజశేఖరు నంశంబు నీవు
నో రాజశేఖర! యుగ్రపాండీశ
యా నాల్గు మేఘాల నాఁకలు విడిచి
భూనాథ పనుపుము పోఁగ నీ రాజ్య
మంతయు దఱికిని నధిక వర్షములు
సంతతంబును గల్గు జాడ గుఱియింతు
ననుచు మాతలిచేత నతి గౌరవమున
దనరంగఁ బత్రిక దగనంపె నంత
వసుధేశుఁ డదిచూచి వర్షించునట్లు
వెసఁ బూటు వెట్టక విడువ నేననిన
నా దేశమున నేడు నగ్రహారముల
భూదేవతలచేతఁ బూటులు గొనుచు
విడిచె నా మేఘాల వెసఁ బాండ్యవిభుఁడు
కడగి సుభిక్షంబుగా వాన గుఱిసె
మహిసొంపు మిగుల నామని శాలమర్యు
బహుళత్వముగాఁ బాడిపంటలు వెలసె
భూదేవకులమెల్లఁ బొలుపుతో వచ్చి
యా దేవపాండీని నర్థి దీవించి
ఓ రాజ! నీవంటి యుగ్రసాహసుల
నేరాజులందును నెఱుఁగమో దేవ!
యా చొక్కనాథుని ప్రాభవంబునను
ప్రాచీనపతి కోటువడిరా నీచేత
నీ లోకమంతయు నిండి వర్షములు
చాలంగఁ గుఱియ రాజ్యము వృద్ధినొందె
జగమెల్లఁ గడు సుభిక్షమ్ముగా వేడ్క
మగఁటిమి సామ్రాజ్యమహిమ పాలింపు

అని సన్నుతులుచేసి యా విప్రవరుఁ
మనుజేశు చేత సన్మానంబు వడసి
సరవితోఁ దమ నివాసములకు నరిగి
స్థిరమతితో సుఖస్థితి నుండి రంత
నే వక్రములులేక నెల్లకాలమ్ము
నా విక్రమాటోప మధికమై చెలఁగ
భూచక్రమంతయు భూపాలవరుఁడు
శ్రీ చొక్కనాథుని కృపను బాలించె
యిది చతుర్దశలీల యిటమీఁదిచరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి.
అనుచు సన్మునులతో నా యగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనిరొ.

## పదునైదవ లీల.

అవ్వేడ మృగపాండ్యావనీశ్వరుఁడు
నెయ్యమ్ము తోడుత నిజకీర్తి మెఱసి
ప్రకటిత సకల భూపాలకుల్ గొలువ
వికసితహృదయుఁడై విశ్వేశు కృపను
దలిఱొంద వేగావతీ దేశమునను
బొలుపొందు మాధుర్యపుర మేలుచుండె
నటుఁ గొంత కాలమ్ము కా రాజ్యమునను
గుటిలత వర్షముల్ గుఱియకయుండ
ననఘాత్ముఁడా రాజు నాత్మఁ జింతించి
తన పురోహితుల నందఱను రావించి
నా రాజ్యమునకు వానలులేని యట్టి
కారణంబేమి నిక్కము సెప్పుఁడనిన
మహీసురు లప్పుడు మది విచారించి
గ్రహవక్రములను వర్షము లేదు దేవ !
గ్రహశాంతిఁజేసినఁ గాలధర్మమున
వర్షించుగా కనివారితంబుగను
గొంతకాలమ్మిట్లు గొనసాగుచుండు
చింతింపవలవదు శ్రీ చొక్కనాథుఁ
డంతటికిని దక్షుఁడై విచారించు

స్వాంతంబునందుఁ సంతాప ముడిగి
శాంతుండ వగుచు విశ్రాంతితో నుండు
మని బ్రాహ్మణులందఱు నా భూమి విడిచి
చనిరి సుభిక్షదేశమునకు నంత
మఱియు నా రాజు క్షామంబైన కతన
ధర పంటలేకున్కి ధాన్యంబులేమి
యజ్ఞ హోమము జపాదు లాగ హోత్రికను
ప్రాజ్ఞులైనట్టి యా బ్రాహ్మలచేతఁ
జేయించుటకు వారు సీమలు విడిచి
పోయిన కారణంబున నాత్మలోన
సంతాపమంది భూశయ్యగావించి
యంతట నిద్రింప నా చొక్కవిభుఁడు
నింపొప్ప నుగ్రపాండీని స్వప్నమున
జననాథ ! నీవింత చింతింపనేల
వరుసతోడుతఁ బరివారంబునకును
నీ పురిజనులకు నిష్టాన్న వితతి
రూపింపఁ గలుగ నే ప్రొద్దు గొఱదవు
ధరణీశ ! యొక యేటిదనుక వర్షములు
కుఱియక క్షామమ్ము కొనసాగుచుండు
ద్విజులును నందాఁక తిరుగ రారిందుఁ
బ్రజలు నీ రాజ్యమ్ము బ్రతుకుట కొఱకు
నీ మది కింపుగా నే నొక్క విధము
ప్రేమతోఁ జెప్పెద పృథ్వీశ ! వినుము
నీకు నే నొసఁగిన నిశిత చండాసి
చేకొని కడు మేరుశిఖరంబు గొట్టి
వలసిన ధనమెల్లఁ వరుసతోఁ దెచ్చి
బలసిన రాజ్యమ్ము ప్రజల బాలింపు
వలనుగా ధనము నవారితంబుగను
గలిగన వారికిఁ గరువేమి నేయు
నని యానతిచ్చిన నతఁడు మేల్కాంచి
తన మంత్రులకును నంతయు వేడ్కఁ జెప్పి
ప్రతిలేని సౌందర్యపతికిని మ్రొక్కి
యతులితమ్ముగ వేడ్క నభినుతుల్ సేసి

తండువాహన దేవతావారజనక !
కుండలిభూషణ ! గోత్రారి వంద్య !
త్రిభువన సంరక్ష ! దేవతాధ్యక్ష !
యభవ సద్గుణపాత్ర యత్రిజనేత్ర
యని సన్నుతులు సేసి యా పాండ్యవిభుఁడు
మనమున సంతోషమగ్నుఁడై యపుడు
నతులితమ్ముగఁ గదంబారణ్య కృపను
జతురంగ బలము లసంఖ్యముల్ గొలువఁ
బూర్వ దిగ్భాగ పుంగవుఁడైన
గీర్వాణ వల్లభు గెలిచి తామున్న
దక్షిణ పశ్చిమోత్తర రాజవరుల
నక్షీణగతి గెల్చి యధిక కప్పములు
గొనివచ్చు నేఁడని గురువాద్యవరము
వినువీధిఁ జెలఁగంగ విభుఁడు దండెత్తెఁ
గడిమిని బూర్వ దిగ్భాగంబు గడఁగి
జలధి మధ్యమున రాజన్యులఁ గెల్చి
పరువడి కప్పంబు జవుళంబు గొనుచు
మఱలివచ్చుచుఁ బాండ్య మహిపతి గాంచె
విలసిల్లు ఘనపుణ్య విమలసారస్యు
దశకంఠ దహన పాతక వినాశంబు
పశుపతి శాంభవీ భవ్యవాసంబు
వలిపెళ కాదలాంబా విలాసంబు
నలినసంభవు యజ్ఞనామ వాటంబు
గురుతర ఘనపుణ్య కోటి తీర్థంబు
చిరతర కైవల్య శీతగుండంబు
ధరమించు గంధమాదన పర్వతంబు
వర సేతువాటికా వాసస్థలంబు
గంగా జలాభిషేక ప్రవాహంబు
రంగైనయట్టి యా రామేశ్వరంబు
ఘనగోపుర ద్వార ఘటితప్రకార
కనక మంటపములఁ గడుసొంపు మిగిలి
పొలుపొందునట్టి యా పురమటు గాంచి
యిల తేఁడు బుధ పురోహితుల కిట్లనిరా

నా దివ్యమైనట్టి యా పట్టణమ్ము
నేది భావించి మా కెఱిఁగింపుఁ డనిన
వరుస నా రాజుకు వార లిట్లనిరి
ధరణీశ ! మును త్రేతాయుగంబునను
నసురులు లోకత్రయము రాయిడింప
వసచరి మునులు దేవతలెల్లఁ గూడి
వేమాఱు శ్రీ హరిని వేడ్కఁ బ్రార్థింప
రాముఁడై దశరథ రాజుకుఁ బుట్టి
గాధేయుఁ డర్థింపఁగా నేఁగి మునుల
బాధించు తాటకఁ బట్టి ఖండించి
యాగమ్ము రక్షించి యా మౌనిచేత
బాగైన ఘనదివ్య బాణముల్ వడసి
పాషాణరూపమై పరగు నహల్య
దోషంబు తన పాదధూళిచేఁ బాపి
శివుని విల్ విఱిచి యా సీతఁ బెండ్లాడి
తివిరి భార్గవరాము ధీరత్వ మడఁచి
యనఘుఁడై యా యయోధ్యకువచ్చి మఱియుఁ
దన తండ్రి పనుపునఁ దమ్మునితోడ
వైదేహియును దాను వనముల కరిగి
రక్కసియైన శూర్పణఖ కామింప
ముక్కును జెవులును మొదలంటఁ గోసి
గరిసించినట్టి రాక్షస సేనతోడ
ఖరదూషణాదుల ఖండించివైచి
మాయామృగంబైన మారీచుఁ ద్రుంచి
చయ్యన నా పర్ణశాలకు వచ్చి
జనకజఁ గానక సంతాపమంది
చని జటాయువు పల్కు జాడలు దెలిసి
శబరిచే నతిథి పూజలు గాంచి మించి
సొబగొంద సుగ్రీవుఁ జూచి మన్నించి
వాలి నొక్కమ్మున వ్రాలంగఁ జేసి
పాలించి సుగ్రీవుఁ బట్టమ్ము గట్టి
వాయునందనునిచే వైదేహి వార్త
లామొడఁ దెలిసి యాయబ్ధి బంధించి

రావణ కుంభకర్ణాదులఁ ద్రుంచి
యా విభీషణు లంక కధిపతిఁ జేసి
జానకిఁగూడి పుష్పకమెక్కి వేడ్క
మానవాధీశుండు మగిడివచ్చుచును
వనధి బంధనమున వడి పాయఁగాఁగ
ధనువునఁ దెగఁదీసి ధనుకోటిఁ జేసి
రావణు హత్య తా రయమునఁ బాయ
నే విధంబా! యని యిచ్చ నూహించి
మఱియు నా సర్వేశు మహనీయమూర్తి
సరగున దేవవేశ్యాభుజంగాంకు
మరణ జన్మలులేని మార్తండనేత్రుఁ
దిరముగా నిచటఁ బ్రతిష్ఠగావించి
తగ నయోధ్యకు నేఁగి దశరథాత్మజుఁడు
జగమెల్లఁ బొగడ రాజ్యము సేయుచుండె.
ఆ రాము పేరిట నమరి యా శివుఁడు
శ్రీరామలింగమై వెలఁగె, నీ స్థలము
రామేశ్వరంబన రాశికి నెక్కి
కామితార్థములిచ్చు ఘన సేవకులకు
నని వారలెఱిఁగింప నతిభక్తితోడ
మనమున హర్ష సంభ్రమలీల నరిగి
ధారుణీశ్వరుఁ డంత ధనుకోటి మునిఁగి
శ్రీరామలింగమ్ము సేవించి వేడ్క
నతిసన్నుతులు సేసి యర్థిఁ బూజించి
క్షితిపతి యిష్టార్థసిద్ధిగాఁ గోరి
సేతుమాధవునకుఁ జెయ్యెత్తి మ్రొక్కి
యాతలఁ జని పశ్చిమాంబుధిఁ జేరి
మలయాళ తులువ భూమండలం బరసి
వెలఁగి వేడ్క ననంతశయనమ్ము జూచి
కొమరొప్పఁ గన్యకాకొమరి వీక్షించి
కర మొప్పఁ ద్రోవ గోకర్ణమ్ము సూచి
రమణ గోకర్ణేశ్వరస్వామి నపుడు
ప్రమదమ్ముతో నతిభక్తిఁ బ్రార్థించి
వరుస నప్పటి రాజవర్గమ్ము చేత

గుఱుతుగాఁ గప్పముల్ గొని ప్రతాపమున
ధారుణీధరకులోద్దామప్రశస్త
మేరుశైలప్రాంత మేదిని యందు
బాహుబలాధిక ప్రాభవోదగ్ర
సాహసం బెసఁగ నచ్చట దండు విడిసె
నప్పుడా సూర్యుండు నస్తాద్రి కేఁగ
గప్పె నల్దిశలఁ జీకట్లు నత్తఱిని
గ్రక్కున గ్రహతారకమ్ములు వొడమె
దిక్కులు తెల్లనై తెలివొందె నపుడు
కలకంఠ తలపువ్వు కలువల నవ్వు
విరహుల తలవెచ్చ విటులఱందురచ్చ
భావజన్మునిమామ ప్రజలకుఁ బ్రేమ
దేవతలకుఁ గూడు దినమణిజోడు
నా పూర్వదిగ్భామ యళికభాగమున
దీపించు కర్పూరతిలకమో యనఁగఁ
బదియాఱుకళలతో భాసురంబుగను
పొడవిదిక్కున సోముఁడు దేజరిల్లె
పాండ్యభూపతికీర్తి ప్రబలినయట్లు
నిండి నల్దిశలు వెన్నెలలు శోభిల్లె
నా రాత్రికవటికే కాఁగిరైపోయి
మేరువు డగ్గఱ మేదినీశ్వరుఁడు
నా చంద్రకోటీరు నాపగాధారు
నా చొక్కనాథుని నాత్మలోఁదలఁచి
శివుఁడిచ్చినట్టి యాచండాయుధమునఁ
దివిరి సత్త్వోద్ధతి దేవనగమ్ము
ధీరత్వమునఁ గొట్టె డిర్దిరఁదిరుగ
ధారుణి వణఁక దిగ్దంతు లల్లాడ
దివిజులు భయమంద దిగ్భ్రమం బెసఁగ
నవిరళబ్రహ్మాండ మట్టిట్టు గాఁగ
నప్పుడా కనకాద్రి యతిభీతినొంది
యాపాండ్య భూమీశు నగ్రభాగమున
రూపింప స్థావర రూపమ్ము నచటఁ
బ్రాపింప జంగమ భావమై నిలిచె

నిలిచినఁ జూచి యానిర్మలాత్మకుఁడు
సలలితమ్ముగ మేరుశైలమ్మునకును
దన స్వప్నమునను సౌందర్యనాయకుఁడు
వినిపించినట్టి యావిధమెల్లఁజెప్ప
చెప్పిన నా మేరుశిఖరియుఁ జెలఁగి
యప్పురశాసను ననుశాసనమున
వసుధేశ ! నీకును వలయునెంతేని
పసవనంబిప్పుడు పట్టిగొంపొమ్ము
సరవితో స్థావర జంగమంబులను
బరగంగ రెండు రూపమ్ములైయుండు
నటుగాన జంగమంబైన రూపంబు
నిటఁదాల్చియున్నాఁడ నీ యూరమ్మునను
స్థావరరూపమై తనరు నాయందు
భూవర ! కొనిపొమ్ము భూతేశు నాజ్ఞ
వలసిన బంగారు వరుసతో ననుచుఁ
బలికిన విని యుగ్రపాండ్యభూవిభుఁడు
శ్రీమన్మహాదేవు చిత్తాబ్జమునను
ప్రేమమ్ముతో నిల్పి పృథుబాహుశక్తి
చండాసి మేరువు శైలమ్ము గొట్టి
తుండించి ఖండించి తునియలు సేసి
ఘనతరోష్ట్రములపై గజముల మీఁద
తనపరివారమ్ము దగ మోయ నంత
సూరిదిగాఁ గనక రాసుల నెత్తి తెచ్చి
కరమొప్పవచ్చుచోఁ గనకాద్రి కదలి
చిరుమ నందమున్ ప్రాయఁ బేర్కొనియవుడు
నరయంగ నాచిరుదవ్వుల నుండ
వరనంచు చెండి చేవడి మల్లగొట్టి
జంగమరూపమై సవరించునట్టి
బంగారుకొండను బరగ మన్నించి
యానువర్ణముఁ గొంచు నా ప్రొద్దె కదలి
భాసుర సకలభూపాలకుల్గొలువఁ
దనపట్టణమ్ముగా ధరణిఁ బెంపొంది
వినుతమా మధురకు విచ్చేసె నంత

పొడిచె వేగురుజుక్క పురుహూతుదిశను
మడురాజు పడమటి యుదధిలోఁ గ్రుంకె
తాటె నంతంతకు దారకారాజి
పాఱెఁ జీఁకట్లెల్లఁ బలపలవేఁగె
ప్రాలేయకిరణబింబము పశ్చిమాద్రిఁ
బ్రాకె వెల్వెలబాఱి వాడె నోషధులు
నక్షత్రకుముదముల్ నఖముఖఁ జిదుమ
నాక్షణమ్మునఁ బ్రాచి హస్తపల్లవము
నెత్తినమాడ్కి నొప్పెసఁగ గభస్తు
లత్తఱి సూర్యోదయంబై చెలంగె
నంత నా పురజను లాధనరాసు
లంతయు గనుగొని యాశ్చర్యమంది
మఱి చొక్కనాథుని మహిమలుగాక
ధరణీశ్వరుల కిట్టి ధన్యత గలదె !
యని సన్నుతుల్ సేయు నాథనంబెల్ల
మను జేశుఁడప్పుడా మధురేశుఁడైన
సౌందర్యనాథుని సన్నిధి కేఁగి
యిందుకళాధర ! యిభదైత్యహరణ !
యీశ్వరేశ్వర ! యీశ !యీశాననాథ !
శాశ్వత ! శాంత ! విస్తారితైశ్వర్య
నీలలోహిత !దివ్య నిర్మలాకార !
హాలాహలాహార యాపదుద్ధార !
దేవేశ ! నీకృపాదృష్టి నాయందు
గావించుకతన విఖ్యాతంబుగాఁగ
ధనరాసులిపుడు వర్ధనముగాఁ గలిగె
నని సన్నుతులు సేసి యధికసద్భక్తి
బొందుగా మఱి సగంబును భూమివారి
కందంద వేడ్కల నతిశయిల్లఁగను
ధనకణాహార సౌభాగ్యంబులందు
రక్షించె నొకరయేఁడు రాజశేఖరుఁడు
వక్రంబులన్ని నిర్వక్రంబుగాఁగ
నంతట వర్షము లధికమై కుఱిసె
నెంతయు ముదమంది రెల్లవారలును

దుర్భిక్షదోషమ్ము దూరమైపోవ
నిర్భయవృత్తిఁ బాండీని నావేళ
నా మహీసురవరు లంద ఱేతెంచి
ప్రేమతోఁ బొడగాంచి పృథివి సొంపెక్క-
యజ్ఞహోమజపాదు లర్థినేయఁగను
ప్రాజ్ఞుఁడై యేకాతపత్రమ్ముగాను
భూలోకమంతయు భూతేశుకృపను
బాలించె నమ్మహీపాలుఁ డింపెసఁగ
వెరవుతో నీలీల విన్న పుణ్యములు
దొరకును, దుర్భిక్షదోషముల్ మాను
నిది పంచదశలీల యిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి
యనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.

## పదునాఱవ లీల.

మఱియు నాపాండ్య భూమండలేశ్వరుఁడు
పరమపుణ్యుఁడు ధాత్రిఁ బాలింపుచుండ
నరయంగఁ దొల్లి బ్రాహ్మణకులోత్తములు
వెరవుతోడుతఁ జతుర్వేదమ్ము లెపుడు
నొప్పుగా నాలుగు యుగముల వరుస,
తప్పకయుండి యధ్యయనంబు సేయఁ
బ్రళయమై బ్రహ్మకల్పమ్మునఁ బూర్వ
కలియుగాంతమ్మునఁ గల విప్రవరులు
పచరించి కాలస్వభావంబు వలనఁ
బ్రచురమై వేదముల్ పఠియించువారు
కొందఱర్థమెఱింగికొన కున్నవారు
కొందఱు పఠియించుకొనకున్నవారు
మఱికొందఱు నసూయమతిని విప్రులకు
నెరవుగా నుపదేశ మీయనివారు
నై యిట్టివిధముల నవనీసురేంద్రు
లీయుండ వర్తనంబెడలి తారపుడు
వేదాధ్యయనములు విడువ నందఱును

నాఁటఁ గణ్వాదులగు మునులెల్ల
నా మహీసురులతో నరిగి వేదములు
హోమవర్తనములు నొగి మొదలైన
క్రియలును దీఱని కినుకమై నపుడు
పయనమై కైలాస పర్వతంబునకు
నరిగి యాకృతయుగం బాదినివారు
పరమేశ్వరుని గోరి ప్రస్తుతింపుచును
హో దేవ! సర్వేశ! యో వేదపురుష!
వేదాగమాతీత వేదస్వరూప
కలియుగాంతరమునఁ గడఁగి వేదములు
తెలియంగలేవయ్య! విప్రులయందు
విఫలమైనట్టి యా వేదముల్ నాల్గు
సఫలమ్ముగాఁ జేసి సద్ధర్మనిరతి
వేదపాలనము గావించి మాయందు
నీ దయగలుగ మన్నింపవే! దేవ
యని సన్నుతులు సేయ నామునీంద్రులకు
మనమున సంతోష మహిమ పెంపొందఁ
బశుపతి మిగుల సద్భక్తితో నపుడు
నశరీరియై వారి కానతి యిచ్చె
మధురాపురమ్మున మహి మించి వెలయ
నధికమ్ముగా మేము నర్థయుక్తముగ
వేదమ్ములను నాల్గు విస్తరించెదము
మోదమ్ముతోఁ బొందు మునులార! యనిన
సలలిత హృదయులై సంయమీశ్వరులు
పొలుపొంద హాలాస్యపురము కేతెంచి
శ్రీ చొక్కనాథునిఁ జేరి వందనము
లాచరింపుచు వారలాత్మ నుప్పొంగి
శూలాది హస్తాయ శుభ్రవర్ణాయ
కాలస్వరూపాయ కాలాంతకాయ
యోగాయ నాథాయ యోగగమ్యాయ
నాగచర్మధరాయ నగజాధిపాయ
బాలేందుజూటాయ ఫాలనేత్రాయ
కాలకూటధరాయ కాపాలికాయ

పురదైత్యహరణాయ భూతేశ్వరాయ
శ్రీవిరూపాక్షాయ వృషభధ్వజాయ
దేవాయ శ్రీ మహా దేవదేవాయ
నగకార్ముకాయ పన్నగ భూషణాయ
నిగమశాస్త్రార్థ వర్ణిత సురూపాయ
అనుపమనిత్య సత్యస్వరూపాయ
ఘనశోభిత కదంబ వనవాసితాయ
విధి శిరోమాలికావృత కంధరాయ
మధురాపురీశాయ మదనాంతకాయ
వాచామగోచర వర్ణరూపాయ
కామభస్మాంగాయ గంగాధరాయ
నీ పాదసేవా మనీషులమైన
మాపాల దయగల్గి మన్నింపుదేవ !
వేదచతుష్కమ్ము వికలత నొందె
వేదమ్ములానతి వేదాత్మ ! నీవు
ననుచు నంజలులు ఫాలాగ్రంబు నందు
ననువందఁ గీలించి యమ్మహామునులు
నభినుతుల్ సేయంగ హర్షమ్మునంది
యనఘాత్ములార ! మా యాత్మ మెచ్చితిమి
మునుకొని మీస్తోత్రములకును ననుచు
శ్రీ చొక్కనాథుఁ డంచితకృప వారి
కాచార్యరూపమై యాశ్చర్య మెసఁగఁ
దలఁప ఋగ్యాజుషాథర్వణవేద
ములు కూఁటికిని క్రమంబులు నేర్పఱించి
వరుస శిక్షాకల్ప వ్యాకరణమ్ము
లురునిరుక్తచ్ఛంద మొగి జ్యోతిషమ్ము
నంగమ్ములారును నవగతమ్ముగను
సాంగమ్ముగాఁ జెప్పి సాధనమ్ముగను
ఘనసలక్షణములు పన్నముల్ జటలు
మునుకొని షట్సూత్రములును వర్ణములు
ఘనశాఖ లారణ్య కాఠకమ్ములును
మఱియును నమకచమకములు రుపములు
పరగఁ బురుషసూక్తపవమానములును

దయ నుదాత్తానుదాత్తస్వరితప్ర
చయములు నాల్గును స్వరముల యందు
విరచించి తగ సామవేదమ్మునకును
నరుదుగా మంద్ర మధ్యమ తారకములు
సామగానమ్ముల సప్తస్వరముల
నా మహాపురుషుల కర్థయుక్తముగ
నొనరంగ నుపదేశ మొసఁగ వారెల్లఁ
తనుఁజూడఁ జూడ నంతర్థానమయ్యె
సరవితో సురలు నా సౌందర్య మీఁదఁ
బోరిబోరి గురిసిరి పుష్పవర్షములు
నంత నామునులెల్ల నా చొక్కనాథు
నెంతయుఁ గీర్తించి యీ దేవుఁ బోలు
దైవమ్ము లేఁడని తాత్పర్య మొసఁగ
నా వేదవితతి బ్రాహ్మణులకు నెల్లఁ
బరిపాలనము జేసి ప్రఖ్యాతిగాఁగ
ధర వెలయించిరి తాపసోత్తములు
నంతట నుపనయనములు సంధ్యలును
సంతర్పణమ్ములు జపతపమ్ములును
నగ్నిహోత్రమ్ములా హోలాన్యక్రియను
ప్రజ్ఞతో ధాత్రిని ప్రబలి వర్ధిల్లె
విదితంబుగాను సద్విప్రులయందు
నది యాదిగా శ్రుతు లభివృద్ధి నొందె
చిరయశోధనులార ! శ్రీ చొక్కనాథు
చరితల నిది షోడశంబగులీల
విశ్వమందీలీల విన్న సత్పుణ్యు
లైశ్వర్య ప్రాప్తులై యామ్నాయవిద్య
లందు నాధిక్యులై యోగమోక్తి గను
బొంది వేడ్కలను సద్బుధులెల్లఁ బొగడ
శ్రీ చొక్కనాథుని సేవల మరఁగి
యాచంద్ర తారార్కమై యుందు రెపుడు
నని సన్మునులెల్ల నధికసంతోష
మును బొంది కలశజన్మునిఁ జూచి మఱియు
సౌందర్యనాథుని సత్పుణ్యకథలు

నందమ్ముగా మాకు నానతిమ్మనిన,
ఇది సర్వ ఘనసత్కవీంద్ర పాదాబ్జ
విదితపూజామోద విమలుండు పచ్చ
కప్పుర సౌరభ్య కలిత మానాంక
తిప్పరాజనుపుత్ర తిరువేంగళేంద్ర
విరచితం బగు లోకవిఖ్యాతమైన
సరసలక్షణ కావ్య సత్కవీంద్రాభి
నందిత శ్రీ చొక్కనాథ చారిత్ర
మందున నిది తృతీయాశ్వాసమయ్యె

---

# చతుర్థాశ్వాసము

## పదునేడవ లీల

శ్రీకర గుణహార ! సింధు గంభీర !
రాకేందుసమతేజ ! రమణీయభోజ !
బసవభూవరపుత్ర ! భాగ్యచరిత్ర
పొసగంగ జినరామ భూపాగ్రగణ్య !
వినుగోళ్ల పెదరామ ! విభవసుత్రామ !
యనుపమజయధామ యధికసత్ప్రేమ
శ్రీ చొక్కనాథు చారిత్రంబులెల్ల
వాచకస్ఫూర్తిగా వర్ణింతు వినుము.
మఱియును నుగ్ర భూమండలేశ్వరుఁడు
పరమసంతోష సంభ్రమ కేళి మీఱియు
జనులెల్లఁ బొగడ రాజ్యము సేయుచుండి
తనభోగసతికిని దనయులుగలిగి
కులకాంతకును నర్భకులు లేనియట్టి
తలఁపునఁ జింతించి తగ విచారించి
పట్టానకర్తుఁడై బాగైనయట్టి
పట్టి యొక్కఁడు గల్గ భక్తితో నపుడు
తనదు పట్టఁపుదేవిఁ దగఁ దోడు కొనుచు
చని చొక్కనాథుని సన్నిధి నిల్చి
హా దేవ సర్వేశ ! హా కృత్తివాస !
హా దేవతాధ్యక్ష ! హా లోకరక్ష
హా చరాచరరూప హా విశ్వరూప
హా పావనగనాథ హా చొక్కనాథ !
పట్టాభిషేక సంప్రాప్తుఁడై వెలయు
నట్టి తేజోమూర్తి నధికసుందరుని
మత్పుణ్య సాధ్వికి మహితసౌభాగ్య
సత్పుత్రు నొకనిఁ బ్రసాదింపవలయు
నని సన్నుతులు సేయ హరుఁడు మన్నించి
మనుజేంద్రునకు సత్కుమారుండు గలుగఁ
గరుణతోఁ గృపజేసెఁ గలకంఠుఁడపుడు
ధరణీశ్వరుఁడు తన తరుణితోఁగూడ
నగరికిఁజని జగన్నాథుని కృపను

జగతిఁ బాలింపుచు జయముతో నుండఁ
గొంత కాలమునకుఁ గోమలాంగియును
నెంతయు వేడ్క దౌహృదలక్షణమ్ము
ధరియించె సోమసౌందర్యుని కృపను
సరవిఁ దొమ్మిది నెలల్ చనినపిమ్మటను
ధరణిపాలన ధురంధరుఁడైన యట్టి
వరకుమారుని గాంచె వనిత యంతటను
నాయుగ్రపాండ్య భూపాగ్రణియపుడు
నాయర్భకునకును నతిసంభ్రమమునఁ
బ్రీతితో నెల్లరఁ బిలువంగఁబనిచి
జాతసూతకములు సరవితోఁ దీర్చి
నెమ్మితో దేవపాండియ నామకరణ
మమ్మహీపాలున కపుడు మన్నించె
నారాజసుతుఁడు దశాబ్దంబులకు
జారువిద్యా విచక్షణ లక్షణముల
నీతివర్తనముల నిపుణత గాంచి
భూతేశ్వరుని కృపాపూర్ణుఁడై వెలసె
నత్తఱి నారాజు నతి మృగవ్యసన
చిత్తుఁడై వనముఁ జెలఁగి వర్తించి
యనఘుండు మృగముల నవలీలఁ ద్రుంచి
ఘనమైన యొక్క వ్యాఘ్రమ్ముచేఁ గాల
ధర్మమ్ము నందె యా ధర్మవర్తనుఁడు
నిర్మలాచారుండు నృపకులోత్తముఁడు
నా యుగ్రపాండీంద్రుఁ డాస్వామియందు
సాయుజ్యమును బొందెఁ జాలంగ నంత
దగినప్రధానులా తనయుని చేత
జగతీశ్వరునకు మోక్షప్రాప్తివిధులు
గావించి మధుర కాగమనమ్ము నేసి
దేవపాండియ నామ తేజుఁడైనట్టి
యాకుమారునకు సామ్రాజ్య పట్టాభి
షేకమ్ము నేయను చింతింపుచుండ
మనమునఁ గపట కల్మషములు పూని
తనర నిశ్చావతి తనయులు చోర

వృత్తిని రత్న కిరీట భూషణము
లెత్తుక కొంపోయి యెవ్వరు దమ్ము
నెఱుఁగరాకుండిన నిట మంత్రివరులు
పరగ పాండ్య కుమారుఁ బట్టమ్ముగట్టఁ
దలఁచి యా శుభముహూర్తమున భండార
నిలయమ్మునందు వర్ణితరత్న దివ్య
మకుట భూషణములు మహితవస్తువులు
వెటుకునఁ గానక తగ నగరెల్ల
దైన్యమునొక్కటై తగ విచారింప
నా సమయమున దివ్యంబైన రత్న
రాసులచ్చటఁ గొంచు రమణతో నపుడు
చూచినవారికిఁ జోద్యమైయుండ
శ్రీ చొక్కనాథుండు సెట్టియై వచ్చి
రాజవీథులయందు రాజితరత్న
రాజి యిచ్చట గొను రాజులు గలరె !
చెప్పుడిన్నిటికిని సెట్టి నేననుచు
నప్పుడు గూర్చుండి యందఱఁ జూచి
నవరత్నముల లక్షణములు జన్మములు
వివరించి చెప్పె నా విశ్వనాయకుఁడు
బలుఁడను దైత్యునిఁ బశువుగాఁ జేసి
యందుమాంసము దీసి యాగకుండంబు
నందు దేవతలెల్ల నాహుతుల్ వ్రేల్చి
తగ హవిర్భాగ మందఱు భుజియించి
మిగిలిన చర్మాస్థి మెదడు నామిషము
లానీస్థలమ్మున నవి పాలవైవ
నవి మూలములుగాఁగ నట్టి యంగములు
గొంత పర్వతములఁ గొంత వాహినులఁ
గొంత వారిధిలోనఁ గొంత మేదినిని
బడినవి బీజ సంప్రాప్తివహించి
వడిఁ దదంగములెల్ల వరుసతో నపుడు
నెముకలు వజ్రాలు నెసఁగు మాంసములు
విమలప్రవాళముల్ వెసఁ గనుగ్రుడ్లు
ధర నీలములును రక్తము మాణిక్యములు

కురులు వైదూర్యముల్ క్రౌర్వ గోమేధి
కములు (?) దంతములు ముక్తాఫలమ్ములును
రమణ శ్లేష్మము పుష్యరాగమ్ము పిచ్చు
పచ్చలునై జగత్ప్రఖ్యాతిగాఁగ
నచ్చుగా దివ్యరత్నాకృతిఁ దాల్చె,
నలరు మాణిక్యమ్ములం దేడువగలు
గల వందులో నాల్గు కాంతి సొంపెక్క-
నదులందుబుట్టెను నాలుగువగలు
నిది యిది యని దాని నెఱుఁగఁగవలయు
వరుస బ్రహ్మక్షత్ర వైశ్యశూద్రులను
బరఁగ రత్నంపుజాతి భావింపవలయు
నా మానికములకు నరయంగ నాల్గు
నామముల్ గలవు ఫణౌఫణి పద్మ
రాగమ్ము కురువిందరాగకోమలము
బాగైనగుణములు పండ్రెండు మఱియు
నవగుణమ్ములు పదియాఱునుగలవు
వివిధదోషాదోష వితతులు దెలిసి
వర్ణభేదములు నిరువైయొనిమిదియును
నిర్ణయింపఁగ నేర్చి నిగ్గులు దెలిసి
యేడులక్షణములు నెఱిఁగిన నదియుఁ
జోడిగా మాణిక్యముల లక్షణములు
మఱి ముత్యములకు జన్మస్థానములుగ
నురగమ్ము మత్స్యమ్ము నుత్తమస్త్రీల
గళమును గరిదంత ఘనవరాహములు
వెలఁగు మామిడిపండు వెఱకును వెదురు
శనిభుజాస్థలమును శంఖమేఘములు
నైనయు ముత్యంపుచిప్ప యొసఁగు నింపులకు
గుణదోషములు పది గుణము నొక్కటియొ
గణుతింప ముత్యాల గల లక్షణములు
సారంబు వజ్రాల జన్మముల్ శైల
వైరాహమును హిమవత్తుంగగిరులు
నిల వాలుకలు గోరు (?) సోమకూటమ్ము
లలి వందిమాతంగ లాఱు దిక్కుల ను

ప్రాఁతవజ్రమ్ములు ప్రభవించునందు
ఖ్యాతిగా గుణములు పదియాఱుగలవు
మంచిగుణములు నేఁడు మఱివజ్రములకు
నెంచి యీలక్షణా లెఱుఁగంగ వలయుఁ
దగు నీలములకు సత్కాంతులెనిమిది
వగలగు నవగుణావళులు నెన్మిదియుఁ
బగడమ్మునకు వన్నె పరగ నార్వగలు
నవగుణమ్ములు నాఱు నరయంగవలయు
పచ్చల లక్షణ భావముల్ వినుఁడి
పచ్చనివని చిల్క పక్షికంఠమ్ము
పోరిదివన్నియయు నాపురుషుల వన్నె
లరయ నీవన్నియ లాఱు సద్గుణము
లెఱుఁగి దుర్గుణములు నెనిమిది దెలియ
సరవితో నివియ పచ్చల లక్షణములు
తగుఁ బుష్యరాగరత్నము కొక్కగుణము
పొగడొందు వైడూర్యమున కొక్కగుణము
గోమేధికమునకు గుణము నొక్కటిరా
భూమిలో నివిరత్నముల లక్షణములు
నని వారలిటుఁజెప్పి యాచొక్కవిభుఁడు
జననాథుతనయుపై సంతోషమెసఁగ
నింతయుఁగలుగుట కిదియమేలనుచు
సంతోషమున బొంది చయ్యన నపుడు
నా కిరీటమునకు నర్హరత్నములు
జోకగా నాఁగి యాచొక్కనాయకుఁడు
సరవి నదృశ్యుఁడై జరిగె నాస్వామి
నరయు వారందఱు నాశ్చర్యమంది
పొందిరు దనకు సద్భక్తుండు గాన
ఖండేందుజూటుఁడిక్కడికి వేంచేసి
కోటీరమునకుఁ బేరొక్కనఁజాలునట్టి
మేటిరత్నములిచ్చె మేలయ్యె ననుచు
మకరాంకహరుఁడిచ్చు మణులు సువర్ణ
మకుటమ్ము నేయించి మంత్రులారాజు
నల వైభవములు నభిషేకమార్చి

వెలఁగి సింహాసనాసీనునిఁ జేసి
నవరత్నములచేత నవకమైనట్టి
ప్రవిమలదివ్య ప్రభాకిరీటమ్ము
శిరమున నిడి సుఖస్థిరలీల రాజ్య
పరిపాలనము సేయ ప్రఖ్యాతిగాను
నమచుఁ బట్టముగట్టిరా దేవపాండ్య
జనపాలకుని మంత్రి సామంతవరులు
నాకుమారుండును నాచొక్కనాథుఁ
గోరి సర్వేశ్వరు గుడికేగుదెంచి
యనుపమదివ్య రత్నాభరణములు
ఘనతరమ్ముగఁదెచ్చి కానుకలిచ్చి
హరహర ! సర్వేశ ! యంబరకేశ !
పరతత్త్వసంకాశ ! భవరోగనాశ !
యభవ మృత్యువినాశ యఖిలలోకేశ
సభయలోకత్రాణ ! సత్యధురీణ
మూలమంత్రోద్ధార హాటకసంచార
బాలచంద్రోత్తంస ! పాపవిధ్వంస !
యని సన్నుతులు సేసి యాపాండ్యవిభుఁడు
జనులు శోభిల్ల రాజ్యము సేయుచుండె
నిది సప్తదశలీల యిట్టిమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుడి
యనుచు సన్మునులతో నా యగస్త్యుండు
మునమునఁ దలపోసి మఱియు నిట్లనియె

పదునెనిమదవ లీల

పరగంగ నాదేవ పాండ్యభూవిభుఁడు
చిరకీర్తి రాజ్యమ్ము సేయుచునుండ
సురపతి యొకనాఁడు సురసిద్ధసాధ్య
వరులాది సకల దేవతలెల్లఁ గొలువ
మునుకొని వరుణుండు మ్రొక్కి నిల్చినను
ననఘుఁ డాశక్రుండు నవ్వలిభాగ
మందుఁ గూర్చుండంగ ననువొప్పఁబంచె
యందు నాసభవార లాత్మ శోభిల్ల
వరుణుఁడు వీక్షించి వాసవునంత
గరమొప్పఁ బ్రశ్నగాఁ గావించె నతఁడు

పులకితదేహుఁడై పూర్ణసంతోష
కలితనేత్రానందకలితుఁడై యపుడు
మున్నుదా వేఁటగాఁ బోయి యాదేవుఁ
గన్నులానందమ్ముగాఁ జూచి పూజ
చేసినవిధ మెల్లఁ జేకొని వారి
కాసలుపుట్టంగ నా వాసవుండు
తడయక వేడ్కతోఁ దాఁజెప్పఁ దొడఁగె
నడచి చైత్రను చిత్త నక్షత్రమందు
మహి మించి తగు పాండ్యమండలమ్మున ను
గుహునంతవాఁడు పేర్కొన రాని యట్టి
హాలాస్యనాథుని నట్టాలనాథుఁ
గాలకంధరుని నంగయకణ్ణియమ్మ
మానసోల్లాసుని మధురాపురీశు
భూనకోంతర్య్య, నాభూశేశు నీశు,
నతులితంబగు కదంబారణ్యనిలయుఁ
బ్రతిలేని సౌందర్యపతి చొక్కవిభునిఁ
గనకాంబుజంబుల ఘనదివ్యసరసిఁ
గనుగొంటి నావేయి గన్నులు జెలఁగఁ
గనియు నాకొలనిలోఁ గడువేడ్కమునిఁగి
తనర నాస్వామిని దర్శించి వత్తు
నాదేవుసౌందర్య మాదేవుమహిమ
మేదైవమునఁ గాన మిదియు సిద్ధంబు
నామధురాధ్యక్షుఁడౌ దేవపాండ్య
భూమీశుఁ డత్యంత భూరిసద్భక్తుఁ
డాతని శివభక్తి యాశ్చర్యమెన్న
నాతనందే కాని యన్యులం దెఱుఁగ
మని తన్మయావస్థుఁడై యాత్మఁ దెలిసి
మనమున హర్షించి మఱియు నిట్లనిచు,
వదలనిభక్తి గీర్వాణవల్లభుఁడు
ముదితుఁడై సంస్తోత్రములు సేయుచుండె
నా దేవపతి మాట కాశ్చర్యమంది
యాదేవతలు మను లంతగతఁదాము
మొదలకుండిరి యనిమిషదృష్టులగుచు

విదితులై వారెల్ల వెరగందియుండ
నయ్యెడ దేవేంద్రుఁ డమరుల మునుల
నెయ్యమ్ముతోడ మందిరముల కనిపి
యలర నావరుణుని నంపిన నతఁడు
పొల్పైన రసవతీపురముకేతెంచి
యాచొక్కనాథు లీలావినోదమ్ముఁ
జూచెద గాకంచుఁ జోద్యమ్ముగాఁగ
గుఱుతుగా మధుర లోఁగొను డంచు నపుడు
వరుణుండు పంపె నా వార్ధులేఁడింటి
నంపిన నావార్ధు లాపట్టణమ్ము
ముంపుదు మని కోపమున మీఱి రాఁగ
నాపురిదేవత లాపురిప్రజలు
నాపరమేశ్వరు నాచొక్కనాథు
ముందరికేతెంచి మోడ్పుగేలమర
జయజయధ్వనులతో సర్వేశునకును
భయమంది వారలు పఱతెంచి మ్రొక్కి
యోదేవ! సర్వేశ యోజగదీశ!
యోదయాపరమూర్తి! యోవిశ్వమూర్తి!
గజదైత్యవైరి యోకాలకాలాంత!
అజశిరశ్ఛేదన! అద్రిజారమణ!
కుంజరాననజనక గోవైరివైరి
భంజనాంధకదక్ష! బలిత ? సంహార!
హలధర! హరిణాంక! యఖిల! నిశ్శంక!
ప్రళయకాలములేక ప్రళయకాలమ్ము
గలిగి యీవార్ధులు గదలివచ్చు
చున్నవి యని వార లుచ్చైస్స్వనముల
విన్నవించినఁ జూచి విశ్వేశ్వరుండు
పరమదయాదృష్టి భావించి యపుడు
వెరవకుఁడని వారి వెరపెల్లఁ దీర్చి
యల పుష్కరము పుష్కలావర్తకమ్ము
వెలగంగ నమృతంబు జీవవర్ధనము
లను మేఘముల నాల్గు నటకు రప్పించి
యనఘుండు వారి కిట్లని యానతిచ్చె

నావార్థితోయంబు లాపోశనంబు
గావింపుడని వారిఁ గడఁక నంపినను
నవధారు దేవ ! మీయాజ్ఞ నెంపునను
గలిసి యావార్థు లొక్కటఁ గ్రుక్కగాను
గ్రోలెదమనుచుఁ బేర్కొను సంభ్రమమునఁ
గాలా నిలాభీల గర్వితోదగ్ర
కీలాలములను నిక్కయుఁ బొరింబొరిని
వేలావతీర్ణమై వేగంబ వచ్చు
జలధులనెల్ల నా క్షణమున మించి
నలువురు నాపోశనంబుగాఁ గొనిన
నప్పుడా పురజను లానందమంది
తప్పక సంస్తుతుల్ దగఁ జేసి రంతఁ
జూత మింకొకసారి చొక్కనాయకుని
భాతిగాఁ దెలుఁగులు పరికింత మనుచు
మఱియును ద్రోణప్రమాణధారలుగ
వరుణుండు మధురమై వానలు గురియ
నా నాల్గు మేఘములందు పైమరువు
గా నుండుడని శాలగా నియమించి
యా ప్రళయమ్ము వాయఁగఁ జేయునపుడు
భూప్రజ లతిమోదమును బొందిరంత
నా పట్నమున నున్న యా దేవపాండ్య
భూపాలు ప్రజలకా భూమండలమున
గలవారికిని నే యుగాంతమ్ములందుఁ
బ్రళయకాలము లే యుపద్రవంబులును
నెన్నివచ్చె నేనీ స్థానమునకు
నెన్నఁడు లేదంచు నిట్లానతిచ్చె
సమముగా నా మేఘసంఘముల్ నాల్గు
కొమరొప్పఁగూటమ్ము గూడిన కతన
నలుడమల్ కూటమై నల్దిక్కులందు
పులుమలు నెప్పంగఁ బరగె నా మధుర
యిప్పుడా వరుణుండు నతిభీతి నంది
యప్పురవిధ్వంసి యా చొక్కనాథు
నగ్రభాగమ్మున కల్లన నరిగి

యుగ్ర ! కపర్ది ! ఓయురగేంద్రహార !
రుద్రాప్రమేయ విరూపాక్ష కాంచ
నాద్రి బాణాసన ! హరిణాంకభరణ
బాణకావ్యత్రాణ ! బాణారిబాణ
బాణరక్షణ ! పంచబాణ సంహార !
విణహాసోజ్జ్వల ! యేణారి చర్మ
రాణితాంబర ! గజరాక్షస హరణ !
త్రిణయన నీ దయాదృష్టి నాయందు
నణుమాత్ర మొగినిల్పు మపవర్గ నాథ
సర్వాపరాధుండ సర్వమూషకుండ
సర్వపాపాత్ముండ జడవర్తనుండ
నని సన్నుతించిన నా చొక్కవిభుఁడు
మనమున హర్షించి మన్నించి యతని
దలఁచిన యప్పుడు దగనిటురమ్ము
వరుణ ! నీ దిక్కుకు వడి నేగు మనుచుఁ
గరుణించి పంపెను గళకంఠుఁడంత
నిది యష్టదశలీల యిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార ! వినుఁడి
యనుచు సన్మునులతో నా యగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.

## పందొమ్మిదవ లీల

ఆ దేవపాండ్య భూపాగ్రణి యంత
సాదరహృదయుఁడై జగతిఁ బాలింప
మఱి చొక్కనాథుఁడా మధురలోకులను
నిరవైన సిద్ధుఁడై యెల్లరుఁ జూడ
కుఱుచ కెంజడలును గుచ్చిలి కంథ
మరుభూతియును రుండమాలికల్ చెవులఁ
బసిఁడి కామాక్షులు బసిఁడి పాత్రలును
బసిఁడి గోణమ్మును బాదనూపురము
మసిబొట్టు బెత్తము మఱి కక్షపాల
పసిఁడి యొడ్డాణమ్ము పైని సరిపెణలు
నాగహస్తము సింగినాదమ్ము యోగ
వాగాలు ఘనరుద్రబంధమ్ము వెలయ

రసవాద ఘుటికలు రసికౌషధములు
రసికుఁడై ధరియించి రాజమార్గమున
నానందలీల నిత్యానందుఁడగుచుఁ
దానందువిచ్చేసి తగవచ్చుచున్న
యా చొక్కనాథుని యందము వేడ్కఁ
జూచి యా పురనివాసులు విరూపాక్ష
నాథుఁడో దయానందనాథుఁడో యాది
నాథుఁడో గోరక్షనాథుఁడో మేఘ
నాథుఁడో భైరవనాథుఁడో మత్స్యే
నాథుఁడో సారంగనాథుఁడో శంభు
నాథుఁడో యీ నవనాథ సిద్ధులకు
నాథుఁడో సౌందర్యనాథుఁడో యనుచు
నా పుణ్యచారిత్రునటఁ జేరఁబోయి
యా పురివారలు నమ్మహాత్మకుని
నెందుండి వచ్చితిరేమి కారణము
నింతుల కేగంగ నేల మీరనిన
వనధులు భూమియు నారి పూరమ్ము
గానకొని మేరువు కుందనమ్ముగను
నెన్ని కల్పములైన నిటువలె నుండ
నెన్నఁగా నీలోక మేలోకమైనఁ
జెలఁగి సువర్ణమ్ముజేతు మేమనుచు,
వెలయ నా పురిలోని వృద్ధుల నెల్ల
బాలులగాఁ జేయు బాలుర నెల్లఁ
జాలంగ వృద్ధుల చందమ్ము సేయ
నణువు మేరువుసేయ నరయ నా మేరు
వణువుగాఁ జేయఁగ నలరు నా తపసి
చెన్నొందు నీలాగు సిద్ధవిద్యలను
నెన్నేని నటియించ నెలమి నా దేవ
నగరమ్ములోన గాంధార సౌందర్య
లగు సిద్ధు లాశ్చర్యులై చూచుచుండ
నంతట నా సిద్ధుఁడా దేవపాండ్య
నంతఃపురంబేగి యున్న గేహములఁ
జరియించ నా పాండ్య జననాథుఁ డెఱిఁగి

జరగ నా సిద్ధునిఁ బట్టి తెమ్మనినఁ
బరిపూని వారలు పట్టంగఁబోవఁ
జే చిక్కినట్లుండు చిక్క కదృశ్యుఁ
డై చని దేవాలయంబు లోపలను
రాతి యేనుఁగువద్ద రమణ నా యోగి
ఖ్యాతిగాఁ గూర్చుండఁ బాండ్య భూవిభుఁడు
నా శివాలయమునకు నరుగుచో నపుడు
నా సిద్ధముఖ్యుని నటఁగాంచి పలికె
నెచ్చోటినుండి నీ వేగుదెంచితివి ?
యిచ్చటునుండుట కేమి కారణము
నని యిట్టులడిగిన నమ్మహా పురుషుఁ
డనఘచారిత్రుఁ డిట్లని యానతిచ్చె
వరుస ననాగత వర్తమానమ్ము
తెలుఁగుమ సిద్ధమ్ము నేము సిద్ధులము
నీకేల పరికింప! నీ వేగుమనుచుఁ
జేకొని మౌని సుస్థిరలీల నుండె
నిదియుఁ బందొమ్మిది యిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార ! వినుఁడి
యనుచు సమ్మునులతో నా యగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.

ఇరువదియవ లీల

ఆ పాండ్య మండలాధ్యక్షుండు మఱియు
నా పరమాత్మతో నట విన్నవించె
దేవ ! సర్వము మీరు దెలిసితిరేని
మీ విద్య మాకు నెమ్మినిఁ జూపవలయు
నెలమితో నా చేతి యిక్షుదండమ్ము
శిల సింధురమ్ము భక్షించెన యేని
నీవు సర్వమ్మును నెఱుఁగు సిద్ధుఁడవు
నీవెదా మాపాలి నిజమైన వేల్పు,
వలమి నాదైన యీ యైశ్వర్యమెల్ల
నెలమితో మీకు నే నిచ్చెద ననిన
నిరవైన యా రాతి యేనుఁగు నపుడు
కళుకరంబుఁడటు నవ్వి కడకంటఁ జూచెఁ

జూచినంతటఁ గడు చోద్యమ్ముగాను
నేచి డగ్గఱుచు బృంహిత మటుఁజేసి
యా రాజుచేఁ జెఱుకా క్షణమ్మునను
నా [illegible]తి యేనుఁగు నటు పట్టి దిగిచి
యఱుత నున్నట్టి కట్టాణి ముత్యాల
సరములు ద్రెంచిన జనపతి వెఱచె
నా రాజు పరివార మత్యుగ్రముగను
ఘోరణాకారమై తఱిమి పైఁబడిన
సామజ మపుడు పాషాణమైయుండె
నా మహాసిద్ధుఁ డదృశ్యమై చనియె
నంత నా దేవ పాండ్యావనీశ్వరుఁడు
నెంతయు భీతుఁడై యిచ్చలో గలఁగి
యా యిందుశేఖరు నాలయమ్మునకుఁ
బోయి సద్భక్తి నద్భుతలీల మ్రొక్కి
పరమేశు నర్చించి భక్తిఁ బూజించి
పరిపూరితానంద బాష్పముల్ దొరుగ
గా వేడ్క రోమాంచకంచుకితాఖి
లావయవుండయి యధిక నిరుద్ధ
గద్గద కంఠ సంకలిత స్వరమ్ము
నుద్గమింపఁగ నంజ లొనరంగ నిటల
భాగమ్మునందు సంభ్రమ మొప్పఁ జేర్చి
ప్రాగల్భ్యబుద్ధి నిట్లని సన్నుతించె
శ్రీ మన్మహాదేవ ! సిద్ధానుభావ !
కామితరూప శంకర విశ్వరూప
యభినవ భుజగేంద్ర యజ్ఞోపవీత
శుభకర శుభమూర్తి ! శోభనమూర్తి
విశ్రుత గుణసార ! వేదాంతసార !
యాశ్రిత సంరక్ష యంబికాధ్యక్ష
యజ్ఞానకృతము నాయందు సిద్ధించెఁ
బ్రజ్ఞా విహీనత పరికించితేను
దేవ ! మీ మహిమలు దెలియ నేనెంత !
భావించి నన్ను కృపాకటాక్షమున
రక్షింపుమని యపారంబైన ధనము

లక్షలా భరణాంబరాదు లర్పించి
వినతుఁడై యా దేవు వీడ్కొని యంతఁ
దన నగరికి నేగెఁ దద్దయు వేడ్క
నిదియు వింశతి లీల యిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార ! వినుఁడి
యనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.

ఇరువదియొకటవ లీల

ఆ సమయమ్మున నా పాండ్య విభుఁడు
భాసుర సౌందర్యపతి చొక్కనాథు
పాద పద్మమ్ముల భక్తి తాత్పర్య
సాదర హృదయుఁడై సలుపుచు మఱియుఁ
దనవద్ది నృపులు సద్భక్తులై శివుని
ననవరతము పూజ లాచరింపుచును
నెదురు లేకెంతయు హెచ్చిన శత్రు
మదము లణంచుచు మధురఁ బాలింప
ఘనుఁడైన చోళ భూకాంతుఁ డత్తఱిని
బగతుఁడై మధుపై పరివారములతొ
తనతోడఁ గిసిసి యుద్ధము సేయుచుండ
బలియుఁడై యా దేవపాండీశు నతని
బలములతోడను బారం[illegible]దోలె
నంత నా చోళుండు నాహవంబునను
నెంతయునోడి వెన్నిచ్చి యాతనికి
నెదురక చిక్కిన నెల్లసీమలకు
బోదురక తనపురంబున కేగుదెంచి
మఱి మంత్ర తంత్రాది మహిమలఁగాని
యరుల జయింపరాదనుచు జైనులకుఁ
దనదు పత్రికలంపఁ దద్దయు వారు
వినుతింప నెనిమిది వేల బౌద్ధులును
గూడుక తమ మంత్రకోటులచేతఁ
బోడిగా నొక గజంబును దోలుకొనుచు
నా రాజు కడకేగి యాతండు వసుప
శారల కిచ్చి వలసినంతైన

మధురపై మీ మంత్ర మహిమలతోను
జని పాండ్య భూపాలు సాధింపుఁడనుచుఁ
బనిచిన నా జైన భట్టారకులును
దారుణమ్మగు భద్ర దంతావళమ్ము
నా పాండ్యపతిమీఁది కరిగి వేగమున
నాపురి ప్రజల సంహారంబు సేయ
నంచు నా జైనులు నందఱుఁ బనుప,
మించి యా యేనుఁగు మిన్నంటి మట్టి
దశదిశల్ దంత సౌదామినుల్ మెఱయ
నశని చందమ్మున నతి బృంహితముల
శైలముల్ వణఁకంగ జలధులు కలఁగ
నీల మేఘము మాడ్కి నిగిడి యాకాశ
నది కాండ మెల్ల తుండాంతమ్మునందుఁ
గాదలేక పీల్చి దిక్కులఁ జల్లుదాని,
పరగ గండస్థల పంక్తుల మదము
దొరకొని నదులుగాఁ దొరఁగించుదాని
మితిలేక నడుచుచో మేదినిమారి
యతలమ్ము ముట్టంగ నడుగిడు దాని,
యమ లులాయము వోని యా వాలమునను
గ్రమమున ఢీకరాకారమై పేర్చి
నిర్భర వృత్తిమై నిఖిలమ్ము నిండి
యార్భటింపుచు వచ్చు నా గజేంద్రమ్ము
పరగంగ నీశాన్య భాగమ్మునందు
మరవడిగా నొక్క యోజనమాత్ర
మెడగల్గఁ గాంచి యా మెడఁ బాండ్యవిభుఁడు
కడు భయంబంది తక్కగ చొక్కనాథు
నగరి కేతెంచి యోనగచాప హస్త !
నగజేశ ! భర్గ ! పన్నగభూషితాంగ !
నగధర స్త్రీప్రియా ! నాగాసురారి !
నగరిపు సంస్తుత్య నగనాథ నిలయ !
నాగాజినాంబర ! నలినాసనాది
నాగేంద్ర యక్ష గంధర్వ గీర్వాణ
దేవ దివ్య కిరీట దేదీప్యమాన

దేవ రత్నోజ్జ్వల దీప్త పాదాబ్జ!
హరహర శ్రీ కదంబారణ్యనిలయ!
పరమాత్మ! హాలాస్య! పాలక నీదు!
శ్రీ పాద సేవాధురీణుని నన్నుc
జేపట్టి రక్షించు శ్రీ చొక్కనాథ!
పరమేశ యిదె మహాప్రళయమ్ముగాను
నురవడి యేతెంచె నొక మత్తగజము
కావవే! సర్వేశ కావవే! మమ్ము
కావవే మీ బంటు కరుణాకటాక్ష!
యని విన్నవించిన నా దేవదేవుc
డనఘుc డాపాండ్య భూపాగ్రణి తోడc
దిరముగాc దూర్పునc దిరువీధులందుc
గర మొప్ప నొక గుడి గావించు మచట
విల్లు నమ్ములు గొంచు వేవేగc బూని
దుల్లంగ నేతు నిష్ఠుర వృత్తి దాని
ననుచు నంతర్వాణియై యానతిచ్చి
నను స్వామియానతి నట్ల కాకనుచు
నా రాజు నప్పుడు నతి వేడ్కతోడ
ఘోరున నేcగి తూర్పున నుండc జూచి
యచ్చోట గుడికట్టి యా దేవునకును
గ్రచ్ఛల వినుతింపc గడకతో వచ్చి
యప్పుడా ప్రళయకాలాగ్ని ధూమంబు
నొప్పగా వచ్చు నా యుగ్రేభమునను
విల్లందికొని చూచి విస్మయంబంద
భల్లమ్మునొకటి చేపట్టి యత్తరిని
పాండీశు చూడ నా ప్రజలెల్లc జూడc
గొండంత లదర దిక్కుధరంబు లద్రువ
రుధిరమ్ము లేఱులై రూఢిగాc బాఱ
నధికఘీంకృతిని బ్రహ్మాండమ్ము వగుల
నాగజం బవని పై నవలీల నపుడు
వేగంబc బడనేసె విశ్వేశ్వరుండు
పరగంగ నా కళేబరము "యాలంది"
మఱి "యానైమలెలంది" మఱలనc బరగె

నప్పు డాదేవపాండ్యావనీశ్వరుఁడు
నపార జనులతో నభినుతుల్ సేసి
హరిహయపూజిత ! యజగర్వహరణ !
కరిరక్షణాశ్రిత ! కరికృత్తికుండ
శర్వాణివల్లభ ! చనుదెంచి నీవు
గర్వియౌ నా కరి గర్వమ్ము బాపి
నట్టి మహాదేవ ! యాగవిధ్వంస !
నెట్టన గజమెంత నిఖిలేశ నీకు
నో దేవ ! యిచ్చోటనుండి మీ రపుడు
మీదైన యీ రూపమిట్లు కావించి
నీ కృపా దృష్టిచే నిఖిలంబు లెల్ల
చేకొని రక్షించు శ్రీ చొక్కనాథ !
యనుచు నా పాండీడు నతి వేడ్కతోడ
వినుతింప వరదుఁడై విశ్వేశ్వరుండు
చెలఁగి యాతని భక్తి చేకొని యొక్క
విలుకాఁడు గానందు విచ్చేసి స్వామి
సొంపొంద నట్టాల చొక్కుడై పేరు
పెంపొంద నెపుడును బేర్కొనఁబడె
నిది యేకవింశతి యిటుమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార ! వినుఁడి
యనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనిరాం.

ఇరువదిరెండవ లీల

ఆ పాండ్య రాజ్యమ్మునందు సావర్ణి
కా పురంబున నగ్రహారమ్ము గలదు
నందొక్క విప్రుండు హరశర్మయనఁగ
సౌందర్యనాథుని సద్భక్తిపరుఁడు
నతఁడు బిడ్డలు లేక నా స్వామికృపను
గుతుకమ్ముతో నొక్క కొఁడుకును గనిరా
నా యిందుముఖిఁజూచి యతఁడు శ్రీ చొక్క
నాయకుఁ బోలెడి నవ బ్రహ్మచారిఁ
గావత్తు నేనని కృతమతి నుండ
వనజాక్షికిని గొన్ని వర్షములుండ

నంతట నొక బ్రాహ్మణ బ్రహ్మచారి
సంతతాగమ వర శాస్త్రపారగుఁడు
శావజనిభమూర్తి పరగ వైష్ణవుఁడు
నా విప్రు నింటికి నతిథియై వచ్చె

వచ్చిన యంతట వాని విద్యయును
నొచ్చెమ్ము లేని వయో రూపములును
గనుగొని తన పుత్రికను వాని కీడు
ననుకూల మౌ నొకో యని బాంధవులను
నడిగి నవారలు నా బ్రహ్మచారి
నడిగిరి కులమును నతని గోత్రమ్ము
నప్పుడు నిలుచుండి యా బ్రహ్మచారి
తప్పక వారికెంతయు వేడ్కతోడఁ
దన కులగోత్ర సూత్రములు నక్షత్ర
మును జెప్పి నక్షత్ర ముద్ర మా కెపుడు
నామధారకుల మన్నను వానిఁ జూచి
యా మహీసురులు గృహస్థు కిట్లనిరి
శైవమ్ము మీఁది వైష్ణవము వీనికిని
భావింపఁ గులగోత్ర బంధుత్వ మెడసి
సరి సమంధములకుఁ జాలదే! యనిన
హరశర్మ యా సమూహమున కిట్లనియె
సోమునందుఁ గళంకు చూపట్టఁ గలిగె
భూమిలో నిందింపఁ బోలు నే యనుచు
నా ముద్దుగూఁతును నా వటువునకుఁ
బ్రేమతో శుభలీలఁ బెండ్లిటుచేసె
నటుఁ గొన్ని దినముల కా పెండ్లికొడుకు
తటుకునఁ బైనమై తన దేశమునకుఁ
బోవుద నన్నను భూషణాంబరము
లా యిరువుర కిచ్చి యంపిన నతఁడు
నత్తన్విఁ దోడ్కొని యతిమోదమునను
తమ యూరికినిఁ బోయి తమ తల్లి తండ్రిఁ
గనుగొని మ్రొక్కి యా కన్యయుఁ దాను
వడయక నా తల్లిదండ్రులు లేచి
కొడుకును నా పెండ్లి కూఁతును నెత్తి

సరగఁ గౌఁగిటఁజేర్చి సంతోషమెసఁగ
బరదేశ మరిగి యాబాల పెండ్లాడి
యరుగుదెంచెను పుత్రుఁడని సంతసిల్లి
వారుదెచ్చిన యట్టి వరభూషణములు
కూరిమి దగఁ బుచ్చికొనియుండి రంత
విదితమై యాబాల వే భూతినపుడు
నుదుటను బెట్టుకుండుట వారుజూచి
పనిమాలి యీ శివ బ్రాహ్మణపడుచు
కొనితెచ్చె ననుచు సంకోచించి రంత
నాయింటి వారెల్ల నలవైష్ణవులకు
బాయక సద్భక్తి పాటింతు రెపుడు
నితరులు నాయింటి కెన్నఁడురారు
హితవుగా నాయింతి యీశ్వరభక్తి
గలుగు భక్తులరాక గడు గోరుచుండు
జలజాక్షి భాగ్యవశంబునఁ గొన్ని
దినములకును వేడ్కఁదీర్థయాత్రలకుఁ
జనుచుండి వారలు సదనమ్మునకును
నాయింతిఁ గావలిదై యుండఁ బెట్టి
పోయిరి వారెల్లఁ బోయినపిదప
నా చంద్రముఖి భక్తి యరయంగవలసి
శ్రీ చొక్కనాథుండు శివభక్తుఁడగుచు
భూతియు రుద్రాక్షములు ధరియించి
యాతతవృద్ధ బ్రాహ్మణ రూపమునను
నా యింట ముష్టిఁ బానడిగిన నబల
మాయత్త సర్వసంపద లింటిలోనఁ
బెట్టి తలుపులుమూసి బీగముద్రలును
బెట్టి పోయెను ముష్టి పెట్టరాదనిన
నా వృద్ధుఁడిట్లనె నతివ యీతలుపు
నా వాకిల ట నీవు నంటినఁ దెఱచు
వెసఁ బాయసము నట్లు వేడివంటకము
పెసరుఁ బప్పును నెయ్యి పెట్టుము మాకనిన
నాశోభనాంగి చయ్యన ముట్టినంత
మూసినతలుపు గొబ్బున బాఱఁదెఱచె

నలివేణి వెరగంది యాయింటిలోన
వలయుపదార్థముల్ వడిగొంచు వచ్చె
మున్నున్న యట్లనె ముద్రికల్ చెడక
పన్నుగా వాకిళ్లు పదిలమై యుండె
నంత నా యింటి యత్యాశ్చర్యమంది
సంతోషమునఁ బొంది చయ్యన నపుడు
దండిగా నాల్గువిధంబులు మెఱయ
వండుచుండెడు వేళ వామాక్షి కెదుర
ముదుకడై యున్నయా ముగ్ధేందుధరుఁడు
పదియును నాఱేండ్ల ప్రాయమై నిలిచె
నంత నా యౌవనప్రాయవిప్రకుని
సంతోషమునఁ జూచు సమయమ్మునందు
మగఁడును నత్తయు మామ వచ్చినను
మగువ నివ్వెరగంది ప్రమ్మపడియుండె
నావేళ యౌవన ప్రాయమువిడిచి
కావుకావు మటంచుఁ గడువేగఁ బిన్న
బాలుఁడై నేలపైఁ బడుచు నవ్వుచును
గాలిప్రేలటు నోటఁ గఱచుచునున్నఁ
జూచి యాయత్త నిష్ఠూరమ్ముతోడ
నీచిన్నిశిశువు నిందేటికి వచ్చె
నని కోడలిని జెక్కలడిచి పోఁద్రోసి
కినిసి యర్భకుని వాకిటనెత్తివైచె
నప్పుడు ప్రత్యక్షమై నిల్చె శివుఁడు
కప్పు గప్పినయట్టి కంఠమ్ముతోడఁ
బసిదిండివన్నె దుప్పటి చేలతోడ
కశ (?) వాల శూల ఖడ్గమ్ముల తోడ
ఫణి నూపురాసవ్యపాదమ్ముతోడఁ
బ్రణుతసన్మౌని హరిబ్రహ్మలతోడ
నంగజ విజయ భస్మాంగమ్ము తోడ
గంగాతరంగ సంగతమౌళితోడ
హరివిరించాస్థి మాలాంకమ్ముతోడ
హరిణశాబక ధరహస్తమ్ముతోడ
సగబాలు మెయిఁగొన్న శర్వాణితోడ

నగజాపుఁ డపుడు పన్నగరాజితోడఁ
ప్రమథగణమ్ములు ప్రబలి సేవింప
నమరకోట్లు జయజయ ధ్వను లిడఁగ
భద్రేభచర్మమ్ము పల్లమ్ము సేసి
రుద్రాక్ష పక్కెర రూఢిగాఁ జుట్టి
ముదమొప్ప బెబ్బులి మొకరంబు నమర
నుదుటను గొదమచందురుని గీలించి
పురదైత్య కలితనూపురము డాకాల
బురణించు గొమ్ముల బొల్లిపాపురము
నెక్కియాడుచు వచ్చి యిందుశేఖరుఁడు
నిలిచినఁ గనుగొని నీరజవదన
మలహాణ ప్రియునిఁ బల్మారు నుతించె
జలజజవైరి ! రాజలజారిధారి !
జలజాక్ష పాదపూజార్హ సత్పాద !
జలచరకేతు సంచయ భస్మధారి !
జలనిధి తూణీర ! జలజాప్త నేత్ర !
జలజజసుతుని నుష్ట్రిము సేయుధీర !
బలిదైత్యదమనుండు పద్మసంభవుఁడు
పాయక శిరసును బాదపద్మములు
వేయాభంగులఁ దడవియుఁ గానలేని
నీరూపు బొడగంటి నిర్మలాకార !
ఆ రాజధరుఁడంత నబలను మెచ్చి
యారాజముఖినిఁ జయ్యన నందివాహ
నారూఢగాఁజేసి యందఱుఁజూడ
వేయిగంటులవాగె వేడ్కతోఁ బట్టి
ధేయని కదలించె దివిజులు గొలువ
మధుర కేతెంచి యామగువ శర్వాణి
విధమునఁ జెన్నొందె విఖ్యాతిగాఁగ
నిది యిరువది రెండు నిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార ! వినుఁడి
యనుచు స్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె

## ఇరువదిమూఁడవ లీల

అంత నా దేవపాండ్యావనీశ్వరుండు
సంతోషమున సోమ సౌందర్య కృపను
విలసిత సామ్రాజ్య విభవసంపదలఁ
బొలుపొంద మాధుర్య పురమేలుచుండె
పరవితో నప్పుడా జనపాలకుండు
పరమేశుఁడాడిన భరతమ్ముదక్కఁ
దలఁపఁ ద్రిషష్టి విద్యల నేర్పు మించి
వెలయంగఁ జౌషష్టి విద్యాప్రవీణుఁ
డనిలేని పేర్వెట్టు కవనిలోఁబొగడ
వినుచుండు నెప్పుడు విఖ్యాతిగాఁగ
నప్పుడు నాచోడుఁడా వార్తలెల్ల
నప్పగి కవితార్థు లందఱుఁజెప్ప
విని వారలెల్లరు వినుచుండ మఱియుఁ
దనకొల్వు వారితోఁ దగనిట్లు పలికెఁ
దలకొత్త నృత్తవిద్యయు లోనుగాను
వెలయంగఁ జౌషష్టి విద్యలుగాక
తనకును లేని యంతటి పేరువెట్టి
కొనియుండుటయును లోకుల కింపుగాదు
ననియెడి వార్తలు నాకొల్వులోని
తన కవితార్థి సంతతు లెల్లవినియుఁ
గడఁకఁ నా పాండీని కడ కేగి వారు
నడరి యాతని విద్యలన్నియుఁ జూచి
భరతవిద్యయు లేమి పాటించి యపుడు
వరుస నారాజుతో వార లిట్లనిరి
చౌషష్టి విద్యావిచక్షణుం డనుచు
భాషింతు రెపుడు భూప్రజలెల్ల నిన్ను
నామాట నీకేల? యాబిరుదేల?
వేమాఱు నీమాట విడువు మి తట్టను
ననిన నా పాండ్య భూపాగ్రణి వారిఁ
గనుగొని నాయందుఁ గడమ యేదనిన
భరతమ్ము లోనుగాఁ బ్రబలినయట్టి
యరువదినాల్గు విద్యలు చెప్పఁబడును

నా విద్యలన్నియు నవగతంబుగను
ప్రావీణ్యుఁ డా చోడ పార్థివుండెఱుఁగు
మీకు నృత్యమురాదు మీకుఁ బ్రౌఢతయుఁ
జేకొన నింకెట్లు చెల్లెడిననిన !
నంత నా పాండీశు నాత్మఁ జింతించి
యొంతయు వారికి నీప్సితార్థములు
వరుస తోడుతఁ గట్టు వస్త్రమ్ములిచ్చి
నెరయవారలను మన్నించి యిట్లనియె
నగజేశుఁ డాడిన నాట్యమ్ము మాకుఁ
దగవు గాదంచు నాత్మను దలపోసి
మానితి గాకది మఱి నాకు నరుదె
యైనఁ జూడు డటంచు నాత్మణమ్మునను
దన మంత్రివరులతోఁ దగ విచారించి
గొనకొని భరతాధి కులను రావించి
భరతమ్ము సాధించెఁ బరమేశ్వరుండు
నరసి తాండవ మాడినట్లు దానాడి
యనఘుఁడా పాండ్యభూపాగ్రణి తనదు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె
నొక పాద మూఁది యొండొక పాద మెత్తి
యొకముహూర్తము నిల్చియుండుట నొచ్చె
ఖండేందు ధరుఁడు నేగతి ననవరత
తాండవం బాడుచుఁ దగ నూర్ధ్వముగను
దండి పాదంబెత్తి తడయ కెప్పుడును
నొండొకపాదమ్ము నూఁదియున్నాఁడు
నా పరమేశు దివ్యంబైనయట్టి
శ్రీ పాదమెంత నొచ్చెనో కదా యనుచు
డమరుకప్రియుని తాండవ మీక్షణమ్మె
శమియింపవలెనని సంరంభమునను
సౌందర్య నాథుని సన్నిధికేగి
యిందుశేఖర మధురేశ ! లోకేశ
డమరుకశూల ఖట్వాంగోరు హస్త !
ద్యుమణీందు వైశ్వానరోజ్జ్వలనేత్ర !
కుందేందుధవళాంగ ! గురుకృపాపాంగ !
మందాకినీధర మహిత ప్రకార !

దండిగా హర్యజుల్ తల్లడమందఁ
దాండవంబాడిన దాక్షాయణీశ !
యుడుగక యొకపాద మూఁది తాండవము
జడియకాడుట మీకుఁ జాలంగ నొచ్చె
నోదేవ యీపాదమూఁది యీయున్న
పాదాన నటియింపు పరమాత్మ ! యన్న
యరసి యాతనిభక్తి నట్ల కాకనుచు
వరుస నా తిరువాలవాయుఁడైనట్టి
త్రిణయనుం డీశాన్య దిగ్భాగమందుఁ
బ్రణుతింప నావేళఁ బాదమ్ము మార్చె
నంత నా బ్రహ్మాదు లాశ్చర్యమంది
సంతోషచిత్తులై సంభ్రమంబునను
దండప్రణామముల్ దనరంగఁ జేసి
నిండిన సద్భక్తి నేర్పుతోఁ బొగడ
ఘనమైన బిరుదు టెక్కెము నంతఁ జేసి
వినువీథితో రాయ వెలయించె నంత.
భాసురమ్ముగ దేవపాండీడు కృత్తి
వాసున కతిభక్తి వచ్చి దండప్ర
ణామంబుజేసి సౌందర్య నాయకుని
శ్రీమన్మహాదేవ ! శ్రీలోకనాథ !
విన్న పంబవధారు వెలయంగ మీరు
మన్నించి నన్ను నీమధుర లోపలను
పాటించి యాడిన భద్రతాండవము
గాటమై లోవిఖ్యాతమ్ముగాఁగ
తగ సదా ఆనంద తాండవమ్ముగను
బొగడొంద నిచటనెప్పుడు నుండుఁడనిన
ఖ్యాతిగా నాదేవుఁడట్లు కావించె
నా తాండవంబాడినట్టి మంటపము
భూతలాధీశుఁ డప్పుడు నొప్పిదముగ
హాటక దివ్యరత్నాంచిత దివ్య
కూటమ్ముగావించె గోత్రచాపునకు
మటి రత్నకీలితమకుట మర్పించి
పరగంగ నానంద పరిపూర్ణుఁ డగుచు

నా విద్యలన్నియు నవగతంబుగను
బ్రావీణ్యుఁ డా చోడ పార్థివుండెఱుఁగు
మీకు నృత్యమురాదు మీకుఁ బ్రౌఢతయుఁ
జేకొన నింకెట్లు చెల్లెడిననిన !
నంతనా పాండీశు నాత్మఁ జింతించి
కొంతయు వారికి నీప్సితార్థములు
వరుస తోడుతఁ గట్టు వస్త్రమ్ములిచ్చి
నెరయవారలను మన్నించి యిట్లనియె
నగజేశుఁ డాడిన నాట్యమ్ము మాకుఁ
దగవు గాదంచు నాత్మను దలపోసి
మానితి గాకది మఱి నాకు నరుదె
కానఁ జూడు డటంచు నాక్షణమ్మునను
దన మంత్రివరులతోఁ దగ విచారించి
గొనకొని భరతాధికులనురావించి
భరతమ్ము సాధించెఁ బరమేశ్వరుండు
నరసి తాండవ మాడినట్లు దానాఁడి
యనఘుఁడా పాండ్యభూపాగ్రణి తనదు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె
నొక పాద మూఁది యొండొకపాద మెత్తి
యొకముహూర్తము నిల్చియుండుట నొచ్చె
ఖండేందుధరుఁడు నేగతి ననవరత
తాండవం బాడుచుఁ దగ నూర్ధ్వముగను
దండి పాదంబెత్తి తడయ కెప్పుడును
నొండొకపాదమ్ము నూఁదియున్నాఁడు
నా పరమేశు దివ్యంబైనయట్టి
శ్రీ పాదమెంత నొచ్చెనో కదాయనుచు
డమరుకప్రియుని తాండవ మీక్షిమ్మై
శమియింపవలెనని సంరంభమునను
సౌందర్య నాథుని సన్నిధికేగి
యిందుశేఖర మధురేశ ! లోకేశ
డమరుకశూల ఖట్వాంగోరు హస్త !
ద్యుమణీందు వైశ్వానరోజ్జ్వల నేత్ర !
కుందేందుధవళాంగ ! గురుకృపాపాంగ !
మందాకినీధర మహిత ప్రకార !

దండిగా మార్యజుల్ తల్లడమందఁ
దాండవంబాడిన దాక్షాయణీశ !
యడుగక యొకపాద మూఁది తాండవము
జడియకాడుట మీకుఁ జాలంగ నొచ్చె
నోదేవ యీపాదమూఁది యీయన్న
పాదాన నటియింపు పరమాత్మ ! యన్న
యరసి యాతనిభక్తి నట్ల కాకనుచు
వరుస నా తిరువాలవాయుఁడైనట్టి
త్రిణయనుం డీశాన్య దిగ్భాగమందుఁ
బ్రణుతింప నావేళఁ బాదమ్ము మార్చె
నంత నా బ్రహ్మాదు లాశ్చర్యమంది
సంతోషచిత్తులై సంభ్రమంబునను
దండప్రణామముల్ దనరంగఁ జేసి
నిండిన సద్భక్తి నేర్పుతోఁ బొగడ
ఘనమైన బిరుదు టెక్కెము నంతఁ జేసి
వినువీధితో రాయ వెలయించె నంత.
భాసురమ్ముగ దేవపాండ్యుడు కృత్తి
వాసున కతిభక్తి వచ్చి దండప్ర
ణామంబుజేసి సౌందర్య నాయకుని
శ్రీమన్మహాదేవ ! శ్రీచొక్కనాథ !
విన్న పంబవధారు వెలయంగ మీరు
మన్నించి నన్ను నీమధుర లోపలను
బాటించి యాడిన భద్రతాండవము
గాటమై లోవిఖ్యాతమ్ముగాఁగ
తగ సదా ఆనంద తాండవమ్ముగను
బొగడొంద నిచటనెప్పుడు నుండుడనిన
ఖ్యాతిగా నాదేవుఁడట్ల కావించె
నా తాండవంబాడినట్టి మంటపము
భూతలాధీశుఁ డప్పుడు నొప్పిదముగ
పాటక దివ్యరత్నాంచిత దివ్య
కూటమ్ముగావించె గోత్రచాపునకు
మణి రత్నకీలితమకుట మర్పించి
పరగంగ నానంద పరిపూర్ణుఁ డగుచు

సరవితో సేవలు సద్భక్తిఁ జేసి
స్థిరముగా రాజ్యమ్ము సేయుచు నుండె
నక్కడఁ జోడుండు హరు భక్తపరత
నెక్కపై యాదేవు నృత్యప్రసంగ
మా కావ్యులటు చని యంతయుఁ దనకుఁ
జేకొని విన్నవించిన సంభ్రమమున
నప్పుడు వినియు నాత్మానందుఁ డగుచుఁ
దప్పక తానాడెఁ దాండవం బపుడు
నా తాండవప్రియుం డాడిన లీల
యాతతభక్తి విన్నట్టి పుణ్యులకుఁ
గదిసిన పాపసంఘములెల్ల వాసి
తుదలేని భుక్తిముక్తులు గాంతు రెపుడు
నిదియు నిరువదిమూఁడు నిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార! వినుఁడి
యనుచు సన్న్యసులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనిరెం.

## ఇరువదినాల్గవ లీల

మఱియును నొకనాఁడు మధురలోపలను
పాండీడు రాజ్యమ్ము పాలింపుచుండ
నలరంగ నొక్క బ్రాహ్మణకులోత్తముఁడు
తలిరుబోణితో నొక్కతావుకుఁ బోవ
నుష్ణాంశుదీధితి కోర్వంగలేక
తృష్ణయు బహుళమై దేహమ్ము బడలి
వచ్చుచు నొక మహా వటవృక్ష మెదుట
నచ్చోట నుండంగ నచటికి నరిగి
యప్పుడా బ్రాహ్మణుండతిరయమ్మునను
దప్పిచేఁ గుందిన తనదు భార్యకును
జలములు గొనితేరఁ జనినంత లోన
నలివేణి నిద్రించె నలసట పొంది
యంతకుఁ దొల్లొక యాటవికుండు
నెంతేని వేఁటగా నేగి వీక్షించి
యా వటవృక్షమ్ము నందొక్క పక్షి
యా వటమ్మున నున్న నత్తఱిఁ జూచి

బాణాసనంబెత్తి పటుశక్తి మెఱసి
బాణమ్ము నేయ నాపర్ణానఁ దగిలెఁ
దగిలిన నాయమ్ము తెగ గాన కపుడు
తగిలించి యాబోయ తనయూరి కేగె
నంత నాపత్త్రము నట కొన్నితిథుల
నెంతయు నటమాని యెండి యున్నట్టి
సాయకంబప్పుడు సరభసమ్మునను
నాయగ్రజన్ముని యతివ వక్షమున
గాలిచేఁ గత్తానఁ గడ నట జాతి
కాలుని వశవృత్తిఁ గావించె నంత
నా యగ్రజన్ముఁడా యతిశైత్యజలము
బారొడఁ గొని తెచ్చి యాభార్య యందు
నా బాణ మా వక్ష మందుండుటకును
నా బాలుఁ డేడ్వంగ నటఁ జూచి పలికెఁ
గడఁకతో ధర్మార్థకామ మోక్షములు
విడువని జపహోమవిధులు పెక్కైనఁ
బుణ్యమ్ములెల్ల నీభూమిలోఁ బరమ
పుణ్యాంగనా జనంబులచేతఁ బతులు
పడయుదురట్టి సద్భామిని నిన్నుఁ
గడుఁ బాప వృత్తినై కడపటు నిట్లు
పోకార్చుకొంటి నంబుజనేత్ర ! యనుచు
నా కుమారునిఁ జూచి యందంద మఱియు
నా పుణ్యపుత్రరత్నమ నీకు నిపుడు
నేపుతోఁ గడుపార నిష్టాన్నములను
నచ్చుగా వేళల నమ్మరో ! యనుచు
వచ్చిన నిడగల వారెవ్వరయ్య
యని తనపుత్రుని నక్కునఁ జేర్చి
తనివోని దుఃఖానఁ దగిలియున్నంత
నల్ల నాక్షణమున నందొక్క బోయ
విల్లు నమ్ములుఁ బూని వేఁట లాడఁగను
గనియు నాకాంతను గడు వీఁడె యేసె
ననుచు నాతనిఁ బట్టి యాగ్రహమ్మునను
ఓరి ! దురాచార యోరి ! దుష్టాత్మ

యీరీతిఁ గ్రూరాస్త్రమేసి మద్భార్యఁ
గీఁటణఁగించి తింకిటు నిన్ను బట్టి
పాటు మాన్పెద నని పట్టి బంధించి
పాండ్యభూపాగ్రణి పాలికిఁదెచ్చి
కాండమ్ముగొనుచు నాకాంతను వీఁడు
భూపాల పడనేసి పోయె నీబోయ
పాపాత్ముఁడంచును బలవింపఁ దొడఁగె
నప్పుడు నారాజు నాబోయఁ జూచి
తప్పకచెప్పు బాధల నొవ్వ కనిన
సర్వథా నేనేసి చంపుటలేదు
నుర్వీశ ! ధర్మమ్ము నున్నట్లు సేయు
మని బోయ పలికిన నా బ్రాహ్మణుండు
మనుజేశ ! సర్వథా మఱి వీఁడె చంపె
నరసి విచారింపుఁడనుచు నాద్విజుఁడు
వరుస నా శబరుండు వాదింప నపుడు
నా పాండ్య భూపాలుఁడాత్మఁ జింతించి
నా పక్కణావాసు నాగ్రహించపుడు
కారాగృహమ్మునఁ గావలిచేసి
యీ రెండువిధములు నీక్షణమ్మునను
వివరించెదను నీదు వెలఁదికి వేగఁ
గ్రమమొప్పనగ్ని సంస్కారమ్ము సేయు
మని ధనమ్మొసఁగిన నగ్నిసంస్కార
మనువొప్పఁ దనభార్య కపుడు గావించి
యారాజు నగరికి నతివేగఁ దనదు
గారాబుపుత్రునిఁ గడఁక దోడ్కొనుచుఁ
బలవించుచును వచ్చు బ్రాహ్మణుఁ జూచి,
కలఁగి యీస్త్రీహత్య కలిగినయట్టి
దోషమ్ము లెడఁబాపఁ దుహినాంశుధరుఁడు
శేషభూషణుఁడు నా శ్రీచొక్కవిభుఁడు
గాక యన్యులు నాకుఁ గలరె ! యటంచుఁ
బ్రాకటమ్ముగ దేవపాండ్య భూవరుఁడు
నాదేవు నగరికి నతివేగఁ బోయి
రా దేవతాధ్యక్ష ! యుగ్రాక్ష ! యభవ

గోత్రభాణాసన గోత్రారివంద్య
గోత్రధరాంబక ! గోత్రజాత్మేశ !
గోత్రరథాగూఢ ! గోకర్ణహార !
గోత్రేశనామ ! సత్కులగోత్రరహిత !
గోవహ్ని నిర్దగ్ధ కుసుమ శరాంగ !
గోవల్లభారోహ ! గోత్రసందేహ !
గోచతుర్థద్వయ ? గోసహస్రాఢ్య !
గోచరోన్నతమూర్తి ! గోధరస్ఫూర్తి !
యీవిప్రభార్యకు నీవిధంబెల్లఁ
గావలె ననుమతి కఱకంఠ ! యనిన
నప్పుడా స్వామి తా నశరీరి యగుచు
నాదేవపాండికి నానతి యిచ్చె
భూవర్య ! యీరాత్రి పురము శోధింపు !
మావలి వృత్తాంత మంతయుఁ దెలియు
నని యానతిచ్చిన నా స్వామి యాజ్ఞ
దనర నారాత్రిశోధనకు నారాజు
నాయగ్రజన్ముని నందంద వెనుక
నాయెడఁ దోడ్కొంచు నరుగుచో నపుడు
నాపురి నొక్క బ్రాహ్మణునింటఁ బెండ్లి
కే పారవచ్చు వారెవ్వరు గాన
రాకుండ నచ్చోటి కంతకు దూత
లారేయిఁ దమ మాటలాడంగఁ జూచి
మీరెవ్వరిచ్చోట మీరుండు టేమి
కారణంబన్నను గాలదూతలము
నీవు మన్మెఱుఁగుట నీవు దేవుఁడవు
భూవర ! యీపెండ్లి భూసురవరుని
గొనిపోవ నిందులకును రాను వలసె
ననిన నమ్మనుజేంద్రుఁడట వారితోడఁ
గోరి మీరా పెండ్లికొడుకు నే రీతిఁ
జేరి కొంపోదురు చెప్పరే యనుచు
సాదరమ్ముగ వారి నడిగినఁ జూచి
యా దూతలిట్లని రారాజునకును
నాభామఁ బెండ్లాడు నవసరమ్మునను

శోభనవాద్యముల్ స్ఫారిది మ్రోయఁగను
నారావమున శౌర్య కాయింటి యావు
ఘోరునఁ బలుపుత్రెంపుక పెండ్లికొడుకుఁ
దాఁకి నంతటఁ దప్పి దానిపై వైచి
వీఁకతోఁ గొంపోదు వేగంబవచ్చి
యనిన సాశ్చర్యుఁడై యా రాజు వారి
కనియె నావద్ద బ్రాహ్మణుఁడట వినఁగ
నిటునాల్గు మూన్నాళ్ల కీపురమ్మునను
నటు మీరు గొంపోయినట్టిది గలదె !
యనిన వారప్పుడు నందందఁ దాము
గొనిపోవుటెల్లఁ బేర్కొని చెప్పి రపుడు
నా మఱ్ఱిమాని క్రిం దాయగ్రజన్ము
కోమలి నిద్రింపఁ గొంపోతి మనుచు,
నా విధంబంతయు నట వారలనిన
నా విప్రవర్యుండు నడిరేయేటి మాట
యీ పెండ్లికొడుకున కిట్లయ్యెనేని
నా పడంతి విధమ్ము నట్టిదే ! యనిన
నట్టి కాకన వారలట్లుండునంతఁ
బట్టణంబేగి యా బ్రాహ్మణోత్తముఁడు
నంగన కప్పుడు నా ముహూర్తమున
మంగళసూత్రమ్ము మఱిఁ గట్టువేళ
నంభోధి గలఁగ మహా వాద్యరవము
గుంభిని వెలఁగ సంకులముగా మ్రోయ
తలుగు త్రెంచుక యావు తఱుముక వచ్చి
కలఁగి బెదరుచు మూఁకలఁ బాయఁద్రోలి
క్రూరత నా పెండ్లికొడుకుఁ దాఁకినను
గోరి యాదూతలు గొంపోయి రపుడు
నదిగని యా విప్రుఁడద్భుత మంది
యిది యథార్థంబని యిచ్చ నూహించి
తన దుఃఖ మెడలించి తనయుండు దాను
మనుజేంద్రుఁ బొగడె నా మహీసురోత్తముఁడు
నంతటఁ బాండీడు నా విప్రకులుని
కెంతయు ధనమిచ్చి యెలమి వివాహ

మరుదారిగా నాడు మతి వేడ్క ననుచు
గరిమతో డుత నంపె గౌరవమ్మునను
నా భిల్లనాయకు నటకు రప్పించి
నీ భార్య నీ సుతుల్ నినుగాన కిపుడు
నేమంచు వగతురో! యేగుము వేగ
తామసింపక నంచుఁ దగఁ గట్టి నిచ్చి
చాల మన్నించి క్రచ్చఱ వాని ననిచి
హాలాస్య నాథుని నట్టాలచొక్క
నాయకుఁడైన సౌందర్యవల్లభునిఁ
బాయక పాండ్యుఁడు భక్తితోఁ జేరి
త్రైలోక్యనాయక! త్రైలోక్యవంద్య!
త్రైలోక్యదేవతాధ్యక్ష! ఫాలాక్ష!
బ్రహ్మస్వరూప యో బ్రహ్మేంద్రవంద్య!
బ్రహ్మాండమాలి కాభరణవినోద!
దేవదేవ మహేశ దేదీప్యమాన
లావణ్యపూర్ణాంగ! దంశితానంగ!
నీ పాటవీవాస! నిఖిలలోకేశ!
రూపించి యీనింపఁ ద్రోచితే! యనుచు
మనమున హర్షించి మఱి సంస్తుతించి
తన మందిరముకేగె దైవ పాండ్యుడు
పాయక దేవుండు పళియంజ చొక్క
నాయకుండను వేడ్క నామంబు దాల్చె
సరవి నాపళియంజ సౌందర్యకృపను
ధరణిఁ బాలించె నా ధరణివల్లభుఁడు
వినతులై యీ లీల విన్న సత్పుణ్య
జనములు పాతక సంహారులగుచు
వెలుపును మఱుపును వీడంగనాడి
పరగ సాయుజ్యంబు ప్రాపింతు రిపుడు
వినరయ్య యిది చతుర్వింశతి లీల
యనిను బ్రియమంది యమ్మహామునులు
నా వింధ్యదర్పాపహారిఁ గీర్తించి
యావలి చరిత మాకానతిమ్మనిన
నా కుంభసంభవుఁ డాత్మ నుప్పొంగి

ంయా మహామునులకు నప్పుడిట్లనిరొ .
ఇది సర్వఘన సత్కవీంద్ర పాదాబ్జ
విదిత పూజామోద విమలుండు పచ్చ
కప్పుర సౌరభ్యకలితమానాంక
తిప్పరాజ సుపుత్ర తిరువేంగళేంద్ర
విరచితంబుగ లోకవిఖ్యాతమైన
సరసలక్షణకావ్య సత్కవీంద్రాభి
నందిత శ్రీ చొక్కనాథ చారిత్ర
మందున నిది చతుర్థాశ్వాస మయ్యె

---

# పంచమాశ్వాసము.

## ఇరువదియైదవ లీల

శ్రీ కర కరుణార్ద్రి శ్రీ రామభద్ర !
రాధాసుతత్యాగ రంజితాభాగ
భాగీరథీ వంశపావనోత్తంస !
రాగదోష విముక్త ! రణజయాసక్త !
బసవభూవరపుత్ర ! భాగ్య చారిత్ర !
పోసఁగంగఁ జినరామభూపాగ్రజాత !
వినుగొల్ల పెదరామ ! విభవసుత్రామ !
యనుపమజయధామ ! యధికసత్ప్రేమ
ఘటజన్ముఁ డామౌని గణముల కపుడు
నటమీఁది చరిత మిట్లానతి యిచ్చె
మధురాపురమ్మున మఱి దేవ పాండి
ధర్మమ్ము దప్పక ధర యేలుచుండఁ
బరగంగ నొక వృద్ధ బ్రాహ్మణోత్తముఁడు
తరుణి వయోరూప ధన్యురాలైన
బాలికామణిని పెండ్లాడిన పిదప
నా లేమ యౌవనప్రాయమ్ము మించి
బాలుని నొకని దర్పకమూర్తిఁ గాంచె
నా విప్రతనయుండు నధిక సౌందర్య
పాత్రుఁడై యౌవనప్రాప్తిఁ జెన్నొంది
మాతృ సంగము జేసె మది నిల్వలేక
యీ విధి దుర్నిష్ఠ లెసఁగఁ గొన్నాళ్లు
నా వృద్ధుఁ జూచి భార్యాత్మసంభవులు
నీవార్త లెవ్వరు నెఱుఁగక యున్న
యీ వృద్ధు వధియించు టిది కార్యమనుచు
సతిసుతు లిద్దఱు సమ్మదమ్మునను
నతనిఁ జంపిరి గరళాన్నమ్ము వెట్టి
యాతని తనయుండు నందఱితోడ
నా తండ్రి పాలు వంటకము నీ రేయిఁ
గుడుచుచో నా కూడు కుత్తుకఁ జిక్కి
పడిఁ జచ్చెనని యతివ్యాకులుండగుచు

సరవిని నగ్ని సంస్కారమ్ముఁ జేసి
తరుణిఁ దోడ్కొని కల ధనమెల్లఁ గొంచుఁ
దనయూరు విడిచి యాతలి దేశమునకుఁ
జనుచు నుండంగఁ దస్కరులటుఁ బట్టి
తలఁ బగులఁగ గొట్టి ధనమెల్లఁ గొనుచుఁ
బొలఁతిని బట్టుకపోయి రయ్యెడను
గడు వేదనలఁ గుంది గాత్రంబు గంది
యొడలెల్లఁబుచ్చి యాయుర్వీసురుండు
నేయూరి కేగిన నెల్లరు దన్ను
నీ యనిరోయఁ జూచినవారలెల్ల
నరయ వీఁడెంత పాపాత్ముఁడో ! యనఁగఁ
దిరిపి ప్రాఁతలు గట్టి తిరుసుక దినఁగఁ
బుణ్యతీర్థమ్ములఁ బుణ్యవాహినుల
బుణ్యస్థలులకును బుణ్యభూములకుఁ
బోయి తత్కర్మమ్ము పోఁద్రోతు ననఁగ
నారొండఁ దన బ్రహ్మహత్య పోనీదు
పరగంగ నీరీతి బహుళ దుఃఖములఁ
బొరలుచుఁ దన పూర్వ పుణ్యమ్ము వలన
నా మహా మధురాపురాధీశుఁడైన
శ్రీమన్మహాదేవు శ్రీ చొక్కనాథు
నగరికి నేతేర నందికేశ్వరుఁడు
నగణితంబైన పాపాత్ముఁడ వీవు
నిటకును రావల దెందేనిఁ బొమ్ము
కుటిలాత్మ ! యనుచును గోపించి పలుక
నా దేవుఁ డిట్లను నలరంగ వీఁడు
నేదిక్కు దెసలేక యిటు వచ్చినాఁడు
రానిమ్ము బసవన్న ! రానిమ్ము ! యనిన
నా నగజాత యిట్లని విన్నవించె
నిట్టి మాతృద్రోహి నీ పితృఘాతు
నెట్లు రక్షింటిరి యీశ్వరా యనిన
హరుఁడు శర్వాణి కిట్లని యానతిచ్చె
గిరిజ వీఁడన నొక్క కీటకాధముఁడు
వీఁడన నెంత యీ విశ్వమ్ములోనఁ

బోఁడిమి చెడి యతుల్ మునులు దేవతలు
వావివర్తనములు వరుసలు దప్పి
భావజున్మని మాయఁబడరె పూర్వమున
హరియు నా బ్రహ్మశక్రాదుల కైన
మరులు పుట్టించును మదనసాయకము
లను చహంకారియై యాశంబరారి
పనుపడి వర్తించుఁ బలుమాయ మెఱసి
యిటుగాక మఱి విను మీ వాసభూమి
కుటిలపాతకశైల కులిశ మీ మధుర
యెట్టి పాతకియైన నీ మహాస్థలము
మెట్టి మూఁపై భక్తి మేకొనగలిగి
దినముఁ బొత్తామర తీర్థమ్ములాడి
మనుజులు మిగుల బ్రహ్మహత్యాది పాత
కములెల్లఁ బోనాడి కైలాసపదవిఁ
బ్రమథులతోఁగూడి బ్రతుకుచుండెదరు
ఇది సిద్ధమనుచు నయ్యాశ్వరి కపుడు
విదితమ్ముగాఁజెప్పె విశ్వనాయకుఁడు
నంత నా విప్రుండు నాచొక్కపతికి
నంతనంతన మ్రొక్కి యటవచ్చి నిల్చి
యభయమో సర్వేశ ! యభయమో వరద !
యభయమో మహాదేవ ! యభయమో స్వామి !
యభయమో వృషభేశ ! యభయమో జియ్య !
యభయమో మధురేశ ! యభయమో యీశ !
యభయమో చొక్కనాయక ! మహాదేవ
యభయమో పళియంజి ! హాలాస్య నిలయ !
యఖిలాపరాధిని నఖిలదూషకుఁడ
నఖిల పాపాత్ముఁడ యఖిలేశ యేను
మాతృపితృ ద్రోహమగ్నుఁడ నధిక
పాతకుండను బితృబ్రహ్మ ఘాతకుఁడ
నాపాప పటల మంతయుఁ బాపి నన్నుఁ
జేపట్టి రక్షించు శ్రీ చొక్కనాథ !
యని విన్నవించిన నా దురాత్మకుని
మనమునఁ గరుణించి మధురేశ్వరుండు

వానినిఁ బిలిచి దుర్వారమై నిన్ను
బూనిన పాతకంబులు వాపు కొఱకుఁ
గపిలధేనువులకుఁ గసవులు దెచ్చి
కృపతోడ మేపుము కృతమతి వగుచు
దినమును మున్నూఱు దేవాలయముల
ఘనరంగ సంగ్రప్రదక్షిణల్ సేయు
వేయును నెనిమిది విశదమ్ముగాను
చాయక గాయత్రిఁ బఠియించు భక్తి
శ్రీరుద్రమొప్పడు శుచినిష్ఠతోడ
సారసద్భక్తిని జపియింపు మనఘ !
భవ్యకల్పమ్ము నాపాద మస్తకము
నవ్య భస్మోద్ధూళనమ్ముగాఁ జేయు
పరమ మాహేశ్వర పాదతీర్థమ్ము
నిరతమ్ము సేవింపు నిజము చెల్లింపు
ప్రతి వాసరము హేమ పద్మాకరమున
నతి భక్తితోఁ ద్రిసంధ్యలఁ దీర్థమాడి
యొనర భిక్షాటనం బొకమాఱు గడపు
దినము నీరీతివర్తించెద వేని
నీ పాతకమ్మెల్ల నింకు పొమ్మనుచు
నా పరమేశ్వరుం డానతియిచ్చె
వాఁడును నారీతి వరుస మూణ్ణెల్లు
పోఁడిగా మాధుర్యపుర నాయకుండు
నానతిచ్చిన రీతి నాస్థలమ్మునను
మానుగా వర్తించి మది భక్తి మించి
శ్రీ చొక్కనాథుని సేవలుజేసి
హెచ్చిన పాతకంబెల్లఁ బోఁద్రోచి
శివలోకమున కేగి శివు కృపగల్గి
ప్రవిమలసాలోక్య పదవిఁ జెన్నొందె
నిది యిరువదియేను నిట మీఁదిచరిత
ముదముతోఁ జెప్పెద మునులార ! వినుఁడి
యనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె

## ఇరువదియాఱవ లీల

మఱియును నొకనాడు మధురాపురమునఁ
బరగంగ నొకఁడు సభ్యాసియై సాము
నేయించుఁ గొందఱ శిష్యులఁ గూర్చి
నాయయ్యగారు వృద్ధాప్యమై యుండు
నాతని ప్రియ భార్య యతి సుందరాంగి
పాతివ్రతాచార బహుపుణ్య సాధ్వి
యీరీతిఁ బణికుఁడై యెల్ల శిష్యులకుఁ
గోరి సాములు చెప్పుకొని యుండునంత
నందులో నొకశిష్యుఁ డయగారిచేత
నందమ్ముగా సాములన్నియు నేర్చి
తన పేరు వెలయ సిద్ధనగా రనంగ
ఘనముగా వేఱొక్క గరిడిఁగట్టించి
తానును వేఱ కొందఱు శిష్యులకును
దానయ్యగళన? సాధన సెప్పుచుండె
నంతనా పణికుండు నా మహావృద్ధు
సంతతమ్ముగ మహేశ్వర భక్తిగలిగి
శ్రీ చొక్కనాథుని సేవయే ప్రొద్దు
నాచరింపుచుఁ ద్రిసంధ్యా కాలములను
గలకంఠునకుఁ బ్రదక్షిణము సేయుచును
నిరతమ్ము దనదు మందిరమున కరుగు.
ఒకనాఁడు నతఁడు శిష్యుల నింట్లకనిచి
మొకముఁ బ్రక్షాళించి ముదుక యా భవుని
నగరికిఁ బోయి దండప్రణామములు
తగు ప్రదక్షిణములెంతయుఁ బ్రొద్దు సేయ
నయ్యెడ నాసిద్ధుఁడతని యింటికినిఁ
జయ్యనఁ బోయి యయ్యాసాధ్వి చేఁబట్టె
పట్టిన నది యోరి పాపాత్మ! తల్లిఁ
బట్టంగ నీకును బాడియే యనుచుఁ
జే విదలించుక చిడిముడి పడుచు
నో విశ్వనాయక! యో చొక్కనాథ!
నా నాథుఁడతివృద్ధు నన్నింతఁ జేయ
వీనికిఁ దగునె యో వృషవాహనుండ!

అని చొక్కనాథుని నాయింతి చీఱ
మనమున దయగల్గి మదనాంతకుండు
నా సాదనయగారి యాకృతిఁ దాల్చి
తా సెగట్టుక పలక కత్తియుఁ గొరడు
చేతను బట్టి యాసిద్ధునిఁ బిలిచి
నాతోడఁబోట్లాడి నాయిల్లు సొరగ
నీకౌనె యంచు వానిని ధిక్కరింప
దీకొని వాఁడును ధీరత మెఱసి
కత్తియు గొరడును గడిమితోఁ బూని
మొత్తువాఁడుగ వానిముట్టిన చెయ్యి
నఱికి యాగొంతును నాలుకఁ గోసి
సరగునఁ దానదృశ్యంబయ్యె నంత,
వాని శిష్యులు వోయి వడి వృద్ధగురునిఁ
బూని మాగురునితోఁ బోట్లాడి చంపి
యిక్కడ వచ్చి సర్వేశ్వరునకును
నిక్కమ్ము భక్తిఁ బూనిన వానిఁబోల
గుడిచుట్టు దిరిగిన గురువుల పనికి
విడుతుమె ! నిను గొట్టి వేతుము గాక
యనిన నావృత్తాంత మాయయ్యగారు
తన యింటికిని వచ్చి తన యింతి నడుగ
నా చంద్రవదన యాద్యంతమ్ము సెప్పి
శ్రీ చొక్కనాథుఁడే సేయంగఁజాలు
ననినను విని యప్పుడా వృద్ధగురువు
మనమున సంతోషమంది వేగంబె
యా మహాదేవు దివ్యాలయంబునకు
వేగంబ యేతెంచి వృద్ధయ్యగారు
చొక్కనాయకుని సంశోభితస్తుతులు
పెక్కు భంగులఁ జేసెఁ బేరు పెంపెసఁగ
గర్వించినట్టి యా గజదైత్యుఁ బట్టి
యుర్విపైఁ గూల్చిన యుమజోడ ! శరణు
వ్యాఘ్రాసురుని బట్టి వ్రచ్చిపోనీక
శీఘ్రతఁ దునిమిన శితికంఠ ! శరణు
అంధకాసురు చక్రమందు ఖండించు

సింధురవరద ! యాశ్రితనాథ ! శరణు
యా నృసింహుని గర్వమణఁచి లోకముల
మానుగా రక్షించు మహాదేవ ! శరణు
దక్షుయాగముఁ జెర్చి దైవతకోట్ల
శిక్షించి ప్రోచిన శివ ! నీకు శరణు
యజుఁడు గర్వించిన నచటు మర్దించి
సుజనుఁడై గాచిన సువ్రత ! శరణు
యముని మార్కండేయుకై పూని చంపి
యము గర్వమణఁచిన యభవుఁడా ! శరణు
ముప్పురమ్ముల వారి మోది లోకములు
దప్పక రక్షించు దైత్యారి ! శరణు
గజవ్యాఘ్రము లంధక కమలాక్షు దక్షు
లజ మయ త్రిపుర దైత్యారు లనంగ
నీ యొనమంద్ర గర్వ మేపుతోఁ బాపి
పాయనన్నట్టి సద్భక్త మందార !
నాకుగాఁ బాడి పంతము దప్పకుండఁ
దూకొని యీ గురుద్రోహినిఁ ద్రుంచి
ప్రాభవమ్మున నన్నుఁ బరికించి వేడ్క
నీ భక్తవరుని మన్నించితే దేవ !
యని సన్నుతులు జేసి యతి మోదమునను
దన యింటికరిగె సోదనయయ్యగారు
నీ ప్రసంగము విని యెల్లవారలును
నా పురి ప్రజలును నా పాండ్య విభుఁడు
నందంద నందఱు నాత్మ నుప్పొంగి
సౌందర్యుఁడిటు తన సద్భక్తునకును
దావచ్చి యుద్ధమ్ము దగఁ జేసె ననుచు
భావించి యాశ్చర్యపడి యుండి రంత
నిది యిరువది యాఱు నిటమీఁది లీల
ముదముతోఁ జెప్పెద మునులార ! వినుఁడు
ననుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె

## ఇరువదియేడవ లీల

మఱియును సమ్మహామధుర లోపలను
బరగంగ నా పాండ్యపతి వంశమునను
నవతరించెను యుక్తుఁడను పాండ్యవిభుఁడు
శివభక్తిచే మించి శ్రీ చొక్కనాథు
పై భక్తి తాత్పర్యపరత నే ప్రొద్దు
సౌభాగ్యలక్ష్మికి స్థావరంబగుచుఁ
బ్రకటిత సకల భూభాగమ్ము దాల్చి
యకలంక మతిని రాజ్యము సేయుచుండెఁ
దలకొని జైన సంతలునెల్ల గూడి
చలపట్టి తమలో విచారమ్ముఁజేసి
యధికుఁడు యుక్త పాండ్యావనీశ్వరుఁడు
విధిజూటుపై భక్తి విశ్వాసగరిమ
దనర నాశైవమ్ము ధరమించఁ జేసె
మన జైనమతమెల్ల మగ్నము జేసె
నిందుకై పాండ్య భూమీశ్వరుఁగూర్చి
క్రందుకో నాభిచారంబైన హోమ
మిప్పుడు గావింత మెల్లర మనుచు
నప్పు తంపటముగూడి యుగ్రహోంబునను
నట్టి యుగ్రక్రూరమంత్రాదుల చేత
గట్టిగా నైన్నైని కాలముల్ వేల్వ
నాకుండమధ్యమ్ము నందొక్క ఘోర
రాక్షసి జనియించె రభసమ్ముతోడ
నతఁడు శేషాకారుఁ డతిదీర్ఘబాహుఁ
డతి భయంకరుఁడు దంష్ట్రికరాళుండు
నున్నతోదరుఁడు నత్యుగ్రమ్మునైన
కన్నుల నిప్పులు గడు రాలుచుండ
నిబిడమౌ నుచ్ఛ్వాసనిశ్వాసములను
బ్రబలాభ్రపటలంబు వాయద్రోయుచును
బ్రదేతాగ్నులొక్కపై ధృతి మించి వచ్చు
భాతిగాఁ గ్రూరసర్పంబు నేతెంచి
బలసి జైనుల యగ్రభాగమ్ము నందు
నిలచి యిట్లని పల్కె నిష్ఠురోద్ధతిని

దహనార్చులను దేహదాహమ్ము నంది
విహరింపుచున్నవి వేగ నాయందు
నయ్యోడు కార్యమ్ము నాత్మలో నెంచి
చయ్యనఁ బంపు డెచ్చుటకైన ననిన
నతిసంభ్రమంబున నా జైను లెల్ల
నతి వికృతాకారమైనట్టి సర్ప
ముండుట గనుగొని మొగి వారలనిరి
పాండీని ప్రజల నా పట్టణంబెల్ల
నాశీవిషేంద్ర ! మాయాజ్ఞచే పట్టి
రాశిగా మ్రుంగి గజ్జ్రి త్రేపఁ బొమ్ము.
అనిన నా మధురపై నతివేగమునను
ఘనమైన పర్వతాకారమ్ము దాల్చి
జిహ్వాగ్రమున నగ్నిశిఖలు పర్వఁగను
సంహారకారియై సంభ్రమంబునను
సురవడి వచ్చు నా యుగ్రాహిఁ జూచి
పురజనులెల్ల విస్ఫురణలఁ గ్రాలి
భీతమనస్కులై బెదరి యా ప్రజలు
నాతటిఁ బాండీని కా తోరణమ్మునను
మొఱఁబెట్టి రప్పటి మొఱయాలకించి
వెఱవకుండోయని వేగంబె వచ్చి
యాయుగ్రభుజగంబు నందందఁ జూచి
సాయకం బొకటెత్తి సంధించి మించి
తగఁ జొక్కనాథుని ధ్యానంబుఁ జేసి
తెగనిండఁ గొనియేసె ధీరత్వ మడర
నేసిన శరము బిలేశయు కంఠ
దేశంబు తఱుగ కదియును నేలేవ
నేలేర, మఱియు ననేక బాణములు
భీతిల్ల నేసిన భీకరంబైన
విషములు గ్రక్కుచు విషధారి యపుడు
విషధులు నొక్కలై వెల్లిగా వచ్చు
టలుగాఁగఁ గాలకూటంబు చందమునఁ
దల కొని మధుర కుద్ధతి వచ్చుచున్నఁ
జూచి యారాజును ఘోరత్వ ముడిగి

యా చొక్కనాథుని నాశ్రయింపఁగను.
నా దేవు నగరికి నతివేగఁ బోయి
మోదంబు తోడను ముందట నిల్చి
గిరిజేశ ! యఘనాశ ! కీర్తి ప్రకాశ
పరమేశ ! భవనాశ ! భర్గ ! సురేశ
విషధరశశిధర విషమృత్యుహరణ !
విషధరభూషణ వేదాంతసార !
వ్యాసహస్తచ్ఛేద ! వశితానుమోద !
వాసవార్చిత పుష్పబాస ! సర్వేశ
సర్వజ్ఞ ! సర్వాత్మ ! శర్వాణిరమణ !
సర్వముక్తకలాప శైలేంద్రచాప !
బాణగానప్రియ బాణారివిశిఖ !
యేణాక్షివామాంగ యీశ ! సర్వేశ
ఓదేవ ! యిదియొక్క యుత్పాతముగను
భూదివమ్ములను గప్పుచు నిందులకును
గాలాగ్ని చందానఁ గడఁగుచున్నదియు
నింతటఁ గాచి మమ్మీక్షణమ్మునను
జింతిలకుండంగఁ జేయవే దేవ !
యని సన్నుతింపఁగా నాస్వామి వచ్చి
తన జటాజూటానఁ దగ నున్నయట్టి
చంద్రునందమృతమ్ము చయ్యనఁ దిగిచి
సాంద్రమ్ముగాఁ జల్లి శాంతిఁ బొందించె
వెలయంగ నప్పుడు విషమంతుకతనఁ
బొలుపొంద హాలాస్య పురమనఁ బరగె
విధుసుధాధారల వీథులఁ జల్లి
మధురాపురంబన మహి సొంపు మిగుల
నా విషంబణఁచి యా యహికళేబరము
నావంక నాగాద్రియను పేరుజేసి
నగజేశుఁడా చొక్కనాథుండు తనదు
నగరిలో నపుడు నంతర్ధానమయ్యె
నప్పుడా స్వామిని నా పాండ్యవిభుఁడు
నప్పౌర జనములు నభినుతుల్ చేసి
సంతుష్టులానందసంపూర్ణులగుచు

## ఇరువది ఎనిమిదవ లీల

నెంతయు వేడ్కతో నేగి రప్పురికి
నిది సప్తవింశతి యిట మీఁదిలీల
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి
యనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.
మఱియును నారాజు మథురాపురమున
సర్వజనమ్ములు సంతుష్టి నుండ
నప్పుడు నాజైను లతిభీతులగుచు
కాంతార ఘోరదుర్గములలోనుండి
మంత్రబలమ్ముల మఱియును బోవఁ
దంత్రముల్ పన్ని రంపము గూడియపుడు
నేమి సేయుద మిట్టు లెన్నని పగఁ
భీమాకృతియుఁగాఁగఁ బేర్చినయట్టి
యా సర్పమును బోయి యా పురిజనుల
శాసింపలేక నిస్సత్త్వమై పోయె
ననుచును మఱియును నభిచారహోమ
మును సేయ నందు సముద్ధతితోడ
దిశలు గంపింప ధాత్రీధరాకృతిని
పశురూపమున సముద్భవమయ్యె నపుడు
నాయొడ్డైను లత్యంత శౌర్యమున
నా యావుఁజూచి యిట్లని పల్కి రంత
బలసి చంపఁగరాని పగ గెల్వరాదు
నిల గోవు వధియింప రెట్టివారైన
హాలాస్యపురమున కరిగి యా ప్రజలఁ
దూలించి పాండీనిఁ ద్రుంపు మీవనుచు
ననిచినఁ జని వేగ నా మహాపశువు
ఘనశృంగములు రెండు గగనమ్ము నొరయ
ఖురముల చేఁబుట్టు ఘోరంపుధూళి
హరిదంతదంతుల యక్షులు మూయ
కుతలమ్ము గొమ్ములఁ గోరాడినంత
నతలమ్ము నెల్ల ప్రయ్యలుగాఁగ నడుచు
రభసమ్ముతో నట్టి రంకె వేసినను
నభము కంపించి ఘూర్ణిత్వమ్ము నంద

వాలమ్ము విసరిన వారిధు లేడు
కోలాహలమ్ముగాఁ గొండల పగుచు
మిన్నునేలయు నొక్క మెయి పేర్చి కడఁగి
మున్నుగా వచ్చు నా పశువును జూచి
యాపురి ప్రజలును నా పాండ్యవిభుఁడు
శ్రీపార్వతీశ్వరు శ్రీచొక్కనాథు
గుడిఁజొఱఁబఱచి యెక్కుడు భీతితోడ
గడగడ వణఁకుచుఁ గలయఁ బాఱుచును
దేవ సర్వేశ్వర! దేవాదిదేవ!
పావకోజ్జ్వలనేత్ర! పవనాప్తగాత్ర!
యుర్వీధరశరాస! యో విశ్వరూప
యుర్వీధర సుబాణ! యో జగత్త్రాణ
ఓమధురాధీశ యో సౌందరేశ!
యీ మహాప్రళయ మే మెఱుఁగ మెన్నఁడును
నదియొక్క పశువు ఘోరాకారమగుచు
పొదలుచు నదె వచ్చెఁ బురమెల్ల బెదరఁ
గరుణతో నీబారి గడపి మమ్మెల్ల
నరసి రక్షింపవే! హాలాస్యనాథ!
యని పెక్కు భంగుల నా రాజు ప్రజలు
వినుతింప నంత నా విశ్వనాయకుఁడు
పడి శరణాగత వజ్రపంజరుఁడు
కడువేడ్క భక్తరక్షణ పరాయణుఁడు
పశుపతి యప్పుడా బసవన్నఁ బిలిచి
పశువొక్కఁడదె మహాప్రళయరూపమున
వచ్చుచున్నది దాని వారించి వేగ
నిచ్చటరమ్మి నందీశ్వర! యనినఁ
దనర బ్రహ్మాండ గాత్రంబుతో నపుడు
తన ప్రతాపమ్మును ధారుణి మెఱయ
పర్వతాకారమై పరగు మూఁపురము
గీర్వాణవల్లభ గీర్వాణమునులు
నగణిత వేదవాక్యముల నర్చింపఁ
దగినట్టి నాల్గు పాదమ్ముల యందుఁ
దివిరెడు పసిఁడియందియల మ్రోఁతయును
నవరత్నకలిత ఘంటారవమ్ములును
పది దిక్కులను జెవుడ్పడఁ జేసి మిగులఁ
గదిసి కయ్యాలకుఁ గాలుద్రవ్వుచును
గడఁగి యుగాంత మేఘములు గర్జిల్లు
వడిని ఱంకెలు వైచి వాలమ్ము ద్రిప్పి

ఖురఘట్టనముచేతఁ గులగిరు లద్రువ
ధరణి కంపింపఁ బాతాళమ్ము బెగడ
గిరిశృంగములు రెండు కెరలు కొమ్ములను
ధరణి గోరాడు నుద్ధతలీల వచ్చి
జైనులంపిన యభిచారహోమమ్ము
ధేనువు ముందర ధృతి వచ్చి నిలిచె
నప్పు డాధేనువు నతికోపభరము
గప్పి నిశ్చేష్టతఁ గడుదూలి మఱియు
నానందబాష్పమ్ము లక్షియుగ్మముల
నాని యంవందఁ బాయలు గాఁగఁ దొరఁగె
జైనులప్పుడు మహాశ్చర్యమ్ము నొంది
దీనాననమ్ముల దిగ్భ్రమ నెసఁగఁ
బఱచి యందఱు భయభ్రాంతులై ఘోర
గిరిదుర్గములయందు ఖిన్నులైయుండి
యక్కట యీధేను వాపురిజనుల
దక్కక చంపునందఱఁ జుట్టుముట్టి
యని నమ్మి పంపిన నది వృథయయ్యె
మన కృత్రిమంబు లామధురపైఁ జొఱవు
శ్రీ చొక్కనాథుఁడంచిత లీలఁగాచి
ప్రోచు నీ మాధుర్యపుర మహర్నిశము
నందునే దశలు ? కల్పాంతకాలమునఁ
జెందగా వెఱచును శివునాజ్ఞ వలన
ననుచు నిరుద్యోగులై వనమ్ములకుఁ
జని యూరకుండిరి జైను లచ్చటను
నా నందికేశ్వరుం డానంద మెసఁగ
నా నందివాహను నగ్రభాగమున
గరిమతో నిల్చినఁ గని గారవించి
తిరముగా మా సన్నిధిని నెల్లవేళ
నుండుము బసవేశ ! యొప్పుగా ననుచు
ఖండేందు జూటుండు కట్టడసేయ
నది యాదిగాఁ ద్రిపురారి ముందఱను
బదిలమ్ముగా నుండు బసవేశ్వరుండు
నాయావు పడినట్టి యాస్థలమ్మునను

నా యొడ వృషభాద్రియళగరై యుప్పెఁ
గలయ నాధేశువు కన్నీరు నందుఁ
దలయేఱు నను పేర ధర్ర మించి వెలసె
సంగతితో నిట్లు సౌందర్యనాథుఁ
డంగయకణ్ణమ్మ కానతి యిచ్చె
నిది యష్టవింశతి యిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి.

## ఇరువది తొమ్మిదవ లీల

అనుచు సన్మునులతో నా యగస్త్యుండు
మనమునఁదలపోసి మఱియు నిట్లనియె.
అహిరాజ భూషణుండౌ నాసమైన
మహిమ నెన్నిక గల మధురలోకులను
బ్రతిలేని పాండ్యభూపాలుని యొద్దఁ
జతురుఁడై సుందర సామంతుఁ డనఁగ
భాసుర సేనాధిపత్యమ్ము దాల్చి
భాసుర సౌఁదర్యపతి సేనలందుఁ
జిత్తమ్ము రంజిల్ల సేయుచున్నంత
నత్తఱి పాండ్యభూపాగ్రణి మీఁదఁ
జేదిరాజాదిక శ్రేష్ఠుఁడైనట్టి
మేదిని వొకబోయ మేటి మన్నీఁడు
దండెత్తిరాగ నా దళవాయిఁ జూచి
పాండీశు డప్పుడు ప్రజ గూర్చుమనుచు
భండారమందున్న బహుధనంబెల్ల
నిండారగా నిచ్చి నెమ్మిఁ బొమ్మనిన
నప్పుడా సామంతుఁ డతిమోదమునను
దప్పక శివభక్తి తాత్పర్యపరత
మాహేశ్వరార్చనల్ మఱియు సర్వేశు
గేహమ్ములకును మిక్కిలిగాఁగ నొసఁగి
యొగి దాన ధర్మపరోపకారంబు
నగణితమ్ముగఁ జేసె నా విత్తమెల్ల
నప్పుడు పాండీని కావిధంబెల్లఁ
జెప్పిరి తోటి యా సేనాధిపతులు
చెప్పినఁ గినిసి యా సేనాని నటకు
రప్పించి మఱియంత రాజువఁగూర్చె !

సామంత ! యనిన నా జనకుబుతోడ
శ్రీ మహామధురేశు శ్రీ చొక్కనాథు
సౌందర్యనాయకు సత్కృప చేత
నెందఱైన నేనేలితి దేవ !
యన్న నారాజును నట్లకాకనుచు
నెన్నిక చూపుము రొల్లి నేఁడనినఁ
దగు నట్లయనుచు నాదళవాయి యపుడు
నగజేశు నా చొక్కనాథునిఁజేరి
యాదరమ్మున మ్రొక్కి యభినుతుల్ సేసి
యింద్రాది సురవంద్య ! యిభచర్మ వసన !
చంద్రార్థ శేఖర ! చంద్రార్కనేత్ర !
త్రిపుర మదధ్వంస ! దీనమందార !
[యపవర్గ ఫలధామ] యద్రికోదండ !
దగ్ధశివద్రోహ తంత్రదుర్మంత్ర !
ముగ్ధేందు మండన ! మోహనాకార !
పటుమేదినీరథ ! శ్రుణవ్రతతోడ !
చటులాలి ? చతురాస్య సారథ్యరథిక !
వేదాదిసన్నుత ! వేదస్వరూప
యోదేవ యిందుకు నొకత్రోవ నిమ్ము
వెలయంగ నా పాండ్య విభుఁడు నేఁడెల్లి
బలములఁ దెమ్మంచుఁ బలికె నాతోడ
నీపాదసేవకు నీభృత్యు నన్ను
జేపట్టి యిపుడు రక్షింపవే దేవ !
అని సన్నుతింపుచు నధికసద్భక్తి
వినుతింప నప్పుడా వృషభధ్వజుండు
నతని కానతియిచ్చె నాత్మ శోభిల్ల
మదిలోన నీ వనుమానంబు డించి
భయమేలఁ జనుమెల్లి పాజుఁ జూపెదను
రయమొప్ప మితిలేని ప్రజనెల్ల ననుచు
నశరీరియై వచ్చి యాస్వామి యపుడు
విశదమ్ముగాఁ బల్కె వినువీధి యందు
నంత నాసామంతుఁ డాత్మ నుప్పొంగి
సంతోషమునఁ దన సదనమ్ముఁ జేరి

తనపత్నితోడ సౌందర్యనాయకుఁడు
తన కానతిచ్చినంతయు వేడ్కఁ జెప్పఁ
జెప్పిన సంతోషచిత్తురై యతివ
తప్పక నాస్వామి దయ నిన్ను బ్రోచు
నన నుదయంబాయె నా మఱునాఁడు
తనకు గల్గిన ప్రజఁ దాఁ గూర్చి కొనుచు
నగరి కేతెంచె నంతటను సౌందర్యుఁ
డగణితమ్ముగ సకలాధిదేవతలఁ
బమ్మక మనుజరూపంబులు గాఁగ
రమ్మని బహుళసంభ్రమలీల మెఱసి
కూడఁగల్గి టెక్కమ్ము లెత్తించి యంత
వడి మీఱఁగాఁ బంచ వాద్యముల్ మ్రోయ
విశ్వేశ్వరుఁడంత వేడ్కతో నొక్క
యశ్వమ్ము దానెక్కి యా క్షణమ్మునను
దనరఁ బత్తిసాయుధమ్ముల తోడ
వెనుకొని రాహుత్త వితతులు ప్రజలు
నెల్లరు గొలువంగ నేతెంచు పౌఁజు
లెల్లనప్పుడు మహోద్రేకమ్ముగాఁగ
నేల యీనినయట్లు నీరధు లెల్లఁ
జాలఘోషముతోడ సాగెనో! యనఁగ
పౌఁజు లేర్పఱచుక పరమేశ్వరుండు
రాఁజూచి యప్పుడా రథసమ్మునకును
వెఱచి యా పాండ్యభూవిభుఁడును గలఁగి
యరివీరులెల్ల నాహవరంగమునకును
నదె వచ్చుచున్నారె! యటు చూడుఁడనినఁ
బరగ నాదళవాయి భయపడవలదు
పరులుగారది మన పరివార మధిప!
యా చిత్రకూటమ్మునందు విచ్చేసి
చూచుట మేలు పౌఁజులదేవ! మీరు
ననిన వేగమ్ముతో నటకు నేతెంచి
మనుజేంద్రుఁడపుడు సామంతునిఁ బిలిచి
నడిపింపవలయు సేనల నిప్పుడనిన
నడరంగ నేఁబది యాఱు దేశముల

ప్రజలను జాతివర్ణము లేర్పఱించి
యజభ భాండము లెల్ల నదర రప్పించి
నెలమితోఁ గళలు వ్రాయించె నత్తఱిని
దలకొని యంత సౌందర్యనాయకుఁడు
సవరణ యుత్తమాశ్వమ్ము పైనెక్కి
ధవళాతపత్రమ్ము దనరఁ బట్టగను
దండిగా నశ్వమ్ము దాఁటించుకొనుచు
నుండగఁ జూచి యాయుర్వీశ్వరుండు
నెవ్వరీతఁడు దన కెఱిఁగింపు మనిన
నవ్వామ భేశున కతఁ డిట్టులనియె
నీ సేనలకుఁ గర్త యీ సేన నితఁడు
భాసిల్లఁ దెచ్చె సంభ్రమలీల ననిన
నప్పుడా రాజును నతని నిందులకు
రప్పింపుడనిన సంరంభంబుతోడ
నచ్చోటి కేతెంచి యాస్వామిఁ జేరి
విచ్చేయు మో దేవ ! వేడ్కతో మిమ్ము
ధరణీశుఁ డచటికిఁ దగఁ బిల్వఁ బంచె
ననిన నా సర్వేశుఁ డట్లకాకనుచు
మనుజేంద్రు కడకేగి మఱియు నిట్లనియెఁ
బ్రాఁతిగా మావర్ణ బంతినామములు
జాతి యేర్పఱచి యిచ్చట వ్రాయవలయు
నని కళ వ్రాయించు నావిధంబునను
దన మెడ కప్పు నౌదలయందు మలకఁ
జూపి వ్రాయఁడు నన్ను జొక్క రావుత్తు
నా పేరనుచును నానతి యిచ్చి యిపుడు
విడుపు మెవ్వరినైన వీరులైనట్టి
కడిమి రావుత్తు సంగములకు ననుచుఁ
దేర్చి యార్చినఁ జూచి పృథ్వీశ్వరుండు
గూర్చుండ సంశయాకులచిత్తుఁడగుచు
నీ యశ్వమెక్కుమ నినుజూచి యేము
వ్రాయంగ నేలంచు వరుసతో నపుడు
నుదుగర లిచ్చిన నుత్తమాంగమున
సడల కుండఁగ జుట్టి సంభ్రమం బెసఁగ

నశ్వమ్ము నేనెక్కి యాడుటచూడు
విశ్వంభరాధీశ ! వేవేలగతుల
ననుచు నా సర్వేశుఁ డతిరయమ్మునను
దనమనమ్మున్నట్లు దగనెక్కియాడు
నంత నా పాండీడు నా పౌరజనులు
సంతోషమంది యాశ్చర్యమ్ము నొంది
యీలాగు తేజీల నెక్కాడువారి
నేలోకమున గాన మిది చిత్రమనుచుఁ
దగఁ జూచుచుండ సౌందర్యనాయకుఁడు
చనిరా నదృశ్యమై చయ్యన నంత
నా కూడ సురలెల్ల నతిపుష్పవృష్టి
పాయక కురిసిరి పరమేశు మీద
నటు జోయరాజును వ్యాఘ్రమ్ము గలచి
తటుకున నేగె నంతటు స్వర్గమునకు
నా వార్త విని రాజు నద్భుతంబంది
శ్రీ చొక్కనాథుఁడాశ్రిత కల్పతరువు
మనపాల గలిగి సమ్మతిఁ బ్రోచె ననఁగ
తన దళవాయి సౌందర్య సామంతు
నఁటు జూచి మన్నించి యాత్మలో మెచ్చెఁ
దటుకున నతఁడు సౌందర్యునిఁ జేరి
తిరువాలవాయ ! యో దేవతారాధ్య !
పురహర ! శివలోకపురవాస ! యీశ !
విశ్వవిశ్వేశ్వర ! వేదాంతవేద్య !
యశ్వాయితామ్నాయ ! యద్రీంద్రచాప !
ఓచంద్ర సూర్యానలోజ్జ్వలనేత్ర !
శ్రీ చొక్కనాథ ! రక్షించితె నన్ను
ననుచు నా సామంతుఁ డతిభక్తితోడ
ననువందఁ బొగడి శివార్చనల్ చేసె
పరమేశ్వరధ్యాన భరతఁ జెన్నొంది
పరగంగ సాయుజ్యపదవికి నేఁగె
నిది యిరువదితొమ్మిదిట మీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార ! వినుఁడి
యనుచు సన్మునులతో నా యగస్త్యుండు

మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె

## ముప్పదియవ లీల

మఱియు నా పాండ్య భూమండలేశ్వరుఁడు
వరుసగాఁ జొక్కనాయకు భక్తి గలిగి
ప్రజల రక్షించి శాత్రవుల శిక్షించి
భుజశక్తి మాధుర్యపుర మేలుచుండె
నా నృపాలకుఁడు బ్రాహ్మణద్వేషి యగుచు
దానమ్ములీయ కెంతయు నింద సేయ
నా విప్రులెల్ల సంధ్యలు జపహోమ
దేవతార్చాపితృదేవ తర్పణలు
నగ్నిహోత్రములు వేదాగమ ప్రోక్త
విజ్ఞానయోగ హవిర్భాగములును
సరవిని యజనాదిషట్కర్మములను
వరుసలు దప్పి తద్వ్రతములు మాని
బ్రాహ్మణాచారసంపద లెల్ల విడిచి
బ్రాహ్మణు లరిగిరి పరభూములకును
నది కారణమ్ముగా నా రాజ్యమునను
గొదవడి వర్షముల్ గుఱియక యుండె
నోషధులన్నియు నొనర దుర్భిక్ష
దోషమ్ము వాటిల్ల దుర్దశ నొందె
దయ ధర్మము నుడిగె ధాన్యమ్ము దఱిగె
నయము లేదాయె దానము లేకపోయెఁ
బరగ నీరీతిని బాండ్య దేశంబు
కరువు గాలముచేతఁ గడు చెడి నొచ్చి
యున్నచోటుల నుండ నోడి యందఱును
గన్నవారేగిరి కన్నత్రోవలకు
నాయెడఁ దన ప్రజలందఱు విడిచి
పోయినఁ దానేలు భూమండలమ్ము
శూన్యమై యున్నను జూచి యత్యంత
దైన్యంబునొంది యా ధరణీశ్వరుండు
నందఱుఁ దనుదాఱ నతిఖిన్నుఁడగుచు
సౌందర్యనాథుని సన్నిధి నిల్చి
యందందఁ బ్రణమిల్లి హస్తముల్ మొగిచి
పొందైన వేడ్క నింపుగ సన్నుతించె

శ్రీ సహ్యాదరధర శ్రీ జటాజూట !
శ్రీస్మూసుహరణ ! యో శ్రీ నీలకంఠ !
హరి విధినుత పాద ! యఖిలప్రమోద
కలకంఠ ! సర్వేశ ! కామితఫలద
యో భక్తజనరక్ష ! గో విరూపాక్ష
యో భూతగణనాథ ! యో చొక్కనాథ !
నా రాజ్యమునకు వానలు లేనియట్టి
కారణంబేమి యో గరళాస్య భూష !
క్షామమ్ము చేతను జాలంగ నొచ్చి
యీ మహీప్రజ లెల్ల నిచ్చోటు విడిచి
పోయిరి యన్యభూముల కిందు కేమి
నేయఁగఁగలవాఁడఁ జెప్పవే ! దేవ !
యని సన్నుతులు సేసి యా పాండ్య విభుఁడు
తన నగరికిఁ బోయి తగ నిద్రపోవ
నా రాత్రి స్వప్నమ్ము నందు విచ్చేసి
యా రాజధరుఁడు నిట్లని యానతిచ్చె
వేదంబులును నాకు విమలరూపంబు
వేదస్వరూపంబు వెలయంగ మేము
తగ వేదములకును దల్లి గాయత్రి
మనుజేంద్ర ! యిటు మహామహిమలు వెలఁగు
నట్టి వేదములు గాయత్రియుఁ గలుగు
పట్టు పాఱులు లోకపావనా కృతులు
మఱి బ్రాహ్మణులు దైవమన వేఱుగలదె !
ధరణికి విప్రులు దైవమ్ము లనఘ !
అధ్యయనమ్ములా ప్రాహ్ణ పరాహ్ణ
మధ్యాహ్నకాల సంప్రాప్తి నేమఱక
నిత్యకర్మము లహర్నిశము బ్రాహ్మణులు
సత్యవ్రతమ్ముగా సలుపుట వలన
దేవతలందఱు తృప్తులై వారు
భూవలయంబు సొంపుగఁ జేయుచుండఁ
గాలమ్ము దప్పక కడఁగి వర్షములు
చాలంగ వర్షించి సస్యమ్ము లెసఁగఁ
పాడియుఁ బంటయుఁ బరగ నే ప్రొద్దు

పోఁడిగా నుండును భూతలంబెల్ల
మనుజేశ ! నీవు బ్రాహ్మణుల రప్పించి
తనరంగ ఘనదాన ధర్మముల్ జేసి
వారి సంతృప్తిగా వరుస రక్షించి
గారవంబున వారు కర్మముల్ నడప
వర్షముల్ గలుగు నీ వసుధ యంతటికి
నరనాథ ! పాడిపంటలు చాలఁగలవు
ధనములేదని మన స్తాపంబు వలదు
ఘనముగా నీకు నక్షయజోలె యొకటి
యేమొసంగెద మది యెందఱికైన
వేమాఱు నర్థమ్ము వెచ్చఁబెట్టినను
నుడుగక బహుధనంబొసఁగు నీ జోలె
పుడమీశ ! ప్రజలను బ్రోచి భూసురుల
రక్షించు దానధర్మములచే ననుచు
నక్షయజోలె నాహరుఁ డొక్కటిచ్చె
నప్పుడు తన మంత్రులందఱి వేగ
రప్పించి సంతోష రసపూర్ణుఁ డగుచుఁ
దనకు నారాత్రి సౌందర్య నాయకుఁడు
జనుల రక్షింప నక్షయజోలె యొసఁగు
విధమెల్లఁ జెప్పి యా విశ్వేశుఁ బొగడి
మధురాపురీ పాండ్య మండలేశ్వరుఁడు
నా జోలె గంధపుష్పాది ధూపములఁ
బూజించి వితరణ స్ఫూర్తి శోభిల్ల
మహిలోనఁ గల్గు బ్రాహ్మణుల రావించి
బహుదాన ధర్మముల్ పరగంగ నిచ్చి
దనరంగఁ బ్రణతి సత్తాత్పర్యుఁడగుచు
ఘనముగా వారి షట్కర్మముల్ నడపె
పరగ మాహేశ్వరభక్తిఁ జెన్నొంది
పరమధర్మ ప్రీతి పాలుఁడై వెలసె
నా రాజ్యమున కపు డధికవర్షములు
మీఱి ధాన్యములు సమృద్ధిగాఁ బండి
యేమిటఁ గొఱలేక యెల్లభాగ్యముల
నా మధురాదేశ మంత వర్ధిల్లె

నా సౌందరేశ్వరు ననుమతి వలన
వేసారకెంతయు పెచ్చుఁబెట్టినను
గడమ గా కా జోలె ఘనముగా ధనము
నుడుగక వర్ధిల్లుచుండె నెప్పుడును
శ్రీ చొక్కనాథుని సేవ సూహాశ్వ
రాచారభరిత బ్రాహ్మణ భక్తిఁగలిగి
ఘనతరైశ్వర్య సంకాశుఁడై పాండ్య
జన పాలవగుఁడు రాజ్యము నేయుండె
నిదియుఁ ద్రింశల్లీల యిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుడి
యనుచు సన్మునులతో నా యగస్త్యుండు
ఘనమునఁ దలపోసి మఱియు నిట్లనియె॥

## ముప్పది యొకటవ లీల

అపాండ్య భూపాలుఁ డధిక ధర్మ ప్ర
దీపుఁడై సకలధా త్రీతలంబేలు
కాలమ్మునను దారుకావనమ్మునను
స్త్రీలును దాము సంచిత తపోధనులు
మునులుందు రందు నా మునిపత్నులెల్ల
నెనయంగఁ దమకును నీడు జోడైన
పరమ పాతివ్రత్య భవ్యచారిత్రు
లరయ లేరనుచు నహంకరించినను
శ్రీ చొక్కపతి ఋషిస్త్రీల పతివ్ర
తాచారములు నూతమని యాత్మఁదలఁచి
చిగురు కెంజడలును జిలుగు చందురుఁడు
మిగులుగన్నును గటిమీఁది సూత్రమ్ము
నడిమి రెయుడ్డాణమ్ము నాగజన్నిదము
మెడకప్పు సంకును మేని భూతియును
బసిఁడి పావాలు జపామాలికయు
భసిత త్రిపుండ్రంబు ఫాలభాగమునఁ
గాలియందెయుఁ జంక కర్పాలయును
చాలఁ గామాత్ములు చేత శూలమ్ము
పులితోలు గోణము పునుక కంచమ్ము
గలిగి సమ్మోహనాకార వేషమున
ధవళశంఖములు ముందఱ భోరుకొలుప

నవ్యమైన భిక్షాటన క్రియతోడ
మూఁడుమూర్తుల కాదిమూర్తైన వేల్పు
మూఁడులోకమ్ముల ముదముతోఁ జూచి
యా దారుకావనాభ్యంతరమ్మునకు
నా దైవతాఢ్యుఁ డర్థితో వచ్చి
భిక్షయటంచును బ్రేమతో లోక
రక్షుండటను సంభ్రమలీల నడిగె
భిక్షాంప్రదత్త ! మే పీన వక్రాంగ
వక్షోజయుగళ యౌవనలార ! భిక్ష !
దారుకావనవాస తాపసోల్లాస
కారుణ్య విభవసుందరులార ! భిక్ష !
గజ జలంధర యంధక వ్యాఘ్ర మదన
అజశిరఃపుర దైత్యహరునకు భిక్ష !
దివి భువి కీలాల తేజ ? స్సమీర
రవిచంద్రయాజి విగ్రహునకు భిక్ష !
జాతిభేదము లేక సద్భక్తులకును
ద్రాతైన మోక్షప్రదాతకు భిక్ష !
కాలకూటాగ్ని లోకమ్ము లేరేడు
కాల నీయని కాలగళునకు భిక్ష !
యని యివ్విధంబున నా జంగమయ్య
మునిపల్లెలో భిక్ష మడుగొని వేఁడ
నప్పుడు మునిపత్ను లతిసంభ్రమమున
గొప్పులు వీడంగఁ గుచము లల్లాడ
భిక్షమ్ము వెసఁదెచ్చి పెట్ట వచ్చినను
గక్ష యుగ్మముజూడఁ గప్పెర చెయ్యి
బోడవెత్తి భిక్ష మప్పుడు పెట్టువేళఁ
గరమూల రుచులు శృంగార హస్తములు
కళికంఠుఁడటుఁ జూచి కడకంటు నగిన
నతని సౌందర్య మయ్యారమ్ముఁ జూచి
మతి విభ్రమించి యేమఱియున్నవారు
భిక్షమ్ము దెచ్చియుఁ బెట్టంగ మఱచి
యక్షీణమోహితలై యున్న వారు
ఘటికొంద ఱలివల మ్రాయషల తపని

మరులచూపుల మేనుమఱచిన వారు
పయ్యెదజాఱిన బ్రమసి పాలిండ్లు
ముయ్యఁగాలేక మోములు జూచువారు
పెట్టియు మఱచియుఁ బెట్టలేదనుచుఁ
జట్టువమ్ములను భిక్షము దెచ్చువారు
నైరి యా మునిపత్ను లందఱు నపుడు
నీరీతి మునుకొని యిందుశేఖరుఁడు
వాడల వాడల వరుసతోడుతను
వేఁడుకతో భిక్ష వేఁడి యాసతుల
మదిలోన నెంతయు మరులు పుట్టించి
మదనారి యచటను మాయమై చనియె
నంత నామునిపత్ను లందఱు విరహ
సంతాపములఁ జిక్కి జాడలు దక్కి
మతివిచారమునించి మానముల్డించి
పతులసేవలు మాని భ్రమములు బూని
కరములుడస్సి యాకరములు గ్రుస్సి
కరముల గాజులొక్కట నూడిపడియె
నా ఋషులెల్లను నతివలఁ జూచి
మీరలాసర్వేశుమీఁది మోహమున
గడు జిక్కి చేతుల గాజులువీడి
పడియెఁ బతివ్రతా భావమ్ము సడలె
మఱి పోయి మీరలా మధురలోపలను
గరమొప్ప వైశ్యుల కడుపునఁ బుట్టు
డని శాపమిచ్చిన నా యింతులెల్ల
మునుల వీక్షించి మమ్ముల నివ్విధమున
శపియించినను మాకు సద్గతి యేది
కృపగల్గి మమ్ము రక్షింపరె ! యనిన
నా ఋషులిట్లని రా నెట్టులకును
మీరలాపురిని జన్మించియుండినను
మఱికొన్నితిథుల కమ్మధురేశ్వరుండు
నరయ గాజులసెట్టియై యందువచ్చి
యాజటాధరుఁడు మీహస్తముల్ పట్టి
గాజులుపెట్టినఁ గలుగు మోక్షమ్ము

అనినను బ్రియమంది యట్లకాకనుచు
జనియించి రావైశ్య సంతతులిండ్ల
పెరుగుచునుండిరి పిక్కువల్ గలిగి
యయ్యెడఁ బెండ్లి ప్రాయములైనఁ జూచి
యియ్యాకుబిడ్డల నెవ్వాగి కిత్తు
మని సెట్టివర్గము లటు విచారింప
మనసిజదమనుండు మధురేశ్వరుండు
చొక్కనాయకుఁడు గాజులసెట్టి యగుచుఁ
జక్కఁగా ముతుకవేషముతోడఁ జల్లి
పట్టుసూత్రఁపుత్రాళ్ల పైఁడుంగరములు
బెట్టుబసవనిఁ జేసి పెట్టినముద్ర
పట్టువస్త్రము గూర్చి బాగుగా బిగియఁ
గట్టినదేవుండు కంఠాన సమర
నొసలను విభూతి నునుపుగాఁ దీర్చి
యొసపరి పెండికట్లారపుగాఁ బెట్టి
సన్నఁపు రుద్రాక్షసరములు వైచి
వన్నెమీఱఁగను దోవతికట్టు కట్టి
పైమించు గజముపచ్చళ్లి పచ్చడంబు
వామాంగమున వల్లెవాటుగా వైచి
నెఱిమించు తలపాగ నేర్పుగాఁ జుట్టి
కరమొప్పవ్రేళ్ల నుంగరములు వెట్టి
బుజముపై గాజులపొది చాలఁబెట్టి
భుజగేంద్రభూషుండు పురవీథులందు
గాజులుబొద్దులు కమ్మదుద్దులును
గాజులుగొనరారో ! గాజులో ! యనుచు
పచ్చలుబూడెలు పచ్చరఁటాకు
పచ్చలు పొన్నాకు పచ్చగాజులును
నీలాలు మఱితట్టు నీలాలు రంగు
నీలాలు పచ్చల సిగ్గుగాజులును
ఆవపూవన్నె రాజావర్తనములు
గోవాళసరములు గొమ్మనంబులును
పువ్వగగాజులు పొన్నపూచింత
పువ్వులు సంపంగిపూ చామపువ్వ

మరులచూపుల మేనుమఱచిన వారు
పయ్యెదజాఱిన భ్రమసి పాలిండ్లు
ముయ్యఁగాలేక మోములు జూచువారు
పెట్టియు మఱచియుఁ బెట్టలేదనుచుఁ
జట్టువమ్ములను భిక్షము దెచ్చువారు
నైరి యా మునిపత్ను లందఱు నపుడు
నీరీతి మునుకొని యిందుశేఖరుఁడు
వాడల వాడల వరుసతోడుతను
వేఁడుకతో భిక్ష వేఁడి యాసతుల
మదిలోన నెంతయు మరులు పుట్టించి
మదనారి యచటను మాయమై చనియె
నంత నామునిపత్ను లందఱు విరహ
సంతాపములఁ జిక్కి జాడలు దక్కి
మతివిచారమునించి మానముల్ డించి
పతులసేవలు మాని భ్రమనులు బూని
కరములుడస్సి యాకరములు గ్రుస్సి
కరముల గాజులొక్కట నూడిపడియె
నా ఋషులెల్లను నతివలఁ జూచి
మీర లాసర్వేశుమీఁది మోహమున
గడు జిక్కి చేతుల గాజులువీడి
పడియెఁ బతివ్రతాభావమ్ము సడలె
మఱి పోయి మీరలా మధురలోపలను
గరమొప్ప వైశ్యుల కడుపునఁ బుట్టు
డని శాపమిచ్చిన నా యింతులెల్ల
మునుల వీక్షించి మమ్ముల నివ్విధమున
శపియించినను మాకు సద్గతి యేది
కృపగల్గి మమ్ము రక్షింపరె ! యనిన
నా ఋషులిట్లని రా నెట్టులకును
మీర లాపురిని జన్మించియుండినను
మఱికొన్నితిథుల కమ్మధురేశ్వరుండు
నరయ గాజులసెట్టియై యందువచ్చి
యాజటాధరుఁడు మీహస్తముల్ పట్టి
గాజులుపెట్టినఁ గలుగు మోక్షమ్ము

అనినను బ్రియమంది యట్లకాకనుచు
జనియించి రావైశ్య సంతతులిండ్ల
పెరుగుచునుండిరి పెక్కువల్గలిగి
యయ్యెడఁ బెండ్లి ప్రాయములైనఁ జూచి
యియ్యాకుబిడ్డల నెవ్వరికిత్తు
మని సెట్టివర్గము లటు విచారింప
మనసిజసమునుండు మఘురేశ్వరుండు
చొక్కనాయకుఁడు గాజులసెట్టి యగుచుఁ
జక్కఁగా ముతుకవేషముతోడఁ జల్లి
పట్టుసూత్రఁపుబ్రోళ్ళ పైఁడుంగరములు
బెట్టుబసవనిఁ జేసి పెట్టినముద్ర
పట్టువసరిముఖార్చి బాగుగా బిగియఁ
గట్టినదేవుండు కంఠాన నమర
నొసలను వీభూతి నునుపుగాఁ దీర్చి
యొసపరి పెండి కటోరపుగాఁ బెట్టి
సన్నఁపు రుద్రాక్షసరములు వైచి
వన్నెమీఱఁగను దోవతికట్టు కట్టి
పైమించు గజముపచ్చళ్ళి పచ్చడంబు
వామాంగమున వల్లెవాటుగా వైచి
నెఱిమించు తలపాగ నేర్పుగాఁ జుట్టి
కరిముఖ్యవ్రేళ్ళ నుంగరములు వెట్టి
బుజముపై గాజులపోటి శాలఁబెట్టి
భుజగేంద్రభూషుండు పురవీథులందు
గాజులుబొద్దులు కమ్మదద్దులును
గాజులుగొనరారో ! గాజులో ! యనుచు
పచ్చలుబూదెలు పచ్చరఁటాకు
పచ్చలు పొన్నాకు పచ్చగాజులును
నీలాలు మఱిసెట్టు నీలాలు రంగు
నీలాలు పచ్చల సిగ్గుగాజులును
అవపూవన్నె రాజావర్తనములు
గోవాళసరములు గొమ్మనంబులును
పువ్వగాజులు పొన్నపూచింత
పువ్వులు సంపంగిపూ చామపువ్వ

అనినను నేను బాల్యమునందుఁగాశి
చని గంగలోపల స్నానమ్ముఁజేసి
యీ కన్యకుమారి నీతీర్థ మాడి
చేకొనిపోవుచుఁ జెలఁగి యీచిన్న
పసుపుల గాజులు బాగుగా నేరి
తొడుగుచున్నాఁడ వృద్ధుండ నాపేరు
చొక్కసెట్టని చెప్పుచును వారుఁ జూడ
నక్కజమ్ముగ మాయమయ్యె నావేళ
నంత నాబాలల పూరుఁడు చేపట్టి
నంత సద్యోగర్భమైనను జూచి
యావైశ్యులెల్లరు నత్యంత మడలి
బాపురే! యపకీర్తి పాటిల్లె నిపుడు
తమవంశములను నిందలు పుట్టెననుచుఁ
దమకులాంగనలును దారు కన్యలను
నగ్నిప్రవేశమయ్యెడఁ జేతు మనుచుఁ
బ్రజ్ఞపాటించిరి భ్రమసి యాసెట్లు
నప్పుడాస్వామి దయాపరమూర్తి
తప్పని భక్తవత్సల పరాయణుఁడు
ఫణియంజనామక భవ్యదాయకుఁడు
నలువొప్ప శ్రీచొక్కనాయకుం డపుడు
మిక్కిలికంటితో మిన్నేటితోడఁ
జక్కనిభూతితో శశిరేఖతోడ
నాగచర్మముతోడ నగజాతతోడ
భోగికంకణముతోఁ బులితోలుతోడ
నాకులతాశననేత్రుఁ డప్పుడు నంది
వాహనారూఢుఁడై వైశ్యుల యెదుట
నత్యంతభక్తితో నమరులు గొలువఁ
బ్రత్యక్షమయ్యె నా పరమేశ్వరుండు
నప్పుడా వైశ్యులు హరునకు మ్రొక్కి
తప్పనిభక్తితోఁ దగఁ బొగడి రపుడు
గజరక్షణార్చిత! గజవక్త్రజనక!
గజరాజసంరక్ష! గజరాజశిక్ష!
ఘోరపాతకదూర! కుండలిహార!

హారహీరశరీర ! యఖిలప్రపూర !
సురగణాసాధ్య ! భాసురగణారాధ్య !
కరిచర్మపరిధాన ! కరుణానిధాన !
నిరుపమధరచక్ర ? నిపుణనిర్వక్ర
తరపరాక్రమశీల ! దమితాఘజాల !
విధి శిరోమాలికావిభ్రమాభరణ !
మధురాపురీశ ! నిర్మలచొక్కనాథ !
నీ రూపుఁబొగడఁగా నేరవు శ్రుతులు
నీ రూపుఁబొగడంగ నేరఁడాయజుఁడు
నీ రూపుఁబొడగాన నేరరు సురలు
నీ రూపుఁబొడఁగాన నేరరు మునులు
నని యివ్విధంబున నభినుతుల్ సేయ
మనమునఁ గరుణించి మదనాంతకుండు
శ్రీకరమ్ముగను నా సెట్ల కిట్లనియె
మీకులమ్మునను నేమియు నిందలేదు
మును దారుకా వనంబునకును నేను
చని వేడ్కతోడ భిక్షము వేడినంత
నా మునిభామిను లందఱుఁజూచి
కామింప వారిచే గాజులూడినను
మునులు కోపించి యీ పురి సెట్లు గర్భ
మునఁ బుట్టుడనిన నామునిపత్నులెల్ల
మీయందుఁబుట్టిరి మీకులంబెసఁగ
మాయనుగ్రహమున మఱి గర్భమైరి
ఏ కళంకములేదు నీకాలలందు
స్త్రీకూరవధ మీకు నేల పాటింప
మేము నే వెంటను మీవంశమునను
ప్రేమతో నొకకాల పెండ్లియాడెదము
చింతింపవలదని శివుఁడానతిచ్చి
సంతోషమున నదృశ్యంబయ్యె నంతఁ
గులమువారలకెల్లఁ గోర్కులు సెలఁగఁ
జెలులేమిభాగ్యమ్ముఁ జేసిరో యనఁగ
మృదునియంశమ్ములు మేకొని దాల్చి
కడువేడ్కబిడ్డలఁ గనిరి యాసతులు

నెఱయ నాబిడ్డలు నెదిగి యాస్వామి
కొనర సేవలుసేయుచుండి రప్పురిని
నీశుఁడంతటను నింతి నింక నొక్కటెను
నా సెట్టి యింట్లఁ బెండ్లాడుచు నపుడు
ఆకన్యకామణు లపరజన్మమున
శ్రీకంఠకృషుగ్గి చిరతపోధనుల
కాఋషులకుఁ బత్నులై తొంటియట్లు
దారుకావనముఁ దగనుండు రంత
నిదియు ముప్పదియొండు నిటమీఁది చరిత
ముదముతోఁజెప్పెద మునులార వినుఁడి

ముప్పదిరెండవ లీల.

అనుచు సన్మునులతో నా యగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె
ఫాలాక్షుఁడొకనాఁడు ప్రమథులతోడ
కైలాసగిరి మీఁద గనక గర్వాది
సకలదేవతలెల్ల జయజయధ్వనుల
వికసితవదనారవిందులై కొలువ
లీలమై నపుడు ఘళిమంటపమున
నావేళఁ గొలువుండి యమ్మహాత్ములకు
శైవాగమాది శాస్త్రము లానతిచ్చు
నాతఱి పాశ్చాత్తు లార్యులు జడలు
భూతియు రుద్రాక్షములు ధరియించి
యత్యంతకౌతూహలాధ్యక్షులగుచు
ప్రత్యక్ష విధుజూటు శుభ్రవర్ణాంగు
నప్పరమాత్ముని నర్థిఁ బూజించి
తప్పక భక్తితాత్పర్యము మీఱి
దేవ! సర్వేశ్వర దేవాదిదేవ!
దేవతాధిష్ఠాన! త్రిపురసంహార!
సనకసనందనాద్యనిమిషలోక
మునిగణవందితమూర్తి త్రయాత్మ!
అంబికాహృదయేశ! అంబరకేశ!
శంబరారిధ్వంస! చంద్రావతంస!
హాలాస్యేశ్వర! యొకవిన్నపము

మాయెడ దయయు సన్మానమ్ము గలిగి
నట్టి మహాసిద్ధు లనువంద మాకు
నిష్టమై యుపదేశ మిచ్చి రక్షింపు
సకలార్థతత్త్వజ్ఞ ! సకలలోకాజ్ఞ !
సకలతత్త్వజ్ఞాన ! సచ్చిదాకార !
యని సన్నుతులు సేయ నభవుండు మెచ్చి
వినుఁడని వినిపింప వినకను వారు
నావేళ వేఱె పరాఙ్ముఖులగుట
భావించి వారి యాభావమ్ము దెలియ
నప్పుడు తబ్బిబ్బులై యానతిచ్చె
నప్పుడెఱుఁగక వార లట్లై భావింపఁ
గోపించి యాయాఱుగురిఁ జూచి యేను
దీపింప మీ కుపదేశమ్ము సేయ
చుండఁ బరాకులై యుండుటఁ జేసి
పాండ్యమండలమునఁ ఒట్టి మంగళము
ననియెడు గ్రామంబునందుఁ బెంపొందు
ఘనమైన యొకపుట్ట కలదందు క్రింద
మీరార్గురును నట్టి మేటివృక్షమ్ముఁ
జేరి తారూపులై చెందుఁడచ్చటను
నని శాపమిచ్చిన నతిభీతిఁ బొంది
తనర నాస్వామికి దండప్రణామ
ములు జేసి ఫాలాగ్రమున మోడ్పుచేతు
లలరంగఁ జేరి యాయతివరిట్లనిరి
ఈస్వామి యపరాధ మోర్చి యీయెడను
నోస్వామి దాసులమైన మాయందుఁ
గరుణార్ద్రవృష్టిచేఁ గరుణింపు దేవ
మురభంజనప్రియ ! ముదమొంద మాకు
నదిగాక సర్వాత్ముఁడైన నీవెందుఁ
గొదలేకయుంట మాకును జంచలత్వ
మెందుఁ గల్గిన నేమి యెల్లజీవంబు
లందు మీరుండుట లది సందియంబె
జీవుండు శివుఁడును శివుఁడు జీవుండు
నావార్త వినమె యామ్నాయమ్ములందు

నేఁయ నాబిడ్డలు నెదిగి యాస్వామి
కొనర సేవలుసేయుచుండి రఘ్వరిని
నీశుఁడంతైను నింతి నింక నొక్కతెను
నా సెట్టి యిండ్లఁ బెండ్లాడుచు నపుడు
ఆకన్యకామణు లపరజన్మమున
శ్రీకంఠకృపగల్గి చిరతపోధనుల
శాబుఋషులకుఁ బత్నులై తొంటియట్లు
దారుకావనమునఁ దగనుండి రంత
ఇదియు ముప్పదియొండు నిటమీఁది చరిత
ముదముతోఁజెప్పెద మునులార వినుఁడి

### ముప్పదిరెండవ లీల.

అనుచు సన్మునులతో నా యగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె
ఫాలాక్షుఁడొకనాఁడు ప్రమథులతోడ
కైలాసగిరి మీఁద గనక గర్భాది
సకలదేవతలెల్ల జయజయధ్వనుల
వికసితవదనారవిందులై కొలువ
లీలమై నపుడు మణిమంటపమున
నావేళఁ గొలువుండి యమ్మహాత్ములకు
శైవాగమాది శాస్త్రము లానతిచ్చ
నాతఱి షాణ్మాతు లార్యులు జడలు
భూతియు రుద్రాక్షములు ధరియించి
యత్యంతకౌతూహలాఢ్యాత్ములగుచు
ప్రత్యక్ష విధుజూటు శుభ్రవర్ణాంగు
నప్పరమాత్ముని నర్థిఁ బూజించి
తప్పక భక్తితాత్పర్యము మీఱి
దేవ ! సర్వేశ్వర దేవాదిదేవ !
దేవతాధిష్ఠాన ! త్రిపురసంహార !
సనకసనందనాద్యనిమిషలోక
మునిగణవందితమూర్తిత్రయాత్మ !
అంబికాహృదయేశ ! అంబరకేశ !
శంబరారిధ్వంస ! చంద్రావతంస !
మాయాశ్వరేశ్వర ! యొకవిన్నపము

మాయెడ దయయు సన్మానమ్ము గలిగి
నట్టి మహాసిద్ధు లనువంద మాకు
నిష్టమై యుపదేశ మిచ్చి రక్షింపు
సకలార్థతత్త్వజ్ఞ ! సకలలోకాజ్ఞ !
సకలతత్త్వజ్ఞాన ! సచ్చిదాకార !
యని సన్నుతులు సేయ నభవుండు మెచ్చి
వినుఁడని వినిపింప వినకను వారు
నావేళ వేఱె పరాఙ్ముఖులగుట
భావించి వారి యాభావమ్ము దెలియ
నప్పుడు తబ్బిబ్బులై యానతిచ్చె
నప్పు డెఱుఁగక వార లట్లై భావింపఁ
గోపించి యాయాఱుగురిఁ జూచి యేను
దీపింప మీ కుపదేశమ్ము సేయ
చుండఁ బరాకులై యుండుటఁ జేసి
పాండ్యమండలమునఁ ఒట్టి మంగళము
ననియెడు గ్రామంబునందుఁ బెంపొందు
ఘనమైన యొకమఱ్ఱి కలదందు క్రింద
మీరార్గురును నట్టి మేటివృక్షమ్ముఁ
జేరి తారూపులై చెందుఁడచ్చటను
నని శాపమిచ్చిన నతిభీతిఁ బొంది
తనర నాస్వామికి దండప్రణామ
ములు జేసి ఫాలాగ్రమున మోడ్పుచేతు
లలరంగఁ జేరి యాయతివరిట్లనిరి
ఈస్వామి యపరాధ మోర్చి యీయెడను
నోస్వామి దాసులమైన మాయందుఁ
గరుణార్ద్రదృష్టిచేఁ గరుణింపు దేవ
మురభంజనప్రియ ! ముదమొంద మాకు
నదిగాక సర్వాత్ముఁడైన నీవెందుఁ
గొదలేకయుంట మాకును జంచలత్వ
మెందుఁ గల్గిన నేమి యెల్లజీవంబు
లందు మీరుండుట లది సందియంబె
జీవుండు శివుఁడును శివుఁడు జీవుండు
నావార్త వినమె యామ్నాయమ్ములందు

నని వారు ప్రార్థింప నమ్మహానుభావుఁడు
మనమున హర్షించి మఱి వారికనియె
నాపాండ్యదేశ మధ్యాంతమ్మునకును
బ్రాపించు మధురాపురమ్ములోపలను
జొక్కనాథుని పేర శోభగొంద వచ్చి
యక్కడ మీశాప మటఁ దీర్చివైతుఁ
జనుఁడన్న వారలు సద్భక్తితోడఁ
దనివొంద సాష్టాంగదండమ్ము లొసఁగి
యాదేవు ననుమతి నవని కేతెంచి
యాపాండ్యరాజ్యమ్ము నందు నావత్తి
దారుణభూత బేతాళ డాకినులు
ఘోరమై తనయందు ఘూర్ణిల్లుదాని
భల్లూకమార్జాల పన్నగతతు
లెల్ల నావాసమై యొసఁగినదానిఁ
జక్కనై శాఖోపశాఖల నష్ట
దిక్కులు నొరయంగ ధృతి మించుదాని
నత్యున్నతమ్ముగా నాకాశ మంటి
నిత్యనిత్యమువచ్చి నిర్జరాంగనలు
వెలయంగ యోజన విస్తారమైన
దళముల శయనింపఁ దనరిన దాని
నూడల నహికన్యలుయ్యాల లూగి
యాడంగఁ బాతాళ మంటినదాని
బడిమించియున్న యా వట మటుఁ జేరి
పడఁతులు నార్గురు పాషాణరూప
లై దాని క్రిందట నత్యున్నతముగఁ
బ్రోదిగా నున్న యప్పుడు మఱికొన్ని
కాలమ్ములెన్నేనిఁ గడచిన పిదప
ఫాలాక్షుఁడా మహాభక్తవాత్సల్యుఁ
డటుస్వామి చొక్కనాయక మహాదేవుఁ
డటుకును గురురూపమై యేగుదెంచి
నంత శిలారూపలై యున్నయార్గు
రింతులై తొల్లిఁటి యేప్రభావంబు
లాప్రభావంబుల యవతారముందు

నాశ్రమఠాధ్యక్షు నగ్రభాగమున
నిలిచి సద్భక్తిని నిటలప్రదేశ
మునను హస్తాంభోజములు జేర్చిరంత
జయజయ భూతేశ ! జయతు సర్వేశ
జయ శుభ్రవర్ణాంగ జయ యభ్రకేశ
జయ హరిసంరక్ష జయ రిపుశిక్ష
జయజయ మహాదేవ జయ దేవదేవ !
బాణవత్సల పంచబాణసంహార
ఏణాంకఘనజూట ! యేనఉచ్చాట
యాగమశాస్త్రోతి హాససంకాశ
వేగావతీవేశ ! విమలసర్వేశ
వ్యాఘ్రచర్మాంబర ! వరదయాలోల !
శీఘ్రమ్ముగా నిష్టసిద్ధి మాకిపుడు
నని సన్నుతించిన నమ్మహాదేవుఁ
డనువొందఁ గృపతోడ నట వారిఁజూచి
మఱి యణిమామహిమాగరిమాదు
లరయంగ లఘిమయుఁ బ్రాప్తి ప్రాకామ్య
మీశత్వము వశిత్వ మింపొంద నష్ట
మా సిద్ధిఁ దెలియంగ మఱి యానతిచ్చె
నేచొక్కనాథుండ నెమ్మి నీమధుర
నాచరింతుము నేము ననుచు నాదేవుఁ
డంత నంతర్థానుఁడయ్యె నాస్వామి
సంతోషమంది యాశ్చర్యమ్ము నంది
యీ శిలారూపమ్ము లీయింతు లౌట
నాశివు నానంద మట్టిదే కాదె
యని సన్నుతింపుచు నమరులు మునులు
ఘనముగాఁ గుఱిసి రక్కడఁ బుష్పవృష్టి
యప్పు డాయార్యులు నతివలు వేడ్క
నొప్పగా సౌందర్య నుపదేశ మాత్మ
గీలించి యొంతయు ఖేచరమార్గ
మే లోకమున జెప్ప దేగుచుండుదురు
వూని యీ లీల యెప్పుడు విన్న పుణ్య
మానవులకు ననుమానంబు లేక

చతురబ్ధిమధ్యభూస్థలి నెల్ల నేలి
ప్రతిలేని సౌందర్యపదవిఁ జెందుదురు
ఋషులార! యిదియు ద్వాత్రింశతిలీల
ధిషణవిస్తారు లాది మునీంద్రు లపుడు
నా యగస్త్యుని గొల్చి యటమీఁది చరిత
లాయతభక్తి మా కానతిమ్మనిన
నిది సర్వఘన సత్కవీంద్ర పాదాబ్జ
విదిత పూజామోద విమలాంతు పచ్చ
కప్పుర సౌరభ్య కలితమానాంక
తిప్పరాజ సుపుత్ర తిరువేంగళేంద్ర
విరచితమ్ముగ లోకవిఖ్యాతమైన
సరసలక్షణ కావ్య సత్కవీంద్రాభి
నందిత శ్రీ చొక్కనాథ చరిత్ర
మందున నిది పంచమాశ్వాసము ॥

---

# షష్ఠాశ్వాసము

## ముప్పదిమూఁడవ లీల

శ్రీకర కరుణార్ద్ర శ్రీరామభద్ర
రాధాసుతత్యాగ రంజి నా భాగ
భాగీరథీ వంశ పావనోత్తంస
రాగదోషవిముక్తి రణజయాసక్త
ఒసవభూవర పుత్ర ! భాగ్య చారిత్ర
పొసఁగంగఁ జినరామ భూపాగ్రజాత
వినుగోళ్ల పెదరామ విభవసుత్రామ !
యనుపమ జయధామ ! యధికసత్ప్రేమ !
ఘటజన్ముఁడా మానిగణముల కపుడు
నటమీఁది చరిత మిట్లానతి యిచ్చె
నంత నా పాండీశు హాలాస్యపురము
నంతయు నేడ్కతో నేలుచున్నంత
నటకును గాడ్వెట్టి యను నొక్కరాజు
నిటలాక్షు సద్భక్తినియమమ్ము పూని
పొలుపొంద నా దేవుఁ బూజింపఁ గోరి
వెలువడివచ్చె నావేళ దండెత్తి
వచ్చిన నందు నా వైఖ ప్రవాహ
మచ్చోట నడ్డమై యద్భుతం బెసఁగ
కూలంబులను మించి ఘూర్ణిత ధ్వనుల
లాలితఫేన జాలమ్ముల నెఱసి
కడు నున్నతమ్ముగా గగనమ్ము నొరయ
నెసలేని యూర్ములయ్యెడ ముక్తిసతికిఁ
బరగంగ సోపానపంక్తులు గాఁగ
మఱి సుళ్ళచేతఁ గూర్మము గానరాఁగఁ
దుంపిళ్లు గుఱియుచుఁ దొడరి సౌందర్య
కంపున జనలోకపావనంబైన
యా పుణ్యనది పాఱు చందంబుఁ జూచి
ప్రాపించుఁ దన పాపపటలమ్ము లూడ్చి
యది నుత్తరంబైన యా యేటిదరిని
దటుకున విడిసె నంతయు దండువచ్చి
విడిసినఁ బాండ్య భూవిభుఁడు చింతించి

తడయ కవ్వలికేని దాఁటిరాకుండ
గట్టిగాఁ దగిన మూఁకలఁగూడి యడ్డి
కట్టాయితమ్ముగాఁ గడఁగి యందుండి
నడురేయి శ్రీ చొక్కనాయక స్వామి
గుడికి సద్భక్తిఁ బేర్కొని పూజసేయ
నేవేళ వచ్చునో ! యిది మోసమనుచు
కావళ్లుపెట్టి యా ఘన కవాటముల
నొనరంగఁ దన ముద్దుటుంగరమ్మునను
ఘనమైన ముద్రలుగావించి మఱియు
నిందుల కేతెంచునేని కయ్యంబు
నందు జయించెద ననుచు నా పాండ్య
జనపాలుఁ డప్పుడు సంభ్రమంబునను
నని మొనల్ దీర్చిన నంతఁ గాంతార
విచ్ఛేదకుం డష్ట విస్మయంబంది
విచ్ఛిన్న హృదయుఁడై విధి దూఱిపలికె
కటకటా ! పాండినిఁ గలసి యీ వైఖ
పశుశక్తి మిన్నంది పాఱుచున్నదియు
యుద్ధక్షమునకు నోడి యడురాజధరుని
సిద్ధమ్ముగాఁ గొల్వ సిద్ధింపదాయె
దాయాదై యీ వైఖ దయలేక మీఱి
దాయాదులను గూడెఁ దగ నేమిసేతు
ననుచుఁ జింతాక్రాంతుఁడై చొక్కనాథు
మనమున దలపోసి మఱి సన్నుతించి
ఆ యింద్రుఁ డర్పించినట్టి విమాన
మాయెడ ఘన సువర్ణాంబుజాకరము
నీ పాదసేవయు నిజముగా మాకుఁ
జూపకయున్న నేఁ జూడ ప్రాణములు
వెలయంగ నిచ్చోట విడుతు గాకనుచుఁ
జెలువంద భయభక్తిఁ జింతించు నంత
భానుఁ డస్తాద్రిఁ జూపట్టిన దిశల
పూని సంధ్యారాగపుంజమ్ము లెసఁగె
నుడుపంక్తులెల్ల నత్యున్నతమ్ముగను
పొడిచె నాకాశ సంపూర్ణమ్ముగాను

బంధురధ్వాంతము ల్ప్రబలె నంతటను
నంధకారము విచారాంధకారమ్ము
గప్పి తెలియకయున్నఁ గాడ్వెట్టి కెలమి
నప్పుడా స్వామి కృపావేశుఁడగుచు
నేఁటి కవ్వలి నొక్క యేతమ్ముపన్ని
దాఁటించి యా పాండ్యధరణీశు ముద్ర
నత్తతి జరుపరాదంచును నందు
నుత్తరప్రాకార మెయ్యన నొక్క
చోట వాకిలిఁ దీసి చొరనిచ్చి యతనిఁ
బాటించి యా రాత్రి పగలు గావించి
సౌవర్ణ సరసిలో స్నానమాడించి
దేవేంద్రుఁ డిచ్చిన దేదీప్యమాన
దివ్యవిమానమ్ముఁ దెలియంగఁ జూపి
భవ్యుఁడా తన మూర్తి భావింపఁజేసె,
నప్పుడా కాడ్వెట్టి యానంద మంది
తప్పని భక్తితోఁ దాత్పర్యమెసఁగ
వెలయంగఁ బదియారు విధముల పూజ
లలరంగఁజేసి తా నభినుతుల్ జేసె
ఓ దయాపరమూర్తి ! యో యాత్మకీర్తి
యో దేవ ! మహాదేవ ! యో సర్వదేవ !
స్థావరజంగమ సంహార హృదయ
యో చిన్మయానంద ! యోగీంద్రవంద్య !
శ్రీ చొక్కనాయక ! శ్రీ మహాదేవ !
నీ పాటవీగేహ ! నిర్మలదేహ !
నీ పాదసేవచే నినుఁ జూడఁగంటి
నని తన్మయావస్థుఁడై యప్పుడంతఁ
దనుదానె మఱచును దనుదానె తెలియు
నీ ప్రకారమ్మున నెంతేని వేడ్క
నా ప్రమథాధీశు నర్థితోఁ బొగడె
నంతఁ గాంతారసంహారకుఁ జూచి
కంతుసంహారుండు కరుణించి యపుడు
నతని సద్భక్తికి నాత్మలో మెచ్చి
యతఁడు కోరిన వరములన్నియు నిచ్చి

తులదూఁగు పాండ్యునితోడి యుద్ధమ్ము
లలరఁ గావింతు నంచరుగుదెంచితివి
యట్టివాఁడవ యోధు వైన నీ కిపుడు
గట్టి మూఁకలులేవు గావున నిపట
సమరమ్ము నతనితో సలుపంగలేవు
క్రమముతో నీ రేయి కదలు మవ్వలికి
ననుచు నాతని నేఁటి యవ్వలి కనిచి
తనర నా వాఁకిటఁ దగ బసవముద్ర
పెట్టినఁ గనుగొని పేర్చి యా రాజు
పెట్టు కావలులెల్ల బెదరి యావేళ
భయమంది వచ్చి యా పాండ్య భూపతికి
రయముతోఁ జెప్ప సంభ్రమలీల నతఁడు
వేవేగఁ దన మంత్రివితతులతోడ
నావేళఁ జనుదేర నందఱుఁ జూచి
మఱి చొక్కనాథుని మహిమలుగాక
వరుసతో నివి యొట్టివారికి వశమె!
యనుచు నాశ్చర్యుఁడై యా పాండ్య విభుఁడు
మనమునఁ జింతించి మఱియు నిట్లనియె
నో దేవ! యిటు నేయ నుచితమే నీకు
నాదు దాయాదికి నయమీయఁ దగవె?
యనుచు నా రాజేంద్రుఁడా రాత్రి చింతఁ
గనుమూయ నాతని కలలోన నపుడు
సౌందర్యనాయకస్వామి విచ్చేసి
యిందుకు సంతాపమే ! భూపాల !
నతఁడు మా మీఁదను నతిభక్తుఁడగుట
న తనికిఁ జూపితి నంతయుఁ దెలియు
మని యానతిచ్చిన నంత మేల్కాంచి
తన మంత్రులకుఁ జెప్పి తగ వేడ్క నుండె
వేఁగ నా కాంతార విచ్ఛేదకుండు
సాఁగెను తనదు రాజ్యమ్మునకు నంత
నీలీల విన్నను నెఱమితో వ్రాయఁ
జాలంగఁ బఠియించు సద్భక్తులకును
నారణ్యభయము జన్మారణ్యభయము

ఘోరమై సద్భక్తి ద్రోవఁ బొందుదురు
నిదియు ముప్పదిమూఁడు నిఁకమీఁది చరిత
మునుకముతోఁ జెప్పెద మునులార వినుఁడి.

## ముప్పదినాల్గవ లీల.

అనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియెఁ
ఒరగ నాహాలాస్య పట్టణమ్మునను
వరుసగోఁ బాండ్య భూవరుఁడు సోంశేక్క
సౌందర్యనాథుని సద్భక్తివలనఁ
పొందుగానా పాండ్య భూపాలకుండు
పొగడంఁదఁ దనజాతి పొలఁతుల యందుఁ
దగఁ బెండ్లియాడ కెంతయు వేడ్కతోడ
కామాంధుఁడై వారకాంతల నందుఁ
గామించి పెండ్లాడి కాలమ్ముగడపు
చుండుచోఁ జోడ భూజోత్తమాహ్వయుఁడు
పాండీనితోడి సంబంధమ్ముకొఱకు
మాకుమార్తెను మీకు మనువుగా నిత్తుఁ
గైకొమ్మటంచును గడఁకతో మీర
లన్నరనాథుని యగ్రభాగమున
నిన్నియుఁ దెలియంగ నెఱిఁగింపుఁడనుచు
తలఁపంగఁ దనదు దూతలతోడఁ జెప్పి
పొలుపొంద హాలాస్యపురికిని బంపె
నా పయి వారలు నతివేగఁ బోయి
యాపాండ్యభూవరునకు విన్నవింప
నా వార్త లాతని యనుజన్ముఁడెఱిఁగి
వేవేగ నాచోళవిభుని రాజ్యమున
కేఁగి నీపుత్రిక నీపంపు మాకు
లోఁగక చోళ భూలోకేశ ! యనిన
నతఁడు నాతనితోడ నని సేయ నోడి
ధృతిలేక నాకుమార్తెను బెండ్లిచేసెఁ
జేసిన నాపాండ్య శేఖరాత్మజుఁడు
రాశకెక్కిన చోళరాజును గూడి
తెలివంద నుత్తరదేశాధిపతుల

దళతంత్రములతోడ ధర గ్రక్కటిలఁగఁ
దమయన్న పాండ్యభూతలపతి మీఁద
గమకమ్ముగా దండుగదలె నత్తఱిని
నారాక యెఱిఁగి పాండ్యావనీశ్వరుఁడు
శౌరి సౌందర్యుని గుడి కేగుదెంచి
యోభక్తమందార ! దేవా చొక్కనాథ !
ఓభర్గ యోయుగ్ర యోనీలకంఠ !
గానైకలోల ! శ్రీకరుణాలవాల !
యట చోళభూకాంతుఁడా యుత్తరంబు
పటుతర సేనాధిపతులను గూడి
నామండలం బెల్ల నాతమ్ముఁడిట్టు
నామీఁద దండెత్తి నడుపుచున్నాఁడు
యోకృపాంభోరాశి ! యొకఁడ నే డాసి
చేకొని యుద్ధమ్ము సేయ నావశమె
యీకదంబాటవి కీశుఁడవైన
నీకృప నాయందు నిలుపవే దేవ
సౌందర్యనాయక ! సకలాండజనక !
యిందు కుపాయమ్ము లేమైనఁ జేయు
మూహించి యని యప్పుడొగి సన్నుతించి
యా పూరుఁడశరీరియై యానతిచ్చె
నో పాండ్యభూవర ! యొక యోజనమ్ము
నేవు దీపింప నీ వేలుసేనలను
గూడుక నెదురేగి ఘోరమ్ముగాఁగ
నాడ యుద్ధము సేయు మట వారితోడ
నీవెంటఁ దోడుగా నేను వచ్చెదను
వేవేగఁ జనుమన్న విని పాండ్యవిభుఁడు
ఘనతర సంతోషకలితుఁడై యపుడు
మనమున నాస్వామి మహిమ లెన్నుచును
రథగజాశ్వములు వీరప్రవాహములు
పృథులమై కొలువఁగాఁ బృథివి కంపింప
నరిగి శత్రుల యోజనమ్మున నెదిరి
పడగ లాకాశమ్ము ప్రబలి నర్తింప
నాచోళభూపాలుఁ డట్లు కావింప

భూచక్ర మద్రువ నద్భుతలీలఁ జేరి
యిరుసేన లంతంత నెదిరించి రంత
శరధియు శరధియు సంధించినట్లు
గగనమ్ము గగనమ్ముఁ గదిసినయట్లు
తగమించి తలపడి ద్వంద్వయుద్ధమ్ము
నొకఁడు లక్ష్యము సేయ నొకఁడేయు శరము
వికలత నడుమున వెసఁ ద్రుంచువారు
పొలుపొంద మొదలను బూనిన పూన్కిఁ
దల త్రెళ్లియును శత్రుతలఁ ద్రుంచువారు
విరథులయ్యును బ్రతివీర రథ్యముల
కుతికి చక్కాడెడి యుగ్రయోధులును
దొడరి వారణములఁ ద్రుంచి మావంతుఁ
బుడమిపైఁ బడవేయు భూరిసాహసులు
రట్టడి రౌతుగుఱ్ఱములతోడ నొక్క
పెట్టునఁ దెగవేయు బిరుదురాహుతులు
గఱిగ్రుచ్చి తనువున గాఁడుబాణములు
వెతికి వైరుల నేయు బిరుదుబంటులును
వలయున ఘనవీరసంఘముల్ రణము
సలుపంగ నాయిరుసైన్యంబులందు
నరయఁగ ద్విరదము లరదముల్ గాఁగ
నరదముల్ గజములై యవనిపైఁ ద్రెళ్ల
వరవీరభటులు నశ్వములైరి మఱియు
పరగనశ్వములు గాల్బలములై యొప్పె
నవని ప్రాలిన కరులచలముల్ గాఁగ
నవచామరములు ఫేనంబులుగాఁగ
ఘనతురగములు నక్రమ్ములుగాఁగ
ధనువు లాశీవిషతండముల్ గాఁగఁ
ఖడగలు జలగణ పంక్తులుగాఁగ
వడిశిరోజములు శైవాలముల్ గాఁగ
రథచక్రములు కూర్మరాజులుగాఁగ
రథములు యానపాత్రమ్ములుగాఁగ
తేలెడి ఢక్కారవ తెఱలును గాఁగఁ
గాలాటి ? శంఖకర్కటములు గాఁగఁ

సకలాయుధములు మత్స్యంబులుగాఁగఁ
బ్రకటిత కోపాగ్ని బడబాగ్నిగాఁగఁ
ఢక్కానినాదముల్ తుములమ్ముగాఁగఁ
జేకొన్న జయలక్ష్మి శ్రీలక్ష్మిగాఁగ
ముక్తాతపత్త్ర మంబుజములు గాఁగ
రక్తపూరమ్ము నీరంబులుగాఁగ
నంభోధిచందమై యద్భుతంబెసఁగ
జృంభితహృదయులై చెలరేగి సలుపు
నయ్యెడ నిరువాగు నతిఘోరయుద్ధ
మయ్యె సురాసురులందు లేదయ్యె
నప్పుడు తీవ్రాంశుఁ డధికమై పొడవె
డప్పిచేఁ జొడని దళతంత్రమెల్ల
మడిసె నయ్యుద్ధాన మడియుటకాకఁ
పాండీఁడు శివభక్తిఁ బరుఁడౌట నతని
దండును దగఁ గాలధర్మంబువలన
నందిన సమరంబు నం దేగువారు
చెందిన దాహమ్ముచే నొచ్చువారు
నై యున్న నంత నాహాలాస్యవిభుఁడు
నెయ్యంపుభక్తుల నెమ్మనంబందుఁ
బాయకున్నట్టి యా ప్రాణవాత్సల్యుఁ
డాయెడఁ జొక్కనాయకుఁ డాదిమూర్తి
జంగుళి దైవవేశ్యా భుజంగాంకుఁ
డంగజ భస్మాంగుఁ డఖిలాంతరంగుఁ
డాపాదమస్తకం బాద్యంతమెల్లఁ
బ్రాపింప భూతిరుద్రాక్ష లింపొంద
ధరియించి కాషాయదండముల్ పూని
శిరమున జడలు నంచితలీలఁ దాల్చి
చలివేంద్ర జంగమై సలిలప్రవాహ
ములుగాఁగఁ గావళ్లు ముంచుక వేగ
వచ్చి యా పాండ్యభూవరు సైన్యములకు
నచ్చటఁ జలివేంద్ర యమరఁ గావించి
యధికవాసితమైనయట్టి తచ్ఛైత్య
మధురాంబుపూరముల్ మది కింపుగాఁగ

ప్రజత్పృష్ణ దీఱ ధీరత్వమ్ముచేత
నిజభక్తిఁ బోసి మన్నించె వారలను
నప్పుడాఁకలి దప్పి యంతయుఁ బాసి
యప్పాండ్య విభుసేన యాటోపమునకు
వీరత్వమడర దోర్వీర్యమ్ము లడర
వైరిసేనఃను సర్వమ్మును గూల్చి
యనఘు నాచోడని నాపాండ్యరాజు
ననుజన్ము నటువేగ నవలీలఁ బట్టి
యాపాండ్యరాజేంద్రు నగ్రభాగమున
రూపించి పెట్టిరి యాధిగాఁదెచ్చి
యంత నదృశ్యుఁడై యరిగె నాస్వామి
కొంత నా బలివేంద్ర పోయె నారీతి
నయ్యెడ సాశ్చర్యుఁడై పాండ్యనాథుఁ
డయ్యెడ మధురాపురీశ్వరుండైన
శ్రీచొక్కనాథుఁ డూర్జిత కృపాంభోధి
నాచోట దయగల్గి నన్నుపాలించి
బలివేంద్ర పెట్టి యా జనుల రక్షించి
వెలఁగి యీ జయలక్ష్మి చేర్చె నాకనుచుఁ
దనయనుజునిఁ జోళధరణీశుతోడఁ
గొని చొక్కనాథుని గుడికినిఁ బోయి
యాస్వామి సముఖాన నతివేడ్కఁ బెట్టి
యాస్వామి యని భక్తి యొనరఁ బ్రార్థించె
నంచితోమాసంగ ! యతనుభస్మాంగ !
సంచితవేదాంగ ! జలధినిషంగ !
సురనదీజూటాంగ ! శుభ్రవర్ణాంగ !
కరధృతసారంగ ! కరుణాంతరంగ !
నరహరిమదభంగ ! నవ్యమోహాంగ !
సరససద్గుణసంగ ! శరభవేషాంగ !
భక్తసంరక్షాంగ ! ఫణిభూషణాంగ !
వృక్తసజ్జనభృంగ ! వృషభతురంగ !
భవభయ గుణభంగ ! పార్వతార్ధాంగ !
శివ శివ ధవళాంగ ! శ్రీ చొక్కలింగ !
వీరిఁ జేసెడి దేమి వేవేగ నాకు

ఘోరున నానతీ భూతగణేశ
యని విన్నవించిన నశరీరి యగుచు
మనుజేంద్ర ! జయము నీ మనను రా నయ్యె
నింక నీదు తలఁపున కెట్లు గావలనె
నొకటి నీ వారల నొగి నట్లు సేయు
మని దేవదేవుండు మఱి యానతీయఁ
దనరంగ సాష్టాంగ దండమ్ము వెట్టి
సంతోషితానంద సంపూర్ణుఁడగుచుఁ
గొంత సేపా దేవుఁ గొలిచి యా పాండ్య
భూమీశుఁడా చోడ భూమీశుఁ జూచి
రా ! మహీపాల ! నీ రాజ్యమ్ము నేయు
మంచును వస్తు వాహనము లెన్నేనిఁ
గొంచుఁ బొమ్మంచుఁ బేర్కొని యిచ్చి పంపి
తన యనుజన్మునిఁ దగఁ గావ లూడ్చి
యొనరంగ నీ యిచ్చ నుండు మటంచు
మజ్జన భోజనాంబరముల యందు
సజ్జననాథుఁ డొయ్యనఁ బొందుపఱచి
యాతనిఁ గట్టడ నటుచేసి వెలయు
భూతలంబేలె నా భూతేశుకృపను
నిదియు ముప్పదినాలుగిట మీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి.
యనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె,

ముప్పదియైదవ లీల.

మఱియును నా స్వామి మహిమలు నచట-
వరుసతోఁ దరు పుష్పవన మనఁగలదు
నాయూర జొన్నాయి యను వారవనిత
శాయజాంతకు భక్తి గల్గి యే ప్రొద్దు
దనకును వచ్చు నాదాయమంతయును
ననుదినమ్మును జంగమార్చన సేయు
నెందరే నొడయలు నేగుదెంచినను
విందు వెట్టినయట్లు వేసర కిడుచు
మరుని యుత్సవ విగ్రహమ్ముగా నొకటి

తిరుమేను నేయింతు దేవుని కనుచు
మైనాన రూపించె మఱియుఁ గ్రామమున
మేను సేయింప నేమియు వగలేక
తన విశేషముగూర్చి ద్రవ్యంబు పుచ్చు
కొని జంగమార్చన కూడదనుచుఁ
జింతింపుచున్నంత శ్రీ చొక్కనాథుఁ
డంతట సిద్ధుఁడై యచటికి వచ్చి
యొడయల పంక్తిఁ గూర్చుండి భోంచేసి
విడిసి యా యొడయల వెంటఁ బోకున్నఁ
బరమసిద్ధునిఁ జూచి భక్తురాలతని
చరణమ్ములకు సాగి శరణార్థియనినఁ
దరమైన సొమ్ములు తనువునఁ బూని
గురువింజపూస ముక్కునబెట్టి నీల
మనిన నా బాలిక యతి భక్తితోడఁ
దన నోరుమూసి పాదము బట్టికొనఁగ
మగువ ముక్కుల ముత్యమాయె, నా తపసి
నగుచు విభూతి జొన్నాయికిఁ బెట్టి
యరయఁ గన్నులనీల మధరంబు కెంపు
వెర వొప్పఁ గురువింద విధమాయె ననిన
నా సతి తనయందు నాస నున్నాఁడు
నీ సిద్ధుఁడని వచ్చి యిందుండ నేల
విచ్చేయు లోనికి వేడ్కతో ననిన
నిచ్చ లే దబల! మా కేమిటి మీఁద
నీ మది చింత మానిచి పోదు ననుచుఁ
బ్రేమతో మధురాపురి న్విడి వచ్చి
తని చెప్పి నీ యింట నంతయుఁ గలుగు
నినుప ముత్తెల్లను నిట తెమ్మి యనిన
నిల్లు శోధించి యా యినుమెల్లఁ దెచ్చి
మొల్లమ్ముగా సిద్ధు ముందరఁ బెట్టు
నవి కొల్ల ముద్దగా నపుడు సేయించి.
యౌషధం బొక్కటి యందువైఁ బూసి
యిడి యగ్ని పుటమున నీ. బ్రొద్దె పెట్టి
పదియాఱు వన్నెయ బంగారమగును

నీ ద్రవ్యమున నీవు నెల్లకాలమ్ము
నాదరమ్మున నీవు నన్నమ్ము వెట్టి
సంగతి నీకు నివ్వకు వచ్చినట్లు
జంగమార్చనచేసి శంభు విగ్రహము
దేవుని నేయించు తిరముగా మదిని
భావించి మా పైని భక్తితో నుండు
మని యానతిచ్చిన నా దారవనిత
మనమున సంతోష మహిమ నుప్పొంగి
చిరతరసిద్ధ ! యో సిద్ధస్వరూప !
యిర వొంద మీరు మాయింట నీ ప్రొద్దు
నిద్రింపవలె నని నెమ్మితోననిన
భద్ర నాగాజి నాంబర ధారుఁడపుడు
వేశ్యల మాయకు వెఱచిన యట్లు
దృశ్యమై హాలాస్య దేవునిఁ గలిసె
నంత నా జొన్నాయి యా సిద్ధుమీఁద
భ్రాంతురాలై మది పాయకయుండె
వెస వేచి యినుమును వేఁగఁ జూచినను
బసగల యపరంజి బంగారమయ్యె
నా విధమంతయు నా యూరివారు
భావించి యాశ్చర్యపడి చూచిరంత
నా యర్థమునఁ జేల్వమైన దేవునిని
జేయించి యా దేవు చెల్వమ్ముఁ జూచి
నిండిన ప్రేమతో నీరజగంధి
రెండు హస్తములతో రెండు చెక్కులను
నిద్దంపు గోళ్లను నెమ్మితో గిల్లి
ముద్దు వెట్టికొనెను మోహమ్ముతోడ
నా నఖక్షతములు నా దేవుమీఁదఁ
గానంగవచ్చు నిక్కముగాఁగ నిపుడు
తనర నా స్వామి సౌందర్యమై యుండి
నను పేర సౌందర్య నాయకుండయ్యె
నా యమ్మ సద్భక్తి నా స్వామి కృపను
నా యూరివారలు నా సీమ ప్రజలు
సంతోషములను నాశ్చర్యమ్ముగాఁగ

జింతించి కొల్చిరి శ్రీ చొక్కపతిని
నల సిద్ధపురుషుని నతివ యేప్రొద్దు
తలఁపునఁ బాయక ధ్యానమ్ము సేయ
దివ్యవిమాన మా దేవుఁ డంపినను
భవ్య సంతోష సంభ్రమ లీల నెక్కి
కాయమ్ముతోడ శంకర లోకమునకు
నారూఢ జోన్నానయాఁకు వేంచేసె
సువిద వారాంగన య్యుండియు మిగుల
శివభక్తి గలిగియు శివలోకమునకు
బోందితో నరిగె నెప్పుడు మానవులకు
సౌందర్యుపై భక్తి చాలఁ గలిగినను
బహుళమ్ములైన సంపద లొందఁజేసి
యిహ పరసౌఖ్యమ్ములిచ్చు నా స్వామి
యిదియు ముప్పదియేను నిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార ! వినుఁడి
యనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.

## ముప్పదియారవ లీల.

కుఱి మించి మధుర భూమండల మెల్ల
నెరయఁ బాండియరాజు నెమ్మిఁ బాలింప
బలియుఁడై చోళభూపాలుండు మఱియు
వెలయంగ నప్పు డావేయు గుఱ్ఱముల
రాతుల కే నొక్క రౌతు నటించు
ఖ్యాతిగాఁ దను నర్థిగణములు బిరుదు
గొనియాడ మూఁడు దిక్కుల రాజవరుల
మునుకొని గెల్చి యా మొనలఁ దోడ్కొనుచుఁ
జతురంగ బలములసంఖ్యముల్ గొలువ
ధృతి మించి దక్షిణ దేశమ్మునకును
దండెత్తె నప్పుడు ధర గ్రక్కదల్లఁ
బాండిని మీఁద సంభ్రమలీల తోడ
నా పాండ్యవిభుఁడును హరభక్తిపరత
నా పరమేశ్వరు నా చొక్కనాథుఁ
డే కాక నా కొండు నేలంచుఁ బిక్కి

నా కేల ప్రజవేల నా కెవ్వ రుండు
నూ కేనుఁగులు పదినూలు తేజీలు
నూలునూర్లగు జనుల్ నూత్న సంబంధ
ములతోడ గల రథంబులు గల్గ నాకు
నదిగాక శ్రీ మన్మహాదేవ దేవుఁ
డిది కారణమ్ముగా నిందుండు నెపుడు
నా చోళభూపాలుఁ డధికసన్నాహ
మూ చోటుఁగూడి తా నరిగిన నేమి
యా చొక్కనాథుని ధ్యానమంత్రంబె
ప్రోచి యే యాపదల్ పోఁ ద్రోయు నాకు
నే పరివారమ్ము నేల పొమ్మనుచు
నేపారఁ దన ధనంబెల్లఁ దెప్పించి
యా దేవదేవుని కధికమ్ముగాఁగ
సాదరమ్మున నిచ్చి సద్భక్తి మఱియు
మాహేశ్వ రార్చనల్ మఱియు సర్వేశు
గేహమ్ములకును మిక్కిలిగాఁగ నొసఁగి
పరగ నా తొల్లిఁటి పరివారములకు
గరిమతో నిచ్చినఁ గాదన లేక
నందుఁ గొందఱు మంత్రులట సమ్మతింప
నందులో మఱికొంద ఱాత్మఁ దలంచి
చింతించి సమ్మతస్థితులు గాకుండి
రంత నా చోళ భూపాగ్రణి యధిక
సేనా సమేతుఁడై వెలువడు నట్టి
యానోద్యమసనాథుఁడై చాల వెలసి
కడఁగి భూలోక మొక్కటఁ బిక్కటిలఁగ
నడచె నా పాండ్యమండలి చక్కనేయ
నా వార్త విని పాండ్యుఁ డాత్మ నేమఱక
వేవేగ సౌందర్యవిభుని సన్నిధికిఁ
జేరి చేతులు మోడ్చి శివ మహాదేవ
ఘోరపాతకదూర ! కుండలిహార !
హారహీరాకార ! హరిణాంకధార !
దారుణత్రిపురదైత్య ధ్వాంతతపన !
మధురేశ చోళ భూమండలాధీశుఁ

డధికమై యిట నైత్తె నదియునుగాక
దురములో వేయి రౌతుల కెల్ల నేను
హరియింప నొక్కండ ననుచుండె నిపుడు
వివరింప నాకును వేయి గుఱ్ఱములు
నివి పోయినంత నే నెట్లోర్వంగలను
రక్షింపు నాస్వామి రక్షింపు దేవ !
దక్షాధ్వరధ్వంస ! దండితత్రిపుర !
యని విన్నవించిన నాదేవుండు చటు
జననాథ నీకు నీ జయమందంజేతు
నెడకుక దంటెత్తు మెదురుగా ననుచు
వడి నానతిచ్చిన వసుధేశుండపుడు
కొంగున ముడివేసికొని వానిందలంచి
యంగాన భూతి రుద్రాక్షలు దాల్చి
చని తన కొంచెంపు సైన్యమ్ముగూడి
పినుతిగా నా చోడవిభు నెదుర్కొనియె
నక్కడం జోడని యా బలమ్ములకు
నెక్కుడు సేనలై నిండి చూపట్టె
నప్పుడిద్దఱి సేన లంతంతం గదిసి
తప్పక ద్వంద్వయుద్ధము సేయుచోట
వ్రాలెను బంధురధ్వజ ఖండసమితి
కూలె రావుతులతో ఘోటకమ్ములును
రాలెను భటరాజి రాజమస్తకము
లోలిగా వ్రయ్యలై యురుమౌక్తికములు
తూలెను భటుల సందోహముల్ గాలు
కాలును బెనచుక కాలుని వురికి
సోలె రాజశ్రేణి సొరిది భూతముల
జాలంబు లాడె మాంసమ్ములు మెసంగి
యీరీతి ధీరత్వ మేపు దీపింపం
బోరుచు నాచోడభూమీశు సేన
యాహవమ్మున నోడె నంత నారాజు
సాహసమ్మునం బేర్చి సన్నద్ధుండగుచు
నేమి నాబిరుదెవ్వ రెఱుంగరా యనుచు
నా మనోవేగమ్మైన యశ్వమ్ము

ఠెక్కుగాఁ బాండీని నేనలమీఁద
నెక్కి తొక్కుడుగాఁగ నిల గ్రక్కటిల్ల
నప్పుడా పాండీడు నాచొక్కనాథుఁ
దప్పక నాత్మలోఁ దగ సంస్తుతించె
నాయాపదుద్ధారుఁడైన యాస్వామి
బోయకాఁడై తలబొమిడిక పెట్టి
నీలి మించినధట్టి నేర్పుగాఁజుట్టి
మేలిపైనట్టి యా మెయిజోడుపెట్టి
వెలయంగ సింగాణి విల్లు చేపట్టి
రూలిపై చెవిసాకు లొనరంగఁబెట్టి
తురగమ్మునకుఁ బులితోలు పక్కెరయు
మఱికందు పక్కెర మహనీయహానువు
బిరుదువాగెయుఁ గాళ్ల బిరుదుటందియలు
నెఱిమొకరమ్మును నెమలికుంచెలును
జల్లులు నాదిగా సంజోకమెల్ల
నొల్లెడ సవరించి యేపుతో నెక్కి
జాయని జంకించి సన్మైట్రవేసి
యారౌడఁ జోడని కప్పుడిట్లనియె
వేగురు రాహుత్త వితతి నొక్కఁ డను
వేగంబె గెలుతు నావెలయు నీబిరుదు
పేర్కొని నీవంటి బిరుదు రాహుతుల
మార్కొని వేవుర మఱిగెల్చు బిరుదు
నాకును గల దిదే ! యను జూడుమనుచు
భీకరాకృతితోడఁ బేర్చి యారౌతు
నాటోపమొసఁగఁగా నద్భుతంబుగను
గాటమై తగ నిరాఘాటమ్ముగాఁగ
ప్రోల నున్నట్టి యా మూఁకలఁగొట్టి
తాలంగఁ బైగిట్టి సమయంగఁ గొట్టి
మీటరై చోడనిమీఁద నాహయము
దాఁటించి వేలాయుధమ్ము చేపట్టి
వేసిన నాశక్తి వేగమై తాఁకి
రాశిగా రక్తపూరమ్ములు గాఱ
గాఱిన వెఱఁగంది గాయమ్ము చెంది

మీఱి కోపాగ్నిచే మృడున కిట్లనియెఁ
పోరిలో నెదురంగఁ బోలరు నన్ను
శూరు లెందైనను శూరత్వమునను
నీరీతి ననుజూడు మెందుఁ బోయెదవు
చేరి గుఱ్ఱము నిన్ను జేర్చిగుదియంగఁ
బట్టుగాఁబట్టి యిప్పట్టున నాదు
పట్టణకు గొంపోదు పటురయమ్మునను
ననుచును జోడఁడు నతిభీకరోగ్ర
మున వాజియున్నతంబుగఁ బేర్చి యెక్కి
ధేయని సాహసోద్రేకమ్ముతోడఁ
గాయజాంతకు మీఁదఁ గదలించి యెక్కె
నెక్కిన నాస్వామి యెదురంగ లేక
పక్కనఁ గడువేఁగి పాఱినయట్లు
హాలాస్యపురము చాయకు వాజినెక్కి
యాలమ్ములోఁ బాసి యట వేఁగపోయె
హా యని పెడబొబ్బ లార్పులు సెలఁగ
నదె పాఱె పాండీడు నదె పాఱె పట్టు
డదె పాఱె నంచును నతితీవ్రముగను
దనమంది గుఱ్ఱముల్ తానును గదలి
వెనుకొని దగ్గఱి వెస నేగునంత
తగిలించి పశ్చిమద్వారంబునందు
నగడిత దాఁటించి యరిగె నాస్వామి
చూడఁ జోడఁడు తన గుఱ్ఱమ్మువేగ
నాడ నే దాటింతు ననుచు జంకించి
కడపంగలేక నగడిత నెన్నడుమఁ
బడి యందు నడఁగె నాప్రజతోడఁ గూడ
నంత నదృశ్యమ్మునయ్యె నాదేవుఁ
డెంతయుఁ దనగుడి కెలమి విచ్చేసె
నందు వసించుటఁ జేసి యా యగడ్తకును
గొందాళి యనుపేరు కొమరొప్పఁ బరగె
నప్పుడా పాండీడు నాచోళవిభుని
తప్పిన సేనలంతయుఁ బట్టితెచ్చి
సౌందర్యనాథుని సన్నిధిఁబెట్టి.

యిందుశేఖర శివాత్మేశ ! భూతేశ !
విశ్వలోకారాధ్య ! వీతిహోత్రాక్ష !
సైశ్వర్య దోర్గ్రాక్ష యంగసంరక్ష
తగ నన్నుఁజూచి తాఁదప్పు లోఁగొనుము
పొఁగడొందఁ గాచితే భువనైకధీర !
యీ లోకనాయక ! యోగి నిన్నుఁ బోల
నేలోకమున లేరు నెల్లదైవములు
నని విస్మయంబంది యానందమంది
వినుతించి వినుతించి వెలయు నాపాండ్య
విభుఁడంత సౌందర్య విభుని సత్కృపను
గుబులుతో నామంది గుత్తాలఁగొంచుఁ
డనమంత్రులెల్ల నతనిసాటిగాన
మనఘుండు నీతఁడు హరభక్తియుతుఁడు
ననుచు నెల్లరు తన్ను నర్థితోఁ బొగడఁ
దననగరికిఁ బోయి ధరణి పాలించె
నంత నాగజతురగాజ సందోహ
మంతు దాఁ గైకొని యాపాండ్యవిభుఁడు
స్వర్ణమయమ్ముగా సౌందర్యనగరు
వర్ణింపఁ గావించె వరుసతో నపుడు
నిదియు ముప్పదియారు నిటమీఁదిచరిత
ముదముతోఁ జెప్పెద మునులార ! వినుఁడి
యనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁదలపోసి మఱియు నిట్లనియె.

ముప్పదియేడవ లీల.

మఱియును నమ్మహా మధురాపురమ్ము
పరువడి పాండ్యభూపాలుఁ డేలంగ
నాపురి నొక శూద్రుఁడన్నదానప్ర
తిపాలకుఁడు హాలదేవుఁడన్వాఁడు
తనధర్మపత్నియుఁ దాను నే ప్రొద్దు
మనమునఁ గ్రియలను మాటల నేక
మైయుండు వొడయలు నరుగుదెంచిన ను
చయ్యన షోడశార్చనల నర్చించి
జొకదార్థము లొప్ప కేమియుఁ గోర

నాపదార్థములెల్ల నపుడు గావించి
పరమాన్న దివ్యాన్న బహుపదార్థములు
పరమమాహేశ్వర భక్తితోఁ బెట్టి
నా యొడయలు తృప్తితో నారగించి
పోయిన వెనుక తద్భక్తశేషమ్ము
తన కులాంగనయును దాను భుజించి
యా మధురాపురి ననిశంబు నిట్లు
ప్రేమతో నుండు సర్వేశ్వరు కృపను
నా చొక్కపతి వాని యన్నదానమ్ముఁ
జూచి యెవ్వరు వీని జోడుగా భువిని
జంగమార్చన సేయఁ జాలరటంచు
నంగయకన్నెమ్మ కానతిచ్చినను
వాఁడు నెప్పుడు భాగ్యవంతుఁడు గనుక
వాఁడు వీఁడనక యెవ్వరు వచ్చిరేని
లేదన కన్నమ్ము లీలతోఁ బెట్టు
పేదతికంబైనఁ బెట్టంగఁగలఁడె !
యనిన నాస్వామి కాత్యాయని కనియె
వనజాక్షి వీనికి వ్రతమెట్లు సాగు
పెట్టెడి వారలు పేదలైనాను
పెట్టుదు రెంతయుఁ బ్రియముతో నెపుడు
ధర లోభివానికి ధనము గల్గినను
మరణమొందునుగాని మఱి తాను నిడఁడు
నిచ్చువారల కెల్ల నిహపరసుఖము
లచ్చుగా నిత్తు నిక్కముగాఁగ నెపుడు
ననుచు నా శర్వాణి కాతనిభక్తి
గనిపింపవలసి శంకరుఁడు వానికిని
దారిద్ర్య మొసఁగిన తనభక్తి విడువ
నేరక నెందఱేనియు మాహేశ్వరులు
నేతెంచినను వారి కెదురుగాఁ బోయి
ప్రీతిఁ దోడ్కొనివచ్చి పెట్టి యంగడిని
నప్పుడు దెచ్చి యిష్టాన్న భోజనము
తప్పక వారికందఱికిని నిడుచు
నారీతితో జంగమార్చన నడపి

కోరిక చెల్లించికొని యుండునంత
మఱికొన్ని దినము లమ్మధుర రాజ్యమునఁ
గరవయ్యె ధాన్యమ్ము గడుదక్కువయ్యె
నప్పుడా భక్తుని కాపురి లోన
నప్పు పుట్టకయున్న నతిచింత తోడఁ
దన యింటికిని వచ్చి తగ నుస్సురనుచుఁ
దనయింతితోడ నెంతయు విచారించి
యిచ్చువారలు లేరు స్త్రీవ్రతంబేను
చచ్చిన విడువంగఁ జాలనో బాల !
రొండయులు విచ్చేసి యుపవాసమునను
బడలి మాసాల లోపల నున్నవారు
నేమి సేయుదము మాహేశ్వరార్చనకు
నేమియు వగలేదు నిఁక నన్ను నిపుడు
శ్రీవిశ్వపతి యేమిసేయ నున్నాఁడో
యే విచారములకు నౌడలేదె యిఁకను
గామిత ఫలదుఁడంగయ కణ్ణాయంబ
కామనోల్లాసుఁ డొక్కఁడె తానె రొంటుఁగు
నని సతియును దాను నాస్వామి నగరి
కినిఁ బోయిచక్క జాగిలి మ్రొక్కి నిల్చి
మాదేవ సర్వేశ ! యోమధురేశ !
మాదేవతాధీశ ! గౌరీపార్వతీశ !
కుందేందుధవళాంగ ! గురుకృపాపాంగ !
మందాకినీచంద్రమహిత కోటీర
శ్రీచొక్కనాథ ! యాశ్రితపారిజాత
నాచేత గలుగ నిన్నాళ్లును జంగ
మారాధనముఁజేసి యామాహేశ్వరులు
నారగించిన మఱి యంగన నేను
వారిప్రసాదమ్ము వాంఛతోఁ గుడిచి
యీరీతి బ్రతికితి మింతకాలమ్ము
లేమి వచ్చినదంచు లేదనలేక
నీ మధురాపురి నింటింటఁ దిరిగి
యప్పులు దీసియు నావ్రతంబేను
తప్పకనడిపి తెంతయు నీదు కృపను

గరువయ్యె భూమినెక్కడ మఱియప్పు
దొరకదు దేవ యిందుకు దయకల్గి
యీమహేశ్వరపూజ యీడేర్చి నన్ను
వేమారు రక్షింపవే ! భక్తవరద !
యీగతి చెల్లింప క్రివతంబిపుడు
సాగకయున్న నీసముఖమ్మునందు
ఏయింతియును నేను నీక్షణమ్మునను
వేయేల ! ప్రాణముల్ విడుతుమ యనిన
నప్పుడు సర్వేశుఁడశరీరభావ
మొప్పగాఁ గైకొని యోరి సద్భక్త !
రుద్ర చూడామణి సొంపుతో నెపుడు
భద్రమ్ముగా నీదుభార్యయు నీవు
నేకమనస్కులై యెల్లకాలమ్ము
ప్రాకటమ్ముగ జంగమారాధనమ్ము
నిరతంబు నడిపితి నిజభక్తి గలిగి
యెఱుఁగ నెవ్వరియందు నీభక్తి మనసు
వన్నెగా కమ్మని వాసనకల్గు
సన్నబియ్యమ్ముగా సడియించి కడిగి
వండినయన్న మవ్వారిగా నొద్ద
యుండి భుజించిన నొదుగుగాఁ గలిగి
రొకరాయి అప్పయు నొకనూక పెరిక
రొకవడ్లగింజ లేకుండగాఁ జేసి
కలశాలమును దఱుగక యుండునట్లు
నలరంగ నతియంబై నిండియుండు
సద్భక్తితో మహేశ్వరపూజ చేసి
మద్భక్తి పరుఁడవై మఱియు నిత్యమ్ము
నా ముడిలోని బియ్యముదీసి తీసి
వేమాఱు నమ్మి నైవేద్యమ్ము చేసి
యాద్రవ్యమునను నీ యప్పెల్లఁ దీర్చి
యే దరిద్రములేక యెల్లకాలమ్ము
నిఖిల సంపదలును నిత్యమ్ము గలిగి
సుఖలీల నుండు నీ సుదతియు నీవు
తగ పురుషాయుస్సు దనుక నీపురిని

నగణితమ్ముగ జంగమార్చన చేసి
మాలోకమునకుఁ బ్రేమముతోడ వచ్చి
నీలతాంగియు నీవు నెమ్మితో నుండు
మని యానతిచ్చిన నాస్వామి నపుడు
వినుతింతు సర్వేశ విశ్వలోకేశ !
యవినాశ ! భవనాశ ! యద్రిజాధీశ !
యవిరళగుణమూర్తి యమితప్రవర్తి
తలచినవారికిఁ దంగేటిజున్ను
కలదన్నవారి కక్కఱ తీర్చుదేవ !
పేదలపాలిఁటి పెన్నిధానంబ !
సాధులపాలిఁటి సంతానతరువ !
యని సన్నుతించి యాహాలదేవుఁ డపుడు
తన సతియును దాను ధాన్యంపు ముడియు
గొనితెచ్చి వివిధ భంగులను నర్చించి
యనుదినమ్మును జంగమార్చన చేసి
యధికమ్ములగు నప్పులన్నియుఁ దీర్చి
మధురలో సకలసంపదలఁ జెన్నొందఁ
జాలఁగఁ దాపురుపాయుష్కుఁ డగుచు
కైలాసమున కేగి కాంతతోఁ గూడ
నాలీలను దరిద్రులైయుండు వారు
హాలాస్య నాయకు నట్లు సేవించి
భుక్తిముక్తులు రెండు బొందుదురనుచు
యుక్తమ్ముగాఁగ నాయూరివారెల్ల
శ్రీచొక్కనాథునిఁ జేరి సత్పూజ
లాచరింపుచు ముక్తులైరి వెండియును
నిదియు ముప్పదియేడు నిటు మీఁదిచరిత
ముదముతోఁ జెప్పెదమునులార వినుడి
యనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.

## ముప్పదియెనిమిదవ లీల.

మలహారు కృపను నా మధురాపురమ్ము
వెలయంగఁ బాండ్యభూవిభుఁ డేలుచుండె
నాపురి నొకసెట్టి యధికధనాఢ్యు

పాపవిదూరుండు భాగ్యవంతుండు
పరఁగ నాతఁడు ధనపాలసెట్టనఁగ
పురములో నప్పు సప్పులు నిచ్చుచుండును
దనయులు లేకుండి తన తోడఁబుట్టు
తనయుని తనయుఁగాఁ దగ కొర్లఁ జొచ్చి
యా మేనయల్లుని నందఱు నెఱుఁగ
ప్రేమతోడుత వాని బిడ్డగాఁ బెంచి
ధనధాన్యలోహ గోధనరాసు లెల్లఁ
దనయుని కిచ్చి యందఱి కొప్పగించి
వానితల్లిని వాని వడి నింటఁ బెట్టి
తానును మఱియు సంతానార్థముగను
దనసతితోడ నర్థముచాలఁ గొంచు
ధనపాలసెట్టి తీర్థాంతరంబరిగె.
అంతట నతని దాయాదులు వచ్చి
పంతమై వారల నలజడిపెట్టి
మా సోదరుని సొమ్ము మాసొమ్ముగాక
యీసొమ్ములకు మీర లెవ్వరటంచుఁ
దల్లిబిడ్డలచేత ధనమెల్లఁ దీసి
యిల్లు వెళ్లఁగఁదోలి రిద్దఱి నపుడు
కడుదుఃఖమునను నాకామిని తనదు
కొడుకు చంకను బెట్టుకొని దైన్యమెసఁగ
పరమదయాకరు పరిపూర్ణ హృదయు
తిరుచొక్కపతి సన్నిధికి వచ్చినిల్చి
శరణమ్ము నాపాలి సర్వేశ్వరునకు
శరణమ్ము నాపాలి శంభులింగమునకు
శరణమ్ము దేవవేశ్యా భుజంగునకు
శరణమ్ము భక్తరక్షణ పరాయణునకు
శరణమ్ము వేదసంవేద్య మూర్తికిని
శరణమ్ము హాలాస్య సౌందర్యునకును
నిరపరాధిని నేను నిన్ను నమ్మితిని
గిరిజేశ ! మొఱ యాలకింపవే దేవ !
భూతేశ ! నాతోడ బుట్టినవాఁడు
నాతనూభవుని నందఱు నెఱుంగఁగను

దన పుత్రుగా నెంచి తనసొమ్ముకెల్ల
ఘనముగా వీనిని గర్తగాఁ జేసి
యీశిశువును నన్నుఁ నింటను బెట్టి
యా సెట్టి చనియెఁ బుణ్యస్థానములకు
పోయినఁ జూచి యిప్పుడువచ్చి యతని
దాయాదు లనుచు నా తనయుని నన్ను
సొమ్ములన్నియును బుచ్చుక యిల్లువెళ్ళ
పొమ్మని పెడతల పొడిచి త్రోచినను
దిక్కెవ్వరును లేక దీననై నీవె
దిక్కని వచ్చితి దేవ ! యాలింపు
మనుచు దుఃఖించె మహాస్వామి యపుడు
తనమదిలోన నెంతయుఁ గృపకల్గి
మగువ వారలను ధర్మాసనమ్మునకు
తగవు రమ్మని నీవు తగనడ్డుపెట్టు
మా సభ మేము చయ్యన వచ్చి చెప్పి
నీ సొమ్ముగల దెల్ల నేఁ దీసి యిత్తు
పొమ్ము దుఃఖింపక పొలఁతి నీవనిన
నమ్మి యాయమ పోయి న్యాయసభావమ్ము
నడుగుద మిందఱ మా సభవారి
కడకు రమ్మని వారిఁ గడు నాన బెట్టెఁ
బిలిచిన రాక దొబ్బిరి వారలపుడు
వెలఁదియు నింక నే వెరవని యుండె
నప్పుడు సర్వేశుఁ డాత్మబంధువుఁడు
తప్పక భక్తవత్సల నారాయణుఁడు
నా సౌందరేశ్వరుఁడా చొక్కనాథుఁ
డా సెట్టి రూపమ్ము నప్పుడు దాల్చి
ధనపాలసెట్టి చందముతోడ నపుడు
తన యింటికిని బోయి తగ నుండునంత
నాతనితో బుట్టు వారెడ వచ్చి
యాతనిఁ బట్టేడ్చి యంతయుఁ జెప్పఁ
దానునుగూడ నెంతయు బ్రొద్దు నేడ్చి
మేనయల్లునిఁ జూచి మిగుల దుఃఖించి
యందఱ యిండ్లకు నపుడు దా నేగి

యందఱి పరిణామ మడిగి కూర్చుండి
కొడుకులు లేక నాకును బెద్దదాని
కొడుకును నేఁ బుచ్చుకొని పెంచుకొంటి
నా కానుపీసు మంతటికిని వాని
నే కర్తఁ జేసి మీరిందఱు నెఱుఁగ
నేను పోవుచునుండి యీ పిన్నవాని
వీని తల్లిని నింట విడిచిపోయినను
దాము నిప్పుడువచ్చి దాయాదులనుచు
నీ మెచ్చు సొమ్మెల్ల నిటుఁ బుచ్చుకొనిర
యెడ దాయాదులు నేడన్నదమ్ము
లేడ బంధుగులు నా కేడఁ జుట్టములు
ననుచుఁ బెద్దల పిన్నలందఱిఁ గూర్చి
యొనర వారలఁ దగవున నోడఁగొట్టి
యా సొమ్ముదీసి యా యాఁడామె కిచ్చె
నా సభవార లిట్లనిరి యా వేళ
కాచుకయుండి యక్కఱ లెల్లఁ బాప
శ్రీ చొక్క విభుఁడు విచ్చేసిన యట్లు
మీరు విచ్చేయంగ మేలయ్యె ననఁగ
వారిఁ దోడ్కొని యింటివద్దకు వచ్చి
యప్పు సప్పులవారి నందఱి నెఱుఁగఁ
జెప్పియా సెట్టి దాఁచిన చోట్లుఁ జూపి
యా చొక్కనాథుఁడో యమ్మ! నీ పాటు
చూచివచ్చితి నని సోదరుండగుచు
నీవు నీ పుత్రుండు నీ యింటిలోను
నే విచారములేక నెల్లకాలమ్ము
సంతోషమున నుండు చాల నీవనుచు
నంతర్హితుండయ్యె నా స్వామి యపుడు
నిదియు ముప్పదియెనిమి దిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార! వినుఁడి
యనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.

ముప్పదితొమ్మిదవ లీల.

వెలయఁ దొల్లిఁటి పాండ్యవిభుఁ డేలినంత
కలియుఁడై వంగుణ పాండీడు మధుర

నయమునతో సౌందర్యనాథుని కృపను
భయభక్తిసేవ్యుఁడై పాలింపుచుండె
వేడుక నొకనాఁడు వేఁటమార్గంబు
జాడగా మృగములఁ జంపక మఱలి
యారయ గజతురగాది సన్నాహ
ఘోర శంఖములఁ బేర్కొనఁ దీవ్రముగను
రాత్రిగా వచ్చుచో బ్రాహ్మణుం డొకఁడు
పాత్రుండు తెరువునఁ బండి నిద్రింప
ఘోటక వ్రాతమ్ము ఖురములందందఁ
దాటింప మఱి కాలధర్మమునందె
నంత నా బ్రాహ్మణుండంతకాలయము
కెంతయు నేఁగుట యెల్లరు దెలిసి
యరయ నా పురినున్న యా విప్రవరులు
మొఱవెట్టినంత నా మొఱ యాలకించి
యధిపతి వెఱగంది యతిభీతి నంది
యధిక చింతాక్రాంతుఁడైయుండి యపుడు
ధర్మశాస్త్రార్థ తత్త్వజ్ఞులఁ జూచి
కర్మానుకూలత గలిగె నీ నింద
యజ్ఞానకృతమున నైనది గాన
ప్రజ్ఞతోఁజేసిన పనిగాదు నిదియు
నేరీతిఁబాయును నీ హత్య నాకు
ధారుణీ సురులార ! దగఁజెప్పుడనిన
భావించి శాస్త్రముల్ పరికించి చూచి
యా వసుధేశుతో ననిరి బ్రాహ్మణులు
భూమీశ ! దశదానములు నేయు వేడ్క
నీ మహాపాతకం బిటుఁ ద్రోచిపోవు
నన్న నా రాజును నధికము గాఁగ
జన్నములును హోమజపము లందందు
దానధర్మములును దశదానములును
నానార్థములుచేసి నయమొప్ప నిచ్చె
నా ధర్మములఁ బోవ కాహత్య మఱియు
బాధ నేయుచునుండె పార్థివేశ్వరుని
నాడ నా విధమొల్ల నటు మఱియొక్క

చోడంతు వింటు మెచ్చుట వారికిచ్చి
యిప్పుడు తఱువాయి యిటువారి నిలుత
తప్పదటంచుఁ జిత్తములోఁ దలఁచి
దండెత్తె తన దళతంత్రముతోడ
పాండినిమీఁద దోర్బల శౌర్యమునను
నంత నా పాండీడు నతఁ డేగు టెఱిఁగి
చింతించి హత్యచే శ్రీ చొక్కవిభుని
సన్నిధి కేతెంచి సౌందర్యనాథు
పన్నగకంకణ ! భర్గ ఫాలాక్ష !
సర్వలోకాధార ! శాంభవీరమణ !
యని సన్నుతులుచేసి యటఁ దనయందు
వెనుకొన్న యా హత్య విధ మేర్పఱించి
యీ చింతతో నుండ నీ వేళ ఎఱిఁగి
యా చోళభూపాలుఁ డధికమ్ముగాఁగ
సమరసన్నాహుఁడై చతురంగబలము
సమకట్టి నన్ను నిచ్చట గెల్వవచ్చె
నీ బంటుగా నన్ను నెమ్మి రక్షించి
యీ వైరియును దీర్చి యీ దోష ముడుపు
మని విన్నవించిన హాలాస్యవిభుఁడు
వినువీధి వాణియై వెస నానతిచ్చె
భూపాల ! ఎదురుగాఁబోయి మాయాజ్ఞ
చేపట్టి గెల్చి యాక్షితిపాలుఁ డేలు
దేశమునకు బోయి తెలివొందునట్టి
యా శంభులింగము లాతీర్థములును
నందంద మఱియుఁ బుణ్యస్థానములును
బొందుగాఁజూచి యింపుగఁ దీర్థమాడి
కడువేడ్కఁ బూజలు గావించి మించి
వడిఁబేర్చి మఱియు నావల తిరువెడమ
మరుదూరఁ బెంపొందు మధ్యార్జునేశు
దరిశింపుఁ బాపెడఁ దగ నీదు హత్య
యని యానతిచ్చిన నా పాండ్యవిభుఁడు
సమరసన్నద్ధుఁడై సంభ్రమంబునను

సమిత బలారూఢుఁడై యెదుర్కొనియెం
నుగ్రుఁడై యపుడ వారోద్యదుగ్రుఁడగుచు
నుగ్రాత్మ భక్తుఁ డత్యుగ్రాహవమునఁ
బేర్కొనె నా చోడపృథివీశ్వరుండు
మార్కొనెఁ దాను మఱి పాండ్యతోడ
శకటను మూఁకలు ననువుగాఁ జేర్చి
ప్రచురమ్ముగా నేర్చి పటుశక్తి నేయ
నిండంద బాణమ్ము లెదురెదు రేగు
చండాన నాటించు సంధానవరులు
నాటోపమెసఁగంగ నవలీలఁ బొడిచి
పోటు గంటుల దూరిపోవు బంటులును
రౌతుపల్లమ్ము గుఱ్ఱమ్మును నొక్క
టై తెగఁ గడు వ్రేసి యార్చు రాహుతులు
సంకించి గజముల నంటించి మెడలఁ
గొంకులు దగిలించుకొను మావటీలు
రథములు గదిసి సారథులఁ దున్మాడి
రథముల కుఱికెడు రథిక సంఘములు
నైపోరు ఘోరమై యాయిరువాగు
నేపారఁ జూపఱ కెక్కుడై సాగ
నంత నా పాండీడు నా చొక్కనాథు
నెంతయు మదినిల్పి యేపు దీపింప
యార్చి యాచోడని నవలీల గెల్చి
పూర్చు నాతని సైన్యకోటి మాయించి
రాణింప రాక్షస వ్రాతమ్ములకును
శోణితమాంసముల్ చొక్కింపఁ జేసి
జయలక్ష్మి చేకొని సంతోష మెసఁగు
రయమొప్ప నా చోడరాజ్యమ్ము సొచ్చి
కరమొప్ప దేవసంఘములఁ బూజించి
మఱిమించి తిరువెడమరుదూరు ననెడి
మధ్యార్జునంబను మహి మించి వెలయు
మధ్యార్జునేశ్వరు మందిరద్వార
గోపురోజ్జ్వల హేమకుంభముల్ గాంచె
నా పట్టణము గాంచు నంతకు పాండ్య

విడువక యా హత్య వెనువెంటఁ దగిలి
నడచి వచ్చుచునుండె నరనాథుఁ డపుడు
నా తూర్పు గోపురద్వారమ్మునకును
నేతెంచి చొచ్చిన నింతలోపల ను
నా మహాదేవుని యాజ్ఞఁ జొరరాక
నా ముఖమ్మున నిల్చి యా పాతకమ్ము—,
ఇంతటఁ బాసితే ! యీ రాజు ననుచు
చింతించి దైవమ్ము నేతలు దలఁచి
యందంద మొఱవెట్టు టూర్పులు నెలఁగ
నందు దక్షిణభాగ మందుఁ గూర్చుండె
నంత నాపాండ్యుఁడు నాభార మడిగి
సంతోషచిత్తుఁడై సంభ్రమంబునను
నా మహాదేవుని నతిభక్తిఁ జేరి
వేమాఱు బహువేల విధములఁ బూజ
లందందఁ జేసి యాత్మానందుఁడగుచుఁ
బొందుగా సంస్తుతింపుచు వేడ్కఁ జెలఁగె
దేవదేవ ! మహేశ ! దివ్యప్రకాశ !
పావనోన్నత భూతి భస్మాంగధార !
నాపాలఁ గల్గియు నాపాతకమ్ము
బాపి రక్షించితే పాపవిధ్వంస !
మధ్యార్జునేశాదిమధ్యాంతరహిత !
యధ్యాత్మయోగసమభ్యాసగమ్య !
యని సన్నుతులుచేసి యధికమ్ముగాఁగఁ
గనకభూషణములు కానుక లిచ్చి
యిటుమీఁద నామీఁద నీ బ్రహ్మహత్య
పటుగతి రాకుండఁ బాపవే దేవ
యని విన్నవించిన నాస్వామి యపుడు
మనమున హర్షించి మామీఁద నీవు
భక్తి తాత్పర్య సద్భక్తుండ వగుట
సక్తమై నీయందుఁ జనరాదు పొమ్మి
యని యశరీరమై యానతిచ్చినను
మనమున రంజిల్లి మఱి పాండ్యవిభుఁడు
భయ : భక్తి తాత్పర్య భావమ్ము పూని ..

నయమొప్ప దండప్రణామమ్ము లొసఁగి
యందంద నుతియించినంతట మఱలి
పొందుగావచ్చి యా పూర్వభాగమున
నటు దక్షిణద్వారమందున వెడలి
దిటవుగాఁ బార్వతీదేవిఁ బూజించి
మఱి మించినట్టి యామధ్యార్జునమున
వసియించె నన్నాళ్ల వరగుణపాండ్య
విభుఁడంత నా స్వామి విభవమ్మునకును
త్రిభువనమ్ములు మెచ్చ దివ్యవిమాన
ములును నా ప్రాకారమున నగ్రహార
ములు దేవునికి నూళ్ల మొదలు గావించి
కలయంగఁ బూజలు ఘనత నైవేద్య
ములును బంచనువాద్యములు సంభ్రమములు
నహరహమ్మును నెలఁగ నా దేవునకును
బహుళమ్ముగావించి బహువిధమ్ములను
ఘనముగాఁ బది ప్రదక్షిణములు వేడ్క
లొనరఁ ద్రికాలమ్ము నొగి నేయుచుండ
మఱియొకనాఁడు నమ్మనుజేంద్రుఁడపుడు
గరిమ ప్రదక్షిణల్ గావించువేళ
నొక శ్వాన విష్ఠ మందున్నట్టి వేళ
వికలుఁడై మనములో విస్మయంబంది
యెవ్వఁడు నీవిష్ఠ యెత్తిన వాని
కివ్వసుంధర నర్ధ మిత్తు నేననుచు
మనమునఁ దలపోసి మఱియంత మఱలి
యనయమ్ము నన్నేలు మనుచు నా స్వామి
నాకిచ్చియుండఁగ నా రాజ్యమొకఁడు
చేకొని యేలంగఁ జెల్లునే యనుచుఁ
దనవచ్చడమ్మునఁ దానెత్తి పోదివి
కొనుచు నవ్వలఁ బాఱఁ గొంపోయి విడిచి
స్నానమ్ముచేసి యా స్వామికి మఱియుఁ
బూని ప్రదక్షిణమ్ములు నేయ నచట
వేములు పండిన విధములు చూచి
యా మహాస్థలమున నిది శివలింగ

ములువండ్లుగాఁ బండె ముదముతో ననుచు
వెలయంగ నందున్న వేముల కెల్ల
నెండగాలియు సోక కే ప్రొద్దునుండ
మండపాల్ గట్టించె మఱి దేవునకును
బొలుపొంద నెండ కాపునకు గుళ్ళోనఁ
దిల లెండఁ బోసినఁ దినుచుండు నొక్క
పరిచారకునిఁ బట్టి పరిచారు లపుడు
ధరణీశ ! యంగసాధన మిదె చూడు
మని చెప్పి పాండీని యగ్రభాగమున
నునిచిన యంత నాయుర్వీశ్వరుండు
నేల తింటివటన్న నే జన్మజన్మ
మీ లీల లెంకనై యీ స్వామి కెపుడు
నుండంగఁ దింటి నే సర్వేశ ! యనినఁ
బాండీశు వాని చేఁబట్టికొన్నట్టి
యానువ్వు పప్పు దానటఁ దీసి నమలె
నైనను నే లెంకనాడు నటంచు
పరమమునీశ్వరుల్ పరమపుణ్యులును
పరమేశు తేఱు సంభ్రమలీల నడువ
నందఱు చూచుచు నతివేడ్కతోడఁ
బొందుగా మునుకొని పోవుచుండఁగను
వెనుకొని వచ్చునవ్వేళఁ దానొక్క
మనుజుని తలఁపున మఱియందుఁ గాంచి
యీ దేవు రథధూళి యీ పుణ్యపరుల
పాదాల ధూళియుఁ బ్రాపించె దీని
కెట్టి పుణ్యము గల్గె నిది చోద్యమనుచు
ముట్టి తామస్తకమ్మునఁ జేర్చికొనుచుఁ
జోరుని నొకని నచ్చోఁ బట్టుడనుచుఁ
జారు లేతేర నచ్చటను నా మ్రుచ్చు
ప్రేతభూమతుగాంచి ప్రీతి నా ప్రేత
భూతి లోపలఁ బొర్లి భూతేశుఁ దలఁచి
హరహరా యనుచుండ నటువానిఁ దెచ్చి
పరువడి బెట్టిన భావమ్ముఁ జూచి
యీతఁడు శుద్ధాత్ముఁడీతనివల్ల

నే తెఱుంగనులేదు నేల బొమ్మనిన
నిలువెళ్లమికిఁగళ్లమిళ్లైయర్ వార్త
తెలమి నామెయిఁగ్గలై నెల్లదిక్కులను
మృగధూర్తకులమెల్ల మించి కూయఁగను
దగను ఘూ యను దేవతాస్తోత్ర మిదిగో
చేయుచున్నది యంచుఁ జేరలెన్నెని
వెలయంగఁ బంపెఁ దావెలయుసద్భక్తి
కప్పలాసరసిలోఁ గడుమ్రోయుచున్న
దగ పార్వతీశ్వరు ధ్యానమంత్రంబె
పలుమాఱుఁ బఠియింపఁ బాల్పడెనంచుఁ
గొలనిలోఁ రూకలు గొంచుఁ జల్లించె
నలరంగఁ దనదు మోహంపు దేవిఁ బిల్చి
మలహరుసద్భక్తి మాహేశ్వరులకు
ననువుగా శుశ్రూష లటుసేయ మనుచు
నానరఁ దాత్పర్యత నొసఁగెవారలకు
నీరీతి మధ్యార్జునేశ్వరస్వామి
కోరి యాస్థలమునఁ గొన్నిఘస్రమ్ము
లతివేడ్క దానధర్మాదుల యందు
సతతశైవాచార సద్భక్తి యందు
నధికుఁడై యాస్వామి నర్చించి మఱియు
మధురాపురమ్మునై మనసటుఁజేర్చి
యందుకుఁ గతిపయయానంబులకును
బొందుగా వచ్చె నాపురముఁ బ్రాపింప
వేగంబె మధురకు విచ్చేసి మఱియుఁ
జంద్రావతంసుని సౌందర్యనాథు
నింద్రాది దేవమునీంద్రాదివంది
త శ్రీపదాంభోజు ధవళవర్ణాంగు
నాశ్రితామరభూజు నా చొక్కనాథు
సన్నిధి కేతెంచి సన్నుతుల్ జేసి
విన్నతం బవధారు విశ్వసంరక్ష !
జాతవేదాదిత్యచంద్రాత్మకాక్ష !
భూతగణాధ్యక్ష ! భూతిరుద్రాక్ష !
యతిసన్నుత దక్షహంకారశిక్ష

శిక్షితాసురవర్గ! శ్రీ విరూపాక్ష!
బ్రహ్మాండమాలికాభరణ సద్వక్ష!
బ్రహ్మవిష్ణుస్తోత్రపాత్ర! శ్రీలింగ
నా పాపపటలమంతయుఁ బాఱఁద్రోలి
చేపట్టి నన్ను రక్షించితే దేవ
యని సన్నుతించి రత్నాకీర్ణ ఖచిత
కనకభూషణములు కానుక లిచ్చి
యా మహాదేవుఁ గృపాపూర్ణుఁడగుచు
భూమీశుఁడప్పుడు భూమిపై వేడ్క
సాగి దండము వెట్టి సంభ్రమం బెసఁగ
రాగిల్లి తనమందిరమున కేతెంచి
ధర్మశాస్త్రార్థ తత్త్వజ్ఞానబోధ
లర్మిలి వినుచుండి యటుమించి మఱియు
శైవశాస్త్రేతిహాసములుల్లసిల్ల
భావించి నెమ్మదిఁ బ్రార్థించి వినఁగ
మించిన శివలోక మిమ్మహామధుర
యంచును నాపురాణార్థముల్ సెప్ప
నప్పు డాపాండీంద్రుఁ డాత్మనుప్పొంగి
తప్పక చనుదెంచి తాత్పర్యమెసఁగ
పరమేశు నర్చించి భక్తిఁ బూజించి
పరిపూర్ణ హృదయ సంభ్రమలీల నపుడు
తారాధిపోత్తంస! తారకధ్వంస!
తారకబ్రహ్మేశ తారాద్రివాస
నగజేశ నగచాప నగధర వంద్య
సగుణ సదాచార శర్వమహేశ
యని సన్నుతులు సేసి యందంద మ్రొక్కి
యనఘచారిత్రుఁ డిట్లని విన్నవించె
భూతేశ నాదైన బొంది యిట్లుండ
నీతఱి నీపురి నీయుగంబునను
గడు శివలోక మిక్కడఁ జూపకున్న
విడుతుఁ బ్రాణమ్ములే విడుతు నీయాన
మాటలేటికి నన్న మధురేశుఁడపుడు
పాటించి వరగుణపాండ్య భూపతికి
బహుకోటి సూర్యసత్ప్రభలను మించు
మహనీయ దివ్యవిమానముల్ సెలఁగ
నళినాక్షు బ్రహ్మబృందారకుల్ మునులు
గొలువంగఁ బ్రమథులు గొలువంగ వేడ్క
గోరాజు నెక్కి యాకుధరజానాథుఁ
డారాజునకును బ్రత్యక్షమై నిల్చి

వెలుపుగాఁ జూచెను శివలోక మతని
కలరంగ నతఁడును నాత్మ నుప్పొంగి
సంతుష్టి నానందసరసిలోఁ దేలి
యంత నా శైవశాస్త్రార్థమ్ము లందు
వినినట్టి విధ మెల్ల విస్మయంబుగను
తనుఁ బొందఁ జూచి మహాశ్చర్యమంది
పులకితదేహుఁడై భూతేశుకృపను
సలలితమ్ముగ మించి సంస్తుతుల్ చేసె
జలజాప్త జలజారి సప్తార్చిరక్ష !
జలజాక్షనేత్ర పూజార్హ సత్పాద !
జలనిధి తూణీర ! జలపూర్ణధార !
జలచరకేతు సంచయ భస్మధార !
జలజజనుతహార ! సకలప్రపూర !
జలజజమస్తక సత్పాత్రహస్త !
నన్నేలు నాస్వామి ! నాపాలిదేవ !
విన్నపం బవధారు విశ్వాత్మ ! యికను
మఱుగు గావింపు మీమహనీయమైన
పరమమ్మునకును నాస్పదమైన లోక
మని విన్నవింప నాహాలాస్య విభుఁడు
చనవిచ్చి తానదృశ్యంబయ్యె నపుడు
తడయక సురలు నెంతయు వేడ్కతోడఁ
గడు గురియించి రక్కడఁ బుష్పవృష్టి
పురజను లెల్ల నద్భుతలీలఁ జూచి
పరశివభక్తులై పరగి రవ్వేట
వడి మించి యప్పుడా వరగుణపాండ్య
పుడమీంద్రుఁ డధిక సత్పుణ్యాత్ముఁడగుచు
వికసితహృదయుఁడై విశ్వేశు కృపను
నకలంకమతిని రాజ్యము సేయుచుండె
నిదియు ముప్పది తొమ్మిదిట మీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి
యనుచు సన్మునులతో నాయగస్త్యుఁడు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.
ఇది సర్వఘనసత్కవీంద్ర పాదాబ్జ
విదితపూజామోద విమలుండు పచ్చ
కప్పురసౌరభ్య కలితమానాంక
తిప్పరాజసుపుత్ర తిరువేంగళేంద్ర
విరచితమ్ముగ లోకవిఖ్యాతమైన
సరసలక్షణ కావ్యసత్కవీంద్రాభి
నందితశ్రీ చొక్కనాథచరిత్ర
మందున నిదియుషష్ఠాశ్వాసమయ్యె.

# సప్తమాశ్వాసము

## నలువదియవ లీల.

మధురాపురము పాండ్యమండలేశ్వరుఁడు
నధికతేజమున రాజ్యమ్మేలుచుండ
బాణభద్రుండను పాఠకోత్తముఁడు
బాణారిబాణ సద్భక్త మానసుఁడు
వీణాదివాద్య ప్రవీణధుర్యుండు
జాణ లందఱును మెచ్చఁగ నాపురమ్ము
భూతేశకృప పాండ్య భూమీశ్వరునకు
గీత వీణావాద్యకేళిఁ జూపుచును
దనవీట నైపుణ్యదానమ్ము జేసి
కొనుచుండ నంతటఁ గొంతకాలమున
చోళభూమిని నుండు సుస్వరగాణ
చోళభూపతి వాని సొంపుగాఁ జాల
మన్నించి కాంచనమహితయానమ్ము
చెన్నొందఁ గొక లంచిత భూషణము లు
బిరుదంబు డాకాలి పెండెమ్ము శ్వేత
వరచామరచ్ఛత్ర వైభవమ్ములు ను
గజములు ఘనతురంగమ్ములు పెక్కు
ప్రజలను గూర్చి యాపాండ్యదేశమునకు
దనవెంటఁ బాడంగఁ దగువా ర నేక
వనితలు పురుషులు వడిఁ గొల్వరాఁగ
నావల్ల పల్లాణుఁడను నొక్కజాణ
నా పాండ్యపతి వద్ద కతివేడ్క నరిగె
నా పాటకుండును నప్పుడా పాండ్య

భూపాలకుని రాజ్యమునకును బోయి
యారాజుఁ బొడగాంచి యధికగంభీర
శారీరయుక్తుఁడై సన్నిధి నిల్చి
గానవిద్యకు నేనె గాక నాయీడు
గాన నెవ్వరినే యుగమ్మున నధిప
తానమానముల శాస్త్రక్రమంబులను
దానని పువ్వుల దండె చేయెత్తి
వేళ లెఱింగి యాస్వరములేర్పఱిచి
లాలితంబైన యాలాపముఁ జేసి
తనర సూళాది గీతప్రబంధములు
ననువొప్ప మంద్రమధ్యమ తారకములఁ
బాడె నాతఁడు మహాప్రౌఢిమ మెఱసి
వేడుకతో రాజు విని చాల మెచ్చి
యుడుగర లిప్పించి యులుప వట్టించి
విడిదికిఁ బంపి యావేళనే విభుఁడు
బాణుని బిలిపించి బహుళసంగీత
జాణవు వీణావిచక్షణాఖ్యుఁడవు
ప్రాగల్భ్యగతి మించి పాటించి నీవు
బాగుగా వీనితో పాడి గెల్చినను
సరసతఁ గాంచన స్నానమాడింతు
బిరుదంచు భక్తియుఁ బెండెము నిత్తు
పరరాష్ట్రమున నుండి పంతము మెఱసి
బిరుదును దనరాజు పేరుఁ గీర్తించి
యీరాజ్యమునను నాయీడు పాఠకులు
లేరని పచరించె లెక్కగాఁ గొనక
యనినను బాణుండు నవనీశ! నీదు
మనము రంజిల్ల నా మధురేశు కృపను
నేఁడు స్వరమ్ముల నింపు సొంపెసఁగఁ
బాడి గెల్చెద నన్నఁ బాండ్య భూవిభుఁడు

తనకట్టు వర్గమంతయునిచ్చి రేపు
వినిరొండ మిద్దఱి వేడ్క నీ ప్రొద్దు
విడిదికిఁ బొమ్మన్న వింతపాఠకుని
విడిది ముందఱ బట్టి వీథిఁ బోవుచును
వాని వెంటనుగూడి వచ్చినవారు
వాని వాకిటఁ జాలవర్ణమ్ముతోడ
మెండుగా నందఱు మేళమ్ముగూడి
దండెయు పాఁగ జంత్రము మందెమేళ
కిన్నెర స్వరకట్ల కిన్నెర బోయ
కిన్నెర యొకతంతు కిన్నెర రుద్ర
వీణె నా రాయణవీణ గాంధర్వ
వీణయుఁ దగమించు వెలయంగ మఱియు
స్వరమండలమ్ము రావణహస్తములును
నొఱపుగా శ్రుతులొక్క యొఱిమగాఁ గూర్చి
వాడుచునుండంగ వాణుండు నిలిచి
వేడుకతో విని విస్మయంబంది
వీరలే యీపాటి వీరికిఁ గర్త
యేరీతిఁ బాడునో యీశ్వరుండెఱుఁగు
పాడెద రేపని పతితోడఁ బంత
మాడి వచ్చితినని యట విచారించి
శ్రీ చొక్కనాథుఁ డాశ్రితరక్షకుండు
నా చిత్తమున నుండ నాకేల వెఱవ
నని స్వామిసన్నిధి కాప్రొద్దె యేగి
వినతుఁడై యోదేవ విమల సద్భావ
హరినేత్రపూజిత హరిహయమధ్య
హరివైరిభూషిత! హరిణాంకహస్త!
హరిణాక్షివామాంక! హారితహరిణ
భావజభసితాంగ! బహుకృపాపాంగ!
నీవని నమ్మితి నిజముగా నేను
చోడభూములనుండి సుస్వరగాణుఁ
డీడకు వచ్చి తానే కాని తనకు
నీడు:లేదన్నను నీశ నీకృపను
బాడెదనంటి నే పతి సమ్ముఖమున

నేలీల నైన వహించుక నన్ను
మేలనిపింపవే మిహిరాబ్జనేత్ర !
యని సన్నుతులు సేసి యాపాతకుండు
తనయింటి కరిగె నంతటఁ జొక్కవిభుఁడు
హరి విరించుల కసాధ్యంబైన యట్టి
పరమేశ్వరుఁడు తన బాణభద్రునకు
దాసుఁడై జడలెల్లఁ దలపైన జుట్టు
గా సవరించి వ్యాఘ్రఁపు వస్త్రపాగ
కట్టి కట్టెలును గంగామాళి నెత్తి
పెట్టుక వీథులఁ బేర్కొని యవ్వ
డాటుల బాగున నమర నొయ్యారి
పాటలు పాడుచుఁ బ్రజలార మీరు
కట్టెలు గొనరారో ! కట్టెలో యనుచుఁ
బట్టణమార్గమ్ము పర్వి రా నపుడు
చూచిన వారెల్ల సూనశరుండో ?
శ్రీ చొక్కనాథుఁడో ? శిఖివాహనుండో ?
యింద్రానుజుండో నయ్యింద్రుఁడో కాంతి
చంద్రుఁడో వీఁడు వసంతుఁడో కాక
యీ నవ్యసౌందర్య మీకట్టె లమ్ము
వాని కెక్కడిదని వాడకామినులు
చీర లూడినవారు చేగాజు లూడి
జాఱినవారు తెచ్చలఁ బోవువార
లైరి యీగతి లీలావినోదముల
నూరెల్లఁ దిరుగ సూర్యుఁడు గ్రుంకె నంత
నిల ముజ్జగమ్ములు నిల్లుగాఁ జేసి
వెలసినయట్టి యాయీశ్వకూటమ్ము
నిల్లు నెందునులేని యట్టు లాయావ
ళ్లాని విడిదింటి వాఁకిటిపంచ
పాకను నాకాష్ఠభారమ్ముఁ జేర్చి
చేకొని యొకమూల చీకటిలోన
నొక ప్రొద్దునను లేచి యొనరఁ గూర్చుండి
సకల చరాచరసమితి రంజిల్ల
శ్రీరాగరాగమంజరియు నాటయును

భైరవి భూపాల బంగాళ మాళ
వియును వసంతంబు వెలయంగ నైనిమి
దియు మగరాగములే దీనికి సతులు
మలహరి దేశాక్షి మంచికాంబోది
లలితవరాళి నీలాంబరి తోడి
కన్నడగౌళయుఁ గౌశిక తెలవిః
ధన్యాసి దేవగాంధారి సౌరాష్ట్రి
పారి గుండక్రియ భల్లాతకియును
సారంగ నాటదేశాళవహరియును
రామప్రియయు మేఘరంజి కురంజి
సామంతయు ముఖారి శంకరాభరణ
ములు నిరువదినాల్గు ముదితరాగములు
నలరంగఁ బురుషుల సతివల నెఱిఁగి
పరగ మిత్రముల నుప్పదిరెంటిఁ దెలిసి
పురుష స్త్రీ రాగముల్ పొందుగాఁ గూర్చి
ధర మంద్ర మధ్యమ తారకంబులును
సరిశుద్ధసాళవ సంకీర్ణములుమ
కంఠ గద్గద నాసికా క ? స్వరములు
కుంఠితమ్ముగఁ జేసి కోమల నాభి
గంభీర సుస్వర కంఠ శారీర
జృంభితహృదయుఁడై జీవ నిర్జీవ
ఆయ కంపితోజ్జ్వలా లంకారముల ను
గ్రియగూడి హంస కోకిల వృకక్రౌంచ
వనమయూర యజావి వర్గమ్ము లలఘు
త నిషాద ఋషభ గాంధార షడ్జములు
మధ్య ధైవత పంచమ స్వరంబులను
మధ్యరాత్రమునందు మధుకేశ్వరుండు
గీత ప్రబంధ జక్కిణి పద చిందు
రీతిగా సరళిఁ బూరితముగాఁ బాడె
మఱియు న్రుశుత మచుంబన మపూర్వమ్ము
నరయ నసాధ్య మాద్యంత మాశ్చర్య
కరము గాంధర్వరాగము సరాగము న
భరితమై తారబ్రహ్మమ్ము పుట్టి

భూచరఖచరు లద్భుతమంది వినఁగ
శ్రీ చొక్కనాథుఁ డంచితలీలఁ బాడె
నా యీపవళ్లాలుఁ డాశ్చర్యమునను
నీ యర్ధరాత్రమం దెవ్వరో యనుచుఁ
దలవాఁకిటికి వచ్చి తగ నిల్చిచూచి
యలర నీవెవ్వఁడ వనుచు వాఁడడుగ
వెఱచిన వానట్టు వెసలేచి నిలిచి
యరుగు గ్రక్కున డిగ్గి యట నోరుమూసి
యే బాణభద్రుని యింటిదాసుఁడను
నా బాణునకు శిష్యు లధికులు గలరు
పాడనేర్చినవారిఁ బాటకు దిద్దు
పాడనేరని వారిఁ బరగ నీ రీతిఁ
గట్టెలు దెమ్మని కట్టడ సేయు
గట్టిగా వానింటి కట్టెమోపరిని.
అని కట్టె లెత్తుక యయ్యె పోరాటనె
యని చెప్పి చనిన వాఁ డాత్మ భీతిల్లి
తనవారి కనియె నింతటిపాటు మనము
విని యెఱుంగుదుమె యీ విశ్వమ్ములోన
వాని బంటుట వీఁడు ! వాఁడెంతవాఁడో !
మానహానియు నగు మన కుంటిమేని
నని వారలును దాను నావేళఁ గదలి
చనె వేగ రెండుయోజనముల పొడవు
నప్పు డా బాణు స్వప్నాంతరమ్మునను
జెప్పె నావిధమెల్ల శ్రీ చొక్కవిభుఁడు
నా భద్రుఁడపుడు చయ్యన మేలుకాంచి
యో భక్తజనరక్ష ! యో లోకరక్ష !
యో భవ్యసంచార ! యో కృపాపూర !
నీ భక్తునకుగాను నీవు నీ రీతిఁ
గట్టెలుమోచి యంగడివీథులందు
నిట్టు వర్తించితే యిందుశేఖర !
యని చాల చింతించి యా చొక్కపతిని
వినుతించినను గృపావేశుఁడై హరుఁడు
నెసగంగ నీవును నీప్రొద్దె పాండ్య

వసుధేశు కడకేగి వానిఁ బిలిపింపు
మనుము నీ వెఱుఁగని మమతతో నిట్లు
ననఘుఁడా బాణభద్రాఖ్యుఁడు వెలఁగి
వినతుఁడై సౌందర్యవిభు నాత్మ నిల్పి
జననాథు పాలికిఁ జయ్యన పోయి
యొలమి నే వచ్చితి నింకఁ బళ్లానిఁ
బిలుపింపుమన రాజు పిలువనంపినను
విడిదింటఁ గానక వెసవారు వచ్చి
పుడమీశ ! కానము పోఁబోలు రాత్రి
సకలవాద్యములు నిశ్శబ్దముల్ గాను
నొకప్రొద్దునను వాఁడు నూడనిబాడె.
చననేమి ! వానికిఁ జనుటు యదేమి
విధమన్న భద్రుండు వెస నిట్టులనియె
మధురేశుఁ డాశ్రిత మందారసురభి
నాపాలఁ గలిగి నిన్నటిరేయి కట్టి
మోపరియై వచ్చి ముగ్ధశశాంక
చూడావతంసుండు శోభితంబుగను
జూడిన, వాఁడును భయపడిపోయె
ననిన నారాజు నత్యాశ్చర్యమంది
ఘనతరైశ్వర్యముల్ కడువేగ నిచ్చి
యేణాంకధరునకు నీ లోకమునను
బాణునివంటి సద్భక్తుండుగలఁడె !
యని సన్నుతించి సాష్టాంగమ్ముఁ జేసి
జననాథుఁ డప్పుడు చయ్యనఁ దనదు
పట్టఁపేనుఁగుపైనఁ బరగ నెక్కించి
పట్టణమంతయుఁ బ్రబల నేగించి
యిదియాది మాకొల్వు కెన్నఁడురాక
మదనారి సర్వేశు మధురాపురేశు
భూచరఖేచరాద్భుత మహాచరితు
శ్రీ చొక్కనాథు నాశ్రితలోకనాథు
సేవఁజేసుక సుఖస్థితి నుండు మనుచు
భూవర్యుఁ డంపె నా పుణ్యపావనుని
ననిపిన నాబాణుఁ డతిమోదమునను

జని సంభ్రమంబున సద్భక్తి గలిగి
సౌందర్యనాథుని సన్నిధి యందు
కందందగాఁ త్రిసంధ్యాకాలములను
గీతప్రబంధ సంగీతమ్ము లందు
నా తాండవప్రియు నతిభక్తి గొల్చి
శివభక్తి యందును స్థిరభక్తి యందు
భువియెల్ల మఱి తను పుణ్యాత్ముఁడనఁగ
నా మథురాపురి నా భద్రకుండు
శ్రీమంతుఁడై యుండె శివకృప గలిగి
తెలియ నీలీల సద్వినయమ్ము తోడఁ
బొలుపొంద విన్నట్టి పుణ్యాత్ము లెల్ల
నెసఁగి సంగీత సాహిత్యసంపదల
మనుచుందు రెప్పుడు మధురేశు కృపను
నలువొప్ప నిదియు సౌందర్యనాయకుని
నలువదో లీల యన్నను మునీశ్వరులు
ఘటజన్మ! గజరక్ష కారణజన్మ!
యటమీఁదిఁ చరిత మాకానతిమ్మనిన
నా వింధ్యదర్పాపహారి యామునుల
కావలి చరిత మిట్లానతి యిచ్చెఁ

నలువదియొకటవ లీల.

దగ నంత పాండ్యభూతల నాయకుండు
జగతి పాలింప నా సర్వేశుకృపను
బాణభద్రుండు నా పార్థివేశ్వరుని
రాణువునకుఁ బోక రాత్రిపగళ్లు
నా స్వామిసన్నిధి నతిభక్తిగలిగి
సుస్వరమ్మునఁ బాడుచుండెడి వేళ
నే పరాకును లేక నిందుశేఖరుఁడు
నాపాట వినుచుండు ననురాగమునను
జాలించి విడిదికిఁ జను వేళ లందు
మేలైన సొమ్ములు మేటిటంకములు
నశరీరి కాసులు నా బాణునకును
పశుపతి తానిచ్చి పనుప నాతండు
నవి తెచ్చి యిమ్మి నిత్యాన్నదానమ్ము

శివభక్తులకుఁ బెట్టి వెలఁగు నెప్పుడును
నీ లీలతోడుత నెఁసగంగఁ గొంత
కాలమ్మునకును బొక్కసము శోధింప
నంతధనము తిరువాభరణములు
నెంతయుఁ గానక నిచ్చలోఁ గలఁగి
బండారములవారు భయపడి వచ్చి
పాండీశునకు విన్నపము జేసి రంతఁ
గావలివాండ్రను గట్టి కొట్టినను
నీవిధమ్మును మాకు నెఱుఁగరాదధిప !
పెట్టినముద్రలు పెట్టినట్లుండు
నెట్లుపాయనో సౌందరేశుఁడే యెఱుఁగు
ననుచు శ్రీ చొక్కనాథా ! నీవె యెఱుఁగు
దని మొఱవెట్టిరి యందఱునపుడు
నదికారణమ్ముగా నాభద్రునకును
మదనారి యేమియు మఱి యీయలేక
చింతింపుచుండెను శ్రీ చొక్కవిభుడు
నంత నాపాఠకుండటుఁ బాడి నిలిచి
యో పరమేశ్వర ! యో చొక్కనాథ !
యీ పురి నన్యథా యెఱుఁగ నెవ్వరిని
వెచ్చానకును లేదు వేగ నేమైన
నిచ్చిరక్షింపవే ! యిష్టార్థఫలద !
యని విన్నపముచేసి యాత్మఁ జింతించి
తనయింటి కరిగి యెంతయు నిద్రవోవ
వాని స్వప్నమ్మున వచ్చి యిట్లనియె
నే నీకు గుడిసొమ్ము లియ్యంగ వెఱతు
దూరైన బండారు ద్రోహమ్ము వలదు
చేరమరాజు మా సద్భక్తివరుఁడు
చీటి వ్రాసిచ్చెదఁ జెలగిఁ గొంపొమ్ము
పాటించి యతఁడతిభక్తి మన్నించి
వలసిన ధనముల వారితమ్ముగను
వెలయంగ నిచ్చును వెసఁ గొనివచ్చి
యిచ్చవచ్చినయట్లు లెల్లకాలమ్ము
వెచ్చమ్ముజేసుక వేడ్కతోనుండు

మని యానతిచ్చిన నపుడు మేల్కాంచి
విసుతించి యన్యుల వేడ నే ననిన
మామాటఁ దోయక మఱి పోయి రమ్ము
ప్రేమతో నని తనప్రియశిష్యునకును
వరుస నిరూపమ్ము వ్రాసి యిప్పించె
పరగంగ మా బాణభద్రుండు వచ్చె
నతఁడు వేఁడినయంత యర్థమ్ము నిచ్చి
యతనిఁ బంపుము చార ! యర్థిమందార !
యని యిట్లు లిఖియించి యా యర్థి కిచ్చి
నను స్వామి యాజ్ఞ నంతటఁ ద్రోయవెఱచి
యా నిరూపము శిరసా వహించి కొని
మానిత సంతోషమాన సుండగుచు
నట్టి చారమహారాజు నర్థితో నుండు
పట్టనమ్మునకును భద్రకుం డరిగె
నాచారు స్వప్నమ్మునందు విచ్చేసి
యా చొక్కనాథుఁ డిట్లని యానతిచ్చె
మా నిజభక్తుండు మా పాఠకుండు
మా నిరూపముగొంచు మఱియు నీ పురికి
వచ్చినాఁడతనికి వలసిన ధనము
లిచ్చి వేగమె యిందు హితవుగాఁ జేయు
మని యానతిచ్చిన నంత మేల్కాంచి
తన ప్రధానులకు నెంతయు వేడ్కఁ జెప్పి
యా పాఠకోత్తము నా పుణ్యచరితు
నీ పురమ్మునను మీరెల్లచో వెదకి
పిలుఁడని వారి నంపిన వార లరిగి
నలుదిక్కులను పట్టణమ్మెల్ల వెదకి
రొక చలివేంద్రలో నున్న పుణ్యాత్ము
నకుటిలచిత్తుని నటఁ బొడఁగాంచి
వెసఁ జని వారలు విన్నవించినను
వసుధేశుఁడప్పుడు వడి కాలి నడనె
చనుదెంచుచున్న యా చారమహారాజు
గనుగొని తనయలంకారమ్ము లలర
వీణ మీఁటుచును ప్రవీణత మెఱసి

బాణుండు సౌందర్యపతి మీఁదఁ గొన్ని
పాడుచున్నట్టి యా పాతకోత్తముని
వేఁడుక నా రాజు వినతుఁడై మ్రొక్కి
యొందుండి వచ్చితి రిందుల కనిన
సౌందర్యనాథుని సన్నిధినుండి
యరుగుదెంచితిమని యా నిరూపమ్ము
తరగ నా చారభూపతి చేతి కిచ్చె
నా నిరూపమ్ము మహా భయభక్తి
చే నందుకొని తన శిరమునఁ బూని
భద్ర మాతంగమ్ముపై నుంచి బాణ
భద్రుని సకల సంభ్రమములు మెఱయఁ
దన నగరికిఁ దెచ్చి తగ గారవించి
యనుపమ సింహాసనాసీనుఁ జేసి
భక్తితోడుత నర్ఘ్యపాద్యాదు లిచ్చి
భక్తి కాలాంతరంబున విందువెట్టి
తనదు నైశ్వర్యమంతయు వేడ్క నిచ్చి
యనఘాత్మ నీవుండు మనఁగ నే వెఱతు
ననుచు నా రాజు సాష్టాంగమ్ముఁ జేసి
నను భద్రకుండు నానందమ్ము నొంది
ద్రవ్యమ్మొకాని సౌందర్యు నానతిని
దివ్య వస్తువుల నేదియు ముట్ట ననిన
నధిపతి తనదు బండారమ్మునుండి
యధికధనమ్ములెన్నైనఁ దెప్పించి
తన మనుష్యులచేతఁ దనియ కెంతేని
ననఘాత్ముఁ డతి వేడ్క నంపిన నతఁడు
రాజశేఖర ! వైరిరాజరాజీవ
రాజ ! చారమరాజ ! రాజదేవేంద్ర !
త్యాగమ్మునందుఁ బ్రతాపమ్మునందు
భోగమ్మునందు సత్పుణ్యమ్మునందు
నిను బోలగలరె ! యీ యఖిలభూపతులు
ఘన చొక్కనాథుని కరుణ వర్ధిల్లు
మని భద్ర యాచకుండతని వీడ్కొనుచు
మనమున రంజిల్లి మధురకు వచ్చి

యా ద్రవ్యమంతయు నా చొక్కనాథు
పాదాల సన్నిధిఁ బఱపించి మ్రొక్కి
దేవ యీశ్వర సర్వదేవతారాధ్య !
పావకోజ్జ్వలగాత్ర ! పవనాత్మనేత్ర !
యో భక్తజనరక్ష ! యోవ్యక్త వరద !
యోభక్తమందార ! యో కృపాపార !
శిక్షిత ప్రతిపక్ష ! శ్రీ విరూపాక్ష !
పక్షివాహననుత పరమ మహేశ
పరమేశ ! నీ నిరూపముగన్న యపుడె
శిరమున ధరియించి చిత్తముప్పొంగి
కోరుటకంటె నెక్కుడు ధనరాశి
పారభూపతి యిచ్చి సాగించి యనిపె
నీ యాజ్ఞఁ దలమోచి నిఖిలలోకములు
నా యుపేంద్రుడును బ్రహ్మాది దేవతలు
వరుసతోఁ గనుసన్న వర్తింపుచుండ
నరులెంత నీదు నానతి సేయుచుండ
నర్థ మింకొక్కరి నర్థింపకుండ
నర్థులలోనఁ గృతార్థునిఁ జేసి
నన్ను మన్నించితి నాభాగ్యమునకు
నెన్నంగ సరియేది యీశ నీ కృపను.
అని సన్నుతులు చేసినంత నా స్వామి
ధనమెల్ల రొత్తి భద్రక ! గొంచుపోయి
యంచిత దానధర్మాదులు చేసి
నించిన వేడ్కతో నీవు నీ వారు
నఖిల కాలమ్ము పరాపేక్ష లేక
సుఖలీల నుండు మంచును వాని ననిపె
నా పాఠకుండు సాష్టాంగమ్ము జేసి
యేపున ధనమెల్ల నింటికిఁ దెచ్చి
సతతమ్ము నీశ్వరార్చన చేసికొనుచు
మితిలేని శివభక్తి మీఱి యాస్వామి
సేవ త్రికాలమ్ము జేసి సౌందర్య
హైవచనమ్ములు పాడుచునుండె
నాపాండ్య భూపాలుఁడా పురి ప్రజలు

నా పరాపరవస్తువైన యాస్వామి
నంగయకణ్ణె యంబామనోల్లాను
సంగీత సక్తుని సౌందర్యమూర్తి
తనభక్తుఁడైన విద్యావస్తువునకు
ధన మిమ్మటంచును దన నిరూపమ్ము
నిచ్చి పంపిన దైవమేయుగమ్మునను
నెచ్చోట నెఱుఁగము నిది చోద్య మనుచుఁ
దనర సద్యః ఫలదాత యీ స్వామి
యని వేడ్కఁ గొలిచిరి యఖిలమానవులు
నిది నలువదియొండు నిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడు
ఋషుల కగస్త్యుండు రూపించినట్లు
విషమసాయక వైరి విధమెల్లఁ దెలియ.

## నలువదిరెండవ లీల.

మఱియును నమ్మహా మధురలోపలను
బరగంగ నా భద్రపాఠకోత్తముఁడు
శ్రీ చొక్కనాథుని సేవ త్రికాల
మూహింపుచు నుండి యతిభక్తి గలిగి
యా చారుఁడిచ్చిన యర్థమ్మువలన
నాచారపరత నిత్యాన్నదానమ్ము
జేయుచు శివభక్తి శీలుఁడై యతఁడు
పాయని భాగ్యసంపన్నుఁడై యుండ
నా పురి ప్రజలును నతని బంధువులు
నీ పాఠకుండిట్లు రెసఁగునే వీఁడు
నెన్నఁడు జూచిన నెల్లవారలును
విన్నగా నీరసభావులై యున్న
నా భద్రుఁడిట్లును నహిరాజకుండ
లాభరణుండు హాలాస్యవాసుండు
శ్రీ చొక్కనాథుఁ డాశ్రితభక్తి గలిగి
ప్రోచినఁ దమకేల పొక్కగావలయు
ననుచు నప్పుడు త్రిసంధ్యా కాలములను
ఘనసేవ సేయుట గాక నిత్యమ్ము
నర్ధరాతిరి యందు నతివేడ్కఁబాడి

యర్థిం బుధరుఁ గొల్తునని నిశ్చయించి
యెన్నేని విఘ్నమ్ము లెన్ని దుర్దశలు
నెన్నేని బాధలు నెసఁగిన మదిని
[illegible]నుపక నాలుగువేళల యందు
ననమాత్తు నగరికి నా ప్రొద్దు పోయి
యే తాను జంత్రమ్ము లెసఁగ వాయించి
యాలాపములు గొన్ని యర్థితోఁ బాడి
తనయింటికిఁ బోవు దనర నీరీతి
ననుదిన వ్రతముగా నందు వర్తింప
నగజా నాయకుఁడు గొన్నాళ్ల మీఁదటను
దగ వీని భక్తిఁ జూతముగాక యంచుఁ
గాలకూటములీలఁ గాటుకకొండ
పోలిక భల్లూకపుంజమ్ము మాడ్కి
ధారుణి గగనమంతయు నేకమగుచు
ఘోరాంధకార మొక్కమ్ముడిఁ బ్రబలి
యుఱుముచు మెఱుముచు నుగ్రమారుతము
బిరుసుగా విసరుచుఁ బెళపెళధ్వనుల
భీకరాకారమై పెనుమేఘ మడరి
యేకార్ణవమ్ముగా నిలను వర్షింపఁ
బశుపక్షి మృగజంతుపటలమ్ము లెల్లఁ
గుశలమై మేఁతలకును వెళ్ళలేక
ప్రళయకాలమ్మని భయపడి జనులు
కళవళపడుచుండఁగా భద్రకుండు
నా మహానిశి వేళ నా వానలోన
నా మహామధురేశు నాత్మ భావించి
కాలిసంజ్ఞలనె మార్గముఁ జూచికొనుచు
హాలాస్యపురవాసు నాపద్వినాశు
గుడి కేగుదెంచి యొక్కఁడు భక్తినిత్త
నడలక నాదేవు సన్నిధి నిల్చి
యేళ వాయింపుచు నెప్పటికంటె
యాలాపములుచేసి యా స్వామిఁ బాడి
మఱి నందికేశ్వరు మహనీయ మూర్తి
పిఱిఁది భాగమ్మునఁ బ్రేమతో నిలిచి

ండు మహాధైర్యమ్ముతోడ
ము నాకాశమ్ము వీతెగి
నఁ జాలు ప్రళయనూరుతము
వయు వచ్చె నయ్యెడత
శ్వరు మహిమ గాక్టి
దైసను వినికి నే నెఱుఁగ
స్వామి సాహస చరిత్రములు
యు మఖ గజవ్యాఘ్రు ?
సంహరణ గీత ప్ర
వాడుచు భ్రమయక యుండెఁ
ంగమ్ము తంత్రులు సడలి
మ్ము వణకంగఁ జొచ్చె
యింప కా దృఢవ్రతుఁడు
ధ్యానమ్మున నిలిచి
డ నా శశియంజివిభుఁడు
జాల విస్మయంబంది
లిగినయట్టి పుణ్యులకుఁ
చెంద భయపడు మనుచు
మ్మ కానతియిచ్చి
చ్చటికి వేంచేసి
ర్చుండి పాడు నీవనుచు
ర్ణ ఫలకయు నిచ్చె
భద్రాసనుండగుచు
ండు నతివేడ్కఁ బాడె
రిదై నెమ్మది వినుచు
డ దృశ్యుఁడై చనిరి
దోదయంబయ్యె నక్షత్ర
సూపె జాతెఁ జీఁకట్లు
లేక కాంతిసొంపెక్క
న్నెల జగమెల్లఁబర్వె
భద్రాఖ్యుఁడవ్వేళఁ
డ సౌందర్యనాయకుని
ముగాఁగఁ జేకూరె ననుచు

భావమ్ములోపలఁ బ్రమదమ్మునొంది
చయ్యన నాస్వామి సన్నిధికరిగి
నెయ్యమ్ముతో మ్రొక్కి నిలిచి యోదేవ !
కమలానుజోత్తంస ! కమలోదరాప్త !
కమలాసనస్తుత్య ! కమలకపర్ది !
కమలాప్తలోచన ! కమలార్చితాంఘ్రి !
కమలకమలవైరి ! కమలాప్తనయన !
కమలాప్తజామిత్ర ! కమలకళత్ర !
కమలాస్యదేహ షట్కమలాదిగేహ !
కందర్పభసితాంగ ! కరుణాకటాక్ష
సౌందర్యనాయక ! సౌందర్యనిలయ !
యని యివ్విధమ్మున నభినుతుల్ చేసి
కనకపీఠముగొంచుఁ గడువేడ్క దనదు
మందిరమ్మున కేగి మఱియు నీరీతి
సౌందర్యపతి సేవ చాలఁ జేయుచును
జంగమారాధన సరవి నేమఱక
పొంగిన వేడ్క నప్పురములోపలను
నాభద్రపాఠకుం డాస్వామికృపను
సౌభాగ్యవంతుఁడై చాల వర్ధిల్లె
నిదియు నలువదిరెండు నిటు మీఁదిచరిత
ముదముతోఁ జెప్పెదమునులార ! వినుఁడి
యనుచుఁ గుంభోద్భవుఁ డా మునీంద్రులకు
సంతోషచిత్తుఁడై సరవి నిట్లనియె.

### నలువదిమూఁడవ లీల.

పరగంగ నాభద్ర పాఠకోత్తముఁడు
పరమపుణ్యాత్ముఁడీ భాతిని గొంత
కాలమ్ము శివభక్తి గలిగి వర్తించి
సాలోక్యగతి నొందె సౌందర్యకృపను
నాతని నిజపత్ని యతిపుణ్యసాధ్వి
పాతివ్రతాచార భవ్యసంచార
తనభర్తృవర్తన దప్పక యుండ
దినమును నా మహాదేవ సన్నిధికి
నడచుచు నెపుడు గానము సేయుమఱియుఁ

నజాలిధర్మమ్ము వలన
: బాండీని కొలువుకుఁ బోయి
ఁ బాడుచు నివ్విధమ్ము నను
మ్మిట్టు కొనసాఁగుచుండ
కనాఁడు నా బాణువనిత
కొలువునే కాంతమ్ము వేళఁ
గానమ్ము సేయుచున్నంత
జూ మోహాతిశయమ్ము
దిని వికారమ్ము నొంది
తిఁ గోరిశయ్యాతలమ్ము నకు
మ్మంచుఁ బిలికె నావిభుఁడు
ఱప్పుడు మనస్తాపమ్ము నొంది
యనుచు నాయవనీశుఁ జూచి
యామాట నావీనులకును
సూదులు జొన్పుచొప్పారెఁ దలఁప
ాభర్త దక్క నన్యులను
తోఁబుట్టు నై చూతుగాన
ాథుని చరణమ్ములాన
మాట లింపుగ నాకు ననిన
నుండు నామాట వినుచు
యప్పు డుల్లములోనఁ దలఁచి
ప్పుడు బిల్చిచేసెద నన్నఁ
ాస్వామి చేకొని యానవెట్టె
దతోక్తిధమ్ము నాత్మలో నునిచి
యాపెను నింటి కపుడాత్మఁ దలఁచి
బ నీయింతి భంగపెట్టంగ
ఏకుణమె నెవ్వగ బొందననుచు
మారాజు నా ప్రొద్దె తానెంచి
, దగ మించఁగాఁ బాడునట్టి
ొకతెఁ దెప్మని యాడిగంపు
ఁ్ంపె నెవ్వరు గానకుండ
బోయి వాఁడట కుత్తరమునఁ
ావేళ మెచ్చఁగఁ బాటకొక్క

నెరయోధ యైనట్టి నీరజగంధి
నరసి తోడ్కొనివచ్చి యాపాండ్యవిభుని
ముందరఁ బెట్టిన మోడ్పుగేలమర
సుందరి యపుడు సంస్తుతిచేసి మించి
వసుధేశ! నన్నీపవల్లాళటంచు
వెసఁ బ్రసిద్ధముగాఁగ వేడ్కఁ జెప్పుదురు
మఱియుఁ బంచమ షడ్జమశ్రుతులేర్చి
యిరువదినాలుగు నాలాపములును
దానముల్ మంద్ర మంధ్యమతారకముల
నేనె పాడఁగ నేర్తు నిఖిలమ్ములోన
ననుచుఁ గూర్చుండి చయ్యన శ్రుతిఁగూర్చి
మనుజేంద్రు నెదుట విస్మయముగా నపుడు
సప్తస్వరమ్ముల జాడల నాత్మ
కాప్తమ్ముగాఁ బాడె నందఱు వినఁగఁ
దడయకప్పుడు పాండ్యధరణీశ్వరుండు
కడుమెచ్చి దానికిఁ గట్టంగ నిచ్చి
యత్తఱి నందున్న యాబాణభద్రు
నుత్తమాంగనఁ జూచి యీసాధ్వి నీవు
నీపవల్లాళతో నీడుగా మించి
నీ శక్తిఁబాడంగ నేర్తువే! యనిన
నామె యిట్లనిపల్కె నాచొక్కనాథుఁ
డామహేశ్వరుఁడు నాయాత్మ నుండఁగ
నాకెదు రెవ్వరు నరనాథచంద్ర!
ప్రాకటమ్ముగమించి పాడెద ననిన
నాపుడు నారాజు నట్లకాకనుచు
నావచ్చినట్టి గాయకురాలి నంత
విడిదికిఁ బొమ్మని వీడ్యమ్ము లిచ్చి
బడిబడి భూషణాంబరములిప్పించి
యంపి యా బాణభద్రాంగన నింటి
కంపఁగాఁజూచి యిట్లని యానతిచ్చె
కడఁగి నీవామెతోఁ గడుబాట కోటు
వడిన నేమోడిన భావమ్ము సుమ్ము
కావున నెఱిఁగి లోఁగక దాని గెలువ

గావలె నంచు నక్కడ వాక్కు నొకటి
మనమున నొకటిగా మానవేశ్వరుఁడు
ననుపంగఁ దలఁప నాయతివ యిట్లనియె
వసుధేశ ! నేఁ బతివ్రత గాదు నేని
వెస నొక్కతప్పు నే వెరవునలేక
మధురాపురీశ్వరు మదిలోన నిల్పి
యధికత నీదు సామర్థ్యమ్ము వలన
నీడ నీసముఖాన నెల్లరుమెచ్చఁ
బాడి గెల్చెదను నీపాదమ్ములాన
యనిన నాభూపాలుఁడా సాధ్విఁ జూచి
యొనరంగ నట్లనేయు మటంచుఁ బలికి
యారాత్రి యీశవల్లావాసమునకు
చారులఁబంపి మాసముఖాన రేపు
పఱతెంచి యాబాణభద్రుని యింతి
వెఱతక దగ్గరి వెస వాదు జేసి
వెనుకదీయక దాని వీడంగఁజాడు
మనుచు నానతిచ్చి యంపినఁబోయి
యావిధంబంతయు నటఁ జారులనిన
నా వారవనితయు నట్లకాకనియె
నంతట మఱునాఁడు నాబాణభద్రు
కాంతాశిరోమణి గానమ్ము నేయ
భూకాంతు సమ్ముఖంబునకు నేతెంచి
చేకొని వినుతింప శీఘ్రంబె యప్పు
డా యీపవల్లాలు నాకొల్వు కరిగి
యాయింతిఁజూచి యిక్కోడను నాతోడ
గానమ్ము నేయంగఁ గడగు మటంచు
నానావిధమ్ముల నయ మింతలేక
నాలీల బాణునినాఁడ నాయిర్వు
రందును వాదమ్ము లధికమ్ముగాఁగ
నందందఁ గల్గుటా యవనీశుఁ డాత్మ
నత్యంతసంతోషితానందుఁడగుచుఁ
బ్రత్యుత్తరమ్ముగాఁ బల్కె వాక్కునను
మీకు వాదంబేల మీరు నాపల్కు

చేకొనుఁడనిరాజుఁ జెప్పెరఁ జేర
రమ్మంచుఁ బాఠకులార ! మీరిపుడు
సమ్మతిఁ బాడంగ సరవి నెవ్వారు
పాటమించినవారు పాటించి మించి
పాట కోడిన వారిపై నెక్కుడనిన
నదియట్లకానిమ్మటంచు నారాజు
నెదుట నేమించి యా యీపవల్లాళు
నాడ నాసభవార లందఱు వినఁగఁ
బాడెను దననేర్పు పాటించి యంత
నాపాట చాలించి యాపాండ్యవిభుఁడు
నీపాట యేపాటి నీపట్లు యిందుఁ
బాడు మిక్కిడికవి పాకముల్ వినఁగ
వేడుకతో నన్న వినుమని బాణ
భద్రాంగనప్పుడు పాడె నావేళ
భద్రమ్ముగ ననేకప్రౌఢనాదముల
నప్పుడా స్థానమ్మునందున్న బుధులు
తప్పక వినియు వాతప్ప కిట్లనిరి
యాకదంబాధీశు కర్పితంబుగను
గోకిలస్వరమునకును సాటిగాఁగ
రాణువ మెచ్చంగ రసికత్వమునను
రాణింప నీ పతివ్రత పాట మించె
నాకాంతపాట చయ్యన వింటి మిచట
కాకస్వరంబది కారాదు వినఁగ
ననిన నాభూపాలుఁడా మాటలేల
విన భీకరమ్ము గావించె వీనులకు
నింపుగాఁ బాడె నా యీపవల్లాళు
సొంపెసలార నిచ్చోమించె ననఁగఁ
దూకొని రాజమతో ధర్మ యనుచు
నాకావ్యులందఱు నాత్మలో నెంచి
యధిప ! మీయానతి యట్టిద యౌను
మధురవాక్యమ్ము లిమ్మహిఁ మించఁ బాడె
ననిన యా మాటకు నాయీపవల్లి
మనమున హర్షించి మఱి వారు మెచ్చ

నాబాణభద్రుని యతివ యంతటను
దాప మనస్కయై తలవంచియున్నఁ
దలకొని పాండ్య భూతల నాథుఁడపుడు
గెలుపోటు మెవ్వరికిని గలదిందు
నటుగాన మీమీగృహమ్ముల కరిగి
తటుకున నందు నెంతయు విశ్రమించి
యెల్లి రేపాడి మీరిటకు నేతెంచి
యెల్లరు వినుచుండ నింపుగాఁ బాడు
డంత మీకెక్క హీనాధిక్య మెల్ల
నెంతయు వేడ్కతో నేర్పఱిచెదము.
అని రాజు పలుకంగ నట్ల కాకనుచు
జనిరంతఁ దమ నివాసములకు వారు
నారాత్రి యొక ప్రొద్దు నా బాణువనిత
భోరునఁ దనమనంబున విచారించి
క్షితినాథుఁ డిట్లుపేక్షించె నాకిఁకను
గతియేది దీనికే గతిగల దనుచు
మానిని యపు డనుమానమ్ము మాని
నానాథునకును నానందమ్ము గాఁగ
పూని సహాయుఁడై పొగ డొందఁ బ్రోచు
నానీపవనవాసు నామధురేశుఁ
డరయంగ దిక్కు నాకతఁడె పో యనుచు
నారేయి యాగుడి కతివేగఁ బోయి
సరిలేని యాస్వామి సన్నిధి నిలిచి
ధరఁ జక్క జాగిలి దండమ్ము వెట్టి
లేచి చేతులు మోడ్చి లెక్కింపరాని
వాచకస్ఫురణ నవ్వామాక్షి యపుడు
వాసుకిహార ! గీర్వాణ విస్తార !
వాసుదేవాబ్జజ వర్ణితాకార !
దాసిగా నిలఁ బతివ్రతలలో నన్ను
భాసురమ్ముగఁ జేయు బాణవాత్సల్య
బాణభద్రుని పుణ్యభామను నాదు
ప్రాణమ్ముఁ గాచి నాపాట మెప్పించు
తెలియంగ మీకృపాదృష్టి నామీఁదఁ

గలదెల్ల వారలకంటె దయార్ద్ర
యా రాజు నాపైని నాత్మలో నెపుడు
దారుణంబైన క్రోధము గల్గుటెల్ల
నీచిత్త మెఱుఁగును నిఖిలాత్మవర్తి
శ్రీ చొక్కనాథ ! రక్షింపవే నన్ను
నని విన్నవించిన నా స్వామి యంత
వినువీధి వాణియై వెలఁది కిట్లనియె
నో సాధ్వి నిను నోడకుండఁ జేసెదను
మాసన్నిధైన యీ మంటపమ్మునకుఁ
జనుదెంచి యిరువురు సరవితోఁ బాడు
డని యానతిచ్చిన నతిభక్తి మ్రొక్కి
తనమందిరమున కెంతయు వేడ్కఁ జనియె
మనుజేంద్రుఁడంత నా మఱునాఁటి రేప
కడ వారి నిద్దఱఁ గడఁగి రప్పింప
బడి బడి చారులఁ బంపి యాక్షణము
హెచ్చు కొంచెము పెద్ద లేర్పఱించెదరు
నని పక్షపాతమ్ము నాత్మలో నునిచి
జననాథుఁడనిన నా సాధ్వి యిట్లనియె
నరనాథ శ్రీ చొక్కనాథు సన్నిధికి
నరిగి యా మంటపమ్మందుఁ గూర్చుండి
వెలయంగ మాపాట వించు నచ్చోట
గెలుపోటములు పరికింపు డయ్యెడను
నదియునాకును జాలునన్న నారాజు
పదపదం డచ్చోటఁ బాడిన నేమి
భావించి నిర్ణయింపగ నేమి గాక
నావల నెవ్వారలనుచు నాస్వామి
సన్నిధి మంటపస్థానమ్మునకును
నన్నరనాథుండు నతివేగ నందుఁ
గవుల విద్వాంసుల గాయకుల్ మంత్రు
లవనిపాలుర మండలాధీశ్వరులను
వేడుకఁ జౌషష్టి విద్యలవారి
నాడకు రావించి యా పాండ్యవిభుఁడు
నడ్డగింపఁగ రాని హంకారమునను

నొడ్డోలగమ్మున నున్నతస్థలినిఁ
గొలువిచ్చి యుండి దిక్కులు మెచ్చి పొగడఁ
బిలువ నంపెను వారిఁ బ్రేమఁ బాడఁగను
నంత నామధురేశుఁ డాచొక్క విభుఁడు
సంతతానందుండు సౌందర్యవిభుఁడు
తవణింపఁ గపటు నాటక సూత్రధార
యవధానమతిని విద్వాంసుఁడై యందు
కరిగి యారాజున కాశీర్వదించి
గురుతింప నతఁడును గూర్చుండు మనినఁ
దళుకొత్త నచటఁ బెద్దలలోన మించి
వెలయంగ నచ్చోట విచ్చేసి యుండె
నప్పుడు నాగాయకాంగన లిద్ద
రప్పార్థి వేశ్వరునగ్ర భాగమున
కేతెంచి పాడి రాయిరువురిలోన
నాతఱి వింత గాయకురాలు నాత్మ
నిక్కమ్ముగా మెచ్చి నెమ్మిఁ బాటించి
యెక్కుడు జేసి నన్నెక్కించు రాజు
నయముగా నంచుఁ దానము లేచ్చి మఱియు
భయమంది యప్పుడా పాదమస్తకము
చలియింపుచును ఘర్మజలముల మేను
దలకఁగ నోరను దడి యింత లేక
శోక స్వరోక్తి గద్గదకంఠ యగుచు
భూకాంతు సమ్ముఖంబునఁ బాడె కొంత
బాణభద్రుని పుణ్యభామ యత్తఱిని
నేణాంకధరు మధురేశు శ్రీ చొక్క
నాథుని మదినిల్పి నలువొప్ప మనుజ
నాథుని యెదుట నందఱు మెచ్చి పొగడ
గొలఁదైన శ్రుతి గూర్చి కోకిలరావ
ములఁ బాడె సౌందర్యమూర్తి కర్పితము
గా బుధుల్ తగ శిరఃకంపమ్ము సేయ
నాబాణభద్రాంగన ధికతానముల
నప్పుడు విద్వాంసుఁడైన యాస్వామి
తప్పక లేచి యాధరణీశుఁ జూచి

భూనాథ యీసాధ్వి పాలు పొందఁ జేసె
గాన మిందుకు సరి గాన మియ్యెడను
గాన మిక్కిలి మంచి గానలలోన
గాన మీమెకు సాటిగా నెన్నరాదు
అని సౌందరేశ్వరుం డానతిచ్చినను
వినియు నారాజును విద్వాంసు లచటి
కవులును సభవారు గాయకవ్రాత
మవునవు నీసాధ్వి యనుచుఁగాఁ బాడె
నయమొప్పఁ దుంబురు నారదు లట్ల
జయము చేకొనె నంచు జనులెల్లఁ బొగడ
నీమెను నీమెపై నెక్కింప వలయు
నామె యీమెకు నోడు టది నిశ్చయమ్ము
అని దృఢమ్ముగఁజేసి యాసామి యపుడు
తను జూడఁ జూడనంతర్ధాన మందె
నప్పుడు నమరులు నతిపుష్పవృష్టి
గప్పిరంతటను వేడ్కలు మించఁ గాను
నాసభ వారెల్ల నద్భుతంబంది
యీసాధ్విఁ బ్రోవంగ నీమధురేశుఁ
డీతఱిఁ గావ్యుఁడై యిటకు విచ్చేసె
నాతఱి మనము పుణ్యాత్ములమైతి
మరయ దైవ సహాయులైన వారలకు
మఱి యనేకావదల్ మగ్నమై పోవు
నదిగాన నాస్వామి నాత్మలో నిల్పి
పదిలమై సభమెచ్చఁ బాడె నీ వనిత
యనుచును గొనియాడు నంత నాపాండ్య
జనునాథుఁడంత నాశ్చర్యమ్ము నంది
యాలోకనాథు లీలానందమునకుఁ
జాలంగఁ బులకితోజ్జ్వల గాత్రుఁడగుచు
బరిపూరితానంద బాష్ప పూరములు
దొడరంగ నతివేడ్కతో నాత్మ నలరి
యా సౌందరేశ్వరు కధికమ్ములైన
భాసుర సద్భక్తిఁ బ్రస్తుతుల్ చేసి
మఱియు నాసాధ్విని మన్నించి యపుడు

యుగ్రునిఁ జూచిన యుత్తమాంగనవు
నీ భాగ్యమునఁ గాదె నీపాట వినఁగ
నీకుండు వేంచేసె నీపాలఁ గలిగి
యనుచు నాబాణభద్రాంగనఁ బిలిచి
మనుజేంద్రుఁ డా వింతమగువపై నంత
నక్కడ సభవార లందఱుఁ జూడ
నెక్కించి పురమెల్ల నేగించి యామె
సహజ పతివ్రతాచారమ్ము తెంచి
బహుళ సద్భూషణాంబరము లిప్పించి
కొనియాడి నీవు నాకొలువున కింక
ననయమ్ము రావలదా దేవు నెపుడు
సేవింపుమంచు నా క్షితి పాలకుండు
నా వనజాక్షి నినతి వేడ్క నంపి
శ్రీ చొక్క నాథుని సేవించి మించి
ప్రోచె నాహాలాస్య పురరాజ్య మెల్ల
నంత నాయింతి యత్యంత మైనట్టి
సంతోష ముప్పొంగ సౌందర్యనాథు
సన్నిధికిని బోయి సద్భక్తి మ్రొక్కి
కరములు మొగిచి శంకర ! మహాదేవ !
కరిదైత్యహరణ ! భాస్కర చంద్రనయన !
కరివక్త్ర జనక ! దిక్కరి వినూనాంక !
కరిరక్షణార్చిత ! కరిరాజ వరద !
పాతకకులములోఁ బాటించి నన్ను
మేటిగా వించితే ! మీనధ్వజారి !
యని సన్నుతించి సాష్టాంగమ్ము జేసి
తన మందిరమున కెంతయు వేడ్క నరిగి
పతిభక్తి సౌందర్య పతిభక్తి గలిగి
సతతమ్ము జంగమార్చనలు సేయుచును
నాపురి వారెల్ల నౌనని పొగడ
నాపురమ్మున నుండె నాపుణ్యసాధ్వి
యిదియు నల్వది మూఁడు నిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార ! వినుఁడి
యనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె

## నలువదినాలుగవ లీల

ఆ మహామధురపురాధీశ్వరుండు
కామిత ఫలదుండు కంతుసంహరుఁడు
శ్రీ చొక్కనాథుండు చిన్మయాత్మకుఁడు
వాచామగోచరవర్ణుండు సర్వ
మంగళారమణుండు మఱి యొక్కనాఁడు
నంగయకణ్ణమ్మ కతిరయమ్మునను
జ్ఞానోపదేశమ్ముగాఁ గొన్ని కథలు
నానతిచ్చెను స్వామి యవధానమతిని
జగతి సృష్టి స్థితి సంహార కర్త
యగుట గావునఁ బరాకయ్యె నాయెడను
దా నానతిచ్చు నధ్యాత్మ మంతయును
బాయక తెలిసెనో పరికింత మనుచు
నా కథావృత్తాంత మాద్యంతములును
మాకుఁ గ్రన్ననఁజెప్పు మా యన్న నంబ
యంబరకేశ ! దిగంబర యీశ !
యంబర మణి సహస్రాంశు ప్రకాశ
శంబరారిధ్వంస ! శశికళోత్తంస !
యనువుగా వినవైతి నజ్ఞానమునను
నను వంటి బుద్ధిహీనత చేత మఱచి
దేవ ! సర్వాపరాధిని నన్ను గరుణ
భావించి యీసారి బాగుగాఁ దెలియ
నానతిమ్మనిన నాహరుఁ డతిరౌద్ర
మానసుండగుచు నామగువ కిట్లనియెం
నతిరహస్యమైన యధ్యాత్మకథలు
నతివేడ్కతో నేము నానతీయఁగను
భయభక్తియుక్తిఁ దద్భావమ్ము నీవు
రయముగా వినక పరాకైతిగాన
శంబడిరాజన జలధితీరమునఁ
బంబిన వేడ్క మాపైఁ జిత్తముంచి
యిమ్మహిఁబూజించు నెలమి ధీవరుఁడు
సమ్మతితోడ నా సద్భక్తవరుని
కడుపునఁ బుట్టు మంగయకణ్ణి వనఁగఁ

వడయకు మంచుఁ గాత్యాయనిఁ జూచి
సర్వేశ్వరుఁడు రోషసంయుక్తుఁడగుచు
శర్వాణికిని దగ శాపమ్మునిచ్చె
నిచ్చిన విఘ్నేశుఁ డెఱిఁగి వేవేగ
వచ్చి కోపమున నాస్వామి నీక్షించి
యాదేవి ఖిన్నురాలై యుండఁ జూచి
యోదేవ యిటు సేయ నుచితమే ! నీకు
జ్ఞానసద్బోధ ప్రజ్ఞావంతులైన
మానవోత్తములు ముమ్మారుగాఁ దెలియ
వినికని యెఱుఁగరు వెలఁది మాతల్లి
యనఁగ నింకొకపారి యానతిమ్మనిన
చపలాత్మ లబలలు జడమతు లనక
శపియించుటది మహాశ్చర్యమ్ము దేవ
యని యగ్రభాగమ్ము నందున్నయట్టి
ఘనతరాగమపుస్తకమ్ముల నెత్తి
తుండమ్మునను బట్టి తోయధిమధ్య
కాండమ్ములోన నాగ్రహమున వైచె
వైచిన నాదంత వక్త్రునిఁ జూచి
నవ్వుచునుండెను నా చొక్కవిభుఁడు
మఱి షణ్ముఖుఁడు వచ్చి మధురేశుఁ జూచి
కరమగ్రమునను భీకరముగా నిల్చి
యలవడఁ బరమ రహస్యాగమములు
దెలియంగ జ్ఞానోపదేశమ్ము సేయ
వేళఁ బరాకైన వివరించి చెప్పఁ
జాలుటగాక యాజాలికు నందు
మాతల్లి నటుఁ బుట్టుమని యానతీయ
నీతియే యని చాల నిందించి శివుని
హస్తమ్మునందు విన్యస్తమైయున్న
పుస్తకమ్మునుదీసి పోఁబార వైచె
వైచినఁ గనుగొని వడిఁ గోపమెసఁగ
నోరి ! దురాచార ! యోరి దుష్టాత్మ !
యీరీతి నీగర్వ మేమి యిందునకు
నీ యోరికోమటి యింట జన్మించు

మీయని శపియించి యీశ్వరుఁడంతఁ
దనయుని నారీతి దండించి పనిపి
పనిఁబూని యా ద్వారపాలుఁడైయున్న
నందికేశ్వరుఁ బిల్చి నన్ను నీరీతి
నిందింప వీని లోనికిఁ బంపుటెట్లు ?
నేకాంతమై యుండు వేళల మఱియు
వాకిలిఁ జూఱనీయ వలదంచు నిన్నుఁ
గావలిపెట్టినఁ గడు వీనినందు
రా విడిచిన యపరాధమ్మువలన
బలుమత్స్యరూపమై బసవేశ మాకుఁ
గలిగిన యాపుస్తకమ్ము లన్నియును
జీర్ణమై పోకుండ శిరమునఁ బూని
యర్ణవమ్మున నుండుమని శపియించె.
అప్పుడా గిరిజా షడానన వృషభు
లప్పరమేశ్వరు కభివాదనమ్ము
గావించి మిక్కిలిఁ గనలి యారీతిఁ
గావింతురే కులకాంతాత్మజులను
మాకును గలియేది మధురేశ ! యనిన
శ్రీకంఠుఁడట దయాదృష్టి భావించి
తరళాక్షి నిన్నును దనయగాఁ గోరి
తిరముగాఁ గూర్చిన ధీవరోత్తముఁడు
నరిమురి వేడ్కతో నహరహమ్ములును
సురువడి తపము సేయుచున్నవాఁడు
నది కారణమ్ముగా నతని గర్భమున
నుదయించి యచటనే యుండిన నేను
వలవాఁడనై వచ్చి వలనుగా నిన్ను
నలర వివాహమౌ దప్పటు నుండు
వృషభేశ నీవును విషధి వర్తింపు
ఝషరూప మపుడు మోక్షప్రాప్తము గను
నిను గుమారుని గాఁగ నిజభక్తితోడ
ఘనముగా నాసెట్టి కడుగోరు గాన
నేనాని ! నీవు నాసెట్టికిఁ బుట్టి
పూని శీఘ్రమున విముక్తుండ ! వగుము

యని చొక్కనాథుండు సానతిచ్చినను
జని వార లారీతి జనియించి రంత
నంగయకణ్ణమ్మ యా దాశవరుని
యంగన కుదయించి యధికలావణ్య
ములచేత ముజ్జగన్మోహిని యగుచు
వలవాని యింటను వర్ధిల్లుచుండ
వనజాక్షి కపుడు యౌవనప్రాయమైనఁ
వనతండ్రి యప్పుడా తనయను జూచి
యీ సుందరాకార నీ శోభనాంగి
నీ సైకతశ్రోణి నీ యబ్జపాణి
నీ కంబుకంఠిని నీ తలోదరిని
నీ పాటలామోద నీ తనుమధ్య
నీ పల్లవాధర నీ లతాతన్వి
నీ చకోరాక్షిని నీ చంద్రముఖిని
నా చొక్కనాథుని యంతవానికిని
నిత్తుగా నొరులకును నియ్య నే ననుచుఁ
జిత్తములోపలఁ జెలఁగుచు నుండె
నప్పు డామధురేశుఁ డాదేవిఁ బాసి
కప్పర్యో మోహాధిక్యముచే మేను
తెలతెలఁ బాఱెఁ గుత్తిక వెచ్చవుట్టె
తలయేఱు వుట్టెను దాహమ్ముహెచ్చె
జడగట్టె నెఱులును సగమాయె నొడలు
నడర నెమ్ములు తోలు నయ్యె దేహమ్ము
నీ రీతి తోడ నెంతేనియు వగల
మారసంహారుఁడా మారుని బారిఁ
బడలేక నపుడు శంబడిరూపు దాల్చి
కడువడిఁ గోడ నక్కడికి విచ్చేసెఁ
దనమామ యతని సౌందర్యముఁ జూచి
మనసిజు గెల్చిన మాడ్కినున్నాఁడు
వీఁడెవ్వఁడో యని వేడుకపడుచు
వాఁడ నీవెవ్వరి వాఁడవో యనిన
జాలారివాఁడను సౌందర్యనాథు
పాలనే యుందును బరగ నాపేరు

చొక్కఁడందురు నన్నుఁజూచితి రేని
చిక్కమ్ము నాచేతఁ జిక్కిన జలధిఁ
గల యొట్టి తిమితిమింగిలముల నైన
వలగొని యీవలావల సేయఁ గలను
పడుచు నిచ్చితి వేనిఁ బరిణయం బాడి
కడువేడ్క నీయొద్దఁ గలసియుండుదును
ననినఁ బ్రియంబంది యా దాశవరుఁడు
తన తనయకు వీఁడు దగినవాఁడనుచుఁ
దలపోసి యప్పుడాతని కిట్టులనియెఁ
గలదిందు జలధిలో ఘనమత్స్య మొకటి
యదియును మిగుల ఘోరాకార మగుచు
నుదధిలోఁ గల జంతువుల నెల్లఁ దినుచు
నెంతేసి వలవారి నెందఱేనియును
బంతమ్ము లాడుచుఁ బట్ట వచ్చినను
త్రుటితమ్మై వలలు తుత్తునియలు చేసి
తటుకున వారలఁ దఱిమి దాఁటుచును
నోడక నెంతేసి రేవాడలనైన
దోడలఁ బగులంగ దాఁటినరీతిఁ
జలుమాఱు చిక్కక ప్రబలి వర్ధిల్లు
బలుశక్తి నామీను బట్టెదవేని
నీకు నీక్షణమున నిక్కమ్ముగాను
నాకూఁతు నిత్తు నెంతయు వేడ్క ననిన
నతఁడట్లకాకని యతిసంభ్రమమునఁ
జతురత నొకవల సవరించె నంత
మునుకొని భవబంధములు ముళ్లువేసి
మొనసి యాశాపాశములు త్రాళ్లజేసి
మాయాంధకారమ్ము మఱి వలగాఁగ
మాయావి తానునై మధురేశ్వరుండు
వల బుజమ్మునవెట్టి వలిమల పట్టి
వలన నావలరాజు వలఁ జిక్కినట్లు
వలవారితోడ నే వలన నామీను
వలనుగానున్నది! వలఁజెప్పు డనిన
నా దాశులందఱు మరునిఁదోడ్కొనుచు

మోదమ్ముతోడ సముద్రమ్ము కరిగి
పాఠీనరూపమై బసవేశుఁడున్న
యాతావుఁ జూపిన నంతట వృషభ
యానపాత్రుండొక్క యానపాత్రమ్ము
దా నెక్కి వార్ధిమధ్యమ్మున కరిగి
గుఱివెట్టి సుట్టి బాగురి వైచి పట్టి
దరిఁ జేర్చెఁబట్టు టందఱికిఁ జూపట్ట
నాధీవరుండైన యాశౌండరేశు
సాధించి యామీను జలధిమధ్యమునఁ
బట్టె నీతండని ప్రహరిగాఁ దన్ను
జుట్టుముట్టుక వేగఁ జూడ నందఱును
మస్తకాగ్రమ్మున మహితసుజ్ఞాన
పుస్తకమ్ములఁ జాల బూనుకయుండె
నవుడు సహస్ర దంష్ట్రాకార ముడిగి
యుపమింపరాని దేహోన్నతిఁ దాల్చి
నందిరూపమ్మున నందికేశ్వరుఁడు
నందివాహనున కానందమ్ముతోడ
వందనమ్ములు జేసి వాసుకి హారు
ముందఱ నిలుచుండి మోడ్పుగే లమర
శర్వ ! శర్వాణీశ శర్వాణిరమణ !
సర్వేశ ! సర్వజ్ఞ సర్వసంపన్న !
సర్వాపరాధినిఁ జాల మన్నించి
పూర్వవైఖరి నన్నుఁ బ్రోవవే ! దేవ
యని సన్నుతులుసేయ నా బసవేశ్వ
రుని గరుణించి యాగోహణుండగు చు
నల్పైన కంఠమ్ము నాగకుండలము
తెలుపు నలుపును నైన దివ్యదేహమ్ము
ముక్కన్ను డమరుకంబును భూతిఁ దాల్చి
చొక్కనాథుఁడు వేడ్క నూతు నింటికిని
విచ్చేసె మునులెల్ల వినుతులు సేయ
నచ్చెరువంది వియచ్చరుల్ చూడ
నచ్చటి కేగి దాశాధీశ ! మాకు
నిచ్చెద నన్నట్టి యింతి యెదనిన !

దాశేశ్వరుఁడును సదాశివు కపుడు
దాసి యొంతేనియు దండముల్ పెట్టి
యతిదయాం దతి వేడ్క నతిరయమ్మునను
మితి లేని సంస్తుతుల్ మిక్కిలిఁ జేసి
హరహరా ! యేను గృతార్థుండ నైతి
ధర మాకులము పవిత్రమ్ముగాఁ జేసి
పరిణయింపఁగవలె పరమాత్మ ! యనిన
హరుఁ డట్లగాకని యానతి యిచ్చె
నాతఁ డప్పుడు పరమానందమంది
సూతవర్యుఁడు మహాస్తుతులతో నపుడు
హరి నీలరత్న మధ్యాలకాచార
సరస రాజీవ కేసర నేత్రగంధి
మదకరి కుంభగమన కుచయుగళ
విదిత రాకాచంద్ర బింబాధరోష్ఠ
సలలిత యరుణాబ్జ సత్పాద గంధి
కలిత విద్రుమ లతాకాంతి తన్వంగి
నంగయ కణ్ణమ్మ ననుదిన సర్వ
మంగళాలంకార్య మహనీయ దివ్య
రత్న పరిష్కారరాజిత దేహ
నూత్న సౌందర్య, తనూజను దనదు
కులమువారెల్ల సంకులముగాఁ జూడ
జలచరాధీశుఁడా జలధారునకును
తత్కాలాచారమ్ము తప్పకయుండ
నుత్కృష్ట ఘనమాన శోల్లాసుఁ డపుడు
నా రాజధరునకు నర్పించె నంత
నా రీతితో వివాహంబాయె నంత
నా ధీవరుఁడు వచ్చి యతిమోదమునను
మాధుర్యపతికి నమస్కృతుల్ చేసి
యో భక్తవత్సల ! యో భక్తవరద !
యో భక్తమందార ! యో కృపాకార !
గుఱుతుగాఁ గుమ్మర గుండయ్య భక్తి
కిరవుగా శివలోకమిచ్చిన వేల్ప !
మడివాలు మాచయ్య మన్నించి యపుడు

నడుగక సాయుజ్యమొసఁగిన వేల్ప
మఱిమెచ్చిపెట్టని మారభక్తునకు
పదిలమ్ముగాఁ బరంపద మిచ్చు వేల్ప !
జాతి భేదములేక సకల జీవులను
ఖాతిగా రక్షించు భక్తమందార !
పరమేశ మీపాద పద్మముల్ గంటి
పరగంగ నా జన్మ పావనంబయ్యె
హింసావిచారుండ హీనమానసుఁడ
సంసారలోలుండ జడవర్తనుండ
నా వారిలోన సన్మానమ్ము జేసి
శ్రీ విశ్వనాథ ! రక్షించితే నన్ను
నని సన్నుతులు సేయ నతని మన్నించి
యనఘాత్ముఁడవు సంతతాన్నదానుఁడవు
శివభక్తిపరుఁడవు చిరభక్తి నీదు
నువిదయు నీవు నన్యోన్యచిత్తమున
జంగమారాధన సద్భక్తిఁ జేసి
సంగతిఁ బుత్రవాత్సల్యులై యెపుడు
కోరుచుందురు గానఁ గొమరొప్ప నీదు
దారకుఁ బుత్రిగాఁ దగ నుదయించి
యంగయకణ్ణ మియ్యెడ నుండగాను
బొంగిన వేడ్క నింపుగను గైకొంటి
నని యానతిచ్చుచు హాలాస్యవిభుఁడు
ఘనముగా వారికిఁ గైలాసపదవి
నా దంపతులకిచ్చి యతి సంభ్రమమున
నా దేవి నటఁ దన యెడమభాగమునఁ
గోరికతో నిల్పుకొని యతి వేడ్క
గోరాజగమనుఁడా గోరాజు నెక్కి
మధురకు విచ్చేయ, మఱియు నా యంబ
యధిక సన్మానులతో నా స్వామి కపుడు
దేవ ! సుజ్ఞానోపదేశమ్ము నాకు
ఖావించి యానతీ ! పరమాత్మ యనిన
గుఱుతుగా నుత్తరకోశంబ యనెడి
పురమున నరువది మువురు భక్తులను

జ్ఞానోపదేశమ్ముకై మమ్ము గోరి
యానిన తపము సేయుచు నున్నవారు
వారికి నీకును వరుస నప్పురము
జేరి యందానతిచ్చెదము మేమనుచు
నా పురమ్మున కేగి యా భక్తులకును
నా పార్వతికిని దివ్య జ్ఞానబోధ
యగణితమ్ముగఁ జాల నానతియిచ్చి
తగ సంతతికినిఁ బుస్తకముల నిచ్చి
యా యంగయర్ కణ్ణియమ్మ సౌందర్య
నాయకుండును సదానందాత్ములగుచు
హాలాస్యపురమున కరిగి సంతోష
కేళి నుండిరి యంత ఖేచరులెసఁగి
హరునిపై నత్యంత హర్షమ్ముతోడఁ
జోరిఁ బోరిఁ గురిసిరి పుష్పవర్షములు
వలగొని యీ లీల వర్తించు నెపుడు
నిదియు నల్వదినాల్గు నిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార! వినుఁడి
యనుచు సన్మునులతో నా యగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనిరి.

## నలువదియైదవ లీల.

మఱియు నా పాండ్యుడు మధురాపురమ్ము
నొరపుగాఁ బాలింపుచున్న యత్తఱిని
నరయ నా దేశమ్మునం దొక్క వెలమ
కులపతి యందును గోర్కెలింపెసఁగ
గాంచెఁ బన్నిద్దఱు ఘనుల నాత్మజుల
నంచిత సౌభాగ్య లధిక విక్రముల
వారలు రూప యౌవనములతోడ
మీఱి యా దేశాన మెలఁగి వర్తించు
తఱిని వారల తల్లిదండ్రులు నమరఁ
బురి కేగిరంత నప్పుడు నా కుమాళ్లు
తగమించి మఱియును ధాన్య సంపదల
పొగడొంద కొన్నేండ్లు పూజ్యులై యుండి
రంత సంపదపోయి యధిక దారిద్ర్య

కొంత విశ్రాంతిచే మించ నూహించి
యన్యదేశము కేగి యందఱు గూడి
యన్యథా గతిలేక హాలికులగుచు
దుక్కిచేతను బ్రబలి దొరతనమ్మునను
నక్కడనుండిరి యాత్మ శోభిల్ల
నంతట నొకనాఁడు నా యరణ్యమున
కెంతయు వేఁటగా నెల్లరు నేఁగి
యందు శాపానుగ్రహమ్మున మించి
పొందుగా నొక మానిపుంగవుం డచట
నధిక ధ్యానారూఢుఁడై యొక్క పాదను
విధుజూటు మదినెంచి వేడ్కతోఁ దపము
నేయుచున్నంతటఁ జేరి యా ఋషిని
రాయిడి వెట్టుచు రభసమ్ముతోడ
మిన్నంది ప్రేలుచు మించి గర్వమున
సన్నిద్ధులపుడు చప్పట్లు దట్టుచును
హాస్యము నేయుచు నతని ముందటను
లాస్యము లాడుచు లాగున నుండ
నప్పు డా మునిసింహుఁ డాగ్రహం బెసఁగ
దప్పక వారి నందఱిఁ జూచి మీరు
కడఁగి యీ భూమి ప్రక్కలు గాఁగ దున్ని
కడుపు సాకుచు నున్నకష్టమానసులు!
కాన మీరేగి సూకరజాతి నొంది
కాననఁ జరియించి కర్కటిగర్భ
మును బోలి మాతృవిముక్తి నందుదురు
నని శాపమిచ్చిన యాక్షణమునను
నరయ నా సన్నిద్ధ అతిభీతులగుచు
పరువడి వేవేగఁ బఱతెంచి వచ్చి
యా మునీశ్వరునకు నతిభక్తితోడ
వేమాఱు నందంద వినుతించి మ్రొక్కి
యో తాపసోత్తమ! యో మునివర్య!
భూతదయాసక్త! భూతేశభక్త!
యీ యపరాధమ్ము లెల్ల లోఁగొనుచు
మాయందుఁ గృపకల్గి మమ్ము రక్షించు

మనుచు నందఱుఁ దన్నుఁ బ్రార్థించు నపుడు
మనమున దయగల్గి మానిపుంగవుఁడు
నగణితమ్ముగ వారి కానతియిచ్చె
నగరాజజాపుండు నయమున వచ్చి
మీకును జన్మిచ్చి మించిన శక్తి
ప్రాకటైశ్వర్యసంపన్నులఁ జేసి
రక్షింప మనుజులై రాజ్య మేలెదరు
కృతార్థులగుదురు మునుకొని మీర
లని శాపమొడలించి యమ్మునివరుఁడు
చనుచున్న వారును జయ్యన నరిగి
పొందుగా నచ్చోట భూధరమ్మునను
నందొక్క కిటి గర్భమం దుదయింప
నా తఱి నొకరాజు నటు వేఁటమార్గ
మా తావు కేతెంచి యా పందిఁగాంచి
తటుకున నొక్క యస్త్రమ్ము చేఁబూని
పటుశక్తి భూమిపైఁ బడనేసి చంపె.
కరమొప్ప నంత సూకరశాబకములు
నిరవుగాఁ దమతల్లి కెదురుచూడంగ
నా శశాంకధరుండు నా శంకరుండు
నాశీవిషాధీశ్వరాభరణుండు
త్రిణయనుఁ డప్పుడా శ్రీ చొక్కవిభుఁడు
గణుతింప నంగయకణ్ణమ్మతోడ
నాలకేనిని నెక్కియట వినోదార్థ
మై లోకపాలకు లర్థితోఁ గొల్వ
నాపర్వతస్థలి కరుగుచో నపుడు
గీ పెట్టుచున్న యా కిటిపోతములను
నారొడఁ గాంచి దయాచిత్తుఁడగుచు
నా యర్భకుల తల్లియై స్వామి యపుడు
చన్నిచ్చె నన్న నా సంయమీశ్వరులు
సన్నుతింపుచుఁ గుంభసంభవుఁ జూచి
జననియై యాస్వామి చన్నిచ్చినట్టి
ఘనసూకరార్భకుల్ గడు వేడ్క మఱియు
వఱనొప్ప నేమైరి ? వాతాపిదమన !

యలవడఁగా మాకు నానతిమ్మనిన
మునికులోత్తంసుఁ డామునుల భావించి
యనువంద నిట్లని యానతి యిచ్చె
నా యంగయర్ కణ్ణియమ్మ యై వెలయు
నా యార్య యట వరాహంబైనయట్టి
శ్రీ చొక్కనాథుని శ్రీమహాదేవుఁ
జూచి యప్పుడు మహాచోద్యమ్మునంది
డాసి సాష్టాంగదండప్రణామమ్ము
జేసి సద్వినయవిశేషమ్ముగాఁగ
కరములు మోడ్చి సూకరవేషుఁడైన
హరుఁ జేరి యిటు వరాహంబౌట యెట్లు
రాజైనవాఁడు వరాహముల్ వ్యాఘ్ర
రాజి వేఁటాడుట రాజమార్గమ్ము
క్రోడంపుమృగమనఁ గ్రోడావతార
మీడను ధరియించు టిది యేమి మీర
లని విన్నవించిన హరుఁడానతిచ్చె
వనజజుఁ డాది యవ్వలఁ బిపీలికము
కడ సర్వజీవాత్మకంబుల యందు
సడలక యుండుట సహజమ్ము మాకు
నీ కోలరూపమ్ము నిట్లేటి కంటి
నీ కోలరూపమ్ము నెల్లప్రాణులకు
తల్లిదండ్రులకు నెందఱు పుత్రులైన
గలుగు నొక్కరిపైనఁ గలుగు పక్షమ్ము
నటుగాన ఋషిశాపమై ఫలవించు
కి టిశాబకముల మాకిటుఁ బ్రోవవలసి
జనకుఁడనై యుంటి నో జలజాయతాక్షి !
యని యంగయర్ కణ్ణియమ్మతో ననిన
నిరవుగాఁ బన్నిద్దరీ మహామధుర
పురి నొక్కవెలమకుఁ బుత్రులు నగుచు
బలియులై పాండ్యభూపాలుని యొద్ద
దళవాయిపట్టానఁ దవిలి యుండుదురు
ననుచు మహాదేవుఁడానతిచ్చినను
విని జగదంబ యవ్విభున కిట్లనియె

పశుపతి నీవొక్క బ్రహ్మను నైన
మశకమ్ముగాఁ జేతు మశకమ్ము నైన
మఱి బ్రహ్మగాఁజేతు మాయాప్రకార
విరచితగుణహార ! వేదాంతసార !
లాసి నీ చన్నుబ్రాల్ద్రావినయట్టి
కాసిగా సూకరార్భకులు సామ్రాజ్య
లై యుండు టదియేమి యాశ్చర్య మనుచు
నా యంబ వినుతింప నా చొక్కవిభుఁడు
క్రోడరూపము మాని కోరి దేవతలు
వేడుక బహుపుష్పవృష్టి గావింప
నా యంగయర్కకణ్ణయమ్మతోఁ గూడ
నారూఢ వృషభేశ్వరారూఢుఁ డగుచు
నా వాసుదేవాదు లర్థితోఁ గొల్వ
వేవేగ మధురకు వేంచేసె నంత
నరయంగ నా గున్న లారూప ముడిగి
సరవి నావెలమకు సత్పుత్రు లగుచు
జనియించి రందఱు సౌందర్యు లనఁగ
ననువైన గుణవంతు లతిరూపవంతు
లధికశౌర్యోదగ్రులై యందఱొక్క
విధమునై విజయులై విస్మయంబంద
నుండి రా సన్నిద్ధులుజ్జ్వలస్ఫూర్తి
నుండు నాఱొండఁ బ్రసంగోన్నతిఁ బాండ్య
భూవరుఁ డెఱిఁగి యప్పుడు వారి నెల్ల
రావించి చూచి సంభ్రమచిత్తుఁడగుచు
మఱిఁ జొక్కవిభుని కొమాళ్లభావమున
సరవి నందఱునొక్క చందమ్ముగాఁగ
నున్నార లనివారి కుడుగర లిచ్చి
మన్నించి యతివేడ్క మఱి చతురంగ
బలముల కధిపులై ప్రత్యేకముగను
వెలువంద నందఱ సేనాధిపతుల
ననువందఁగాఁ జేసి యా పాండ్యవిభుఁడు
ఘనమహీరాజ్యమ్ము గడు నేలుచుండఁ
గొమరొప్ప మఱియును గొన్నినాళ్లకును.

క్రమముతో వారెల్ల రాజులై పాండ్య
విభుని దిగ్విజయమ్ము వెలయఁ జేయించి
ప్రభ మించియుండి రావన్నిద్దఱపుడు
విరచింప సౌందర్యవిభుఁడు నాపాండ్య
ధరణీశు స్వప్నానఁ దగు వేడ్కతోడ
వెలయఁ బన్నిద్దఱ వృత్తాంతమెల్లఁ
దెలిపెను బూర్వమ్ము తేజరిల్లఁగను
నప్పుడా పాండీఁడు నాశ్చర్యమంది
యప్పరమేశ్వరు నభినుతుల్ చేసె
పురహర ! భూతేశ ! భువనప్రకాశ !
ధరరథారూఢ శ్రీధరగర్వహరణ
నగరాజకార్ముక ! నగవైరిజనక !
నగరిపుసంస్తుత్య నాగాసురారి
గిరిశ శ్రీకంఠ యో గిరినాథ ! యభవ
పరమేశ ! యనుచు నప్పార్థివేశ్వరుఁడు
నత్యంతభక్తితో నట వారిఁ బిలిచి
ప్రత్యేకనామాంకురమ్ములు జేసి
వారల నంపిన వా రతివేడ్క
తో రాజ్య మేలుచుఁ దోరంపు భక్తి
సతతశివార్చనాసంసక్తు లగుచుఁ
జతురత జంగమార్చన లందు వెలసి
సౌందర్యనాథుని సద్భక్తిఁ గాంచి
పొందుగాఁ గైలాసమున కేగి రంతఁ
బందులుండుటఁ జేసి పరగ నాకొండ
పందిమల యనంగఁ బరగె నెల్లెడల
నిదియు నల్వదియేను నిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి
యనుచు సన్మునులతో నా యగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె

## నలువదియాఱవ లీల.

మఱియు నా స్వామి నిర్మలకృపామూర్తి
కరుణాధురీణుఁడై కడువేడ్కతో న
మరసన్నిభుఁడు పాండ్యమండలేశ్వరుఁడు

ధరణిఁ బాలింప నంతట నొక్కనాఁడు
నా కాలముల నొక్కయడవి లోపలను
గాకిమూఁకల చేతఁ గలకాలమెల్ల
నేటిరింతను పక్షి కేదిక్కు లేక
పోటులఁ బడిపడి పొదఁ జొఱఁబాఱి
యాఁకలి దప్పిచే నలమట నొంది
వీఁకతోఁ బొద వెళ్ల వెఱచుచు నుండి
తనభాగ్యవశమునఁ దగ మదిలోన
ఘనమహాత్ముఁడగుచు నిట్లని విచారించి
గెలుతురు పరమేశు కృపకలవారు
పొలుపొంద నటుగాన భోరున నేను
చెలఁగుచు శివపూజ చేసిశాత్రవులఁ
బొలియింతు ననుచును బుద్ధి నూహించి
ధరణిఁ బూజ గొనెడి దైవమ్ములందు
తిరుచొక్కపతివంటి దేవుండు లేఁడు
మఱి స్థలమ్ములలోన మాధుర్యపురికి
సరియైన పావన స్థలమును లేదు
తీర్థమ్ములను హేమదివ్యాబ్జసరసి
తీర్థమ్ముఁ బోలెడి తీర్థమ్ము లేదు
తత్క్షణమ్మున వేగ దయగల్గి మఱియు
రక్షించు సౌందర్య రాజశేఖరుఁడు
నాచొక్కనాథుని నధికసత్పూజ
లాచరించియును బ్రత్యక్షము గాంతు
నని విచారింపంగ నాత్మబంధువులు
తనవారలటుకుఁ గొందఱు వచ్చిరంత
వారలఁగూడి యెవ్వరు గానకుండ
భోరున మాధుర్యపురమున కరిగి
పొత్తామరలకొలంబునఁ దీర్థమాడి
చిత్తజాంతకుమీఁద జిత్తమ్ముఁ జేర్చి
తగఁ బ్రదక్షిణము లెంతయుఁ బ్రొద్దునేయ
నగజాధినాథుఁ డెంతయు దయతోడఁ
దా నొకపక్షిమాత్రమ్ము నజ్ఞాత
మానసమైయుండి మద్భక్తి గలిగి

నేనని వచ్చి నిండిన ప్రేమతోడ
స్నానముఁ గుడి ప్రదక్షిణములు చేసె
నని సత్కృపాకటాక్షాంచలుండగుచు
మనమున హర్షించి మధురేశ్వరుండు
నోఖంజరీటమ ! యోభరద్వాజ
యీ ఖగకులములో నెల్ల శ్రేష్ఠుఁడవు
నని స్వామి మృత్యుంజయ యటంచు నపుడు
మునికొని కరుణించి మూఁడక్షరములు
నుపదేశ మిచ్చి ప్రత్యూషకాలమున
జపియించి శాత్రవక్షయము గావింపు
తనర నీబంధుమిత్ర భ్రాతృసుతులు
నొనర వేఁకువ నిది యుచ్చరించినను
నా మేటి పక్షుల నందఱఁ గెలిచి
భూమిలో వెలయుము పుణ్యమ్మువలన
ధర నెవ్వరేవియు దవ్వులయాళ్ళ
కరుగుచో మీవార లా వేళలందు
వలపలనుండి యవ్వలికి వచ్చినను
గలుగును నధికసౌఖ్యములు లాభములు
నరవభాషను వలియడు నామమెపుడు
నరయంగఁగలుగు మీ యన్వయమ్మునకు
నని గారవించి యొయ్యన మేను నిమిరి
యనిపిన నాపక్షి హాలాస్యపతికి
నా చటకమ్ము చయ్యన మ్రొక్కి నిలిచి
చేకొంటి నా కులశ్రేష్ఠుండ నైతి
మాకులమ్మునను సన్మాన్యుండ నైతి
మృగధర ! మృగవైరి ! మృగకులముఖర
నగచాప ! నగధీర నగవైరి వంద్య
హరిధర హరిణాంక హరినుతచరణ
హరివైరిభూషిత ! యట్టి నీరూపు
హరివిరించిసురేంద్రు లరయఁగాఁ గోరి
చిరతపమ్ములను జేసియు గనలేని
నీ పాదములు గంటి నీ దయగంటి
నా పాపమెల్ల నింతటఁ బాపుకొంటి

నని సన్నుతులు సేసి యధిక సంతోష
మున వచ్చి తనవారి ముందఱ నిలిచి
యామంత్ర ముపదేశ మందఱ కిచ్చి
భూమి నెంతటి పక్షి ముఖ్యులఁ గిట్టి
కాక ఘూకముల నెక్కడ నున్నఁ బొడిచి
భీకాకుపడఁ జేసి శివకృపచేత
నిలిచి భూతేశుని నెమ్మది ననిచి
వలియ నామమ్ముల వర్ధిల్లె భువినిఁ
జూచి రెల్లరు మహాచోద్యమ్ము నంది
యా చొక్కనాథుని నాశ్రయించినను
నణువైన మేరువు నగుఁగదా! యనుచు
గణుతించి రాస్వామి ఘనవిశేషములు
నిదియు నల్వదియాఱు నిటమీఁదిచరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి
యనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.

## నలువది యేడవ లీల

మఱియు నుత్తరభాగమండలమ్మునను
బరగంగ నొక మహాబకపక్షి గలదు
నా యండజాతమ్ము నా దేశమునను
బాయ కెప్పుడు నుండు బహుళ కాలమ్ము
నా పక్షి తనకు నిత్యాహారముగను
వాపి కూప తటాక వనజాకరములు
నదులు కాలువలు నానాజలాశయము
లుదకపూరములతో నున్నట్టి మృదుల
జలచరమ్ముల నెల్లఁ జాల భక్షించి
జలములు గ్రోలి యిచ్ఛావృత్తి నుండు
నీరీతి వర్తింప నెలమిఁ గొన్నాళ్ళ
కా రాజ్యమంత యవగ్రహం బెసఁగి
వానలు లేక తీవ్రాకార మగుచు
భానుకరప్రభాపటలమ్ము మెఱసి
యేదిక్కుఁ జూచిన నెండల నెండి
మేదినిఁ గలదెల్ల మృగపక్షిజంతు

సంతతి మృగతృష్ణ సంతాపమంది
కాంతార వితతి శుష్కమ్ములై మఱియు
భూచరు లంబరంబును గోరుచుండ
ఖేచరు లాధాత్రికిని బోద మనఁగ
భూచరాధిపులు ద్యోభూమి మేలనఁగ
నీ చందమున ధాత్రి యెల్ల వేటిల్ల
నీరు నీరని గోర నిబిడమారుతము
మారుతమ్మును గోర మఱి తరువ్రజము
తరువుల నీడలెంతయు వేడ్కఁ గోర
ధర నిట్లు పర్వె నాతపమహాఋతువు
గుంటకాలువలెల్ల కూపముల్ చెరువు
లంటుపట్టెను సైకతావాల మగుచుఁ
గాఁగెఁ గుళీరముల్ గరఁగెఁ గర్కటము
వేఁగె కచ్ఛపములు వెచ్చె మచ్ఛికులు
తూలెను మకరముల్ దునిసె సర్పములు
సోలెను మృగపంక్తి సొరిగెఁ బక్షులును
స్రుక్కిరి యసురులు సురిగిరి ప్రజలు
చిక్కె భూతగణమ్ము చిల్లై శైలములు
కాఁకయ్యె వనములు గమల సంయములు
నింకె వారిధు లుడుకెత్తె నంబరము
వ్రయ్యలయ్యె ధరిత్రి వ్రస్సె నాకసము
నయ్యెడ నాబకం బాత్మ నూహించి
కటకటా ! యీ భూమి కరవయ్యె నిఁకను
నెటుఁ బోవఁగలవాఁడ నీశ్వరా యనుచుఁ
బరికింపఁ దనపూర్వభాగమ్ము కతన
గుఱుతుగా నుత్తరకురుభూములకును
గ్రచ్చఱ గగనమార్గమ్మునఁ జనఁగ
నచ్చోట నొకఋషి యాశ్రమపుణ్య
వనమును గాంచి య వ్వన మధ్యమునను
ఘనమైన యొక మహాకమలాకరమ్ము
పురణించు వైకుంఠపురమును బోలె
నరుదైన వేడ్క శ్రీహరి యుక్త మగుచుఁ
గమలనాభుని దివ్యకరములఁ బోలెఁ

కమనీయ శంఖ చక్ర స్థితమగుచు
సన్నుత విహగేంద్రచరితమ్ము వోలె
పన్నగ గజ కచ్ఛపమ్ములు గలిగి
వినుతింప దేవేంద్రు వీడును బోలె
యనిమిషాహారవిహారమ్ము గలిగి
ప్రకటితనక్షత్ర పథమును బోలె
మకర కర్కాటు మీనమండలి గలిగి
యనుపమ రాజచిహ్నమ్ముల వోలె
ఘనతర పుండరీకమ్ములు గలిగి
యమృతాబ్ధి మథనవిహారమ్ము వోలె
రమణీయ సుమనోనురాగమ్ము గలిగి
దారుణమైన కాంతారమ్ము వోలె
సారంగపటలసంచారమ్ము గలిగి
యరుదైన శైలగహ్వరముల వోలెఁ
దిరముగాఁ గేసరోదీర్ణమ్ము గలిగి
మహనీయ పుణ్యాశ్రమంబును వోలె
నహరహమ్మును నేటిహంసలు గలిగి
కలిత భూపాంగనాకరముల వోలెఁ
బొలుపొందఁ గంకణస్ఫురణమ్ము గలిగి
జననుతమ్మగు దివ్యశరధియుఁ బోలె
మునుకొని బహుశివముఖములు గలిగి
చెన్నొందు నాసరసీరుహాకరము
కన్నులపండువుగాఁ జూచి పక్షి
వరుఁ డప్పుడా సరోవరతీరమునకుఁ
బఱతెంచి నిలిచె సంభ్రమోదయ మగుచుఁ
జయ్యన నచట నాశ్రమవాసులైన
సంయమిముఖ్యు లా జలజాకరమున
కరుదెంచి స్నానమ్ము లాడువేళలను
బఱతెంచి యట మీనపటలమ్ము వారి
దగ్గఱ వచ్చి నిష్ఠాపరత్వమున
వెగ్గలమ్ముగ మంత్రపీతలి యాలింప
నప్పుడా పక్షీంద్రుఁడా మత్స్యములను
తప్పక వీక్షించి తనయాత్మఁ దలఁచి

మీనమ్ములకు నిట్లుమించిన భక్తి
జ్ఞానానువర్తన గలిగియున్నదియు
నెట్టి వేళల జీవహింసకు రోయ
నట్టివంశమ్ము నాయది గదా ! యనుచు
మదిలోన నొకనియమమ్ము దాఁ బలికె
నిదియాదిగా జీవహింసలు సేయఁ
గలవాఁడగాను నేఁ గలలోన నైనఁ
గులమువారెల్లైనఁ గూలనిమ్మనుచుఁ
బట్టెను వ్రతము నప్పట్టున నుండి
పుట్టె సుజ్ఞానమ్ము పులుఁగుఱేనికిని
నంతటఁ దనజాతియైనట్టి పక్షి
సంతతి యచటికిఁ జనుదెంచి చూచి
నీకేమి ? యిట్లుండ, నిజము మీయాన
జీవహింసావృత్తి సేయ నే ననిన,
విని విస్మయంబంది వేగఁ దా మందుఁ
జని యాకొళంబున జలచరమ్ముల న
ఖరములఁ బట్టి యాఖగములు దినఁగ
సరవి నాసంయమీశ్వరులు గోపించి
చూచిన సురసుర స్రుక్కి మూర్ఛిల్లి
ఖేచరు లచ్చోటఁ గెడసె నన్నియును
నదియును జూచి తా నత్యద్భుతమ్ము
ముదమును జ్ఞానమ్ము మఁప్పితి గొనఁగ
జీవనంబే తనకు జీవనం బగుచు
నా విహగాధీశుఁ డట్లున్నయంత
ఋషిముఖ్యు లటు నిత్యకృత్యమ్ములైన
త్రిషవణ స్నానముల్ దీర్చి యందఱును
భూతిరుద్రాక్షసంపూర్ణాంగు లగుచు
నాతతి భద్రాసనస్థులై బోధి
వృక్షమ్ముక్రింద నావృషభవాహనునిఁ
బ్రత్యక్షు సర్వేశ్వరు నధ్యాత్మమైన
శైవపురాణముల్ చదువుచు మునులు
నావేళ సౌందర్య హాలాస్యవర్య
శ్రీ చొక్కనాథు నంచిత పూర్ణకథలు

జూచి పఠింపుచు శ్లోకము ల్వొగడుచును
నర్థముల్ సెప్పుచు నధికహేమాబ్జ
తీర్థరాజము సన్నుతింపుచు నుండ
నయ్యెడ నాలాయణాండజాతంబు
నెయ్యమ్ముతో వీని నిజభక్తిఁ బూని
శ్రీ చొక్కనాథ మూర్తిని నవాఙ్మనస
గోచరు నతిభక్తిఁ గొలిచి యుక్తుండ
నయ్యెడ నని బలాకాధీశుఁ డపుడు
వయ్యన నెగసి ఖేచరమార్గమునను
కతిపయ దినములుగా బోయి, పైన
గతులను మాధుర్యకటకమ్ముఁ జేరి
కాంచన పంకజాకరమున మునిఁగి
పంచాస్త్రహరునకుఁ బ్రణతులు చేసి
మనమార నాస్వామి మదిలోన నిలిపి
తనజిహ్వకును వేడ్కఁ దగఁ బ్రస్తుతించె
లోకపాలకవంద్య ! లోకత్రయాత్మ !
లోకత్రయాధార ! లోకోపకార !
లోకనాయక ! పద్మలోచనార్చితుఁడ
చేకొని నను గావు శ్రీచొక్కనాథ !
యని సన్నుతులు చేసి యధిక సంతోష
మునఁ దనిసొకనాఁడు పులుఁగుఱేఁ డపుడు
ప్రతిదినమ్మును నిట్లు ప్రత్యూషవేళ
ధృతిమించి హేమాబ్జదీర్ఘిక మునిఁగి
స్నానమ్ము జేసి యాసౌందర్యపతిని
ధ్యానించి యాదేవు దర్శించి యపుడు
తప్పకచేసి ప్రదక్షిణమ్మును
నప్పుష్పకమునకు నభినుతి సేయఁ
దలవంచి సాష్టాంగదండమ్ము వెట్టి
దినదిన మ్మొకపూట దేహపోషణకుఁ
గనకపుష్కరిణి పుష్కరములు గ్రోలు
నీరీతి ఘనభక్తి యెడలక పక్షి
నారాయణుండు సౌందర్యనాయకుని
సేవ నేమము లిట్లు సేయుచునుండ

భావించి యప్పుడా పక్షియం జివిభుఁడు
శ్రీచొక్కనాథుండు చిన్మయాత్మకుఁడు
నాచంద్రధరుఁడు ప్రత్యక్షమై నిల్చి
యోపక్షికులనాథ యోపక్షివర్య
యీ పక్షికులమందు నీవొక్కరుఁడవ
నీవుపుణ్యుండవు నీవు మాన్యుఁడవు
నీవంటిసుజ్ఞాని నీవంటివంశ
పావనచరితుండు పరికింపఁ గలఁడె
తలపంగ మాకుఁ బ్రదక్షిణమ్ములను
నలవడఁ జేసిన యట్టిపుణ్యమున
మానవు లెందేని మఱి మారయాత్ర
గా నేగువేళ నిక్కముగ నీవారు
వలనుగా నేతేర వారికిఁ జాలఁ
గలుగు సంతోషసౌఖ్యములు సంపదలు
నీవు మాపూజలు నెమ్మిఁ జేసితివి
గావున సాలోక్యగతి నీకుఁగలిగె
భవరోగములు మాని బక కులాధీశ !
శివలోకమున సుఖస్థితి నీవునుండు
మని యానతిచ్చి యా హాలాస్యవిభుఁడు
దనరిన వేడ్క నంతర్ధానమయ్యె
నిదియు నల్వదియేఁడు సిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి.
అని సన్మునులతోడ నా యగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియెఁ

నలువదియెనిమిదవ లీల

గ్రహమొప్ప మఱి తొల్లి బ్రహ్మకల్పాంత
రమునఁ జరాచరప్రతతుల తోడ
మధుర యొక్కటిదక్క మఱిపట్టణములు
నధికదేశమ్ములు నంబుధుల్ చేత
లయ మాయెఁ దచ్ఛివాలయమున మధుర
జయముగాఁ దనదు నాజ్ఞాశక్తి వలన
లయము గాకుండ నెల్లడ నాపురమ్ము
రయమార నాస్వామి రక్షించె నపుడు

నిరవుగా నాయూరి కేయుపద్రవము
లరయంగ లేనట్టి యా నిమిత్తమునఁ
గడఁగి యామధుర విఖ్యాతిగా నంత
నడుపూరు ననియెడి నామమ్ముగాంచె
నంత నాపాండీఁడు నాచొక్కవిభుని
నెంతయు సంస్తుతు లెన్నేనిఁ జేసి
యామహాదేవుని యాజ్ఞ పెంపునను
నీమధురాపురి కేదోషములును
రానేరవని పాండ్యరాజశేఖరుఁడు
నానావిధమ్ముల నగరుగట్టించి
కోరి యాదేవుని గుడిగోపురములు
తేరులు గట్టించి తేజరిల్లఁగను
నిప్పుడు నీపురికే సొంపు గాని
తప్పదటంచు నాతలము గావేడ్క
రయముతో గృహములు రమ్యమ్ముగాఁగఁ
గట్టిరి యప్పుడా కారణమ్మునను
జుట్టున నడుమునఁ జోటు లేకుండఁ
బాయక పాండ్యభూపాగ్రణి చొక్క
నాయకస్వామున్న నగరికేతెంచి
యాదేవుఁ బొడఁగాంచి యతిభక్తి మ్రొక్కి
ఓదయావిస్ఫూర్తి ! యోదివ్యమూర్తి !
నరవాహనప్రియ ! నాగాసురారి !
నిర్వాణచిద్రూప ! నిఖిలప్రదీప !
సర్వేశ ! లోకవిస్తారమ్ము లెల్ల
లయమౌనొ మధురకు లయము లేకుండ
భయమైన నీయాజ్ఞ పరగి రాదయ్యె
నటుగాన నోస్వామి నానిమిత్తమునఁ
దటుకున సర్వభూతలమెల్లఁ గడఁగి
యీపట్నమున వచ్చి యిండ్లను గట్టి
రీ పురి యెడచాల దియ్యెడ మాకు
నెల్ల చూపుము దీని కెల్లను నీవె
సల్లలితోజ్జ్వల సౌందర్యనాథ !
యని సన్నుతులునేయ నాస్వామి యపుడు

దనకుఁ గంకణముగాఁ దనచేత నున్న
భుజగేంద్రునూడ్చి యీపుర మెల్ల నీవు
నిజముగాఁ జూపుమీ నీపాటవెల్ల
నని యానతిచ్చిన నాపరమేశ్వ
రుని యాజ్ఞఁ జేసి మారుతభుక్కులేశుఁ
డనఘుఁడై పనిబూని యతిభక్తితోడఁ
దనరంగ సాష్టాంగదండమ్ము వెట్టి
యాశంభు గుడిభాగమందు వాలాగ్ర
దేశమ్ము నిలిపి యాదిత్య కాపురము ?
నను నుత్తరము వృషభాద్రి యైనట్టి
ఘనముగాఁ దగ నళగరి లోనుగాఁగ
గుడికిని నాల్గుదిక్కుల నెడఁ, గల్గఁ
బడగెత్తి యోజనప్రామాణ్యముగను
వచ్చి తన్ముఖము నా వాలమ్ము నొద్దఁ
దెచ్చిపెట్టుక యుండెఁ దెలఁగొల్ప నంత
హాలాస్య పురిమున కానిమిత్తమున
వాలవాయ ను పేరు వార్తకు నెక్కెఁ
జాల నప్పుడు పాండ్య జనవిభుఁడు దిరు
వాలవాయుండైన వామదేవునినిఁ
జేరి యందంద విశేషమ్ములైన
పౌరాణికస్తోత్ర పఠనముల్ జేసె
నోదేవతాస్వామి ! యోకృపాకార !
యో దానఫలదాయి యోదైవతాయి !
వల్లగా నీప్రభావము తేజరిల్ల
నెల్లను దెలిసె నీయెల్ల మాకెల్ల
నని సన్నుతులు జేసి యామహాస్వామి
యనుమతిఁ గాంచి మహాప్రసాదమున
వలనొప్పఁ దిరువాలవాయైన మధుర
పుర మెల్లనపుడు గాపురములు నిండఁ
బురణింపరాని గోపురములు మేడ
లాకోట లంగళ్లు నందంద మఱియుఁ
బ్రాకటగృహమంటపమ్ము లన్నియును
గనకమయమ్ముగాఁ గావించి మధుర

వినుతింప నాపాండ్యవిభుఁ డేలుచుండె
నీలీల సద్భక్తి నెవ్వరు వినిన
హాలాస్యనాథ మహాదేవు కృపను
నెల్లజీవులకెల్ల నెల్లయై లోక
మెల్లయు నేలుదు రెల్లరు బొగడ
నిదియును నలువదియొనిమిదో లీల
విదితమ్ముగా వేడ్క వినుఁడన్న మునులు
హాలాస్యనాథు లీలానందములకుఁ
జాలంగఁ బులకితోజ్జ్వలదేహు లగుచు
నామౌనివరునకు నర్చించి నిలిచి
యామీఁది వృత్తాంతమడఁ జెప్పు డనిన—
ఇది సర్వఘనసత్కవీంద్ర పాదాబ్జ
విదిత పూజామోదవిమలుండు పచ్చ
కప్పురసౌరభ్య కలితమానాంక
తిప్పరాజ సుపుత్ర తిరువేంగళేంద్ర
విరచితమ్ముగ లోకవిఖ్యాతమైన
సరసలక్షణ కావ్యసత్కవీంద్రాభి
నందిత శ్రీచొక్కనాథ చరిత్ర
మందున నిది సప్తమాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ

# అష్టమాశ్వాసము

## నలువదితొమ్మిదవ లీల.

మఱియును నొక మహామండలేశ్వరుఁడు
వరగండ పాండ్య భూవరగుణోత్తముఁడు
పరగంగ నేకాతపత్రమ్ముగాను
ధరణిఁ బాలించె శాత్రవుల నిర్జించి
హాలాస్యనగర మా హాలాస్యకృపను
జాలంగ నొకకొన్ని సంవత్సరములు
పాలించి జనులెల్లఁ బ్రస్తుతి సేయఁ
ప్రబలింప నాతని పట్టి యనంత
గుణపాండ్యవిభుఁడు సద్గుణవంతుఁ డగుచు
శివభక్తియుక్తుఁడై శ్రీచొక్కనాథుఁ
దివిరి త్రికాలమ్ము ధృతిమించి పూజ
సేయుచు నప్పుడాసీమలు పదర
మారొండఁ బాలించె నట్టి కాలమునఁ
జోడభూపాల వంశోద్భవుఁ డొక్క
చోడాఁడు మఱియును శౌరత్వ మెసఁగి
యతనిపై దండెత్తె నతితీవ్రముగను
జతురంగ బలసంఘ సన్నాహుఁ డగుచు
మధురపై యోజనమాత్రమ్ము గాఁగ
నధికుఁడై వచ్చి తా నటు దండు విడిసె
విడియుచో విచ్చలవిడి తటాకమునఁ
గడఁగి గుంటలుకట్టఁ గాలువ లెల్లఁ
ద్రెంపుచు మఱియు నాదేశమ్ము పసుల
గుంపులు వడిఁ దోలుకొనుచు నీలాగు
నలజళ్లు సేయుచు నాచోళవిభుఁడు
బలియుఁడై రాఁగ నా పాండ్యరా జెఱిఁగి
తనమంత్రి వరులతోఁ దగ నిట్లు పలికె
మనదళతంత్రమ్ము మఱి చాలఁ గొంచె
మతనికి దళతంత్ర మధికమ్ము వీని
నతివేగ గెల్చును నాచొక్కనాథుఁ
డాశ్రితవత్సలుఁ డామహాదేవుఁ
డని సౌందరేశ్వరు నావాసమునకుఁ

జని భక్తితో నమస్కారమ్ముఁ జేసి
పదియు నాలింటను బరగ నర్చించి
తుదిలేని మదిని సంస్తుతు లిట్లుచేసె.
దేవ ! యీశ్వర ! సర్వదేవసంస్తుత్య
భావభవాంగసద్భసితాంగరక్ష
హరి యజార్చితపాద ! హరినాగవరద !
హరివైరివైరి వాహనసన్నుతాఢ్య
హరిదశ్వ ధరణాంక యమితధరాంక
హరిణశాబక హస్త హరిచర్మవసన
లోకనాయక ! సర్వలోకప్రకాశ !
భీకర త్రిపురగంభీరోపహార !
యనుచును ఘనముగా నభినుతుల్ జేసి
మనమారఁ బిట్లని మఱి విన్నవించె
నో దేవ ! చోడాఁడు నున్నతమ్ముగను
నాదేశమునఁ గల్గు నధికసన్నాహ
ములతోడ వచ్చి సమ్మోదమ్ముతోడఁ
బోలుపొంద హాలాస్యపురి చుట్టు విడిసె
భావింప నాకును బ్రజలు గుఱ్ఱములు
లేవధికమ్ము బిలేశయాభరణ !
యదియునుగాక దాయాదులు హెచ్చి
కొదలేని ధనమెల్లఁ గొంపోవుకతనఁ
బచ్చ పైకములేదు ప్రజనేల నాకు
వచ్చెను జోడాఁడు వడి నన్ను గెలువ
స్వామి కీయపకీర్తి సంధించుగాన
స్వామితోడై గెల్వవచ్చును దలఁపఁ
గావున నానాఁడు గజమును నేయు
నావిధమ్మున వారినందఱఁ గెలిచి
చేకొని నన్ను రక్షింపవే దేవ !
నాకేడుగడయు నెన్నఁగ నీవె సుమ్మి
యన్యమ్ము నెఱుఁగ నిత్యమ్ముగా నీవ
వన్యావసథనాథ ! వరచొక్కనాథ !
యభయ మిమ్మంచును నాపాండ్యవిభుఁడు
నభినుతచిత్తుఁడై యభినుతుల్ నేయ

వినువీథిఁ బలికె నావిశ్వేశుఁడపుడు
జననాథ ! నీకును సంతాప మేల !
ననయమ్ము మేము నీయాత్మ నుండఁగను
నీకు గల్గిన సైన్య నివహమ్ము గూడి
దీకొను మెదురుగా ధీరత్వమునను
నపుడు మేమచ్చోటి కరిగి చోడాని
సపరివారమ్ముగా సమయింపజేతు
మని యానతిచ్చిన హర్షమ్ము నంది
యనువంద దండప్రణామముల్ చేసి
కదలెను నపుడు భూకాంతుఁ డాతనికి
నెదురుగా న్ప్రొద్దై యేపు దీపింప
నంత నాచోడేంద్రుఁ డాశ్చర్యలీలఁ
జింతించె నితఁ డల్పసేనలఁ గూడి
కదనమ్మునకు నన్ను గదిసెద ననుచు
మదముతో నెదిరె నేమనవచ్చు ! నింక
ననుచు నత్యుగ్రుఁడై యాటోప మెసఁగ
సరభసమ్మునఁ దన చతురంగబలము
నురవడిఁ బురిగొల్పి యున్నతశక్తి
నార్భటింపుచుఁ దనయశ్వమ్ము నెక్కి
నిర్భయవృత్తిమై నిగిడించె నంత
నప్పుడా పాండ్యభూపాగ్రణి బెగడి
యాపార్వతీశుని నాత్మఁ జింతించె
నంత నాలోకనాయకుఁ డాదిమూర్తి
యంతమ్ము నెరయ దోర్బలశౌర్య మడరఁ
దుష్మిన వానికిఁ దోడఁ బంచాక్ష
రమ్మహాదివ్య మంత్రము దోచినట్లు
స్వామి యప్పుడు వింటివాని చందమునఁ
డామసింపక వచ్చి దారుణమైన
బాణాసనమ్ము చేపట్టి వేగంబె
తూణీర మందున్న తూఁపుల నించు
సరిలేని వృషభలాంఛన సాయకమ్ము
జడిపడి వేసె నాబలముల మీఁద
వేసినప్పుడు వారిమానుఁగుల్ రథములు

నానేన అశ్వమ్ము లాక్షణమ్మునను
బంచిపెట్టినయట్లు చతురయమ్మునను
ద్రుంచె నెన్నడుములు దునియలు గాఁగ
జోడరాజప్పుడు చోద్యమ్ము నంది
కూడిన తనసైన్యకోటి మాయుటలు
చూచి యిట్లనిచొక్క సోమసౌందర్యుఁ
డా చొక్కనాథుఁ డాశ్రితరక్షకుండు
ప్రాతిగా వచ్చి యీ పాండ్యభూపతికి
ఖ్యాతిగా గెలిపించె గాని లేకున్న
నింతటిశక్తి వీనికి నేడ దనుచు
మంతు కెక్కిన తనమంత్రులతోడఁ
గంపితహృదయుఁడై కడఁగి యారాజు
నంపించుకొన్న వానట్లు తా నపుడు
దైవసహాయుఁడై తనరిన పాండ్య
భూవరు నెదిరించి పోరలో నింకఁ
జేరి యుద్ధము సేయఁ జెల్లదటంచు
ఘోరున వెనుకొత్తిపోయె నయ్యెడను
అతనికిఁ దోడుగా నట వచ్చినట్టి
ప్రతిలేని కర్ణాట చక్రాధిపులు
బలసమూహమ్ము లార్భటుముల తోడ
నిల గ్రక్కదల వచ్చి యితనికి నీవు
విలుఁగుట కొట్లని విక్రమం బెసఁగఁ
బోరినాజి నెదిరించి పోరుఘోరమ్ము
గా యుద్ధ మొనరింపఁ గలకంఠుఁ డపుడు
నా యస్త్రమున మఱి ప్రియవల్లిల సైనెఁ
గరములు చరణముల్ గాత్రమ్ము శిరము
లురువడి ఖండించి ద్రొయ్యఁ జించి సైచె
తాఁకి వ్రక్కలుగాఁగ ధగినట్టి బోయ
మూఁకల యవయవమ్ములు నుగ్గుజేసె
నెత్తురు టేరులై నీరధియందు
హత్తి పారఁగ జేసి యుక్తి వేగ నంత
నా దేవదేవుండు నప్పుడప్పృథ్వ్యుఁ
డై దివ్యంత్రములు మెచ్చ [illegible]

వారితోఁ దక్కినవారెల్ల నోడి
వారి తమందు బోవల నున్నవారిఁ
దోఁకొని యీతని తో యుద్ధమునను
దీకొన నేర్తురే దేవుండె యితఁడు
సౌందర్యనాథుని సద్భక్తుఁడగుట
నిందుల గెల్వ రాదీతని ననుచుఁ
చింతించి వెనుకదీసిరి శౌర్య ముడిగి
యంత నా జనులెల్ల నాశ్చర్య మంది
ఖ్యాతిగా వరగుణపాండ్య భూవిభుని
నా తతి రక్షించు నావిధంబునను
నతని పుత్రునియందు నతిభక్తి గలిగి
క్షితిమించ నితని రక్షించితే ! యనుచుఁ
గదిసి భూజనులెల్లఁ గడు వేగఁ బొగడి
రదిగానఁ బాండ్యధరాధీశు లెల్ల
నయ మొప్ప శ్రీచొక్కనాథ సద్భక్తు
లై నేవ లొప్పఁగఁ బ్రణమిల్లి యెపుడు
మతి మించి నడుతురు మధురలోకులను
వరగుణపాండ్య భూవరకులోత్తముఁడు
ఫణిభూషణునకు సద్భక్తుఁడనంత
గుణ పాండ్యవిభుఁడంత గోత్రజాత్ముఁడు
నగరికిఁ బోయి యెంతయు సన్నుతించి
జగ మెన్నఁగా దేవ సత్కృప గాంచి
యధికుఁడై సకలదేశాధీశుఁ డగుచు
నధిక బలమ్ముతో నవనిఁ బాలించె.
నిదియును నలువదితొమ్మి దిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార ! వినుఁడి
ఋషుల కగస్త్యుండు దూపించినట్లు
విషమసాయకశత్రైన విభు నెల్లఁ దెలియ.

ఏబదియవ లీల.

మఱియును నమ్మహామధురాపురమునఁ
బరమపుణ్యుఁ డనంత పాండ్య భూవిభుఁడు
చిరకీర్తి రాజ్యమ్ము సేయుచునుండఁ
బరగ నక్కాలంబు ధరణీశు గరిమఁ

జను మహాసత్కార్యు లాదిగా నలువ
దినమంత్రులు గూడి మహేశ్వరుఁ జొక్క
నాయకుఁ జేరి విన్నప మొప్పఁగాను
బాయని సద్భక్తిఁ బ్రణుతించి రంత
కాలకాలాంతక ! కారుణ్యనేత్ర !
భూలోకపావన ! భూతేశ యీశ
పురదైత్యభంజన పురసంఖ్యనేత్ర
మురహరసన్మిత్ర ! ముల్లోకపాత్ర
యని సన్నుతులు చేసి హరుని మెప్పించి
వినుతింపఁగా మాకు వేడ్కయిందఱకు
భాసిల్లఁగా జగత్ప్రఖ్యాతి యైన
యాసన మొకటి మా కభవ ! యిమ్మనిన
మోదితుఁడై నాల్మూఱు మూరెడు విరివి
చదరమైనట్టి సుజ్ఞానపల కిచ్చె
నిచ్చిన వార లా యీశ్వరుతోడ
నెచ్చటఁ జాలును నీసంఘపలక
యనిన నాస్వామి విద్యాధికులైన
గరిమతోఁ జోటీయఁగలదన్న వారు
పెరుగుసంతసమున వేడ్క నాసంఘ
పలక నొక్కటు మంటపమునందు నిడిన
నదియు భూస్థలి నిల్వ కంతరిక్షమున
విదితమై నిల్చె నా విశ్వేశుకృపను
నరయ విద్యాధికులైన నక్కీర
భరణకపిలు లాది పండితోత్తములు
శారదామూర్తులు సకలశాస్త్రార్థ
పారంగతులు జగత్ప్రఖ్యాతులైన
నలువది యొనమండ్రు నలువొప్ప సంఘ
పలక మంటపమున [illegible]
నీరీతి నుండిరి యీశ్వరుకృపను
కారక తము నెల్లవారలు బొగడ
నటుఁ గొంతకాలమ్ము నాకవీశ్వరులు
[illegible] తాము చెప్పిన కవిత
[illegible] దమలోన [illegible]

సందేహపడిరి మాత్సర్యదోషమున
నీలక్షణార్థము లెవ్వరు దీర్పఁ
జాలరటంచు నాస్వామినిఁ దలఁప
నప్పుడు విద్వాంసుఁడై వారికడకు
నొప్పుగా నేతెంచి యొనర నిల్చినను
వారలందఱు గూడి వరుస మాకావ్య
సారమ్ము పంచలక్షణ యుక్తముగను
నెమ్మిఁ జెప్పితివేని నిన్ను నల్బదియుఁ
దొమ్మిదోవాని వంతుగఁ గూడికొందు
మనినఁ గానిమ్మని యా కవీశ్వరుల
ఘనకావ్య పంచలక్షణశబ్దధాతు
వర్ధమానార్థ మవ్యక్తమ్ముగాను
సార్థమ్ముగాఁ జెప్పె సభికులౌ ననఁగ
నప్పుడు విద్వాంసు లాశ్చర్య మంది
తప్పక లక్షణార్థము లేర్పఱించి
యీచందమునఁ జెప్ప నితరుల వశమె !
శ్రీ చొక్కపతియె విచ్చేసె కాననుచుఁ
దూకొని నలువదితొమ్మిదో వాని
గా కూడి సంఘమల్కాను నిడికొనిరి
తాను చెప్పిన కవిత్వమునకు వార
లా నల్వదెనమండ్రు నర్థలక్షణము
లెఱుఁగలేకుండిన నిందుశేఖరుఁడు
నెఱుఁగంగ నానతి యిచ్చిన వారు
సంతోషమును బొంది సన్నుతుల్ సేయ
నంత నా నక్కీరుఁడా యైదు లక్ష
ణము లర్థసంఘట్టనై యుండ దనినఁ
గ్రమ మెఱుంగఁడు గదా కపటమానసుఁడు
పరగ నెప్ప డసూయభావంబె కాని
సరసచిత్తుఁడు గాఁడు శారదాసముఖు
మీర లిందఱు విని మేలని పొగడ
నారయ వీఁడు గాదన నెంతవాఁడు
నని దేవుఁ డొకశబ్ద మప్పుడు సెప్పఁ
దనరంగ నిందు కర్థము సెప్పుడనిన

విని యూరకుండి రా విద్వాంసులెల్ల
దనము నజ్ఞానకృత్యమున నత్కీరుఁ
డదియును దప్పన్న హరుఁడల్ల నవ్వి
యిది నీవు తప్పన్న దిది తప్పుగాని
చెప్పుడు వీఁడు దా నీర్ష్యమానసుఁడు
తప్పన్న దీనికిఁ దప్పుగాదనిరి
పరుసతో నాకాశవాణి యంతటను
నెరయ నీవాక్యసందేహమ్ము దెలుప
శ్రీచొక్కనాథుఁడా శ్రితపక్షపాతుఁ
డై చనుదెంచె విద్యాధికుఁడగుచు
నా కాలగళుని కావ్యము తప్పనంగ
మీకు శక్యముగాదు మీరెంత యనిన
నందఱు లేచి సాష్టాంగమ్ము లొనర
నిందుమౌళికి వేడ్క నెసఁగంగఁ జేసి
వరద మునిస్తోత్ర వర్ణితనామ !
వర నేత్రజనితపావకదగ్ధకామ !
కామమోహాదివర్గచ్ఛేదినామ !
నామరూపక కపటనాటకధార !
ధారాధరాభకంధర ! దయాసార !
సారంగధర ! వరసారంగహస్త !
హస్తిచర్మోజ్జ్వల యమితప్రశస్త
శస్త్రవ్రజోత్తుంగ ! సత్కృపాపాంగ
యని సన్నుతులు జేసి నవసరమ్మునను
దనర నా దేవుఁడంతర్ధానమయ్యె
శ్రీకంఠుఁ డానతిచ్చిన లక్షణములు
లోకప్రసిద్ధిఁ జెల్లుచునుండు నెపుడు
నిదియు నేబది లీల యిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి
యనుచు సమ్మునులతోఁ నా యగస్త్యుండు
ఘనమునఁ దలపోసి మఱియు నిట్లనియె

## ఏబదియొకటవ లీల

మఱియును నొకనాఁడు మధుర లోపలను
సరసతఁ బాండ్యభూజననాయకుండు

లాలితభూషణాలంకారుఁ డగుచు
స్త్రీలును దాను నంచితలీల మేడ
పైని వినోదింపఁ బట్టంపుదేవి
వేసవి వాసన వేడ్కతోఁ గూడి
మలయానిలమ్ము పై మలసిన విభుఁడు
జలజాక్షిపైనఁ బతిమ్మనఁ గూర్చి
యిది జన్మవాసనో ! యిది పుష్పములను
వదలక ముడిచిన వాసనో ! దీని
భావజ్ఞులైనట్టి పండితోత్తముల
చే వినవలె నని చెలఁగి యాస్థాన
మంటపకనకకంభమున వేమాట్లు
గంటు గట్టించెఁ బ్రజ్ఞావంతుఁడగుచు
గరిమ నాపురమునఁ గల కవీశ్వరుల
రప్పించి యా పాండ్యరాజు వేఁడుటయు
నెరవుగాఁ దమతమ నేర్పులు మెఱయఁ
జెప్పిన నారాజు చిత్తమ్మునకును
నొప్పుగా సరిరాక యున్న యంతటను
నాపురమ్మున ధర్మియను బ్రహ్మచారి
పాపవిదూరుండు బ్రాహ్మణోత్తముఁడు
శ్రీచొక్కనాథుని సేవ త్రికాల
మాచరింపుచు నుండి యతిభక్తి తోడ
దేవ దేవేశ యాదేవేంద్రవంద్య
భావజసంహార ! భక్తమందార !
దక్షసంహార ! యాదైవతారాధ్య
పక్షివాహస్తోత్ర ! పరమపవిత్ర !
తల్లియుఁ దండ్రియుఁ దాత దైవమ్ము
నెల్లరు నీవె నాకెల్లకాలమ్ము
వరుసతో నాకు వివాహమ్ము జేసి
కరుణింపుమయ్య ! యోకఱకంఠ ! యనిన
నరసి శ్రీచొక్కనాయకుఁడు కారుణ్య
భరితుఁడై యతనికిఁ బత్రికయిచ్చి
యిది మదీయశ్లోక మిది గొంచుఁ బోయి
ముదమొప్ప నారాజు ముందరఁ జదివి

యామాళ్ల ముడుపు నీ వలివేడ్కఁ దెచ్చి
ప్రేమమ్ముతో నీవు పెండ్లాడు మనియె
నతిమోదమునఁ బొంది యా బ్రహ్మచారి
క్షితినాథుకడకు నాటిటఁ గొంపోయి
చదివిన నాపాండ్యజనపతి తనదు
మదికిని సరివచ్చి మఱి చాల మెచ్చె
నలవడ నా కవితార్థ మెట్లన్న
నళులార ! సకలమ్ములైన పుష్పముల
సౌరభమ్ములు మీరు సరవిఁ గ్రోలుదురు
నారాజు దేవుల యా నెఱికురుల
వాసన గనుఁడు మీ రా రెంటిలోన
వాసనాధిక మెందు వర్తించు ననిన ?
నా సాధ్వికురులు దివ్యంబైన జన్మ
వాసనగాని పూ వాసనగాదు
వలఁప నద్దేవి కుంతలముల యందుఁ
గలుగు వాసన యధికంబనై నళులు
నట్టి శ్లోకార్థమ్ము కాత్మ నుప్పొంగి
పట్టాభిషిక్తుఁడా పాండ్యభూవిభుఁడు
నా వేళ వరహాల నమరిన ముడుపు
నో విప్ర ! కొనిపొమ్మి యొనరంగ నీవు
ననిన నాముడుపు బ్రాహ్మణుఁడు దా విడువఁ
జనిన నక్కీరుండు చయ్యన వచ్చి
నిలువు విప్రవరేణ్య ! నీశ్లోకమునకుఁ
గల దొకతప్పు నీకవి చెప్పినట్టి
వారిఁ బిలువుమన్న వరుస నాబ్రహ్మ
చారి యేతెంచి యా సర్వేశు కనియె
నోశశాంకకిరీట ! యోచొక్కనాథ !
యీశ మీ రానతియిచ్చిన కావ్య
మొరసి నక్కీరదేవుఁడు తప్పుపట్టి
తిరముగా మిము దోడితెమ్మనె దేవ !
యని విన్నవించి బ్రాహ్మణుఁ డిందుధరుని
వినుతించినను గృపావిర్భూతుఁడగుచుఁ
దన కావ్యము పఠింపఁ దనవారిఁగూడి

యనుపమవిద్వాంసుఁడై సంఘమంట
పమునకు నేతెంచి ప్రాజ్ఞత మించి
భ్రమయక నాసంఘములకఁ గూర్చున్న
వారిలో నాకవిత్వము తప్పులన్న
వా రెవ్వ రనుచు నాస్వామి దానంత
శ్రుతులందు వినవె ! యీ రుద్రాణిపేరు
కౌతుకక సౌగంధికుంతల నాఁగ
నన విని నత్కీరుఁ డాదేవి కురులు
మనుజాంగనల కురుల్ మఱి సాటి యగునె !
యని హరానలదృష్టి కట నోర్వలేక
చనుచుఁ బొత్రామరసరసిలోఁ బడిరొ
మరునిఁ జూచినచూడ్కి మఱి తనభక్తి
పరులను జూడంగఁ బాడి గాదనుచుఁ
దన నేత్రశిఖి వానిఁ దగులకయుండ
మనమునఁ గరుణించి మఱియు నాకొలనఁ
గ్రుంకియుండఁగఁ జేయ గూఢపాన్నాథ
కంకణునకును నాకావ్యులు వాఁడు
తప్పొప్పు లెఱుఁగక తప్పనె గాక
నొప్పులు తప్పన నుచితమే యనుచు
నా సభవారెల్ల నటు విన్నవింప
నా సదాశివుఁడు బ్రాహ్మణునితో నపుడు
ధనము గొంపోయి మోదమునఁ బెండ్లాడు
మని యానతిచ్చి యదృశ్యుఁడై చనిరొ
నరయ నావిద్వాంసు లాశ్చర్య మంది
వరచొక్కనాథుని వాదమ్ముఁ జేసి
గెలువ శక్యమ్మె నత్కీరున కనుచుఁ
బలికిరి మఱియు నా బ్రాహ్మణోత్తముఁడు
ధనము గొంపోయి మోదమునఁ బెండ్లాడి
తనరంగఁ బుత్రపౌత్రాభివృద్ధిగను
శ్రీచొక్కనాథుని సేవ లేప్రొద్దు
నాచరింపుచు ధర్మియై యుండెనంత
నిదియు నేఁబదియొండు నిటమీఁదిలీల
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి

యనుచు సన్నుతులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియెం.

## ఏబదిరెండవ లీల.

అంత నావిద్వాంసు లందఱు గూడి
కంతుసంహరు నీలకంధరు నభవు
చొక్కనాయకుని సంస్తుతులొప్పఁ జేసి
నక్కీరదేవుఁ డెంతయు విన్న నగుచుఁ
జాలఁ బొత్తామరసరసిలో నుండి
హాలాస్యనాథ! నిన్నాత్మలోఁ దలఁచి
యున్నవాఁడ తని యభ్యున్నతస్తుతులు
విన్నపం బవధారు వృషభవాహనుఁడ!
దేవ! మీతో నిప్డు దెలియంగఁ బల్క
భావించి తానాడు పల్కుల వారి
నక్కీరదేవుఁ డెంతయు శంక లేక
ఒక్కమ్మె తప్పంటి నేనె పో! యనినఁ,
గానకాని దినము సంకులు గోసి యమ్ము
కొనువాఁడ వీవు నీ కొలఁదెఱుంగకయు
నాకవిత్వము తప్పన న్నీకుఁ దగునె
యీకవీశ్వరులకు నెఱిఁగింపు మనిన,
దీనికి నక్కీరదేవుఁడిట్లనియె
మా కులక్రమ మిది మఱి నీదువృత్తి
గోత్రమ్ము నామము కులము శీలమ్ము
పాత్రమ్ము నెయ్యది! భావింప నాకు
నెఱుఁగఁ జెప్పు మటంచు నీతుతో మఱియుఁ
బరగ నీ చెప్పిన పద్య మర్థమ్ము
కురులవాసన గాని కొమరొప్ప ముడుచు
విరులవాసన గాదు వెలఁదికి నంటి,
దనర మస్తకమునఁ దైలమ్ముగూడ
కనుదినమ్మును స్నానమాడక మఱియుఁ
బరిమళామోదపుష్పమ్ములు నెపుడు
నొలుపుగా ముడువక యున్న నాచెమట
కంపు వైచును గాక కమ్మనితావి
సొంపు నెఱులకు నేలఁ జొప్పడు జెపుమా!

యనినను నాస్వామి యప్సరోంగనల
కును బుష్పవాసన గూడునె కురుల
ననిన నాతఁడు నట్లయోగాక యనిన
మునుకొని కురువంపు మొలకల కట్టు
వాసన దలఁపఁబార్వతిదేవి కురుల
వాసన యది పెట్టువాసన యనుచు
నతఁడటు నజ్ఞాన మడర నాహైమ
వతి కురులకుఁ బెట్టువాసన యనిరొఁ
దరుణేందుధరుఁడంతఁ దన జడ వీడ్చి
వరుస నిందుకుఁ బెట్టువాసన యనిన
నడరి నక్కీరుఁ డాహరున కిట్లనియె
జడగొని బెదిరింపఁ జనునె ! యీయర్థ
మీ ,మండలమ్మెల్ల నెఱుఁగున యనిన
నామాటకా దేవుఁ డధికకోపమున
నళికనేత్రముఁ జూప హరు భక్తివలన,
గలఁగక తలచుట్టు కన్నులైనాను
తప్పుతప్పగు గాక దారుణాకృతుల
నొప్పెల యగునన్న ! న్రగు కిట్లనిరి
దేవ మీ ఫాలాగ్నిదృష్టికి వీఁడు
భావజన్ముఁడు గాఁడు, భావించి చూడ
సురనరలోకముల్ సోరిది బాధించు
పురదైత్యులునుగాఁడు, పురములుగాఁడు
తప్పులెన్నైన విద్వన్నుత ! వాని
కెప్పుడు నపరాధ మెందును లేదు
శంకర ! యపరాధశతకంబు మీకుఁ
గింకరుఁడైన నక్కీరుండు సెప్పె
గరుణించి యంగయకణ్ణమ్మ మీర
లిరువురు విచ్చేసి యిటుదరి నుండి
వినవయ్య యని వారు విన్నవించినను
మనమున దయగల్గి మన్నించి యపుడు
నంగయకణ్ణమ్మ యాచొక్కవిభుఁడు
మంగళాలంకార మహిమఁ జెన్నొంది
యాకాంచనాబ్జాలయమ్ము కేతేర

నా కవీశ్వరుఁడందు నణఁగి యుండియును
గగన గంగాజూటు! కైలాసకూటు
నగరాజవాస! సంతతమనోల్లాస!
యాతతిఁ గాలపాశార్తుఁ డైనట్టి
శ్వేతకేతనుని రక్షించిన వేల్ప!
కాలను దన్నిన కన్నప్ప నపుడు
పాలించినట్టి సద్భక్తవత్సలుఁడ!
సాంఖ్యతొండని గాల జడికిని నోర్చి
సౌఖ్యాబ్ధిఁ దేల్చిన సత్పుణ్యచరిత!
యడరి మార్కండేయు కాయుష్యమిచ్చి
కడువేడ్కఁ బ్రోచిన కరుణాసముద్ర!
వింటఁ గొట్టినయట్టి విజయుని మదినిఁ
గంటుగించక ప్రోచు గరుణాసముద్ర!
కాలకూటాగ్నిచేఁ గాలకయుండ
భావించి లోకముల్ బ్రతికించు వేల్ప!
యట్టి దయాఖండవైన నీవిపుడు
నెట్టన నన్ను మన్నించుట యరుదె!
యనుచు సన్నుతు లప్పుడందందఁ జేసి
యొనర నాగమ శాస్త్రియుక్తమ్ముగాను
నపరాధశతక పద్యములు పఠింపఁ
గృప తోడ వినియు నక్కీరదేవునిని
దరికిని రప్పించి తగ గారవించి
నిరతమ్ము మీరలుండెడి యాసనమునఁ
గూడి యొప్పటియట్ల కూర్చుండు మనుచు
రూఢిగాఁ దన నిజరూపమ్ముఁ జూపి
యాదృశ్యత భజింప హరుఁడు దేవియును
సాదృశ్యమే లేని సద్భక్తిపరుఁడు
నక్కీరుఁ డప్పుడానందమ్ము నొంది
చొక్కనాథుని గుడిఁ జొచ్చి యద్దేవు
సన్నిధినిల్చి యోసర్వేశ! యీశ
పన్నగకేయూర! భక్తమందార!
యిల మీరు విచ్చేసి యిటు నిలుచుండ
ఖలుఁడైన నాదు నజ్ఞానమ్ము కతన

నాసంఘమంటు బాహ్యాంతరమునను
నేశంకయును లేక యేను గూర్చున్న
కృపతోడ నన్ను రక్షించిన వేల్ప !
హాలాస్యపురవాస ! యధికప్రకాశ !
బాలచంద్రోత్తంస ! పాపవిధ్వంస !
యని సన్నుతించి సాష్టాంగమ్ము జేసి
తన సంఘమంటుపస్థలికిఁ బోయి
ముక్కంటి కృపచేత మున్నున్నయట్లు
నక్కీరదేవుఁ డెంతయు నుండె మఱియు.
గళకంధుఁ డేటేటఁ గనకాబ్జసరసి
దఱికి నేగుసు మహాత్మ్యముతో నెపుడు
నిదియు నేబది రెండు నిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి
యాకుంభసంభవుఁ డామునీంద్రులకుఁ
జేకొని మఱియిట్లు చెప్పదొడంగె.

## ఏబదిమూఁడవ లీల.

అనఘుఁ డానక్కీరుఁ డనుదినం బెలమిఁ
గనకాబ్జసరసిఁ దక్కక తీర్థమాడ
యుడురాజధరునకు నొగిఁ ద్రికాలమ్ము
గడుఁ బ్రదక్షిణనమస్కారముల్ సేయు
చుండు నంతట దేవుఁ డొకనాఁడు కరుణ
నిండంగ నతని మన్నింతుంగఁ దలఁచి
నెమ్మి నీ నక్కీరునికిఁ గావ్యలక్ష
ణమ్ముల రాక నెన్నఁగ నెట్టి పెద్ద
లైన విద్వాంసుల నట వారిఁ గన్న
కాన కెప్పుడు తిరస్కారము సేయ
నటుగాన వీనికి నధికమ్ముగాను
నిటు లక్షణమ్ములు నెఱిఁగిన యట్టి
ఘనుల ఛందమును లక్షణయుక్తముగను
ఘనముగాఁ దగఁ జెప్పఁగావలె ననుచు
మఱి యానతిచ్చిన మధుకేతుఁ జూచి
కరమొప్ప వంగయాకత్యమ్ము తనదు
కరయుగమ్ములు మోడ్చి కళాకంఠ ! యభవ !

నిత్యసత్యాత్మక నిఖిలలోకాత్మ
రత్యాప్త దమన ! గౌరాజనస్వగమన !
సర్వజ్ఞ ! మును ఘట జన్ముని యామ్య
సర్వంసహోన్నతి సమము గాకున్నఁ
కైలాసగిరి మీఁదఁ గడచి మీరుండి
పాలించినట్టి లోపాముద్రనాథు
నాతని నంపంగ నవధరించినను
నాతఁడు పని బూని యందంద మ్రొక్కి
యిదియు ద్రావిడదేశ మీదేశభాష
యది నాకుఁ దెలియదు నా కావ్యలక్ష
ణము లుపదేశమ్ము నాకును నిప్పు
డమరంగ నానతిమ్మని విన్నవింప
రక్షించి యతని కా ద్రావిడకావ్య
లక్షణమ్ములు గొన్ని లాలించి యాన
తిచ్చియు మఱిగొన్ని దెలియ మధురకును
వచ్చి చెప్పెదమంచు వడి నానతిచ్చి
యంపంగ నాతని నవధరించితిరి
యింతసేఁగఁగ నాతఁడిచ్చోటి కరిగి
నని విన్నవించిన నా సౌందరేశుఁ
డనువంద నాజగదంబను జూచి
మేము మఱచితి మిది మేలు నీవిపుడు
నామాట దెలిపితి వది చొక్కడనుచు
నమ్మహాదేవుఁ డాయంగయక్షిణి
యమ్మ యానతి వట నలరంగఁ జెప్పె
వనర ద్రావిడకవిత్వమ్ము నాకపుడు
కానరఁగా లక్ష్మణయుక్తమ్ముగాఁగఁ
డగ నానతిచ్చె నెంతయు వేడ్కతోడఁ
బొగడొంద ద్రావిడభూమిని కింతసద్గ
వంత నక్కీరుని కా లక్షణమ్ము
లెంతయుఁ దెలియ సర్వేశుడానతిని
విరచించి యెంతయు విశ్వేశ్వరున్ను
మఱిమించి పొదియ మ్రాకుల నుండు వంత
నప్పు డంగయక్షిణియమ్మ యిహాదేవుఁ

దప్పక వీక్షించి తగవిన్నవించెఁ
దెలియంగ నక్కీరదేవుని కిపుడు
నెలమితో మీరానతీక కుంభజుని
చే నుపదేశమ్ము సేయించు టిదియు
నానతీవలె నాకు నంతయు ననినఁ
గ్రక్కున నంగయకణ్ణెమ్మ తోడఁ
జొక్కనాథుఁ డపుడ సూయచిత్తునకు
జటులహంకారికిఁ జంచలాత్మునకుఁ
గుటిలున కత్యంతక్రూరకర్మునకు
బూని మే ముపదేశమును సేయరాదు
గాన నక్కీరుని గర్వమ్ముఁ జూచి
యనఘుఁ డగస్త్యున కానతిచ్చితిమి
యనిన శర్వాణి యాహరు నుతియించె
నంత నా నక్కీరుఁ డాచొక్కనాథు
నెంతయు స్తోత్రమ్ము లెన్నేనిఁ జెప్పె
దక్షాధ్వరధ్వంస! దక్షసంహార!
పక్షివాహనవంద్య ప్రణతముకుంద !
పక్షిస్వరూప మోపరమేశ యీశ
యిక్షుకార్ముకవైరి ! యిభచర్మధారి !
సర్వేశ నాకు నజ్ఞానమ్ము మించి
గర్వించినాఁడ మీకావ్యలక్షణము
గాదన నేనెంత కాలకాలాంత !
నాదూషణత్వమ్ము నన్నింత జేసె
నాయపరాధమ్ము నానేర్పు నేర
మీయెడ లోఁగొంటి యీశ ! సర్వేశ !
యని సన్నుతులు సేయ నాదేవుఁ డపుడు
ఘనముగా నతనిపైఁ గరుణార్ద్రదృష్టి
గావించి నీతోటి ఘనసంఘమంటు
పాపాసమునను గావ్యశ్రేష్ఠుఁడుగను
నుండు మహంకార ముడిగి నీవంచు
ఖండేందుధరుఁ డంపెఁ గడకతో నతని
నంపిన నక్కీరుఁ డాదేవప్రకును
సంపూర్ణభక్తితో సాష్టాంగ మెరఁగి.

యా సంఘమంటపాభ్యంతరమ్మునను
నేశంక లేకుండె నీశ్వరుకృపను
నిదియు నేబదిమూఁడవ నిటుమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి
యనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.

ఏబదినాల్గవ లీల.

నా పాండ్యభూపాలుఁ డా దయాశీలుఁ
డా పుణ్యసంచారుఁ డాయశోహారుఁ
డా చొక్కనాథు దయాపూర్ణుఁడగుచు
భూచక్రమెల్ల సొంపుగ నేలుచుండ
ననుపమంబగు మధురాపట్టణమ్ము
నను దివ్యసంఘమంటపము శోభిల్ల
నా సంఘమంటపాభ్యంతరమ్మునను
నీశు సత్కృపచేత నిందఱు మెచ్చ
సుజ్ఞానఫలకను శుభలీల నున్న
ప్రజ్ఞావిశేషులు పండితోత్తములు
ఘనమైన ద్రావిడకావ్యాలు నలువ
దెనమండ్రు తమలోన నీర్ష్యలు పుట్టి
తమతమ కావ్యసత్త్వమ్ములు దెలిసి
వివరింపఁగా పురవిజయుండు దక్ష
నన్యులకును నశక్యమ్మని నీశు
వన్యావనీనాథు వరచొక్కనాథు
సన్నిధి కరిగి సాష్టాంగమ్ము లెఱఁగి
సన్నుతించిరి జగన్నాథ్య సర్వజ్ఞ
విద్వత్కులశ్రేష్ఠ ! వేదప్రతిష్ఠ !
యద్వైతరూప ! హేమాచలచాప !
వరద ! మా మా కవిత్వమ్ము లన్నియును
నరసి వేర్వేఱుగా నందఱి చేత
విని తదర్థమ్ములు వివరించి తెలిసి
ఘనముగా హీనాధికమ్ములు సర్వ
సమ్మతిగాఁగ లక్షణము లేర్పఱచి
మమ్ము రక్షింపు మంబరకేశ ! యనుచు
యను విన్నవించి కామరఁడు గూడ

కాని స్వామిసన్నిధిఁ గూర్చున్నయంత
నా నీలకంధరుం డా సదాశివుఁడు
డా నొక పండితోత్తముని చందమున
శ్వేతకంచుకశిరోవేష్టనమ్ములును
భూతియు రుద్రాక్షములు ధరియించి
జవణిపాముల రాజు జందెమ్ము వైచి
నవరత్నకర్ణకుండలములు బూని
చంకను నొక్క పుస్తకము ధరించి
శంకరుఁ డప్పుడా సభకు విచ్చేసి
వరుసతో నవ్వారి వాక్యముల్ వినియు
హరుఁడు వారలకు నిట్లని యానతిచ్చె
నీపట్టణములోన నీశ్వరభక్తి
చేపట్టియున్నాఁడు సెట్టి దా నొకఁడు
పన్నగాభరణ సద్భక్తమానసుఁడు
నాతఁ డీపురిని గళాదుఁడ న్వాఁడు
నాతీర్థమూర్తియై యా పెద్దసెట్టి
తనదుభార్యకును సంతానమ్ము లేక
తనయమ్ము నీదేవు నర్థిఁ బూజించె
నా సెట్టికిని బట్టియై వేడ్కతోడ
భాసిల్లుచుండి యీ పట్టణమ్మునను
వానికి నుదయించె వరకుమారుండు
సేనాని మూఁగయై శివునాజ్ఞ వలన
నారీతి రుద్రశర్మాభిధానమునఁ
గారణజన్ముఁడై కలిగియున్నాఁడు
వని మీర లారుద్రశర్మ ముందరను
వినుతించినను వాఁడు విశదమ్ముగాను
మీ గద్యపద్యముల్ మీ కావ్యములును
బాగుగా మీకు నేర్పఱుపంగఁగలఁడు
ననినను వార లాయనఘాత్ముఁ జూచి
వినవయ్య యామూఁగ వెత్తిరాఁడెట్లు
మా కావ్యతారతమ్యంబులు దెలిసి
ప్రాకటమ్ముగ నేర్చి భాషింపఁగలఁడు
ననినను మీకావ్య మతని ఘుఁగలమ

వినిపించు వానికి విమలదేహమునఁ
బులకాంకురమ్ములు పొడమి నేత్రములు
జలములు దొరఁగినఁ జాలంగ వారి
భావ్యంబు ఘనమని కవులార మీరు
భావ్యమ్ముగా మది భావించికొనుఁడు
నని యానతిచ్చి యాహాలాస్యవిభుఁడు
దనవిగ్రహమున నంతర్థానమయ్యె
నప్పుడా విద్వాంసు లాశ్చర్యమంది
యప్పరమేశ్వరుఁ డాచొక్కనాథుఁ
డీరీతి నానతి యిచ్చెనే! యనుచు
వారలందఱు సెట్టివానింటి కరిగి
యాపిన్నవానికి నామానచిత్తు
నాపుణ్యశీలుని నటుఁ బొడగాంచి
యతనికి నర్ఘ్యపాద్యాదు లర్పించి
యతులితదివ్యమాల్యానులేపనము
లను దివ్యభూషణాలంకారములను
నధికగజస్కంధికారూఢుఁ జేసి
మధురాపురీరాజమార్గమ్ము మెఱసి
యాసంఘమంటపాభ్యంతరమ్మునను
నాశైశవాకారు నాసుకుమారుఁ
గూర్చుండఁ బెట్టి యాకోవిదులెల్ల
రర్చించి యతుల సాష్టాంగముల్ జేసి
రాసఁగ నానలువదియొనమంద్రు కవులు
నసమానద్రవిడభాషావిచక్షణులు
నప్పుడా గుహుఁజూచి యతిముద మంది
తప్పక భక్తితాత్పర్యమ్ము లెసఁగ
శాంభవీనందన! స్కంద! సేనాని!
శంభుసత్పుత్ర! తారకహర, బాహు
లేయ క్రౌంచారి వల్లీనాథ! కార్తి
కేయ మహాసేన కేకిసనాథ!
పళనిపర్వతనాథ! భానురస్వామి
మలవాస సైకతామలవాస శక్తి
ధర కుమారస్వామి తారకదైత్య

కారణ సాక్షాత్కృక యగ్నిసంభూత
యనుచును సన్నుతు లనువందఁ జేసి
యనఘు లచ్చోట నాత్మానందు లగుచుఁ
దారు సెప్పిన ప్రబంధములెల్ల వేఱు
వేఱ ప్రత్యేకంబ వినిపింప నంత
నందఱు చదువఁగా నవధానమతిని
నందమ్ముగా విని యచలుఁడై యుండె
ఘనుఁడు నక్కీరుండు కపిలుండు భరణుఁ
డనువారి ముగురి కావ్యముల సంగతులు
విన్నంతఁ బ్రముదితావిర్భూతుఁ డగుచుఁ
గన్నుల నానందకణములు దొరఁగ
నదరంగఁ బులకాంకితాంగుఁడై యతఁడు
కడు వేడ్కతో శిరఃకంపంబు నేసి
యందఱు జూడఁగా నక్కుమారుండు
సందీప్తుఁడై యదృశ్యంబయ్యె నంతఁ
జని శాపముక్తుఁడై సైకతాచలము
తనకును నిజరాజధానిగాఁ జేసి
దృష్టమైనట్టి తత్స్వార్థులకును
నిష్టార్థములు వేడ్క నిచ్చుచునుండె
నప్పుడు సభవార లాకవిత్రయము
చెప్పిన కావ్యమే శ్రేష్ఠమ్ములనిరి
వారలు సంతోషవార్ధి నుప్పొంగ
కోరి యా సర్వేశు గుడికి నేతెంచి
ముగ్గురు నపు డతిమోదమ్ముతోడ
దగ్గఱి సాష్టాంగదండముల్ చేసి
పార్వతీరమణ! యో భక్తవాత్సల్య!
నిర్వాణనిరవయ నీపాటుఫీశ
మధుభంజనప్రియ! మదనసంహార!
మధురేశ యో యవాఙ్మనసగోచరుఁడ,
హాలాస్యనాథ! కావ్యాధిక్య మెఱిఁగి
లాలించి మాకు నాహ్లాదమ్ము జేసి
రక్షించితే భక్తరక్షణాకార!
చతుశ్శ్రుతివాటీశ సద్భూషణాంగ!

యని సన్నుతులు జేసి యందఱు గూడి
చని సంఘపలక నిచ్చలు నుండి రంత
నిదియు నేబదినాల్గు నిఁటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార యనుచు
నా యగస్త్యుండును నానందమంది
యాయతోన్నతముగా నటువారి కనియెం.

## ఏబదియైదవ లీల.

నా మహామధురఁ బాండ్యావనీశ్వరుఁడు
సామహాదేవు కృపాపూర్ణుఁడగుచుఁ
బాలింపుచున్న యాపట్టణమ్మునను
లాలితసత్కావ్య లక్షణుఁడైన
కపిల సన్మిత్రుండు ఘనుఁడొక్కరుండు
నపుడు నాపాండ్యభూపాగ్రణిఁ జూచి
తా రచియించినయట్టి తగుకావ్యమెల్లఁ
జేరి యాభూపాలు చెంతను జదివెఁ
జదివినదెల్ల నశ్లాఘ్యమ్ముఁ జేసి
పదపడి యాతనిఁ బాటింప కనిపె
ననిపిన నతఁడు లజ్జాయత్తుఁడగుచు
ఘనమైనచిత్తమై కడఁగి సౌందర్య
గుడికి నేతెంచి యాకుధరాత్మజేశ !
జలధర శశిధర సజ్జటాధార !
పురహర భవహర భోగీంద్రహార !
కరిదైత్యసంహార ! ఘనకృపాకార !
కాలకూటాహార ! కలుషాపహార
దుగ్ధపారావార తుహినాద్రి హార
స్నిగ్ధవర్ణస్ఫార నిర్మలాకార !
రూపింప శబ్దస్వరూపము శక్తి
ప్రాపించు నర్థమ్ము పరమేశుఁడనుచు
వేదశాస్త్రమ్ముల వినియు నీరీతి
మేదిని వెలయంగ మేటినై కొంత
కావ్యమ్ము సెప్పి సత్కావ్యాలు మెచ్చ
[illegible] పాండ్యభూపాలుని యొద్ద,
వాదమ్ముతోడ నింపుగఁ జదివింప
నాదరింపక యనాదరణమ్ము జేసె...

యదయుఁడై న న్నుదాసీనముఁ జేసె,
నది నేయాటయు మిమ్ము నంగయకణ్ణి
యమ్మను గైకొననట్టిది కాదె!
యమ్మను జేంద్రుండు నటునేయుటెల్ల
ననుచు, నడుకొఁడ డందంద మ్రొక్కి
చనెను బోయెద నంచు సంతాపమునను.
అంతటఁ దనభక్తుఁడైన యామధ్య
కాంతారుఁ డటు చనఁగాఁ జూచి తాను
నప్పు డంగయకణ్ణియమ్మఁ దోడ్కొనుచు
నప్పరమేశ్వరుఁడా చొక్కనాథుఁ
డది యొట్లు నాకావ్య మతఁడు కాదనుట
పదపద యేనును బద వత్తుననుచు
నాతనివెంటఁ దా నరిగెను వైఖ
కాతటి నుత్తరప్రాంతమ్మునకును.
వరుస నాగ్రామదేవతలును దుర్గ
కరివక్త్ర భైరవ కరివరదాదు
లాశాధినాయకు లాది సన్మునులు
నా సంఘమంటపమ్మందున్న కవులు
ప్రమథవర్గమ్ములు భాసితమ్ముగను
క్రమముతోఁ గొలువంగఁ గథువేడ్క నుండె
నంతట మఱునాఁడు నాయుమశకాల
మెంతేని శివభక్తు లెల్లరు గూడి
యాయొడ స్థానికు లటమున్నఁ బూజ
నేయఁగా వచ్చి యచ్చెరువంది వారు
నాది యా దేవుని యావాసమునకు
మోదమ్ముతోడుత మ్రొక్కంగఁ బోయి
యామహాదేవుని నచ్చోటఁ గాన
కామహేశ్వరులు బ్రాహ్మణులు భీతిలుచుఁ
గ్రచ్చర వెదుక నక్కడ వైఖదరిని
నారూఢఁ బ్రమథమహామునుల్ సురలు
గొలువంగ నున్నాఁడు కోర్కులు మీఱ
వెలయంగ నిదియేమి విధమొకో యొఱఁగ
మని విన్నవించిన నతిభీతుఁ డగుచుఁ

గనకాసనము క్రిందఁ గడుబడి లేచి
మొలచీర వీడఁ గ్రొమ్ముడి చాల జాఱఁ
గలఁగుచు వేవేగఁ గదలి యాక్షణము
తనస్త్రీలు దాను దనమంత్రు లెల్ల
రును నొగి స్వామి పేరోలగంబున్న
యాతావుకరిగి భయాతురు లగుచు
భూతేశు పాదాల ముందర భూమిఁ
బడి పొర్లి మ్రొక్కి యోపరమేశ ! మీరు
వెడలిటుకును వచ్చు విధ మదియేమి ?
నావల్ల దప్పేమిఁ నాకానతిమ్ము
ఈపట్ల మీ రేగు నీ విధంబెల్లఁ
గారుణ్యనిధి ! యంచుఁ గన్నుల బాష్ప
పూరముల్ నింపుచుఁ బొరిఁబొరి నేడ్చు
చున్న యాభూపాలుఁ జూచి యా స్వామి
యున్నికగా నానతిచ్చె నిట్లనుచు
నీమీఁద దప్పేమి నీతోడిదేమి !
నీమీఁది కోపమ్ము నేనెన్న నేల ?
నేము నీ స్థలమున కెనరైన స్థలము
నేము గావరె నన్న నిచ్చోటు లేదె !
నీవంటి భక్తులు నిక్కమ్ముగాఁగ
నావల మఱిమాకు నందంద లేర
యా యడుక్కొండడు నా కమితాప్తుఁ
డాయెడ నొకకావ్య మనువొప్పఁ జేసి
యర్థిమై నీపాలి కర్థమ్ముగోరి
యర్థింప వచ్చిన నర్థికి నీవు
నర్థ మీనోపక యాకావ్య మందు
నర్థము దెలిసిన హంకారమునను
నర్థి నుదాసీన మటు నేయఁ దగునె
పార్థివేశ్వర ! మాకు భక్తుఁ డీతండు
గాన మే మీమధ్యకాంతారుఁ డలిగి
రా నిందు నతనికై రాఁ బ్రాప్తి కలిగె
నీవిందు రానేల ? నీచోటి కరుగు
మని యమ్మహాదేవుఁ డానతిచ్చినను

వినియు నాపాండ్యభూవిభుఁ డాత్మఁ గలఁగి
శంభో! మహాదేవ శాశ్వతైశ్వర్య!
యంభోజ సంభవాద్యర్చితపాద!
వేదరక్షణ జాతవేదోజ్జ్వలాక్ష!
బాదరాయణ భుజాబంధనకరణ!
హా దేవ! దేవవేశ్యాభుజంగాంక
యోదేవదేవ మృత్యుంజయ! యేను
నజ్ఞాని నపరాధి నవివేకపరుఁడ
బ్రజ్ఞావిహీనుండ భవబంధనుండ
నా నేర మెన్నక నన్ను మన్నించి
యేను జేసిన నేరమెల్ల లోఁగొనుచుఁ
జనవిచ్చి రక్షించు సౌందర్యనాథ!
యని సన్నుతులు సేయ నా పాండ్యవిభునిఁ
గరుణించియప్పుడా ఖట్వాంగపాణి
తిరిగె హరిబ్రహ్మదేవతల్ మునులు
నాయడుక్కాండ డాదైనసత్కృతులు
నారొడఁ గొలువంగ నతిసంభ్రమమునఁ
గడువేడ్క నంగయకణ్ణమ్మతోడఁ
దడయక విచ్చేసెఁ దనస్థానమునకు
నరుసతో సకలదేవతలును మునులు
నరిగిరి తమతమ యాశ్రయములకు
నప్పు డాసౌందర్యుఁ డావైఖ దరిని
నొప్పుగా విచ్చేసి యున్న యాస్థలము
నరయంగ నుత్తరహాలాస్య మనఁగ
వెలసెను నచ్చోట వినుతింప నంత
నామహీపాలుఁ డానందమ్ము నంది
యా మహాదేవున కర్చనల్ చేసి
పరిమళ భూషణాంబరము లొసంగి
గరిమతో నామధ్యకాంతారుఁ జూచి
యా స్వామికై నీవు నతిభక్తి గలుగ
నా స్వామి నీపజ్జ కటకు విచ్చేనె
నీవు పుణ్యుఁడ వౌదు నిక్కమ్మై యనుచు
భావించి యతనికి బహుభూషణమ్ము

తెప్పించి పట్టంపుఁ దేనుఁగుమీఁద
నప్పుడు నెక్కించి యతిసంభ్రమమునఁ
బురవీథు లెల్ల నింపుగ నేఁగఁజేసి
వరుసతోఁ దగు కట్టువర్గము లిచ్చె.
తడయక మధ్యకాంతారుని వెనుక
నతివేడ్క నుత్తరహాలాస్యమునకుఁ
దొడరి వచ్చినమాత్రఁ దొడరి యేతేట
నెడపక పిచ్చియు నెపుడు నాస్వామి
నిదియు నేబదియేను నిటుమీఁది చరిత
ముదము తోఁ జెప్పెద మునులార వినుఁడి
యనుచు సన్మునులతో నా యగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె

### ఏబదియాఱవ లీల.

మధురాపురీపాండ్య మండలేశ్వరుఁడు
విధుకులు సత్కృపావిఖ్యాతుఁడగుచు
మతిమంతు లెల్ల సమ్మతి నీతిఁగలుప
మతిమించి రాజ్యమ్ము మహిమఁ బాలింప
గైలాసవాసుని గణనాథుఁ డొకఁడు
హాలాస్యపురమున నగ్రజన్మమున
మధ్యగోత్రమ్మున మహి నెన్నఁబుట్టి
యధ్యయనాది విద్యాకళా ప్ర
వీణుఁడై సౌందర్యవిభవ సంపదలఁ
బ్రతిలేకయుండు నా పాండ్యభూవిభుఁడు
నతని నెల్లరుఁ జెప్పనంతయు నెఱిఁగి
ఫణిహారులను బంపి పరగ రప్పించి
ప్రణుతింపఁ దెన్నవ బ్రహ్మయనంగఁ
తననామ మతనికిఁ దనరఁ గావించి
వలయు నాభరణముల్ వరుసతో నిచ్చి
వలసిన మన్ననల్ వలనుగాఁ జేసి
దండనాయకుఁడవై తనర నా వెంట
నుండుమంచును ముద్దుటుంగర మిచ్చి
పాయవాకిఁట మఱి పారుపత్యమ్ము
నేయంగఁ గట్టడచేసె నా విభుఁడు

వాని నామంత్రి యత్యంత చాతుర్య
వంతుఁడై సద్గుణవంతుఁడై నీతి
మంతుఁడై సౌభాగ్యవంతుఁడై రూప
వంతుఁడై శివభక్తి మంతుఁడై యుండి
యతులిత స్వామికార్య ధురంధరత్వ
మతి నెంచి తొల్లిఁటిమంత్రుల మించి
మధురేశ్వరునకును మాహేశ్వరులకు
నధికధనమ్ముల నర్పించి మఱియు
నొనరంగ దానధర్మోపకారమ్ము
ననయమ్ము సేయంగ నానిమిత్తమున
నా పాండ్యవిభునకు నధికమ్ముగాఁగ
ప్రాఁపుగా సంపదల్ పాటించి మించె
విశ్వమంతయుఁ దన్ను వినుతింపుచుండ
శాశ్వతుండై యుండె సౌందర్య కృపను
నంతటఁ గొన్నాళ్ల కశ్వరక్షకులు
చింతింపుచును భీతచిత్తులై రాజుఁ
జేరి యందఱు వచ్చి చేతులు మోడ్చి
యోరాజ! యశ్వమ్ము లుష్ట్రమ్ములెంతొ
యతిసారముల చేత నధికమైనట్టి
మితిలేని వ్యాధులు మెయికొని కొన్ని
దీర్ఘనిద్రల జాఱిరెగ నున్నవింక
నని సాహిణులు వచ్చి యటు విన్నవింప
మనమునఁ దలపోసి మనుజేశ్వరుండు
నొప్పుగాఁ దిరువాదయూరి దేవునకు
రప్పించి యట్టివార్తల నెల్లఁజెప్పి
యశ్వశాలల రాజితాశ్వమ్ము లెల్ల
నశ్వర యత్నమై నగ్గె నన్నియును
నాటోప మెసఁగ సైన్యము లెన్నియైన
కోటానకోటులు గొల్చివచ్చినను
ఘోటక గజములు గొల్చిరాకున్న
పాటింప రహిత భూపతు లటుగాన
రయమొప్ప ద్వీపాంతరముల నేతెంచు
హయములఁ గొనితెమ్మి యట దగఁ బొమ్మి

యనుచు నాతనికిచ్చి యధికమైనట్టి
ధనరాసులెంతేనిఁ దగవాళ్ళఁ బంపెఁ
బంపినఁ దెన్నవ ప్ర?ష్టారాయండు
సొంపెసలార నా సోమసౌందర్య
సంగడికినిఁ బోయి సన్నుతుల్ జేసి
యంగయు కణ్ణమ్మకాదేవునకును
నిండిన సద్భక్తి నియమంబు బూని
దండప్రణామంబు దనరంగఁ జేసి
శరణు శరణ్య ! యో శరణార్థిరక్ష !
శరణు దుష్కృతశిక్ష ! శరణనలాక్ష !
శరణు తారకదైత్య సంహారకార
శర ణంధకాది రాక్షస దక్షవైరి
శరణంబరాంబర ! శరణంబికేశ !
శరణజహరివంద్య శరణు బృందార
శరణసేవిత ! యీశ శరణు విశ్వేశ !
శరణు నాస్వామి నా శరణు లోఁగొమ్మ
కాకోదరేశకంకణ ! నీదుభృత్యుఁ
జేకొని నా కార్యసిద్ధి గావింపు
మని వేడుకొనుచు నా హరునాత్మ నిలిపి
వనధికూలము కేగి వలనైనయట్టి
తిరుపెరుందూరను దివ్యమైనట్టి
పురమున కా మంత్రిపుంగవుం డరిగి
యందుఁ బ్రవేశించు నంతమాత్రమునఁ
బొందె సుజ్ఞానంబు పొందె నాతనికి
నప్పుడు నొకచోట నతఁడు గూర్చుండి
యప్పాండ్య భూపాలుఁ డంపిన ప్రజల
రావించి యీనెల రాత్రు గుఱ్ఱములు
ఆవణినెలఁ గొంచు నట వత్తు ననుచు
నన్నరనాథున కంతయుఁ దెలియ
విన్నవింపుడు మీరు వేవేగఁ బోయి
యని వారి మఱలంగ ననిపి తానందు
ఘనముగా నపుడు సుజ్ఞానమ్ము మించి
తెలియ నాధార స్వాధిష్ఠానములను

నలమణి పూరకంబా యనాహతము
కడు విశుద్ధము నను కమలముల్ గలుగ
నడర షడ్వర్ణ లింగాధికులైన
కరివక్త్రి కమలజ కమలపత్రాక్షు
లరయఁ బినాకియు నా సదాశివుఁడు
పరశివుండును బరబ్రహ్మంబులైన
మఱి దైవతంబుల మదిలోన నిలిపి
వర్ణబీజమ్ముల వర్ణాక్షరముల
వర్ణింప నాల్గును వడినాఱుఁ బదియుఁ
బన్నెండు పదియాఱు భావింప రెండు
నున్న వేయింటిని నొనర నర్పించి
వర్ణింప నాద్విషడ్వర్ణ లింగముల
నిర్ణయింపుచుఁ దన్ను నిజముగా నెఱిఁగి
యల మీఁదటు మనోలయ స్థానమందు
వెలయ నప్పరమాత్మ వెదుకుచు నుండె
ననఘుండు నాయూర నాశంభులింగ
మును గోరి యాగుడి ప్రొక్కంగ బోవ
నమ్మహా చొక్కనాయక దేవుఁ డడరి
నిమ్మ్రమాకుల నీడ నెమ్మితో నుండె
మఱి తొమ్మనూఁటు తొంబదియు తొమ్మఁడ్రు
గురువును శిష్యులై కొలువంగ నపుడు
నా తిరువాదయూ రరుగు చో నెదుర
నాతఱి గురురూపమై దేవదేవు
డచ్చోట నాతని యగ్రభాగమున
విచ్చేసి యుండంగ వేగంబె గాంచి
దొరకొన్న భవబంధ దురితముల్ ద్రుంచి
కొనర నా తిరువాదయూరు దేవునకు
ననువందఁ జేరి సాష్టాంగముల్ సేయ
శివుఁ డప్పుడాతనిఁ జేర రమ్మనుచుఁ
బ్రవిమల సద్గురు భావమ్ముగాఁగ
వరుసఁ జక్షుస్స్పర్శవాచక శిక్ష
లరుదుగా నియమించి యందంద మఱియు
లోల కామక్రోధ లోభ మోహములు

చాలంగ మదము మాత్సర్యమ్ము లాఱు
నాఱుండఁ ద్రోచి పృథ్వ్యప్పులు నగ్ని
వాయు వాకాశమ్ము పడి నందుఁ గల్గు
పసనైన యట్టి శబ్ద స్పర్శరూప
రసగంధములు పచ్చి కసవు గాలించి
యమరఁ ద్వగక్షిశ్రోత్రము జిహ్వ నాసి
కయును నేనింటి సంగతులూడ్చి మఱియు
పరగంగ వాక్పాణి పాదపాయువులు
నరయ నాగుహ్యగతాగమం బరసి
పూని ప్రాణాపానములు సమానం బు
దానవ్యానాదిక స్థలము లందరఁగు
వెలయ నిట్లగు పంచవింశతి తత్త్వ
ములయందు నధిక సద్బోధ గావించి
నిరవుగాఁ దగ యమనియమాసనంబు
లరయఁ బ్రాణాయామ మరయక మఱియు
నమరఁ బ్రత్యాహారధ్యాన ధారణ స
మాధి కయోగమ్ములైన యష్టాంగ
మాదికముగ మించ నాత్మలోఁ దెలిసి
గమకమై నాభిదగ్గఱ నున్న పాము
కరముప్ప బోధించి కమలమ్ము లాఱు
విరచితంబైయున్న విధములు దెలిసి
వెరసి డెబ్బది రెండు వేల నాళములు
నరయఁ, నావేళల నదిమి పట్టుచును
బలిమిమై నడుకొన్న పశ్చిమనాడి
సొరిది పొల్లనై గాలి జొనుపంగఁ జేసి
యరసి యా సోమార్కులను గూర్చిపట్టి
చిరసుధారస వార్ధి వాలలాడుచును
గఱకంఠుఁ గాంచి యక్కడ దృష్టి నిలిపి
యా నిరంజనుతోడ నాత్మను గూర్చి
తాను నేననువార్త తలఁపున లేక
యున్న పుణ్యుఁడు శివయోగి యౌఁగాక
యిన్నియు నెఱుఁగ నా యిందుశేఖరుఁడు
వలను మీఱఁగఁ దిరువాదయూరికిని

దెలియంగ జ్ఞానోపదేశమ్ముఁ జేసి
జగతి మాణిక్యవాచకుఁడను నామ
మొగణితమ్ముగఁ బెట్టి యతని మన్నించి
తప్పక శిష్య సంతతులతోఁగూడి
యప్పు డదృశ్యుఁడై యరిగె నాస్వామి
గడిమించి మాణిక్యవాచకుండపుడు
ఒడిబడి పడి శివభ్రాంతత్వ మూని
గరిమతోఁ దిరువాచకంబను కావ్య
మిరవందగాఁ జెప్పె నెల్లరుఁ బొగడఁ
గోరి యా హయములఁ గొంచు రమ్మంచు
నా రాజు నిచ్చిన యట్టిధనమ్ము
గుడి గోపురమ్ములకును దైవములకు
నడరంగ నా మహేశార్చనమ్ములకు
మఱిఁ గల్గు దానధర్మంబుల కెల్ల
నిరవైన యా ధనంబెల్లను నొసఁగి
తిరముగా నా యుపదేశించినట్టి
గురువును భావింపఁగొని యుండఁ గాన
లేక నా గురువున్నలికుచ వృక్షమ్ము
ప్రాకటమ్ముగఁ జేరి పరమహర్షమున
నా యూర నా గుడి నా పాండ్యమునను
నా మహాదేవుని నరసి సన్నుతులు
చేయుచు వెదకుచుఁ జింతింపుచుండ
నా యొక్క సుజ్ఞాన మధికమై మించె
నంత నా పాండీని కందున్న మంత్రు
లెంతయు వేగంబ యేతెంచి నిలిచి
యా రాజ తిరువాదయూర దేవుండు
మీ రర్థమిచ్చి పంపినఁ బోయి యతఁడు
గుఱ్ఱాల గొనక పేర్కొని శివభారి
వెల్లియై గుళ్ళకు వెదఁ జల్లె ననిన
నావార్త విని రాజు నత్యుగ్రకోప
మావహింపఁగ నప్పుడాక్షణమ్మునను
వడిఁ డిగమ్ముల వారి రావించి
యడుగక తిరువాదయూర దేవునికి

ఘోటకమ్ముల వేగఁ గొంచు రమ్మంచు
మాటిమాటికిఁ దిరువు మఱి మీర లుండి
యాతని గుఱ్ఱాల నడరి తోడ్తెండు
నా తాపునకుఁ బొందు నతివేగ రండు
నని నిరూపం బిచ్చె నంత నయ్యెడను
జని వార లందఱా సచివునిఁ జూచి
చేరి దగ్గఱ వచ్చి శీఘ్రమ్ము గాఁగ
నా రాయసం బప్పు డతని ముందరను
బెట్టిన నాతఁడు పేర్కొని చదివి
నెట్టన నేను పాండీని ప్రధాని
నంచును మదిలోన నప్పుడు దెలిసి
యంచితమ్ముగ ద్రవ్య మధికమ్ము గాఁగ
గొంచు గుఱ్ఱమ్ములు గొనితెమ్మటంచు
బంచడె నన్ను నాపార్థివేశ్వరుఁడు
హయములఁ గొననైతి నాధనం బెల్ల
వ్యయమాయె గుళ్లకు, రాజద్రోహమ్ము
పాటించె నాకు నీభ్రాంతిఁ బుట్టించు
జూటేందుధరునిఁ ద్రిశూలహస్తకుని
గ్రోడమ్ముకై చెంచురూపైన వాని
నోడక యాటవికోచ్ఛిష్టభుజుని
గాలకూటాహారుఁ గడు నమంగళ్య
శీలునిఁ బితృధరాసీనుఁడైనట్టి
భూతేశు పాలికిఁ బోయి విన్నపము
నే జూడు నంచు నాశ్రీకంఠుఁ గూర్చి
వరుస నామాణిక్యవాచకుం డపుడు
నురుపడి నాయూరి యొడయారిఁ జేరి
కోరి యాస్వామిఁ బేర్కొని విన్నవించి
యోరాజశేఖర ! యొకవిన్నపమ్ము
మా రాజు పాండ్యభూమండలేశ్వరుఁడు
కోరి ధనం బిచ్చి గుఱ్ఱాలఁ గొంచు
నతివేగ రమ్మంచు నంపె నన్నపుడు
నతఁడు నిరూపమ్ము నంపె నాకిపుడు
నరసి మాహేశ్వరార్చనలకు గుళ్ల

కరుదారగా నిచ్చి యాధనం బెల్ల
గుఱ్ఱాల నొకటైనఁ గొన్నది లేదు
నట్టాడుచున్నారు నటు రాజభటులు
నిందు కుపాయమ్ము లేమైనఁ జేసి
యందమై నను గావు మాపదుద్ధార !
యని సన్నుతులు సేయ నచ్చోటికపుడు
వినువీథి శ్రీచొక్కవిభుఁడు విచ్చేసి
యాకాశవాణిగా ననువందఁ జేరి
నీకేల వెరవ మాణిక్యవాచకుఁడ !
దండిగా హయములఁ దగఁ దెత్తు ననుచు
పాండీని కిఁప్రొద్దె పత్రికలంపు
వాయుజవమ్ముల వాజు లెన్నేని
నీయాత్మ మెచ్చంగ నెమ్మిఁ దెప్పింతు
నని యానతిచ్చిన నావాదయూరుఁ
డనఘుఁడు మదిలోన నానంద మంది
చయ్యన నప్పుడా సచివాగ్రగణ్యుఁ
డయ్యెడఁ బాండీని కటఁ గమ్మ్రవానై
లాయమ్ము లెల్ల వాలాయమ్ముగాను
నారొడఁ గట్టింపు డాయతమ్ముగను
గోరిన యట్టి యాఘోటకమ్ములను
భోరునఁ గొనితెత్తుఁ బొండు మీరనుచు
భోరిపొరి నూడిగంబుల వారి ననిపి
పురగ నాస్వామిదే భారమ్మనుచు
నెమ్మి నాగుళ్లలో నిద్రింపుచున్న
నమ్మథురేశ్వరుం డతని స్వప్నమున
నీమనోజయముగా నెమ్మి గుఱ్ఱముల
గొంచువచ్చెదము నీకోర్కె లింపెసఁగ
గొంచ కీవటు వేగఁ గొమరొప్పఁ బోయి
పడిమించి యశ్వముల్ వచ్చె నటంచు
బుడమీశునకుఁ జెప్పి పొసఁగ నందుండు
మని, యానతిచ్చిన నంత మేల్కాంచి
పనిఁ బూని యాస్వామిఁ బ్రస్తుతుల్ జేసి
యారాజు పాలికి నాలిరుఖాద

యారదేవుఁడు వోయి యోరాజ ! వాజు
లెన్నంగ నిటువచ్చు నెల్లి నేఁడనుచు
విన్నవించినఁ బాండ్యవిభుఁడు శోభిల్లి
గుఱుతుగా నీవన్ని గుణాలఁ గొంటి
వరసి చెప్పుమటన్న వసుధేశు కనియె
వలసిన వన్నియు వచ్చుచున్నవియు
నలరంగ జనులెల్ల నాశ్చర్య మంద
నని విన్నవించిన నారాజు మెచ్చి
ఘనమైన యుడుగరల్ కట్టంగ నిచ్చి
యంపె నాతని యింటి కతివేడ్కతోడ
నంపిన నతఁడును నాచొక్కనాథు
గుడికి నేకాంతమై కోరిక లెసఁగ
వడిఁబోయి యప్పుడా స్వామి నర్చించి
శివశివ ! యోసదాశివ ! శివాత్మేశ
శివ గౌరిహృత్పద్మ చిరతరసద్మ
హరహర నరహరి హరిగర్వహరణ
హరిణాంక హరిదశ్వ యనలత్రినేత్ర
యాలోకరక్షణార్థై యొకగ్రుక్క
హాలాహలము గొన్న హాలాస్య చొక్క !
కము దక్షయాగరక్షకులెల్ల గ్రుక్క
నపరంగ మోదిన యట్టాలచొక్క !
లోకముల్ నీడొక్కలోఁగొన్న చొక్క !
నాకంజజనితాదు లరయ నీయిక్క
కానలేనట్టి వైఖానసది చొక్క !
యా నీకపనమధురళగిరిచొక్క !
నావిన్నపంబెక్క నా మాటదక్క
భావించి కృపదక్క పలియుంజిచొక్క !
పాండ్యరాజిచ్చిన పసదనంబెల్ల
కొంకని శివభక్తకోటి కిచ్చితిని
వోస్వామి నాచేత నొకకాసులేదు
నీసొంత మికనన్ను నీళ్ల ముంచినను
పాల ముంచినమునుపుఁ బ్రమథాధినాథ
హాలాస్యపురనాథ ! యాలస్యమేల

మీ రానతిచ్చి నేమించిన కతన
నా రాజునకు నేను నందఱు వినఁగ
హయములు వచ్చెనటంచుఁ బల్కితిని
ప్రియమంది యతఁడును బ్రీతి నన్ననిచె
నీకడ నశ్వమ్ము లిటు రాకయున్న
వేయేలఁ బ్రాణముల్ విడుతు నీయాన
యనుచుఁ జింతింపుచు నభినుతుల్ సేయ
వినువీథి వాణియై విశ్వేశ్వరుండు
భయమేల నీకు నో బ్రాహ్మణవర్య !
హయముల నిటఁ దెత్తు నటవేఁగఁ బొమ్ము.
అనియానతిచ్చిన నావాదయూరుఁ
డెనయంగఁ దనయింటి కేతేర నవుడు
నతనిబంధువ్రాత మంత నేతెంచి
మతి మించి ధనమెల్ల మాయమున్ జేసి
భయపడి పాండీని పాలికి వచ్చి
హయములు వచ్చునటంచుఁ బల్కితివి
యిందు కుపాయమ్ము నేమి జేసెదవు
పొందుగా మాకు నిప్పుడు సెప్పుమనిన
ధీరుఁడై వారితోఁ దిరువాదయూరుఁ
డీరీతి నిట్లు మీరేల నన్నడుగ !
నాపాలి శ్రీచొక్కనాథుండు వచ్చి
చేపట్టి నన్ను రక్షించు నేఁ డనకు
దాసుండుగాఁ జేసి తగ నశ్వములకు
జేసు నింకొక వగ సిద్ధమ్ము గాఁగ
నని న వారందఱు నౌఁగాక యనుచుఁ
జనిరంతఁ దమనివాసములకు నంత
నాఁడు నామఱునాఁడు నాఁజాజ్ఞ ఘనుఁడు
గూడిగమ్ములవారు కోలి నేతెంచి
హయములు వచ్చెనో యంచు మీకడకు
రయముతో మమ్ముంపె రాజు నిచ్చటికి
తురగమ్ములెవ్వి ? యిందుకు విధంబేది
నేటికిఁ జెప్పవలెను మాణిక్యవాచకుఁడ !
అన విని వారితో నామంత్రి పలుకు

చనుఁడు వేగిర మేలఁ జయ్యన మీరు
కరమొప్పఁ బురము శృంగారింపుఁ డెల్ల
తురగమ్ములిందుఁ బొందుగ వచ్చెననుచు
వారి నంపిన వారువచ్చి యారాజుఁ
జేరి విన్నపములు జేసి రారీతి
విని యప్పు డాపాండ్యవిభుఁ డతివేడ్క
ఘనముగాఁ బురము శృంగారింపఁ జేసి
వాటిపై లాయముల్ వరుసఁ గట్టించి
ఘోటకమ్ముల రాకఁ గోరుచుండె
నర్మ్యాడ దివసత్రయమ్ము నచ్చటికి
నెయ్యమ్ముతో రాక నిలిచె నశ్వములు
నిదియు నేఁబదియాఱు నిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి
హృదయమ్ము లలరంగ నీశీల విన్న
సదమలాచార సత్సంతతుల్ గలిగి
శివయోగముల సదాశివుని సత్కృపను
ప్రవిమలకైలాసపదవి నందెదరు
ననిన నమ్మునులెల్ల నత్యంతమోద
మున బొంది కలశజన్ముని బ్రస్తుతించి
యొయ్యనఁ దిరువాదయూరుఁ డేరీతి
నయ్యశ్వములఁ దెచ్చి యిచ్చె రాజునకు
హాలాస్యనాయకుం డతని నేరీతిఁ
జాలించెఁ జెప్పవే! పరమాత్మ! యనిన—

ఇది సర్వఘనసత్కవీంద్రపాదాబ్జ
విదితపూజామోదవిమలుండు పచ్చ
కప్పురసౌరభ్యకలితమానాంక
తిప్పరాజసుపుత్ర తిరువేంగళేంద్ర
విరచితమ్ముగ లోకవిఖ్యాతమైన
సరసలక్షణకావ్య సత్కవీంద్రాభి
నందిత శ్రీచొక్కనాథచరిత్ర
మందున నిది యష్టమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ

## నవమాశ్వాసము

### ఏబదియేడవ లీల.

అంత నాపాండీడు మర్యాద బుద్ధి
మంతులైన పురాణమంత్రుల కనిరాఁ
దిరువాదయూరుఁ జేరెంచి మాతోడ
ధరణీశ ! రేపు మధ్యాహ్నంబులోన
ఇత్తాయిత్తమ్ముగా సైంధవ జాతు
లుత్తమాశ్వమ్ము లత్యున్నతి వచ్చుఁ
బురమార్గములును గోపురము మేడలును
దిరువాలవాయిని దేవాలయమ్ము
లాయమ్ములెల్ల వాలయమ్ముగాను
సేయ నలంకృతుల్ శృంగారముగను
చని మూఁడు దివసమ్ములయ్యె నేఁటికిని
ఘనతరాశ్వములు రాఁగాన మేమియును
మితి బెట్టె ననుచు నమ్మితిమి వీఁడిట్లు
హితశత్రువై యుండు టెఱుఁగలేమైతి
మిందుకు వెరవేది యెఱిఁగింపుఁడనిన
నందలి సచివు లిట్లనిరి భూపాల !
కన్న కార్యము మాకుఁ గలిగినయట్లు
విన్నవింపక యుంట విహితమ్ము గాదు
నతఁడు శివభ్రాంతుఁడై యర్థ మెల్ల
సతతంబు జంగమార్చనలకుఁ బెట్టి
దొరకొని తిరువందమూరు నన్నట్టి
పురమునఁ గనకగోపురమంటపములు
నాకారమైనట్టి ప్రాకారములు న
సాకారమైన యుత్సవ విగ్రహములు
నాలయంబైన దేవాలయం బచట
బాలేందుధరునకుఁ బరఁగఁ గట్టించి
తెరువుల సత్రమతిథులకు నిడుచు
మరులుగొన్నట్లు ధర్మములు సేయుచును
నర్థమంతయుఁ గొంచు నరిగి యీరీతి
వ్యర్థమ్ముగాఁ జాల వెచ్చి యున్నాఁడు
కట్టి తెప్పించి నిర్భరముగా దా...

పెట్టి ద్రవ్యమ్ముఁ దెప్పింపఁ గావలయు
ననినఁ జింతాక్రాంతుఁడై యున్నరనుచు
జననాథుఁ డపుడు రోషస్వాంతమునను
వేత్రహస్తులఁ బిల్చి వే చని వాని
గాత్రమ్ముపై దొడ్డగడ్డ పెట్టెత్తి
యిప్పుడు ధనమెల్ల నీక్షణమ్మునను
దెప్పించుఁడని రాజు తెలుఁగొప్పఁ బనిచె
వారు నచ్చటికిని వడిఁ బోవ నతఁడు
ధీరుఁడై యావేళఁ దిరువాదయూరుఁ
డచలిత హృదయుఁడై యతిభక్తి తోడ
నచలజామాతురు నాత్మలో నిలిపి
పరతత్త్వ బోధలు పఠియింపుచుండెఁ
దరువుల కాండ్లును దగ నూరకున్న
మఱియుఁ గొందఱు ధుర్య మానసులైన
పరిచారకులఁ బంచి పట్టి తెప్పించి
యా వాని తిరువాదయామాత్యవరుని
భూమీశ్వరుండు విస్ఫుట రోషమునను
హయములఁ దెమ్మంచు నర్థ మిచ్చినను
భయము లేకింతయు బాఱంగవైచి
పెడ వేషధారియై వీడిందు వచ్చి
జడియక నుండు నీచందమ్ము లెల్లు
వీనిని గొంపోయి పెస నడ్డ పెట్టి
తాను గొంపోయిన ధనమెల్ల నిపుడె
కొనితేక యున్న మీకును నాజ్ఞ వచ్చు
నని చారులకు వాని నప్పగించినను
వారలు మిగుల దుర్వారులై యతనిఁ,
గ్రూరతఁ బట్టీడ్చికొనిపోయి యపుడు
కారాగృహమ్ముల ఘనశృంఖలముల
ఘోరమ్ముగాఁ బెట్టి గొబ్బున మాకు
దగఁ జెప్పు ధనము శేషమైన ననుచుఁ
దగ బాధసేయ నంతకు శౌర్యలేక
హా చొక్కనాయక ! [illegible] !
హా చిన్మయానంద ! [illegible] !

యార్తరక్షణశరాయణుఁడ వీవనుచుఁ
గీర్తింతు రెవ్వరుఁ గృపగల్గు దేవ !
మాధుర్యపురనాథ ! మఱి యిట్లు నన్ను
బాధలు సేయంగఁ బాడియే నీకు
రాజశేఖర ! పాండ్యరాజశేఖరుకుఁ
దేజీల నిప్పుడు దెచ్చి యీకున్న
వేయేల ప్రాణమ్ము విడుచుట కాని
పాయ దీ కథ యేయుపాయమ్ములందు
ననుచు దుఃఖింపుచు నాస్వామి దూఱు
చును స్తోత్రములు సేయుచును నుండె నంత
మఱియంబి చొక్కఁడాపత్సహాయుండు
నళగరి చొక్కఁడు నాత్మ బాంధవుఁడు
దనభక్తుఁ డిట్లు వేదనల నందుటకు
మనమునఁ జింతించి మాయాస్వరూపి
యారాజ్యమునఁ గల యఖిలవర్ణముల
ఘోరవమ్ములను రప్పించి వేర్వేఱ
సారంగుఁ డళగఁడు జన్నఁడు గరుడ
నీలుండు గురువింజనీలుండు కెంచ ?
నీలుండు మొదలైన నిఖిలవర్ణముల
రంగైనయట్టి తురంగమ్ములకును
బంగారుటుందెలు పాదాలు నపుర
పళ్లాలు సుల్లాలుఁ బసిఁడిపక్కెరలు
కళ్లాల గబ్బీలు గద్దెపక్కెరలు
బల్లాలు కోరలు పలు నత్తడములు
చిల్లాణములు కొల్కి చికిలిచక్రములు
జల్లులు కుంచెలు సవరముల్ మఱియు
నెల్ల సంజోకమ్ము లెల్లఁ గల్పించి
యత్తురంగములకు నమరుచు నమర
నుత్తమంబైన రావుత్తులఁ జేసి
తలను సుళ్లఁవుఁజుట్లు దగ రుమాలములు
మొలమీఁదఁ జల్లడమ్ములు దట్టిజోళ్లు
వజ్రాంగిజోళ్లను వడి రాగవళ్ల
విజృంభణమ్ముగా వేడ్క నాహయము

లెక్క యాడుచు వార లెసఁగ నేతేఱఁ
జొక్కనాథుఁడు తాను జొక్కమైనట్టి
యాయతమ్ముగను జిత్రాయితంబైన
హయాతురంగమ్ము మహిమతో నెక్కి
రమణతో నుభయపార్శ్వమ్ముల బలిసి
యమరులు రాహుత్తులై కొల్చి రాఁగ
మధురాపురమ్ము నామడ మేరనంగ
విధుజాటుఁ దచ్చోట విడిసెఁ బాళెమ్ము
నప్పు డాతురగరింఖాదివ్యధూళి
కప్పి నల్దిశ లంధకారమ్ము పర్వె
నది గని భూపాలుఁ డారయోద్ధ్రుజల
కదె ధూళి యొగసె వాహములదే వచ్చు
చున్నవి యని చూచున్న నాలోన
సన్నమై రేణువు సమసె నత్తఱిని
నీ విధమ్ములు వాని యింద్రజాలముల
భావమ్ముగాని స్వభావమ్ముగాదు
ననుచును గుటిలుఁడై యా రాజు తీవ్ర
మనుజులఁ బిల్చి యా మాణిక్యవాచ
మంత్రిని వీఁపుచర్మము వీడునట్లు
తింత్రిణీ లతల మర్దింపుడీ ! యనుచుఁ
బనిచిన వేవేగఁ బటుగతి తోడ
చని వార లటు నేయఁ జాలినఁ జూచి
యా తిరువాదవూరుండు నత్యంత
భీతితో నాస్వామిఁ బేర్కొని యిట్లు
జేసితే సర్వేశ ! శివలోకవాస !
యాశాంబరోల్లాస ! యధికప్రకాశ !
ఘోటకమ్ములఁ దెచ్చి కువలయేంద్రునకుఁ
బాటించి యిచ్చి నాపాటు బోఁజేయు
మని విన్నవింపుచు హాలాస్యవిభుని
దనమదిఁ దలఁపుచు దైవమా యనిన
నాలించి యధికదయాళుఁడై యపుడు
లక్షోపలక్షలై లక్షణాశ్వములు
హేషారవమ్ముల కేడువారిధులు

ఘోషింప సకలదిక్కులు బిక్కటిలఁగఁ
బంచమహావాద్యపటలముల్ మ్రోయఁ
బంచాస్యుఁ డధికప్రపంచమ్ముతోడ
పంచాస్త్రపంచాస్య ప్రకటవిరించి
పంచాస్యహరణ ప్రభావమై బిరుదు
వినుత కాహళములు వినువీధి మ్రోయఁ
బ్రజలకుఁ గన్నులపండువై యుండ
నజుఁడును హరి యుత్తమాశ్వముల్ వేడ్క
నెక్కియాడుచు స్వామి కిఱుపార్శ్వములను
ప్రక్కరావుతులై ప్రబలి యేతేఱ
నత్తళమ్ములు ద్రిప్పు చమరరావుతులు
కత్తులు విసరుచు ఘనతురంగములఁ
బరిపరిగతులను బహువిధమ్ములను
మెఱసి తొక్కుచుఁ జుట్టు మేళంబు లిడుచుఁ
దను గొల్చి రాఁగ సౌందర్యనాయకుఁడు
కను గొన్న సతులకుఁ గాంతులు వొడమఁ
బురమువారెల్ల నద్భుతముగాఁ జూడ
ధరణీశ్వరుండు నా దండనాయకులు
విశ్రాంతి గొనునట్లు విలసితభ్రాంత
మశ్రాంతగతులుగా నతివేడ్క నుత్త
మాశ్వమెక్కాడుచు మఱి పాండ్యమండ
లేశ్వరు నగరికి నేతేఱ నపుడు
పుడమీశుఁ డతిమోదమునఁ బొంది వేడ్క
వడిమీఱ మాణిక్యవాచకామాత్యుఁ
బిలిపించినను నతిప్రేమతో నతఁడు
నిలచేని కడకును నేతెంచి చాల
నమితుఁడై శ్రీచొక్కనాథుని కృపను
గములుగా నిటె తురంగము లిటవచ్చె
జననాథ యొకపూట సైరింప కింత
పనికిగా నన్నిట్లు పలిచితే! యనిన
నృపుఁడు గౌఁగిటఁజేర్చి నేఁడు నాయందు
నపరాధ మెంతైన నధికమ్ము గలదు
వోర్చికొమ్మనుచును నుచితవస్తువుల

నేర్చి యాతనికిని నిచ్చిన నతఁడు
వెలయఁగా వాకిఁటు విచ్చేసి పెద్ద
కొలువు చావిడిలోనఁ గూర్చుండి ఘోట
కముల నెక్కుడు జూచి కైకొనుండనిన
రమణ భూపతి హజారమున కేతెంచి
మండలాధీశులు మన్నీలు దొరలు
దండనాయకులు నందఱును సేవింపఁ
బేరోలగంబుండి పృథివీశ్వరుండు
వారలందఱు సైంధవవ్రాతములను
నెక్కి యాడుచు వేడ్క నెల్లరావుతులు
నొక్కరూపమ్మునై యుండుటజూచి
యెక్కుడు మీలోన నెవ్వరిందనినఁ
జొక్కనాథుని దెసఁ జూపి రందఱును
నప్పు డాసౌందర్యుఁ డవధారుఁ డనుచు
నొప్పుగా నందఱు నోహో యనంగ
గోరాజగమనుఁ డాగోమాయ హయము
నారోహణావరోహణరోహియగుచు
నెన్నేని విధముల నెన్నేనిగతుల
వరుసతో దుత రాగ తాగెలయందు
మఱి కశాఘాతభూమానమ్ము వాహ
నక్రియాత్మారక్షణలఁ బరాపేత
నిక్రియఁ దురగమ్ము నెక్కుడుగాఁగ
నష్టావధానమ్ము నంది యొక్కెడ
స్రష్టయు హరియు నాశ్చర్యమ్మునందఁ
జూచి యాపాండీశు చోద్యమ్ము నొంది
యహా చొక్కనాథుఁడేయని చాల మెచ్చె
నప్పుడు పశుపతి హయము పైనుండి
చెప్పెద విను రాజశేఖర మున్ను
తిరువాదయూరుండు దెచ్చిన ధనము
తురగమ్ములకు గాను దొలుత నే మాకు
నిచ్చినఁ గైకొంటి నిదె ఘోటకములు
వచ్చె నేర్పున గొను వసుధేశ ! యనిన
సౌందర్యపతికి నాజనపతి యపుడు

నిందు లక్షణముల నెఱిఁగింపుఁ డనిన
వినుము పూర్వమ్మున వేదంబు లందు
వనధుల నమృతంబు వహ్ను లయందు
బ్రహ్మాండమునను దిక్పాలకులందు
బ్రహ్మనేత్రమ్ములఁ బ్రభవించె మఱియు
నారట్టి రింఖాణ యవనకంఖాణ
వారాశి కాంభోజ బాహ్లీకదేశ
ములఁ బుట్టు నుత్తమంబులు వానిలోన
వెలయు బ్రహ్మక్షత్రవిట్ఛూద్రజాతు
లందులో రాజవాహము లుత్తమములు
నందు దివాజాత మర్హమ్ముగాదు
నరయ దేవమణికంఠాభరణమ్ము
మఱి ఘానికము నుడి మస్తకసమము
ఖడములు నాలుగు ఫాలస్థలమ్ము
విదితభావశ్యమై వెలసినయట్టి
పంచకల్యాణు లీ భాతిఁ జెన్నొందు
నంచితమ్ముగ గాత్రులందును మిగుల
శుభలక్షణమ్ముల నుడినుద్ధములను
బ్రభవించు హయములు ప్రభువు లెక్కినను
నఖిలసంపదలను ననుకూలమగును
నిఖిలశాత్రవులను నిర్జించు మఱియు
శుక్లైడ నుడి గల్గు పాదమ్ము తీసి
కట్టు శోకావర్త కంఠనాశముల
వెన్ను నాదలఁ బొల్లు విసపాది శృంగి
నైన్న బూడిద ముక్కు నేకమస్తకము
మఱియుఁ బిండావర్త మస్తకహీన
మరయ నీకొదలైన యశుభలక్షణము
లీయశ్వముల నెవ్వరేని నెక్కినను
శ్రీయు నాయువు వారిఁ జెందఁగానోడు
నని మఱియును గల్గు నశ్వలక్షణము
లనువందఁగా వారి కానతి యిచ్చి
రా రాజశేఖర ! యుత్తమంబైన
వారువంబుల యిష్ట వచ్చినవెల్ల

నలయక శత్రుసేనాసమూహంబుల
కలగుండు వడసేయఁగల్లు గుండ్లధిప
సప్తవారాసుల సప్త శైలముల
సప్తాశ్వరథసక్త సప్తాశ్వములను
గడవఁగాఁ జాలు నీకడ గుఱ్ఱములకుఁ
బుడమీశ ! వినుము యిప్పుడ చెప్పవలయు
విదితమ్ముగా వీని విలువ లెట్లనిన
మొదలి తరంబెల్ల ముప్పదివేలు
నడితరంబెల్లను నాలుగువేలు
కడతరం బొకవేయి కంఖాణములకు
నీరీతి వెలనిశ్చయించి యావాద
యూరుఁ డిచ్చిన మేము నొప్పి వచ్చితిమి
మనుజేశ ! యిటు నాగె మాఱుచుకొన్న
వెనుక నా గాదన్న విహితమ్ముగాదు
ఇప్పు డీగతి మీకు హితమాయె నేని
యొప్పుకొమ్మన్న నాయుర్వీశుఁ డనియెం
సమ్మతించితిమి నిచ్చటు నాగెమార్చి
యిమ్మన్న మమ్మాటి కిచ్చిన యర్థ
రాశి మాయది యశ్వరత్నముల్ మీవి
యీసభవారెల్ల నెఱుఁగఁ జెప్పితిమి
తుదొకమనులకు నేనున్నవాఁడ
నాడయూరుఁడు నెందువాఁడును గాఁడు
శ్రావణమాలనత్రతమ్మునందు
భావించి సకలభూమతు లెల్లవినఁగ
నని నాగెమాటిచ్చి యారాజు చేతి
కిని యిచ్చె దేభుఁడా కృత్రిమాశ్వముల
నప్పు డాపాండీంద్రుఁ డఖిలకట్నములు
చెప్పించి యిచ్చిన ధీరుఁడై మాయము
మైనుండి చండ నాఁ బరగు బెత్తమునఁ
డా నందుకొనిన నాతనిఁ జూచి నృపుడు
కనలిన నది దేశకట్టుడ యనుచు
వినిపించి తెన్నవ విప్రవర్యుండు
తటుకున శివునిపాదము బట్టుకొనిన

నిటలాక్షుఁ డపుడు మాణిక్యవాచకుని
మన్నించి తనదివ్యమకుటమ్మునందుఁ
గ్రొన్నెలచేని వైకొనఁ జుట్టుకొనియెఁ
దనభక్తునికిఁగాను దగు భైరవములఁ
గొనివచ్చి గంధర్వఘోటకజాతు
లుగఁ జేసి భూమిపాలున కొప్పగించి
నగజేశుఁ డరిగెను నగుచు నయ్యెడను
హరివిరించీంద్రాదులైన దేవతల
సరవి నంపిన నమస్కారముల్ జేసి
చనుచుండి వారలీ సౌందరేశ్వరుఁడు
తనదాసులకును నింతప్రయాసపడునె
యని సన్నుతింపుచు నాత్మ మెచ్చుచును
జనిరి వారలు తదాశ్రమముల కంత
నంగయకన్నమ్మ కాలీలఁ జెప్పి
పొంగి నవ్వుచునుండె భూతేశ్వరుండు
నారొండఁ బాండ్రీంద్రుఁ డతిమోదమునను
లాయముల్ నిండఁ జాలఁగఁ గట్టుఁడనిన
వారుపమ్ముల నెల్ల వశస సాహిణుల
వారు గట్టిరి వేగె వన్నెలేర్పడుచి
యారాజు హర్షించి యలరంగ వాద
యూరున కధికమ్ము లుడుగర లిచ్చి
యతని మందిరమున కనిచి యాపాండ్య
పతి కొల్వువిరిసి లోపలికి విచ్చేసెఁ
దెన్నవరాయఁడా త్రిభువనాధిపుని
సన్నిధి కేతెంచి సంస్తుతుల్ జేసి
సామగానప్రియ ! సామజవరద !
సామజరక్షణార్చిత పాదపీఠ
సామజముఖజనక సామజశిక్ష
సామవేదస్తుత్య స్వామి సర్వేశ
మాయాశ్వములఁదెచ్చి మహిపతి కిచ్చి
తే యంచు మలహరు దీక్షితకృపను .
దనమందిరమునకుఁ దడయక నరిగి
వినుతింపఁబడిరా నా విప్రవర్యుండు

మునులార ! శ్రావణమూల నక్షత్ర
మునఁ బ్రతివత్సరంబును నశ్వములను
వాగెమాఱుచు లీల వరుస నిప్పుడును
సాగుచునుండును సౌందర్య పురిని
నిదియు నేఁబదియేడు నిటుమీది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి
వాతాపిదమనుఁ డా వరమునీంద్రులకు
ప్రీతితో నిట్లనె భూతేశు మహిమ

ఏఁబదియెనిమిదవ లీల.

నంత నాపాండ్యరాజ్యాఖిలేశ్వరుఁడు
సంతోషచిత్తుఁడై సౌందర్యనాథు
కరుణను వాయువేగము లైనయట్టి
తురగమ్ము లెన్నని దొరికెఁ బొమ్మనుచు
గట్టియౌ కవణముల్ కట్టడచేసి
దొడ్డుగా నామృగధూర్తుల కెల్లఁ
బెట్టించినను నవి బెదరి యేమియును
ముట్టక మోఱుమోములు చూచుచుండె
నా పాండ్యభూపాలుఁ డట విచారించి
ద్వీపాంతరమ్ముల తేజీలు నివియు
మేఁటి మాంసమ్ముల మెసవుటఁ గాని
పాటించి తృణములు భక్షింప వనుచు
వేఁటలఁ దెప్పించి వేగఁ దోపించి
ఘోటకమ్ముల కెల్లఁ గోసి వేయించె
నవి తమజాతి యాహారమ్ము లగుటఁ
దివిరి మాంసమ్ములు దినుచుండె నంత
నటు మూఁడుదినములు నరిగిన పిదప
నిఖిలాత్ముఁ డాయశ్వనికరమ్ము లెల్ల
మునుపటి జంబుకంబుల లీలఁ జేసి
జనులకు మిగుల నాశ్చర్యమ్ము నేయ
వలెనని కృత్రిమాశ్వమ్ముల నెల్ల
వలఁచెను నిజరూపధారులు గాఁగ,
నప్పుడు లాయమ్ములందున నెల్ల
నొప్పుగా నున్నట్టి యుత్తమాశ్వములు

నొకనాఁడు మదిని నన్యోన్యభాషణల
మొక మొకమ్ములు జూచి ముచ్చట నొంది
వనముల లోపల వలసినయట్లు
మనయిచ్చ నెల్లఁ గ్రుమ్మఱుచున్న మనకుఁ
ద్రాళ్లచే వాళ్లచేఁ దలుగులచేతఁ
గాళ్లను మెడలను గట్టులఁ బడుచు
నీరాజునగరున నిన్నిభంగులను
ఘోరమ్ముగా మనకును నుండనేల
శిశు నాజ్ఞవలన వచ్చితి మిందు మూఁడు
దివసమ్ములుంటి మింతే చాలు మనకు
ననునంత సూర్యుఁడస్తాద్రికిఁ జనిరా
ఘనముగాఁ బర్వెఁ జీకట్లు నత్తఱిని
నడురేయి సాఱు లందఱును నిద్రింపఁ
దడయక మనకిది తరువాయి యిపుడు
పోదాము మనమన భూముల కనుచు
నా దేవనిర్మితంబైన యశ్వములు
నున్నతలీలఁ జెన్నొందు దేహములు
సన్నంపురూపులై సాగిన యంతఁ
గాళ్లను మెడలను గట్టినయట్టి
త్రాళ్లు నన్నియు వీడి తడయక నపుడు
నన్నియుఁ గూడుక నా లాయమునను
మున్నున్న హయపోతముల నెల్లఁ గఱచి
మొనసి యాసాఱుల ముక్కులుఁ జెవులు
గొఱిశలు మొదలంటఁ గొఱికి పైకుఱికి
రవములు నెలఁగ భైరవము లన్నియును
దివిరి లాయమ్ములు తెగువతో వెడలి
కన్నడి సన్నట్లు కాననమ్ములకు
నన్నియుఁ గూడఁ జయ్యన జాఱె నంత
నా రాత్రి వేఁగంగ నామఱునాఁడు
భీతులై డాఁగి తప్పించుకున్నట్టి
పాడివారల్ల కాపాడి యాఁదఱును
గూడుకవని రొక్క ఘోషమ్ముతోడ
నావసుధేశుని నటఁ గాంచి మ్రొక్కి

దేవ యీరాత్రిగాఁ దెచ్చి యీ వాద
గూరుండు మనకును నొప్పించినట్టి
గారువమ్ములు ఘోరవంబులై సగము
ప్రొద్దున నీరేయి పొసఁగ నన్నియును
బెద్దైన మేనులు పిన్నలు జేసి
కుడకాళ్ళ నున్నట్టి మేటిపగ్గములు
సడలించుకొనుచు విచ్చలవిడి తోఁడ
నట్టులెత్తుక రాఁగ నటుకని యేము
నొత్తొడి పంచల నొదిగితి మంత
గుత్తింపుఁ గొదమల గుములు కంఠములు
పత్తుగా గొంతికియు వడిఁ బాలె నంత
వెత్తు లెత్తినయట్లు వెదకి సాణులను
గొత్తైలఁ దిన్నట్లు కోలలఁ బెటికి
కుత్తులుగాఁ జెవుల్ ముక్కులు గొంతికి
బొత్తులు నిండంగ భూరిరక్తములు
జుత్తులు గొనుచును సోలి సొక్కుచును
గత్తునఁ ద్రేన్చుచుఁ గాఁద్రవ్వుచును
నెత్తుఁగాఁ జూచుచు నెవ్వరిఁగన్నఁ
జిత్తున గవయుచు జిమ్మి రేఁగుచును
గుత్తు మటంచును గునిసియాడుచును
నత్తునఁ గనలుచు నుతికి పైఁబడుచుఁ
జెత్తుదాఁటులు దాఁటి చేరి యాడుచును
జత్తున నయ్యశ్వశాలలు వెడలి
బెట్టుగా నూళలు వెట్టుచు నగరు
పట్టణమ్మును వెడలి పరువెత్తె నధిప !
యని కొల్చునందలు నటు విన్నవించి
నను రాజు మిగులఁ జింతాక్రాంతుఁడగుచు
దురదుర తురగమందిరమున కరిగి
పరికించి వెరగంది పరితాప మంది
కొలువుపావడికిఁ గ్రక్కున వెళ్లి వచ్చి
కొలుచుండి దొరల మంత్రివ్రాతములను
రప్పించి హరులు ఘోరవములై చనుట
చెప్పి యావిధమును నేయుటలెల్ల

వాదయమారుని మృషావాదముల్ గాక
నేదేశమునఁ గాన మీ యద్భుతములు
ననుచు వాదపురీశు నపుడు దూతలను
బనిచి యాక్షణమునఁ బట్టి తెప్పించి
దారుణాకృతితోడ ధారుణీశ్వరుఁడు
నోరి! యీరీతి నేయుట లెట్లు నీవు
నా దేశమునఁగల నక్కల నెల్ల
సాధులఁ జేసి యశ్వములంచుఁ దెచ్చి
యొడవానినో తెచ్చి రాకిమీడటంచు
నోడక మాచేత నుడుగరిప్పించి
తగ నింద్రజాలవిద్యలు పన్న నీకుఁ
దగునె మానగర నర్థముగొంచుఁ బోయి
మంత్రులందఱు నీక ? మంత్రముల్ జేసి
తంత్రముల్ బన్నంగఁదగునె నీకగునె
కలధనమ్మెల్ల నక్కలకుఁ బాలాయెఁ
దొంబుతను నున్నట్టితురగముల్ పోయెఁ
జాలు మాధనమెల్ల సరగ నిచ్చెదవు
బాధ నొందక కస్తిఁబడక వేవేగ
సాధువర్తన! నీసరి మంత్రులెదుర
మానమ్ము విడక సన్మానమ్ము చెడక
పూని మాధ ము నిక్కడఁ బెట్టు మనిన
వాదయమారుఁడు ప్రతివాదియై యేమి
పోదు నాకును హయంబులకును నీదు
ముందఱ గుఱ్ఱాల మొదలివర్తకులు
నందఱు నెఱుఁగఁగ నప్పగించితిని
వారి మాటిచి యిచ్చువారిచే ధనము
వేగంబె యీరీతి వేడుకొమ్మనిన
నా విభుండిట్లనె నతని మేమెఱుఁగ
మీవు మాహయముల నిచ్చుట తగవు
సభవారి నడుగుము జాడతోననఁ
బ్రభువన్నరీతిని బలికిరందఱును
దిరువాదయమారుఁ డింతియకాని యున్న
ధర యథా రాజా తథా ప్రజా యనమఁ

క్రొత్తటే యీమాట కొదలేదు మున్ను
చిత్తమ్ము కొలఁదికిఁ జేసుకొమ్మధిప
తలఁప రాజానుమతము ధర్మమింత
నిలఁ జొక్కనాథుండు నెఱిఁగిన దనినఁ
జొక్కనాథుఁడు నిన్ను గోరిదిగా నిట్లు
నక్కఁ జెమ్మనినాఁడొకో! వీనిఁ
గొనిపోయి మున్ను దాఁగొనిపోయినట్టి
ధనము దెమ్మనుచు బంధనముగాఁ జేసి
యడ్డపాతులఁ బెట్టి యందఱు గిట్టి
దొడ్డచట్టుగఁ బెట్టి త్రోచి పైఁబెట్టి
గ్రుడ్లు వెల్కుఱుకంగఁ బెద్దైనయట్టి
దుడ్లు పుచ్చక కొట్టి ద్రోహినిఁ బట్టి
కాళ్లచేతులు గట్టి ఘనముగాఁ గొట్టి
వ్రేళ్లను దగగిట్టి వెసఁ గట్టికొట్టి
సరగున ధన మవశ్యము దెమ్మటంచుఁ
దరువుకాండ్లకు నిరుత్తరవుగా నిచ్చె
వార లామాణిక్యవాచకుఁ బట్టి
యారీతిఁ గొనిపోయి యటు గస్తి సేయ
నాచొక్కనాథుని నపుడు మాణిక్య
వాచకుండు ననేకవరుస సన్నుతులు
నేయుచునుండె నిశ్చేష్టుఁడై యనిన
నాయగస్త్యునికి నిట్లనిరి యామునులు
శివభక్తులకుగాను శివుఁడు దానెట్లు
శివముల హయములఁ జేయుట లెట్లు
మునినాథ యాహయంబుల జంబుకముల
తనువుల నేయుటింతయు మహైశ్వర్య
మామహాదేవుని యానందలీల
వేమారు వినవిన వేడుకయ్యెడును
నావలి లీల మాకానతిమ్మనిన
భావించి యాకుంభభవుఁ డిట్లనియె
నిదియు నేఁబదియెన్మి దిటుమీఁదిలీల
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి
యిల్వలదమనుఁ డాయీశ్వరు మహిమ
బల్వగల నను జెప్ప భక్తితోఁదలఁచు

## ఏబది తొమ్మిదవ లీల.

ఒప్పుగాఁ దిరువాదయూరదేవుండు
నప్పరమేశ్వరు నాత్మ భావించి
హరహర జగదీశ యభవ భూతేశ !
గిరిశ మహేశ్వర గిరిజేశ యీశ !
శాంత శాశ్వత శివ స్థాణ్వగ్ని నేత్ర !
కంతుసంహారి భద్ర కాలాగ్నిరుద్ర
పశుపతి శర్వోగ్ర భర్గ ఫాలాక్ష !
శశిరాంగ భస్మాంగ శ్రీ సత్కృపాంగ !
కలకంఠ ధూర్జటి ఖట్వాంగపాణి !
పరశు త్రిశూలకపాలోరుహస్త !
హాలాస్యపురనాథ ! హా చొక్కనాథ !
యీలాగు నను సేయుటిది నీకుఁ దగునె
యని సన్నుతులు జేసి యాత్మఁ జింతింప
మనమునఁ గృపమీఱ మధురాపురీశుఁ
డా చొక్కనాథ మహాదేవుఁడపుడు
ప్రాచేతసునిఁ దలంపఁగ వచ్చి యతఁడు
నఁదండ సాష్టాంగ మతిభక్తిఁ జేసి
ముందఱ నిల్చి సమోదముతోడ
ఓంనమశ్శంకర ! యోంనమోస్తు !
పనియేమి నాస్వామి ! పనియేమి దేవ !
పనియేమి నీభృత్యు పని చాటు నన్ను
నని సన్నుతులు సేయ నాస్వామి యతని
కనువొంద నిట్లని యానతి యిచ్చె
వాదయూరుఁడు మాకు వలయు భక్తుండు
మేదినీశుఁడు వానిమీఁద నాగ్రహము
సేయుచుఁ గరము శిక్షింపుచున్నాఁడు
నాయుపద్రవము వాయఁగఁ జేయవలయు
వరుణ ! నీవతివేగ వర్షించి వైఖ
ధరఁ బొర్లి మధురపైఁ దగఁ బాఱఁజేయు
మనియానతీయ మహాప్రసాదమ్ము
ననుచు నావరుణుండు హరు నాజ్ఞఁ జేసి
గుఱియింప నావైఖ కూలముల్ ముంచి

పోరిఁబోరి యందందఁ బొరలి పొఱలఁగను
గట్టు కాలువలెల్ల గట్టిగాఁ ద్రెంచి
పట్టణమ్మొరసుక పారె నయ్యోడను
నావసుధేంద్రుండు నచ్చోటి కరిగి
వేవేగ మధురపై వెల్లి రాకుండ
నిల్లాదిగా నూర నెల్లరఁ దెచ్చి
కల్లోలబంధమ్ము గావింపుఁడనుచు
సేనాధిపతుల కాక్షితిపాలకుండు
నానతిచ్చిన వార లతిరయమ్మునను
బరిచారకులఁ బంపి పట్నమ్ములోనఁ
బరికించి యందఱఁ బట్టి తెప్పించి
పిన్నపెద్దాదిగాఁ బేర్కొని వచ్చి
మన్నగా నాకట్ట పంచి వైచినను
బిట్టవ్వ యనునొక్క పేదపెద్దమ్మ
పిట్టమ్మి తనపొట్ట పెంచుక నెలమి
నెడలేక నొడయలు నెందఱు నైనఁ
దడయక వచ్చినఁ దగఁబిట్టు వెట్టు
నట్టి పిట్టవ్వకు నట్టి యామైఖ
కట్టఁ బాల్పంచిన కట్ట లేకున్నఁ
బట్టి యామెను నీడ్చి పరిచారులెల్లఁ
జుట్టుక కట్టుమంచును బాధసేయ
నార్తరక్షణ పరాయణుఁడైన యాది
మూర్తియు నైనట్టి మూర్తిత్రయాత్ముఁ
డారయఁ జొక్కనాయకమహాదేవుఁ
డాయవ్వ తనమీఁద నతిభక్తి గాన
జడలెల్లఁ జుట్టుగా సవరించి కట్టి
పొడలవన్నెలదట్టి పొలుపుగాఁజుట్టి
తనచేతి మరతుకుద్దాలమ్ముగాఁగఁ
బునుక కప్పెర మంటిపుట్టిక గాఁగ
గావించి రా కూలికాని చందమునఁ
దా వచ్చి యామె ముందఱ నిల్చి పలికె
నే కూలికాఁడను నీవేమి కూలి
నాకుఁ బెట్టెదవన్న నగజేశుఁ జూచి

యిట్టి కోమలరూప మిట్టిసౌందర్య
మిట్టి నీవీ మన్ను నెట్లు మోసెదవు
నన్న నాపిట్టవ్వ కాస్వామి యనియె
మన్ను నీళ్లను మోసి మా తలచూడు
జడగట్టె నెప్పుడు సహజమ్ము మాకు
నొడలేదు మాటలకేమి యిచ్చెదవు
ననిన నాముద్ది ద్రవ్యములేదు నాకు
దినమును బిట్టమ్మి తిరిగెడుదానఁ
బిట్టు నీకును గూలిఁబెట్టెద గాని
గట్టి మన్నుగ మోచి కట్టుమా ! కట్ట
యనిన నాసర్వేశుఁడా చొక్కనాథు
మనసను నీమనసను నిమ్మహి నొక్కటౌను
పిట్టవ్వ యదినాకుఁ బెట్టుము చాలు
గట్టిపిట్టుగ నీవు కడుపారఁ బెట్టు
మనిన నాముద్దియు నట్లన నే ల
నీకును మనసారా నెంతయుఁ బిట్టు
గావించి పెట్టెద గాని నాపాలు
వేవేగ ముగియంగ వేసి రావలయు
నారాజు పరిచారు లందంద వచ్చి
కారాపులై నన్ను రాయిడించెదరు
ననుచు నప్పుడు నున్నయట్టి యాపిట్టు
తినుమని పెట్టినఁ దెమ్మని దట్టి
పొరలోనఁ బెట్టుకపోరాద ననుచుఁ
బొరిపొరి యాపిట్టు బొక్కలాడుచును
మెచ్చుచుఁ నాకట్టమీఁదికి వేగ
వచ్చి యందున్నట్టి వారలఁ బిలిచి
మంచి మేలైనట్టి మంచివారలకుఁ
బంచిపెట్టక తినఁ బాడిగాదనుచుఁ
బెద్దలు చెప్పంగఁ బ్రియముతో నెపుడు
వొద్ద నుం డేవిందు నొప్పుగా ననుచుఁ
బాటించి యాపిట్టు వారికిఁ బెట్టి
పాటలు పాడుచుఁ బనిసేయు వారి
నాటలాడింపుచు నాపిట్టు దినుచుఁ

దాఁటులు వేయుచుఁ దగ నుంతు నంత
నటు నధికమైన నాపాండ్యవిభుని
భటులు నేతెంచి నీ పనియేది చెపుమ !
యీలాగునను మన్ను నిటమోయకున్న
నేలాగు మూలాగు నెఱుఁగనే యన్న
ననిరొం నాసర్వేశుఁ డదిరొట్లు నేను
మునుకొని మన్నెల్ల మోసినవాఁడ
మఱి యెవ్వరైనను మన్ను మోయంగ
నెరవరి యెవ్వఁడు నేను గాకనిన
వారు నిజమని యవ్వలి కేగిరంత
నారీతి మఱియును నాటలాడుచును
దిరిగి పిట్టవ్వమందిరమున కరిగి
హరహరా యనుచును నచటఁ గూర్చుండి
మే నెల్ల భారమై మెడ ద్రిప్పరాదు
వానగాలనక నీవంతు మన్నెల్ల
మోసి కట్టితి నేనె మునసి యాకట్ట
నా నేయు పని చొక్కనాథుండె యెఱుఁగు
నాపాటు లిన్నియు నమ్మవై తేని
నోముద్ది వేవేగఁజూతు రావమ్మ
యని చెట్టఁ బట్టిన నాముద్ది నమ్మి
తనరంగ నాపాలిదైవమై వచ్చి
రాచసేవకులచే రారాపు లేక
నాచోటఁ గలిగితే నా తండ్రి యనుచు !
నపు డాయితంబైన యా పిట్టు వెట్టి
యిపుడు నింకొకపాటు నేగి యచ్చోట
గట్టిగాఁ గట్టుమీ కడఁకతో ననిన
నట్టె చేసెద నంచు నాపిట్టు గొనుచు
భక్షింపుచును వేడ్కఁ బరగ నందులకు
నాక్షణమ్మునఁ జేరి యందఱుగట్టి
నట్టి యాకట్టఁ బాగట్టిగా గట్టి
నట్టి భాతిని నది యటు దెగఁగొట్టి
తానును గట్టక ధాత్రికపాల
మైన యాపుట్టిక నటఁ దల్రకింపఁ

బెట్టుక పాటలు పేర్కొని పాడు
నట్టి వేళల గణితజ్ఞు లేతెంచి
మునుకొని గట్టిగా మోచినవాని
మును వ్రాయవలె నన్న ముందరిఁ బాఱి
మెడ యోరగాఁ బెట్టి మెయి ధూళిగట్టి
తడయక వారిముందర వచ్చి నిలిచి
మొదల నే నీ మన్ను మోచిన వాఁడ
వదలక మును నన్ను వ్రాయంగవలయు
నా పేరు చొక్కఁడు నను వ్రాయుఁడనిన
నా పరివారమ్ము లదియెట్లు వీఁడు
పాటలాటలఁ బండపడి ప్రొద్దువుచ్చి
యాటగింపుచు వచ్చి నాఁడు వీఁడిపుడు
మన్నెల్ల మోఁచిన మమ్మును మీరు
మున్ను వ్రాయక వీని మున్నెల వ్రాయ
ననిన నా సౌందర్యుఁ డవియెట్లు మన్ను
మునుకొని నాయట్లు మోయంగఁ గలరె !
నిక్కమై యంతయు నే మోయ వీర
లొక్కమై నన్నును నోడఁ గొట్టెదరు
ననిన నా మంత్రు లిట్లని గిట్టివాఁడు
మనమీఁదఁ గొండెమ్ము మఱిఁ జెప్పు ననుచు
నీ వెప్పఁడిట ! మఱి నీకుఁ బేరేమి ?
యేయూర నుందువు నెవ్వగివాఁడ
వనిన నా పరమాత్మ యన్నలు దమ్ము
లెనయఁ గల్గియుఁ దండ్రు లెవ్వరు లేరు
పెద్దగా సౌందర్యపేరు సెప్పికొని
పెద్దను చిన్ననై పేర్కొని నేనె
యేకాంగినై యుందు నీపురియందుఁ
జేకొని యొకమూలఁ జేరి యుండుదును
సొలయక నా పేరు చొక్కఁడటంచుఁ
ఖ్యాతుడు రెల్లరుఁ బాటించి నన్ను
బ్రతుకుకై యీమంటిరాసులు నీళ్ల
సతతమ్ము మోయంగ సగమయ్యె మేను
పుట్టి యస్థులు జర్మమును జిక్కె మేన

ఖత్రిగొల్లను మీరు పరికింపనేల
తను వ్రాయుఁడన్నను నయమొప్ప వార
లని రిఁకనైనను నామన్న పోసి
నీ పాలుగట్టుము నిన్ను జూచినను
గోపించి మాకును గొట్టఁజెయ్యాడ
దీరీతి మఱియును నిట్లుంటివేని
వారింతు వీపున వట్లును గాఁగఁ
గాఱులాడుచు నోరుగలిగిన వాని
కూరోర్వ దనుమాట యొగినిఁ జూచినను
నాలేకరులు జూచి యతనిఁ బిట్టవ్వ
కూలికాఁడనుచుఁ బేర్కొని యల్లఁ దన్ను
వారిలోపల మున్ను వ్రాసి రట్యాడను
వారి నోరార్చి తావచ్చుచోఁ బుటిక
మోమున మలుఁగుగా ముసి ముసి నవ్వు
తో మఱి యచ్చోటఁ దొల్లిఁటి యట్ల
నుండి గానమ్ము నేయుచునుండు వేళ
బాండీడు నా సేతుబంధనంబపుడు
జూడ నేతెంచినచో నెల్లవారు
గూడుక యుండి పేర్కొని తమ భాగ
ములు గట్టుచుండంగ మునుకొని రాజు
నలరంగఁ జూచుచు నరుగుచో నెదుర
నిది చూచి యీపాలు నెవ్వరి దిచటఁ
బదిలమ్ము సాలదు పట్టుకరండు
మదముగా నించుక మన్నైనఁ దెచ్చి
చదరమ్ముగా వేయు చందమ్ము గాన
ననినఁ బాండీనికి నందఱిట్లనిరి
మనుజేంద్ర ! యిందుకై మానవుఁడొకఁడు
పిట్టవ్వ యనునొక్క పేదాపె పాలు
కట్టెద నని కూలికాఁడునై వచ్చి
యల్లదె పవళించి యున్నవాఁడు
చల్లఁగా నీడను జారలాడుచును
ననిన నా రాజు నత్యంతకోపమునఁ
జని మీరు వాని నిచ్చటికిఁ దోడ్తెండు

పొమ్మని పనిచినఁ బోరిపోరి వచ్చి
పట్టుకరమ్మనెఁ బాండీఁడు విన్న
రావమ్ము వేవేగ రాజు సంగడికి
నీరీతి జాగులు నెఱిఁగి రందఱును
ననిన నాస్వామియు నామాట లెల్ల
విననట్లు నిద్రించు విధమున నుండి
దగ్గఱి యట వచ్చి తట్టిలే పినను
దిగ్గనలేచి నల్దిక్కులు జూచి
యా రాజు నటఁ గాంచి యతిభయం బంది
యారీతి నట వేగ నందఱు దేఱి
పరశు కుద్దాలమై పట్టి, కపాల
మరుదైన పుట్టికమై యుండఁ జేసి
మందమందమ్మున మన్నందు కొనుచు
నందంద దగ్గఱి యట కేగునంత
నక్కించి గుఱ్ఱాని నారాజు త్రోలి
జక్కించి యిదియేమి చయ్యన రావు !
ననుచు నాస్వామిని హస్తాన నున్న
కనకదండమునఁ దక్కన వీఁపుగొట్టెఁ
గొట్టిన నప్పుడా కొట్టుతోఁ బోయి
కట్టపై నాపుట్టికను నున్న మన్ను
గట్టుకో వైచి యాక్షణమునఁ దాను
నట్టె యదృశ్యుఁడై యరిగె నాస్వామి
యతుమున్నె యపుడు పాండ్యావనీశ్వరుఁడు
పటుగతి నాముద్దిఁ బట్టెఁ దెమ్మనుచుఁ
బరిచారకులఁ బంపఁ బరువడి వారు
పఱతెంచి యాముద్దిఁ బట్టి యీడ్వఁగను
నాయవ్వ యప్పు డాహాకార మెసఁగఁ
గాయజాంతక నీలకంధర ! శర్వ !
తోయజాసనవంద్య తోయజనేత్ర
పాయక యార్తరక్షణపరాయణుఁడ
కడఁగి నిమ్మవ్వ తోఁకటిపెట్టు కోర్చి
కడువేడ్కఁ బ్రోచిన కరుణాకటాక్ష !
యంటశాఖన్న చోడవ్వ ఝెంగిళియము

నంటూరగించిన యభవ ! భీమేశ !
శివలోకపురనాథ శ్రీ చొక్కనాథ
ధవళాంశుశేఖర ! ధవళాంగ భర్గ
యీబాధలకు నెల్ల నేనోర్వఁగలనె
యీ బారి గడపి నన్నేలవే దేవ
యని దైన్యమెసఁగ నాయన్న ప్రార్థింప
గను నందు విచ్చేసి కడువేడ్క తోడ
నెక్కుడుగన్న మిన్నేఱు కెంజడలు
చుక్కలరాజు ద్రిశూలమ్ము పరశు
డమరుఖట్వాంగమ్ము డాచేతి జింక
జమిలిపాములరాజు జన్నిదం బలర
భూతిత్రిపుండ్రమ్ముఁ బులితోలు కాసె
చేఁ గపాలమ్ము శృంగినాదమ్ము
మెడకప్పు పటికమ్ము మీన రుద్రాక్ష
తొడవును జెవులను దూఁగుకుండలము
నేనుఁగుదోలుఁ నెరయొప్పు ? వల్లెవాటు
మేనకాత్మజయు సామేనుగా నంత
సరసిజాక్షుండును సరసిజాసనుఁడు
సరస వింజామరల్ సరవితో వీవ
బలభేది ధవళాతపత్రమ్ము బట్ట
నల యంతకుఁడు వేత్రహస్తుఁడై చెలఁగ
సలిలాధిపతి శైత్యజలకుంభ మిడఁగ
నందంద పౌలస్త్యుఁ డుపధరింపఁగను
కర్పూరాఖ్యుఁడు గుంచెకాళంజి యిడఁగఁ
గర్బురకంఠుఁ డాదక్షిణమున నపుడు
సుతియఁ గల్గిన దేవపుడలం బెల్ల
గరిమతోడుత సూడిగములు సేయఁగ
ప్రమథసన్మునులు సంభ్రమములీలఁ గొల్చి
యమరంగ సన్నుతు లతివేడ్క సేయ
వెస ఖణిల్లున నంకె వేసి మిన్నందు
బసవరాయని నెక్కి ఘనురమ్ముగను
నరసి పిట్టువ్వకు నగ్రభాగమున
నెరయఁ బ్రత్యక్షమై నిల్చె నాస్వామి

యంతఁ బిట్టవ్వ దివ్యాకారతేజ
మంతయు గైకొని యానందబాష్ప
ములు గన్నులను జాఱ మోడ్పుగేలమరఁ
బులకితదేహుఁడై పొలుపొంద నపుడు
తనజిహ్వకును వేడ్కఁ దగిన వాక్యముల
వినుతింపఁగా స్వామి వెలయ నామెకును
గాయమ్ముతోడుతఁ గైలాస మిచ్చి
యాతొడ విచ్చెనె నాస్వామి యంత
నా స్వామికై నూని నట్టి యాపెట్టు
ప్రస్వేదముల హరిబ్రహ్మాదులకును
దేవేంద్రుఁడాదిగా దిక్పాలకును
దేవసన్యాసిసర్వదేవతలకును
నలర బ్రహ్మాండమ్ము లందులోపలను
గల జీవజంతుసంఘముల కాపాండ్య
జనపతి కాతని సేనల కెల్ల
ఘనముగా వీపునఁ గడుకట్లు గట్టె
నా పెట్టు లా ప్రజ లారాజునకును
జూపెదమని కడుఁజోద్యమ్ముగాను
జూపిన నారాజు జూచుచుఁ దనదు
వీఁపున నున్నన్నట్టి వెలయు నాపెట్టు
జూపి యాస్వామి నచ్చోఁ జూడలేక
యాపాండ్యరాజు మహాభీతుఁడగుచు
నాముద్ది యింటికి నతివేడ్కఁ బోయి
యామహాత్మునిఁ జూచుడందుండు ననుచుఁ
దనమంత్రులను బంపఁ దద్దయు వారు
చనిపోని వచ్చి యాపరమాత్మయందు
విచ్చేసి యామెకు విమలకైవల్య
మిచ్చినరీతెల్ల నెఱిఁగి వేవేగఁ
బోయి వారాపాండ్యభూపాలునకును
నాతొడ వినిపింప నావిధంబెల్ల
వినియాను బాండీడు విస్మయంబంది
చని చొక్కనాథుని సన్నిధినిల్చి
మాయాదిలోపాయ ? మాయావినోద

మాయాప్రపంచ ! యో మాయాస్వరూప !
శివశివ త్రియక్ష ! జితపురాధ్యక్ష !
భవభవ పద్మాక్ష బ్రహ్మేంద్రరక్ష !
హరహర దైవతాధ్యక్ష ! యుగ్రాక్ష !
గరుడకిన్నరయక్షగంధర్వరక్ష !
అద్భుతాంధకదక్షసంహారశిక్ష
సద్భూతిరుద్రాక్ష ! సర్వాంగరక్ష !
భీమ ఫాలాక్ష ! యోభిక్షాన్నభక్ష !
శ్రీమధురాధ్యక్ష ! శ్రీవిరూపాక్ష !
యఖిలాంతరిక్ష వ్యాపారసన్మోక్ష ?
యఖిలాగమోద్రక్ష ? యంబికాధ్యక్ష
సర్వలోకారాధ్య ! సర్వజీవాత్మ !
సర్వదేవశరణ్య ! సర్వేశ యీశ
యోకుండలినుకుండలీ యంబరాంబ
రోకామకామక యోకాలకాల!
నీమాయ లెవ్వరు నియమించువారు
నీమాయలెల్లను నీకును దెలియు
విశదమ్ముగానంచు వినుతింప నప్పు
డశరీరిమై స్వామి యతని కిట్లనియె
మఱి వాదయూరుండు మాభక్తుఁడగుటఁ
దురగముల్గాని తేను దొఁడరి నీవతనిఁ
బాటించి యిచ్చిన పస ధనమ్మునకును
మేటి యయాహయముల మేమె పట్టితిమి
వంచింపకట మేమె వైఖరప్పించి
మించి పిట్టుకు మన్ను మేమె మోచితిమి
కొంచెమై నీచేతఁ గొట్టున బడితి
మంచు నాతనిఁ బుచ్చ మతనికిఁగాను
నీలాగునను మేము నెన్నే నిగతుల
వాలాయ మిటుసేయ వలసెను మాకు
పాటించి యిటుగానఁ బాండ్యభూపాల !
మాటు లేటికి వాగె మార్చి యేమొసఁగు
ఘోటకంబులను గైకొంటివి నీవు
బాగుగా జగమెల్లఁ బాటించి చూడ

నా గెమార్చిన నీకు వఱకొందుఁ గలదు
నీకెక్కినదిగాన నిఖిలమ్ము నెఱుఁగ
నీకేల నతనిపై నీ కోప మనఘ !
యటుగాన నీ కావ లతనిపై నేల!
దటుకున విడుమన్న ధరణీశ్వరుండు
కడు విస్మయంబంది కడకతో నిదియు
వరచొక్కనాథుని వాక్యములనుచు
పులకితదేహుఁడై పొలుపొంద నపుడు
వెలయంగ నాతని వేగ రావించి
పరమేశ సద్భక్తిపరుఁడ వీవౌట
నెఱుఁగక జేసితి నెల్లలోఁ గొనుము
నిరవుగా నీవు నీయిచ్ఛల నుండు
మరుదారగా నంచు నతివేడ్క నంతె
నంతట నతివేడ్క నాతఁడేతెంచి
యెంతయు నాదేవు నెలమిఁ బ్రార్థించి
కొన్నాళ్ల కాస్వామి కృప చాల మీఱి
పొన్నాంబలమునకుఁ బోయి యాస్థలి ని
ఫలితముక్తికరంగ పాపవిభంగ
కలితపుణ్యాకాశగంగ సత్సంగ
నిర్మలాంబుతరంగ నిఖిల ప్రసంగ
పూర్త విస్ఫురితాంగ కూలానుషంగ
స్థిరపుండరీకాంబుతీర్థ మనంగ
సరవితోడుత నభ్రసరసి యనంగఁ
దగుపేళ్ల నమరంగఁ దగు శివగంగ
నగణితమ్ముగ నంగజాంగ భస్మాంగ
సంగభాగమ్మున నా సర్వమంగ
ళాంగీకృతుండు గంగాధరుండతని
కభిషేక సంప్రాప్తమైన యాసరసి
నభిలాషతోడుత నందందఁ జేరి
యందుఁ గృతస్నాన మతివేడ్కఁ జేసి
క్రందుకొన్నట్టి దుష్కర్మముల్ ద్రోచి
యంబరకేశుని నంబరాంతకునిఁ
దుంబురునారదసంస్తుత్యు ననాది

పరమంబు నా చిదంబర మూర్తియైన
పరమేశ్వరుని యగ్రభాగంబు కేగి
బహులీల లగ్నించి ప్రణమిల్లి నిలిచి
సహిత పంచాక్షరీ మంత్రయుక్తముగ
నాతాండవ ప్రియు నావాదయూరుఁ
డాతతభక్తి నిట్లని సన్నుతించె
నానీలకంధరాయ నమశ్శివాయ
యానందతాండవాయ నమశ్శివాయ
యమృతాంశుశేఖరాయ నమశ్శివాయ
యమృతాగ్రలోచనాయ నమశ్శివాయ
యఖిలలోకాంతరాయ నమశ్శివాయ
యభితైకరక్షణాయ నమశ్శివాయ
యజగవ కార్ముకాయ నమశ్శివాయ
యజశిరశ్ఛేదనాయ నమశ్శివాయ
యాది మధ్యాంతరాయ నమశ్శివాయ
యాదిపరాపరాయ నమశ్శివాయ
భావజహరణాయ పాపనాశాయ
దేవదేవ నమోస్తుతే శంకరాయ
యని స్తోత్ర పఠనంబు లమరంగఁ జేసి
వినతుఁడై యష్టాంగవిధుల సేవించి
సంతోషమునఁ బొంది సరభసమ్మునను
నంతర్విశుద్ధుఁడై యంతట మఱచి
వడిమించి మఱియు సేవంద? పాదంబు
గడు వేడ్క దర్శించి ఘనపుణ్యుఁడగుచు
నావాదయూరుండు నపుడు సూదస్ము
తో వచ్చి నరలోకస్తుత్యయైనట్టి
యాంబ కిరీటాంచి తార్ధేందుబింబ
బింబఫలాధర బింబ మదంబ ?
నంబిక జగదంబ నాంబికేయాంబ
నంబరాంబర మంగళాంగితాలంబ
శివకామసుందరి శ్రీమహాదేవి
భవనమ్మునకు నేగి భావించి కాంచి
యాదేవి నతిభక్తి యమరఁ బూజించి

వేద మంత్రమ్ముల వినుతించి మఱియు
శర్వాణి రుద్రాణి శాంభవి యార్య
పార్వతి దుర్గ యపర్ణ హైమవతి
కాళి భవాని దాక్షాయణి గిరిజ
మాలిని మాతంగి మాయాస్వరూప
నానందవల్లిఁ గాత్యాయని గౌరి
జ్ఞానార్థరూపిణి జ్ఞాన కౌమారి
శంకరప్రియ మహాజాలి కాపాలి
కంకాళి భైరవోంకారి హ్రీంకారి
యని సన్నుతించి యాయంబ సత్కరుణ
ననువందఁగాఁ గాంచి యచ్చోటు వెడలి
తిరువాదయూరుఁ డాతిరుపంబలమున
స్థిరముగా నాదేవదేవు సత్కృపను
దురువాచకంబును దిరుమంత్ర మెలమి
వరుసతో నాతిరుపంబల కోవ
లరయ నీ స్తోత్రమ్ము లాత్మ శోభిల్ల
విరచించి వేర్వేఱ విశదంబుగాఁగ
నాధిక్యమైన యజ్ఞానముల్ ద్రుంచి
మాధుర్యపురికి నెమ్మదిఁ బోయి మఱియు
సౌందర్యనాథుని సద్భక్తిఁ గాంచి
యందంద సుజ్ఞాన మధికమై పొరలి
వాదయూరుఁడు కృపావరలబ్ధి గాంచి
యాదేవునందైక్యమయ్యె నయ్యెడను
నౌరవుగా నతఁ డప్పు డొనరించినట్టి
తిరువాచక స్తోత్ర దివ్య మంత్రంబు
ప్రచురమై సర్వేశ్వర స్థానములను
బచరించి సద్భక్తిఁ బఠియింతు రెపుడు
మఱియు నాపిట్టుకు మన్నంటు కరణిఁ
గరమొప్ప నేటేట గడలు నాస్వామి
యుదియనేఁ బది తొమ్మి దిటమీఁది చరిత
ముదముతో జెప్పెద మునులార వినుఁడి
యెన్నంగ నీలీల నెవ్వారు నైన
విన్న వ్రాసినఁ జదివిన పుణ్యపురుషు

లాయురైశ్వర్య సంప్రాప్తులై మఱియుఁ
బాయక శ్రీచొక్కపతి సేవలందు
నాసక్తులై సదానందాత్ము లగుచు
భాసుర సాలోక్యపదవిఁ జెందుదురు

అఱువదియవ లీల.

అంత నామధురమహాపురంబున న
నంత గుణాఢ్య పాండ్యాధిప వంశ
మునఁ గుబ్జ పాండ్య భూభుజు డుద్భవించి
తనదారఁ బాండ్యభూతల మేలుచుండి
యతఁడు జైనులఁ గూడి యధిక చార్వాక
మతమున శైవసమ్మతుఁడు గాకపుడు
భూతిరుద్రాక్ష విముక్తుఁడై యుట్టి
భాతిని సౌందర్యపతి సేవ మాని
దనవద్ది దొరలు ప్రధానులందఱును
దనరీతి జైనమతంబుఁ జేపట్టి
శైవమ్ము మదికి నసహ్యమై పాండ్య
భూవరుం డొరంత ప్రొద్దు "నమో రు
హంతార" యనుచును నాత్మదలంచుఁ
గొంతకాలం బిట్లు కొనసాగు చుండ
నాపాండ్యపతి దేవులైన యాచోళ
భూపాలుని కుమార్తె పుణ్యచారిత్ర
మంగయకర్క సన్మంగళాకర్క
నాకోమలాంగిని నాచోళవిభుఁడు
నాకుబ్జ పాండికతివేగఁ బెండ్లి
చేసి. యంపుచును నశేషవస్తువులు
భాసితమ్ముగ నిచ్చి పరమానురాగ
చిన్మయాత్మకు గులశేఖరుం డనెడి
సన్మంత్రి నామెకు సచివుగాఁ జేసి
యుంపైన బుద్ధుల నైన్నెనిఁ గలిపి
పంపెను మాధుర్య పట్టణమ్మునకు
నా మంత్రియును మంగయాకర్కయమ్మ
హాయిపాండి ని దావర్తనఁ జూచి
శైవమ్ము విడిచి యాజైనుల మతము

భావింపుచున్నాఁడు పార్థివేశ్వరుడు
పరికింప మనకిది పాటి గాదనుచు
ధరణీశు దేవియు దండనాయకుఁడు
నుదకమ్మును విభూతి యొప్పగా నెపుడు
నుదుట ధరించు రొందరు గోప్యముగను
నివ్విధంబున వార లీశ్వరు భక్తి
భావంబు నందునఁ బరిపూర్ణులగుచు
నా చొక్కపతి తమ యధ్యాత్మలందుఁ
జూచి మ్రొక్కుచును బ్రస్తుతులు సేయుచును
నున్నఁడు జైనుల హింసించి శైవ
మెన్నఁడు ప్రబలునో యీశ్వరా ! యనుచుఁ
జెలువయు నా మంత్రిశేఖరుం డపుడు
దలపుచునుండి రంతటిమీఁద మఱియు
మునులార ! యాచోళభూమిలోపలను
ననుపమంబైన శియ్యాళూరి యందు
నుండును నొక బ్రాహ్మణోత్తముండతఁడు
కౌండిన్య గోత్రుండు ఘనశైవవరుఁడు
నాతని గర్భమ్ము నందున మిగుల
ఖ్యాతిగాఁ బ్రమథ నాయకుఁ డాదికార
ణంబుగా జనియించి నడిచి యాడుచును
నంబ వెంటను నేఁటి కరుగుచో నచట
యశరీరియై వచ్చి యాజగదంబ
శిశువును గాంచి యంచితమైన తనదు
పసిఁడికుండలఁ బోలు పాలిండ్ల పాలు
పసి దీఱఁ ద్రావించి భక్తి విచ్చెనె
నా నిమిత్తంబున నాబాలునకును
జ్ఞానంబు గలిగె సుజ్ఞానసంబంధుఁ
డను నామమున మహాప్రాజ్ఞతమెఱసి
ఘనతరశివ భక్తికలితుఁడై యపుడు
వేదశాస్త్రపురాణ విద్యల నెల్ల
బాదరాయణునకుఁ బ్రతియనఁ బరగి
కరమొప్పఁ దిరువళక్కాడనుపురము
కరుదెంచితిరునావుకరశరు డాను

విమలసుజ్ఞాన ప్రవీణమానసుఁడు
ప్రమథనాయక భక్తిపరులుండి రంత
నాపాండ్యభూపాలు నర్ధాంగలక్ష్మి
వీపాటవీనాథ నిజభక్తచరిత
చోడరాజ తనూజ సుజ్ఞానతేజ
భేదధిపోత్తంస విశ్వప్రశంస
ఘనమాత్మ యామంగయక్కర్షయమ్మ
తన మంత్రివరున కెంతయు నానతిచ్చెఁ
" పాండ్యభూమి సమంతభద్రాగమంబె
నిండి శైవమ్ము తూష్ణీకృతంబయ్యె
జ్ఞానసంబంధు నిక్కడకు రావించి
యా నగ్నకులమెల్ల నడఁపంగవలయు "
నతనినిఁ బిలుపింపు మతివేగ నవిన
నతివేడ్కఁ గులశేఖరామాత్యవరుఁడు
ఖర్వపాండీడు నిక్కడను నీరీతి
సర్వజ్ఞులును దాను సర్వజ్ఞభక్తిఁ
బాసియుండుట వారు ప్రబలమైయుంట
నా శైవసమయంబు లట్లుండుటయును
నా వర్తమానమ్ము లన్నింటి కతని
వేవేగ మధురకు విచ్చేయుఁడనుచుఁ
దనకమ్ము వ్రాసి యాతనికినిఁ బనిచె
ఘనమైన తిరువళ్ళకాడికి నంత
నాలేఖఁ జదువుక నప్పుడు జైన
కోలాహలుఁడు శైవకుశలుండు శివుని
నమ్మినభక్తుఁ డెంతయు వేడ్క జ్ఞాన
సమ్మంధుఁ డధికాష్ట సాహస్ర శిష్య
గణమును దిరునావుకర్షరు దాను
ద్రిణయను నాత్మలోఁ దీపింపఁ జేసి
మధురాపురమునకు మహిమతో వచ్చి
విధుజూటు శంకరు విశ్వేశు నభవు
నా చొక్కనాథుని హాలాస్యపతిని
ప్రాచీనపతివంద్యు భక్తితోఁ గాంచి
సాష్టాంగదండముల్ చాలంగఁ జేసి

యిష్టార్థసిద్ధిగా నిచ్చులోఁ గోరి
యంభోజగర్భార్చితాంఘ్రిసరోజ !
శాంభవీరమణ ! విశ్వంభర పాహి
అంధకవ్యాఘ్ర జలంధర త్రిపుర
బంధురాసుర దర్పభంజన ! పాహి
కుంభినీధరచాప కుంభీనసేంద్ర
గంభీర కంధరాగ్రైవేయ ! పాహి
అంహోవిభేదనాహంకారోగ్ర సప్త
జిహ్వాజిహ్వాగ్ర విచ్ఛేదన ! పాహి
సంహార గజదైత్యసంహార కాల
రంహాజిహ్వాజి నార్ద్రాంబర ! పాహి
అత్రినేత్రజ మిత్రయనిలత్రినేత్ర
నేత్రాగ్ని దర్పకనిర్దాహి పాహి
మాధుర్యపురవాస మకుటవిస్ఫుట క
ళాధరోజ్జ్వల ! సత్కళాధార ! పాహి
అగజామనోహర యధికకైలాస
నగనాథ శ్రీచొక్కనాథ మాంపాహి
యంగయకణ్ణేశ యభవ మాం పాహి
గంగాపగాధర ! కలకంఠ ! పాహి
కామితభక్త శంకర దేవ పాహి
సోమసౌందర్య సంస్తుతనామ ! పాహి
హాలాస్యపురనాథ యట్టాలనాథ
యీ లోకరక్షణ యో కృపామూర్తి
శైవమాహకుల నిక్షేత్రమ్ము జేసి
భావించి మమ్మేలు పళియంబినాథ
యని సన్నుతులుజేసి యచ్చోటు వాసి
యనఘాత్ముఁ డాయంగయర్కణ్ణియమ్ము
దరిసించి నుతియించి దండమ్ము వెట్టి
పరమసంతోష సంపన్నుఁ డప్పురిని
వాగీశభక్తి నివాసమ్మునందు
రాగవాసనలచే నుండిరంతటను
నా మంత్రియును వారి నతిభక్తి గాంచి
భూమీశుఁ డావైనముఖ్యులఁ గూడి

శివదూషకుండౌట నెప్పి వారలకు
వివిధవస్తువు లిచ్చి వేడ్కతో నుండఁ
గడఁగి యామంగయక్కర్శి సౌందర్య
గుడికి నేతెంచు లాగున వచ్చి జ్ఞాన
సమ్మంధుఁ బొడఁగని సర్వమ్ము దెలిపి
క్రమ్మఱఁ దనగృహాంగణమున కరిగె
నంతట నాశైవు లతనివృత్తాంత
మంతయుఁ దెలిసియు ప్రహస్వపాండీని
కెఱుఁగంగఁ జెప్పి యీ యీశ్వరభక్తి
పరుఁడైన బ్రాహ్మణార్భకుఁడు మాతోడఁ
దర్కించి మమ్ము నందఱ గెల్తు ననుచు
మార్కొని వచ్చె నీమధుర నున్నాఁడు
మహిపాల! యిపుడు మామంత్రాగ్ని వలన
దహియించెదము వానిఁ దప్పక ననిన
నతఁడట్లు చేయుఁడన్నంతట వారు
నతివేగ మంత్రయంత్రాదుల వలన
బడబాగ్ని పుట్టించి పటుశక్తిఁ గదిసి
తడయక నాతని దహియించు మనిన
నదియును బ్రళయకాలానలాకృతిని
గదియ వచ్చిన నంత గరళకంధరుఁడు
దనభక్తవరునకుఁ దగులకయుండ
మనమునఁ గరుణించి మధురేశ్వరుండు
శ్రీచొక్కపతి తన శీతలవృష్టిఁ
జూచినఁ జల్లనై సొరిగె నావహ్ని
మఱియును వారలు మధ్యరాత్రమునఁ
బరికించి యతఁడున్న భవనమ్ము మీఁద
ననలమ్ము దరికొల్ప నంతసౌందర్య
ఘనుఁడు దానినిఁ జల్లగాఁ జేసి యనిన
నంత నామఱునాఁడు నావిధంబెల్లఁ
జింతించి పళియంజి శ్రీచొక్కవిభుఁడు
కరుణ నాపైఁ జాల కలిగియుండఁగను
బరవాదు లెచ్చట బ్రదికిపోయెదరు
వీరల పనియేమి వీరలే లక్ష్య

మీరీతి వీరల మెచ్చుగాఁ జేసి
కినిసి రాజా రాష్ట్రీకృతము పాపమ్ము
ననఁగ నింతటికిని వాలయంబైన
నా పాండ్యపతి మేన నధికమ్ముగాఁగ
దాహజ్వరంబేను దగులంగఁ జేతు
నని చొక్కనాథుని నాత్మ భావించి
తన మంత్రబలశక్తిఁ దనర నావహ్ని
క్రమ్మఱ నారాజు గదియించె జ్ఞాన
సమ్మంధుఁ డంత నాశ్చర్యమ్ముగాఁగ
నప్పు డావహ్ని తీవ్రాకార మగుచు
నప్పాండ్యపతి దేహ మాపాదమస్త
కంబును బెన్ని దాఘుజ్వరం బతికృ
శంబుగాఁ బీడించె నైరణలేక
వైద్యులెవ్వరుఁ జూడ వచ్చువారల క
భేద్యమై యొడలెల్లఁ బెచ్చిన యట్లు
మంత్రమ్ములప మాఱు మలయుచు నుండు
యంత్రమ్ములకుఁ జాల నగ్గల మ్మగుచు
నౌషధక్రియలకు నధికమై శైవ
దూషులచేత నెందును శాంతిలేక
నప్పు డాపాండీంద్రుఁ డా జైవకులము
రప్పించి మిగుల వారల కిట్టులనియె
నుడుగని తాపజ్వరోష్ణ తాపమ్ము
నొడలెల్ల బడలింపుచున్నది వేగ
మీమంత్రబలశక్తి మెఱసి యీతఱిమె
మామేనఁ దాపమ్ము మాన్పుడీ యనిన
నరయంగ వారలు నట్లకాకనుచు
గుఱుతైన తమ బలికుంచెలఁ దుడిచి
మఱియొన్ని భంగుల మంత్రించి రేని
పరితాపసంజ్వరోపద్రవం బేమి
శమియింప కెల్ల పింఛాంచలంబులును
గమలె నాపాండ్యభూకాంతుని మేన
నంతకంతకుఁ దాప మధికమౌ గాని
శాంతిగాదయ్యె నాసౌందర్యు మహిమ

శివద్రోహకుండౌట సెప్పి వారలకు
వివిధవస్తువు లిచ్చి వేడ్కతో నుండఁ
గడఁగి యామంగయక్కర్షి సౌందర్య
గుడికి నేతెంచు లాగున వచ్చి జ్ఞాన
సమ్మంధుఁ బొడఁగని సర్వమ్ము దెలిపి
క్రమ్మఱఁ దనగృహాంగణమున కరిగె
నంతట నాతైను లతనివృత్తాంత
మంతయుఁ దెలిసియు హ్రాస్యపాండీని
కెఱుఁగంగఁ జెప్పి యీ యీశ్వరభక్తి
పరుఁడైన బ్రాహ్మణార్భకుఁడు మాతోడఁ
దర్కించి మమ్ము నందఱ గెల్తు ననుచు
మార్కొని వచ్చి యీమధుర నున్నాఁడు
మహిపాల ! యిపుడు మామంత్రాగ్ని వలన
దహియించెదము వానిఁ దప్పక ననిన
నతఁడట్లు చేయుఁడన్నంతట వారు
నతివేగ మంత్రయంత్రాదుల వలన
బడబాగ్ని పుట్టించి పటుశక్తిఁ గదిసి
తడయక నాతని దహియించు మనిన
నదియును బ్రళయకాలానలాకృతిని
గదియ వచ్చిన నంత గరళకంధరుఁడు
దనభక్తవరునకుఁ దగులకయుండ
మనమునఁ గరుణించి మధురేశ్వరుండు
శ్రీచొక్కపతి తన శీతలదృష్టిఁ
జూచినఁ జల్లనై పోరిగె నావహ్ని
మఱియును వారలు మధ్యరాత్రమునఁ
బరికించి యతఁడున్న భవనమ్ము మీఁద
ననలమ్ము దరికొల్ప నంతసౌందర్య
ఘనుఁడు దానినిఁ జల్లగాఁ జేసి యనిచె
నంత నామఱునాఁడు నావిధంబెల్లఁ
జింతించి పళియంజి శ్రీచొక్కవిభుఁడు
కరుణ నాపైఁ జాల కలిగియుండఁగను
ఖరవాదు లెచ్చటు బ్రదికిపోయెదరు
వీరల పనియేమి వీరలే లక్ష్య

మీరీతి వీరల మెచ్చఁగాఁ జేసి
కినిసి రాజా రాష్ట్రకృతము పాపమ్ము
ననఁగ నింతటికిని వాలయంబైన
నా పాండ్యపతి మేన నధికమ్ముగాఁగ
దాపజ్వరంబేను దగులంగఁ జేతు
నని చొక్కనాథుని నాత్మ భావించి
తన మంత్రబలశక్తిఁ దనర నావహ్ని
క్రమ్మఱ నా రాజు గదియించె జ్ఞాన
సమ్మంధుఁ డంత నాశ్చర్యమ్ముగాఁగ
నప్పు డావహ్ని తీవ్రాకార మగుచు
నప్పాండ్యపతి దేహ మాపాదమస్త
కంబును బెన్నిదాఘజ్వరం బతిక్ర
శంబుగాఁ బీడించె సైరణలేక
వైద్యులెవ్వరుఁ జూడ వచ్చువారల క
భేద్యమై యొడలెల్లఁ బెచ్చిన యట్ల
మంత్రమ్ములను మాఱు మలయుచు నుండు
యంత్రమ్ములకుఁ జాల నగ్గల మ్మగుచు
నౌషధక్రియలకు నధికమై శైవ
దూషులచేత నెందును శాంతిలేక
నప్పు డాపాండీంద్రుఁ డావైదికులము
రప్పించి మిగుల వారల కిట్లులనియె
నుడుగని తాపజ్వరోష్ణ తాపమ్ము
నొడలెల్ల బడలింపుచున్నది వేగ
మీమంత్రబలశక్తి మెఱసి యీతఱిమె
మామేనఁ దాపమ్ము మాన్పుఁడీ యనిన
నరయంగ వారలు నట్లకాకనుచు
గుఱుతైన తమ బలికుంచెలఁ దుడిచి
మఱియెన్ని భంగుల మంత్రించి రేని
పరితాపసంజ్వరోపద్రవం బేమి
శమియింప కెల్ల పింఛాంచలంబులను
గమలె నాపాండ్యభూకాంతుని మేన
నంతకంతకుఁ దాప మధికమై గాని
శాంతిగాదయ్యె నాసౌందర్య మహిమ

నంత మంగయకర్త యామంత్రివరుఁడు
చింతించి యావేళఁ జెప్పెద ననుచు
నా పాండ్యపతి వద్ది కల్లనఁ జేరి
రూపతి యుందుల కుపశాంతి సేయఁ
గలవాఁడొకండు నిక్కడ వచ్చినాఁడు
నళగయ చొక్కనాయకభక్తిపరుఁడు
నతఁ డిక్కడికి వచ్చి యధిప ! నీమేను
జేత నంటినఁజాలు శీతలంబగును
దాపజ్వరమ్ము నెంతియు మాని దివ్య
రూపమై యాయురారోగ్యమ్ము లగును
ననినను నృపుఁ డతివ్యాధిపీడనము
దను నొంది యానుతాదనసేర కతనిఁ
బిలిపింపుమన్నను బిరుసునఁ బోయి
చెలఁగుచు నామంత్రిశేఖరుం డపుడు
సమ్మంధునికి మ్రొక్కి జనపతికడకు
రమ్ము భూనాథు జ్వరమ్ముఁ బోఁజేసి
నీ మహాత్మ్యముఁ జూపి నిర్మలచరిత !
యా మారజిత్కులం బణఁపఁ గావలయు
ననిన నాతఁడు మహాహ్లదమ్ముతోడ
ఘననీపవనవాసుఁ గరుణావిలాసుఁ
దనమది నిల్పి ప్రార్థనచేసి మ్రొక్కి
చని భూపతిని దనచల్లని దృష్టిఁ
జూచినంతనె కొంత చులుకైనట్లు
లేచి కూర్చుండఁ గల్పించె నారాజు
నంత నాజైనగణాచారు లెల్లఁ
బంతమ్ముతోడ సంబంధునిఁ బాండ్య
జనపతి వామపార్శ్వమునఁ గూర్చుండు
మనుచుఁ బెట్టించిరి యాసనమ్మొకఁడు
దాము నారాజుకు దక్షిణపార్శ్వ
భూమిఁ గూర్చుండిరి బుద్ధు లంతటను
నా పాండ్యభూపాలుఁడాతనిఁ జూచి
యో పుణ్యచరిత యేయూరు మీఁదనినఁ
దనయూరు దనపేరుఁ దనపాలి శివుని

వినిపించినంతనే విని బౌద్ధులెల్ల
మంగయకర్ణను మంత్రినిఁ జూచి
సంగతి వామపార్శ్వ జ్వరోష్ణమ్ము
దనమంత్రబల మహత్త్వంబున నిపుడు
మనుజేశ్వరునకును మానుపు మనుడు
దక్షిణపార్శ్వమ్ము తాపజ్వరమ్ము
తత్క్షణమ్మున మాన్పెదము మేము ననిన
సమ్మంధుఁడును మంత్రి జనపతిమహిషి
సమ్మతించిరి నంతె చాలు నటంచుఁ
బంచాస్యుఁ దనమది భావించి చేతి
సంచి విభూతి హస్తమునఁ బట్టినను
జ్ఞానసంబంధునిఁ గనుగొని యపుడు
జైనులందఱును నీ సంచివిభూతి
వలదన్న సంబంధవరుఁడు నాతఁడామె
యుఁల జేని పాలికి నిష్టమైనట్టి
పరిచారకులఁ జొక్కపతి గుడి కనిపి
తిరువాలవాయిని దీపించు నట్టి
వీభూతిఁ దెప్పించి వెస చేతఁబట్టి
యాభూతనాథుని నభిషేకచొక్క
నాథుని హాలాస్యనాథు నట్టాల
నాథుని సౌందర్యనాథునిఁ దలఁచి
గణుతించి హృదయపుష్కరమున నిలిపి
ప్రణవపంచాక్షరీపఠనమ్ముఁ జేసి
పంచమహాఘోరపాతకాటవి ద
హించు దావానలహేతి విభూతి
యజ్ఞానిజనమానసాంధకారౌఘ
సుజ్ఞానఘనపరంజ్యోతి విభూతి
పరమేశహితభక్తిపరుల కైశ్వర్య
కరమగు నధికవిఖ్యాతి విభూతి
యాశాదివర్గరాగాది దోషోగ్ర
రాశి విచ్ఛేదనారాతి విభూతి
ప్రాకటోదగ్రరౌరవఘోరనరక
భీకరోన్నతమహాభీతి విభూతి

దుర్వారఘనశివదూషణోన్మాద
గర్వాచలాశనిఘాతి విభూతి
నయముతో నిహపరానందమ్ము లొసఁగు
ప్రియభక్తులకును సంప్రీతి విభూతి
మానవకోటిజనార్జితానవధి
కైనసకంతాగ్రహాతి విభూతి
భూతపిశాచవిస్ఫుటరోగభయద
పాతకమ్ముల నెల్లఁ బాపు విభూతి
మూలమంత్రాధారమునకును నాది
మూలమై విలసిల్లు మూర్తి విభూతి
వేదాగమ పురాణ విద్యలయందు
నాదిమవర్ణనీయమ్ము విభూతి
తనరంగ నే వేళ ధరియించు పుణ్య
ఘనులకుఁ బావనోత్కరము విభూతి
త్రిభువనపావనోత్కీర్తి విభూతి
శుభగుణాలంకృతస్ఫూర్తి విభూతి
పరలోక మోక్షసంప్రాప్తి విభూతి
నరలోక వైభవోన్నతము విభూతి
రణముఖసర్వాంగరక్ష విభూతి
రణశౌర్యవిజయకారణము విభూతి
సురుచిరాంచితదేహశుద్ధి విభూతి
హరుకృప దీర్ఘాయురారోగ్యములను
సిరు లిచ్చుగాక నాచేతి విభూతి
యనుచు విభూతి మహత్త్వ మీరీతి
గొనియాడి మదిని సంకోచమ్ము మాని
వామనపాండిని వామభాగమున
కా మహాత్ముఁడు తనహస్తమ్ము జాచి
శివరక్ష యని తనచేతి విభూతి
దివిరి పైఁబడవైచి దిగువాలుఁ దుడిచి
నంతఁ దాపజ్వర మడఁగి యాభూమి
కాంతుని సవ్యభాగము శైత్య మయ్యె
మఱియు దక్షిణభాగ మాజైను లెల్ల
నొలపుగాఁ దమచేత నున్నట్టి పికిలి

కుంచెలు వేములు గొనుచు మంత్రింప
ఇంచుకైనను శమియింపక యుండ
నాచంద మీక్షించి యతివ మంత్రియును
మీచేతఁ గాకున్న మీకింకఁ దొలఁగు
డింతమాత్రమ్మున కీయయ్య చేత
శాంతమౌ నన్న నాజైను లిట్లనిరి
సవ్యపార్శ్వమ్మది చంద్రభాగమ్ము
నవ్యమై యందుండు నమృత మెప్పుడును
దరణి భాగంబిది దక్షిణపార్శ్వ
మరయ నుష్ణాధిక్యమై యుండు కతన
నెడమభాగము శైత్య మెప్పుడు గలదు
కుడిభాగ మితఁడు గ్రక్కున మాన్పనేని
నితఁడె పో దేవుండు నీలోకమునకు
నితనిఁ బోలినవార లెందు లేరనిన
జ్ఞానసంబంధుండు ఘనత నిట్లనియె
నేను నావిషభాగ మిపుడు మాన్చెదను
మీర లమృతభాగమే మాన్పుడనిన
వార లాదిక్కుకు వచ్చిరి యతఁడు
నాపార్శ్వ మటు ముట్టి నంతమాత్రమునఁ
దాపమ్ము మాని శైత్యమ్మయ్యె నొడలు
వీరు వచ్చిన దిక్కు విపరీతముగను
నారని తాపజ్వరానలాభీల
మధికమై మేనెల్ల నలముటఁ బొంద
నధిపతి వారితో ననియె శోకమున
యీభవ్యచరితుండు నేదిక్కు వచ్చి
వీభూతి యినుమంత వేసినంతటను
జల్లనై దేహమ్ము సౌఖ్యమై యుండె
నెల్లభంగుల మీరలెల్లరు గూడి
యేసంక వచ్చితిరేని నాదిక్కు
పావకజ్వాలల భాతి నయ్యెడిని
ఏటిమంత్రములు మీరేటిమానిసులు
మాటలేటికిని మీమాయలు దెలిసె
వెడలిపొండిట జాలు వేయేల ! దేహ

ముడుకుచున్నది మీర లుండితిరేని
ననినను వారు లజ్జాన్యులై వెడలి
చని రందఱును దదాశ్రమముల కంత
నమ్మహీపతి దేహ మవయవాంగములు
సమ్మంధభక్తుఁ డా సవ్యాపసవ్య
భాగజ్వరోష్ణతాపము వేగమాన్చి
బాగుగా నా గూని పైన విభూతి
హస్తము వైచిన యంతమాత్రమున
విస్తారవక్షుఁడై వినుతికి నెక్కి
కమనీయరూపరేఖాకాంతులందు
నమరేంద్రసుతు లీల నమరినఁ జూచి
నిండినభక్తితో నీవు సౌందర్య
పాండీడవనుచును బలికె నయ్యెడను
నాపాండ్యభూపాలుఁ డతిమోదమునను
నాపుణ్యసతియును న్ప్రధానియును
జ్ఞానసంబంధునిఁ గలుషసంహరుని
లయానతి పట్నమయాచార్యదివ్య
పాదపద్మలకు జాగి ప్రణమిల్లి నిలిచి
యాదివ్యపురుషుని నర్థితోఁ బొగడి
ధన మపారంబిచ్చి తనరంగ నితని
ఘనభూషణాంబరాకారునిఁ జేసి
పట్టపుటేనుఁగుపైని మాధుర్య
పట్టణ మ్మంతయుఁ బరగ నేగించి
వీడుపట్లకు మీరు వెంచేయఁ దగిన
వేడుక సంబంధవిజ్ఞానమూర్తి
హరసమయస్థాపనాచార్యధుర్యుఁ
డరిగిరి జైనకోలాహలుం డపుడు
సౌందర్యనాథుని సన్నిధి కరిగి
గొందంద సాష్టాంగ మలరంగఁ జేసి
తగువేడ్క లేచి హస్తములు మోడ్చి
యగణితశాస్త్రోక్తి నభినుతుల్ చేసి
ఈదేవుఁ డాగమం బేలినవాఁడు
నేదేవుఁ డపవర్గ మేలినవాఁడు

నే దేవుఁ డాద్యంత మేకమై యుండు
నే దేవదేవుండు నెల్ల దేవతల
కాదికినాదియై యాద్యైనవాఁడు
నే దేవుఁ డకలంకుఁ డే దేవుఁ డచలుఁ
డట్టి సౌందర్యమహాదేవ ! యభవ !
నెట్టనఁ గుబ్జపాండీని జ్వరంబు
నాచేత మాన్పించి నన్ను మన్నించి
శ్రీచొక్కనాథ రక్షించితే ! నన్ను
యని సన్నుతులు చేసి యా దేవుకృపను
వనమఠంబున కేగెఁ దనవారు పొగడ
సాంఖ్యాదియోగవాసనలచే నతఁడ
సంఖ్యశిష్యులు గొల్వ జయమున నుండె
మునులార యీలీల మునుకొని విన్న
ఘనులకు సకలరోగవ్యథాఘములు
దొలఁగును జొక్కనాథుని కృపగలిగి
కలకాలమెల్ల విఖ్యాతిఁ జెందుదురు
నిదియు నరువదిలీల యిటుమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార ! వినుఁడి

## అఱువదియొకటవ లీల.

మఱియును బౌద్ధు లామధుర లోపలను
నరపతి పద్ద మున్న నవారు గాన
శివభక్తు లప్పురిఁ జేర రాకుండ
శివకథ లారాజు చెవిఁ జొఱకుండ
పాండీని వాఁకిటఁ బ్రబలి యే వేళ
నుండి బోధింపుచుండిరి జైనమతము
నంత నా కుబ్జపాండ్యావనీశ్వరుని
కాంత యా చోళభూకాంతుని తనయ
యా మంగయక్కర్షయమ్మ యే ప్రొద్దు
నా మహాదేవుపై నతిభక్తి మించి
గురుతరప్రజ్ఞాగ మంత్రిఁ గులశేఖరార్యు
నరసి రప్పించి యాఱేఁడుఁ దాను నతఁడు
మనమునఁ దలపోసి మఱి జైనకులము
ఘనముగా నెంతయుఁ గడువాచ్చె ననుచు

జ్ఞానసంబంధుతోఁ జాలనిట్లనిరి
జైనులవల్లను శైవమ్ము గొంచె
మై వారి సమయమ్ము నధికమై పొదలె
గావున వారి నొక్కటఁ ద్రుంపకున్న
శైవమ్ము కృశమౌను జైనశాస్త్రమ్ము
లావల ఘనమౌను యది సంశయమ్మె
యనవుడు నది యట్లయౌ నంచు నపుడు
మనమున జ్ఞానసంబంధుఁడు దెలిసి
యిందుకు నా స్వామి యిందుకోటీరుఁ
డెందేని నతనిఁ బ్రార్థింతు నేననుచు
భోరున హాలాస్యపురవాసుఁ డర్థ
నారీశుఁ డౌ చొక్కనాయకుండున్న
యావాసమున కేగి యాయష్టమూర్తి
యా వేదవేద్యుని నర్చనల్ చేసి
దండప్రణామమ్ము దనరంగ నిడుచు
నిండిన సద్భక్తి నియతిఁ బ్రార్థించె.
హరహర వేదశాస్త్రార్థతత్త్వజ్ఞ !
యురగేంద్రసద్భూష ! యున్మత్తవేష !
పాపనాశన జగత్పతి లోకరక్ష
యాపగాధర ! లలాటాక్ష కపాలి !
యలినీలకంధర యధ్యాత్మయోగ
నిలయ విశారద నిజభక్తవరద
మీనకేతనభస్మ ! మేదినియందు
జైనులు హెచ్చి రిచ్చట వారిఁ బట్టి
కొట్టకున్నను నాదు కోపమ్ము పోదు
నిట్టై నన్ను ననుగ్రహింపవే ! దేవ
యని సన్నుతించిన నా మహాదేవుఁ
డనఘాత్మ యది యట్లయౌగాక యనుచు
నశరీరభావుఁడై యానతిచ్చినను
బటువటి యాజ్ఞ చేపట్టి సుజ్ఞాన
సమ్బంధుఁడప్పుడు సంతోష మంది
యమ్మహాదేవుని నభినుతుల్ చేసి
యందందఁ బ్రణమిల్లి యంతట మఱలి

పొందుగా నాకుబ్జభూపాలు కడకుఁ
బరువడిఁ జనుదెంచి భావించి యనిరా
వరుస జైనులతోడ వాదమ్ముఁ జేసి
ఒట్టిగొడ్లను బట్టి యుబ్బూతలూఁగఁ
గొట్టు శక్యెంతు నీకును సత్యతంబె
యనిన నాకుబ్జపాండ్యావనీశ్వరుఁడు
నొనర.గ నట్లసేయుము వేగ మనిన
జ్ఞానసంబంధుఁడుత్సాహియై యున్న
జైను లెనిమిదివేల జనము నావేళ
సరవి నాభూపాలు సముఖమ్మునకును
నురవడి నేతెంచి యొనర నందున్న
సుజ్ఞానసంబంధుఁ జూచి యందఱును
బ్రజ్ఞావిహీనులై పల్కి రిట్లనుచు.
మా మంత్రమహిమ మీ మంత్రమ్ము మహిమ
యీ మహీపాలుని యెదుటను దాళ
పత్రాల లిఖియించి ప్రజ్వలదీప్తి
పెబాత్ర మధ్యమ్మున నొగి వేయ నట్టి
దహనార్చులందు నిర్దగ్ధమ్ము గాక
సహజమై యున్న నిశ్చలలేఖ పత్ర
మెవ్వారి దట్టివారే గెల్చువారు
నెవ్వరుఁ బజరింప నేల పొమ్మనిన
మదిమెచ్చి జ్ఞానసంబంధుండు నపుడు
నదియట్ల కాలు బౌద్ధాధికులార !
యామాట తిరుగకుం డది సమ్మతనిన
నామాట తామాట యట్ల కాకనుచు
విశ్వమంతయుఁ జూడ వేవేగ నపుడు
వైశ్వానరార్చుల వడిమీఱఁ జేసి
భ్రమయక నా కుబ్జపాండ్యుని యెదుటఁ
దను మంత్రసామర్థ్యతను లేర్పఱించి
లిఖియించి తెచ్చి యా లేఖలు వహ్ని
శిఖల మధ్యమున వేసిరి సిద్ధముగను
వేసినంతట జైనవితతులు వ్రాసి
వేసిన యాలేఖ వేగంబ యపుడు

తూలమ్ము చందానఁ దోడ్తోన మఱియుఁ
గాలి భస్మంబయ్యెఁ గానరాదయ్యె
జ్ఞానసంబంధుఁ డాసౌందర్యనాథు
మానసమ్మున నిల్పి మఱి వేసినట్టి
యాశైవపత్రిక యావహ్ని యందు
భాసిలుఁ దొల్లిఁటి భావమ్ము కంటె
నంత నాభూపాలుఁ డాప్రజ లెల్ల
సంతోషమంది యాశ్చర్యమ్ము నొంద
సురలును మునులును శోభితమ్ముగను
బరగించి రందంద బహుపుష్పవృష్టి
యాజైనులందఱు నపుడు వీక్షించి
యీ జాతవేదుని నిపుడు లోగొంటి
మిది సమ్మతముగాదు నిది యగ్ని కట్టు
కొనలేక యిఱుదెఱుంగుల వార మిపుడు
వరుస నింకొకలేఖ వ్రాసి యిర్వేటి
వరద వైచినను నెవ్వారిచీటి యేటి
కెదురెక్కు నను వార లిటు గెల్చువార
లిదియ పో నిశ్చయం బిందు కోడినను
వెఱచి యీ యెనిమిదివేల బౌద్ధులము
దరతరమ్మును నీకు దాసులయ్యెదము
సత్యంబె యన్న సుజ్ఞానసంబంధుఁ
డత్యున్నతమ్ముగా నవ్విరా వారలకు
మాకు దాసులమీఁద మఱి యాసలేదు
చేకొని మీకొండు జేయుడు వేగ
మిందు కోడిలిరేని నందఱు నాకు
బందాలు గానేల! పరగ నిర్వ్యాడను
నొక్కొక్క కొఱ్ఱు మీ రొగిఁ జేతఁబూని
యెక్కుఁడాయత్తులై యిచటి కేతెండి
యనిన నాసర్వజ్ఞు లట్ల చేసెదము
ననుచున్న సమయమ్ము నందునఁ గోట
చరుఁడను నొక మంత్రి సమ్మంధవరుని
గనుగొని పల్కెను ఘనతతోఁ గొఱ్ఱు
లెనిమిదివేలు నాయితముగాఁ జేసి

కొనితెచ్చినాఁడఁ జేకొని చూడుఁడనుచు
నేనగాఁ దెచ్చి వైచినఁ జూచి యపుడు
జ్ఞానసంబంధుఁ డా జైనుల కనియె
శివకథాలాపముల్ చెవిసొగ్గి వినక
భవబంధకర్మ్మసంఘల్ వాయునా ! చెపుడ
పంచాక్షరీమంత్ర పఠనమ్ము లేక
పంచపాతకములు వాయునా ! చెపుడ
భక్తుల శ్రీపాదపాంసువు మేకొనక
భుక్తి ముక్తులు రెండు దొరయునే ! చెపుడ
లింగ దేహప్రాణలియ్యమ్ము లేక
వెంగలితన మెల్ల విడుచునే ! చెపుడ
జంగమతీర్థప్రసాదమ్ము గాక
యంగమ్ము పావనంబౌనొకో ! చెపుడ
భూతిసర్వాంగపూర్ణము గాక
జాతి సంకరములు మానునే ! చెపుడ
రుద్రాక్షదామభూషలు గాక సకల
భద్రాభ్యుదయముల్ వడయుఁ గే ! చెపుడ
మదనారి సకుని మీఁద మనసెల్ల నిడక
సదమలానందమ్ము చవియున్నె చెపుడ
యటుగాన మీర లియ్యాగ్రహ మ్మూడిగి
నటుకున శివభక్తితాత్పర్యు లగుచు
నంచిత భూతిరుద్రాక్షలు దాల్చి
పంచాక్షరీమంత్ర పఠనమ్ము సేయుఁ
డెసఁగినదోసమ్ము లెల్లను బాయు
పశువులఁ బోలఁగనేల పరచోళ్యవిభునిఁ
గొలువుఁ డన్నను జైనకుల మెల్లఁ గినిసి
పలుకులేటికి నింకఁ బది వేలకైన
గెలుతు మీవాదమ్ము కీర్తిగా ననుచుఁ
జెలఁగి యాకులముల్ చేతులఁ బూని
కొని యప్పుడావైభ మాలమ్మునకును
జేర నానుజ్ఞానసంబంధుఁ డట్టి
వారిఁ గన్గొని వచ్చి వారును దారు
నా రీతిఁ బ్రతిక లందు వేర్వేఱ

వెలయ నా కూనిమిదివేవురు గూడి
బలియులై తమమంత్రబలము లేర్పఱిచి
లిఖియించి యప్పుడా లేఖలు దెచ్చి
నిఖిలమ్ముఁ జూడఁ బాండీడును జూడఁ
దొడరి యాయుభయవాదులు గూడివచ్చి
వడి మీఱి వారు నావైఖ లోపలను
మునుకొని నడిమధ్యమున వైచి రపుడు
కనుఱెప్ప వేయక కనుగొనుచుండ
నయ్యెడ జైనుల యాకు ప్రాఙ్నిశకుఁ
జయ్యనఁ బోయి యాజలధిలో మునిఁగె
మనమార జ్ఞానసంబంధుఁడు వైచు
దనరు నాశైవమంత్రస్థమైన లేఖ
యాయేటి కెదురెక్కి యటరూజనమ్ము
శోభిలఁ బశ్చిమభాగమునకు నాక్షణమె
నప్పు డాపాండీంద్రుఁ డామంత్రివరులు
నప్పత్రి కెందుఁ బోయెను జూడవలయు
ను జ్ఞానసంబంధుఁ జూపు మం చపుడ
భిజ్ఞులతోఁగూడఁ బేర్కొని యతఁడు
వారలఁ దోడ్కొని వరుస నయ్యేటి
కూడ నే యప్పుడు రూజనం బరుగ
నాదరి నొకశివాలయము లోపలను
యాదేవుఁ డంత బ్రాహ్మణవృద్ధరూప
మాలీల ధరియించి యటకు విచ్చేసి
యాలేఖఁ దనహస్తమందుఁ గీలించి
జ్ఞానసంబంధుఁ డచ్చటి కేగు వేళఁ
దానందు నిల్చి యాతని చేతికిచ్చె
నాకూడఁ బుష్పమ్ము లమరులు గురియఁ
బోరాం సద్భుత్యుఁడై భూతేశుఁ డంత
నిరవుగా నాపత్రి కిచ్చిన స్థలము
కరమొప్పఁ దిరువడగంబనఁ బరఁగె
మనమార నపుడు ముమ్మారుగా ననుచు
ననఘవిహారుఁ డా కూరభక్తుఁడైన
జ్ఞానసంబంధుఁ డాజైనులఁ జూచి

మానితహృదయుండై మఱియు నిట్లనియెం
దాడఁచు నీశ్వరద్రోహమ్ము జేసి
చెడనేల నికనైన సిద్ధమ్ము గాఁగ
హరిభక్తులాంధనంబైన రుద్రాక్ష
ధరియించి భక్తాంగధారులై యుండు
డా మహనీయరుద్రాక్షమహత్త్వ
మాహోదమున మీకు నానతిచ్చెదము
శివతత్త్వబోధలు చెవి కింపుగాని
శివనిందపరవాది శిక్ష రుద్రాక్ష
శాశ్వతైశ్వర్య మోక్ష ప్రాప్తమైన
యీశ్వరసేవకాపేక్ష రుద్రాక్ష
భవబంధ పరితాపముల్ ప్రాపింపకుండఁ
బ్రభువులసార్వాంగరక్ష రుద్రాక్ష
పరనిందసేయుక పరమేశు నాత్మ
స్థిరభక్తి గల్గించు దీక్ష రుద్రాక్ష
దామకమ్ములు గూర్చి ధరియించు నెపుడు
భీమేశ్వరునకు నపేక్ష రుద్రాక్ష
యనవిని యామును లాకుంభసంభ
వుని జూచి రుద్రాక్ష లురుతరమహిమ
దెలుప నే యనుచుఁ బ్రార్థించిన నతఁడు
వలరుచు సౌందర్య సాత్మయం దునిచి
కరమర్థి మునుల కగస్త్యుఁ డిట్లనియె
సరవి తోడుత జ్ఞానసమ్మంధుఁ డపుడు
కరుణించి యాబౌద్ధగణముల కనియె
వినిపింతు రుద్రాక్షవిభవమ్ము మీకు
వసువసుపాలకహారము తన్మహిమ
నరుఁడు భక్తుండైన నతిభక్తుఁడైన
నరయ నీచుండైన నతినీచుఁడైనఁ
దనువున రుద్రాక్ష ధరియించె నేని
బనివడి సర్వపాపవిముక్తుఁ డగును
దశపుణ్యరుద్రాక్షధారణం బెందు
శ్రుతిలోని యతిమహావ్రత మంచుఁ దత్త్వ
విదులైన మునులచే వినఁబడుచుండు

ముదమున రుద్రాక్షములు వేయు దాల్చు
నతనికి శివున కెట్లఖిలదేవతలు
నతులు గావింతు రున్నతభక్తి యుక్తి
నొక్కటి వేయును నొదుగకయున్న
నొక్కటి శిఖను బాహులఁ బదారేసి
గరిమ నల్వది మస్తకమునఁ గర్ణముల
నరయ నొండొండైన నాఱేసిరొంటఁ
జెదరని భక్తి ముంజేతుల రెంటఁ
బదియారెండేసి యేర్పడఁ గంఠమునను
ముప్పదిరెండురంబున నేబదియును
నొప్ప నూఁటెనిమిది యుపవీతముగను
దవిలి యెవ్వఁడుభక్తిఁ దాల్చు రుద్రాక్ష
లవని నాతఁడు పూజ్యుఁ డల శివునట్లి
పగడమ్ములైనను బటికమ్ములైనఁ
దగిన వైడూర్యముక్తామణులైనఁ
గడునొప్ప వెండిబంగరు పూసలైన
నెడనెడ గ్రుచ్చి తా నెపుడు ధరింప
నడర నాతఁడు శివుండగుట నిశ్చయము
యొడలను శివముద్ర యొకటిలేకున్న
బురుషుండు రుద్రాక్షములె ధరించినను
ధరణిఁ బాతకము లాతనిఁ జెంద వెఱచు
గరిమఁ జీఁకటి సూర్యుఁ గదియదన్నట్లు
గరుడిని గదియ నాగము లోడినట్లు
రుద్రాక్షమణుల పేరుల జపియించు
భద్రమంత యనంత ఫలముల నించుఁ
జెలఁగి రుద్రాక్షలఁ జేయని జపము
ఫల మల్పమగు మహాఫలము నీలేదు
యొకటైన రుద్రాక్ష యొడల లేకున్న
నకట భస్మ త్రిపుండ్రాంకి గాకున్న
నామనుజుని జన్మమది నిరర్థకము
శ్రీమతి రుద్రాక్ష శిరమునఁ దాల్చి
నరుఁడెవ్వఁడేని స్నానముఁ జేసెనేని
భరితగంగాస్నాన ఫలమందు నతఁడు

జలముక్కటి విడిచి సకలోపచార
ములను రుద్రాక్ష నెవ్వఁడుఁ బూజసేయు
పురుషుండు శివుఁ బూన్చు పుణ్యమ్ముగాంచు
విరచింపఁగా నిట వేదవాక్యమ్ము
వలపోయ నేకవక్త్రము పంచవక్త్ర
ములు చతుర్దశవక్త్రములు పదునొకండు
ముఖములు గల్గు నమూల్యరుద్రాక్ష
లఖిల లోకముల కత్యంత పూజ్యములు
నమ్మి శివాత్మకమ్ము రుద్రాక్ష
నెమ్మిఁ బూజించిన నేదర్థమునకు
సదమల ధనధాన్యసంపదల్ గల్గు
నిదిసత్య మిదిసత్య మిట యతిగోష్ఠ
మిట సవిస్తరముగా నెలమిని మీకు
ముద మొప్పఁ జెప్పితి మహాత్ములార !
యట్టి రుద్రాక్ష మాహాత్మ్యమ్ము విన్న
నెట్టన పశుపతి యానీరజాదులకు
మఱియు నావీభూతి మహిమ లాపాండ్య
ధరణీశ్వరుండు ప్రధానులు మీరు
పూని వింటిరగదా ! పొగడొందగాను
నానావిధగ్రస్థుల నాబుద్ధి నెంచి
మదిలోన మీ రనుమానమ్ము డించి
సదయులై బ్రాహ్మణార్చన యందు మించి
వీభూతి రుద్రాక్ష వెలయ ధరించి
ప్రాభవ పంచాక్షరంబు పఠించి
ఈలాగు వెల్గుదురై యుండఁ జెప్పెదరు !
పొందఁ గాలంగ సుగతులు గలవె
నెరయ మీ రిటఁ బూనిన మాత్రమునకై
బరగంగఁ గొల్వులఁ బడుట సమాన
మనుచు నాసంబంధుఁ డామాట పలికి
నను వైదికిష్ఠాని మానతి తోడ
మాకును విధినియమం బటుమంచె
నా గొల్వులను గాలుటదియేమ మాకనుచుఁ
దుబ్బి నెవ్వరు శివద్రోహమ్మొనరను

బడబడి లోనైన పాపాత్ములకును
నిది ప్రాప్తమని భూమి కెల్లఁ దార్కాణ
విదితమై చూపు నావిధమున వార
లాలాగునను మహాహంకారు లగుచు
శూలి యాజ్ఞను దూలి శూలాలఁ గూలి
కాలధర్మమునొంది కాలుని పురికి
నాలయంబై బాధ లధికమ్ముగాఁగ
నొందిరి మఱియు నందును శేషమైన
కొందఱు జైను లెక్కుడు శివభక్తిఁ
బూనిన చందానఁ బొసఁగ వారెల్ల
జ్ఞానసంబంధు నాజ్ఞకు భీతులగుచు
దలఁకి రుద్రాక్షలు ధరియించువారు
పాలుపొంద విభూతి పూసెడివారు
నెనయంగ గోమయం బెందు విభూతి
జనని యంచును మేన సవరించువారు
ప్రాభవం బెడలి యాబౌద్ధులు మఱియు
విభూతి ఫలియించు వృక్షమ్ములనుచుఁ
దోడనె యాభూతి దొరకక మెడలఁ
గోడెదూడలఁ గట్టుకొని చనువారు
జంగాల మఱుఁగు లిచ్చలఁ జొచ్చి యఱుత
లింగాలు గట్టి కెళ్లెడ వచ్చువారు
నాడువారలకు రుద్రాక్షలు లేక
మేడికాయలు గూర్చి మెడఁ జేర్చు వారు
పాషాణములు తలబట్టలు గట్ట
నౌషధాభిజ్ఞులు నపుడు వేవేగ
నట్టులఁ జేర్చక హరహరా యనుచుఁ
గొట్టులఁ దప్పించుకొని పాఱువారు
సరవి నివ్విధమున సరభసమ్మునను
మఱి శివభక్తుల మఱుగులఁ జొచ్చి
సతతమ్ము జంగమార్చనలందు మించి
బ్రతికిరి మిగుల నాబౌద్ధు లయ్యెడను
నారాజ్య మెల్ల రుద్రాక్షవిభూతి
ధారులై హరభక్తితాత్పర్యులైరి

## అఱువదిరెండవ లీల.

అనఘుఁడై పాండీడు నామధురమ్మౌ
నానరంగఁ బాలింపుచున్న యత్తఱిని
వార్త కెక్కిన సెట్టి వైశ్యవర్తకుఁడు
బార్తన నొకఁడష్టమూర్తి సద్భక్తుఁ
డాపురమ్మున నెప్పు డావాసముగను
గాపురంబుండు వేడ్కలు మీఱ నతఁడు
సౌందర్యునకు ఘనసారసౌరభ్య
చందన మ్మనుదినమ్ము నర్పించు
నీవిధం బతినిష్ఠ యేప్రొద్దు నెమ్మి
గావింప నొకకొంత కాలమ్మునకును
రయముతోఁ గర్ణాటరాజ్యాధిపుండు
భయ మింతలేక నిర్భరవృత్తి గదలి
బహుళమౌ చతురంగబలములతోడ
మహి గ్రక్కటిల వచ్చి మధురపై విడిసె
విడిసిన నాపాండ్యవిభుఁడును గినిసి
నడిచెను దనదు సేనలతోడఁ గూడి
కొందిరింప నా వారు నెదిరి యుద్ధమును
గదనమ్ముఁ జేసిరి ఘనముగా నచట
నపుడు నాపాండీంద్రుఁడా రాజు తోడి
విపినమ్మునకు నేగె విక్రమం బెడలి
యాలాగు నధికుఁడై యాపాండ్యవిభుని
దోలి యారాజును దోడ్తోన మధుర
కరిగి పట్టముగట్టు కారాజ్య మెల్ల
ధరియించి యొకకొంత దానధర్మము
బూని యావైదిక స్ఫూర్తిఁ బోనాడి
తాను వే జైనశాస్త్రమ్ముల [illegible]
నప్పు డామూర్తిపై [illegible] చొక్కనాథు
నెప్పుడు మదినిల్పి యెలమిఁ బ్రార్థింపు
చును గంధమర్పించుచును భక్తి [illegible]
నను దినమ్మును మించె [illegible]
[illegible]
[illegible]

## ఇఱువదిరెండవ లీల.

అనఘుఁడై పాండీశు నామధురమ్ము
నొనరంగఁ బాలింపుచున్న యత్తఱిని
వార్త కెక్కిన సెట్టి వైశ్యవర్తకుఁడు
బూర్తన నొకఁడష్టమూర్తి సద్భక్తుఁ
డాపురమ్మున నెప్పు డావాసముగను
గాపురంబుండు వేడ్కలుమీఱ నతఁడు
సౌందర్యునకు ఘనసారసౌరభ్య
చందన మ్మనుదివసమ్మ నర్పించు
నీవిధం బతినిష్ఠ నేప్రొద్దు నెమ్మి
గావింప నొకకొంత కాలమ్మునకును
రయముతోఁ గర్ణాటరాజ్యాధిపుండు
భయ మింతలేక నిర్భరవృత్తి గదలి
బహుళమౌ చతురంగబలములతోడ
మహి గ్రక్కదల వచ్చి మధురపై విడిసె
విడిసిన నాపాండ్యవిభుఁడును గినిసి
నడిచెను దనదు సేనలతోడఁ గూడి
కదిరింప నా వారు నెదిరి యుద్ధమును
గదనమ్ముజేసిరి ఘనముగా నచట
నపుడు నాపాండీంద్రుఁడా రాజు నోడి
విపినమ్మునకు నేగె విక్రమం బెడలి
యాలాగు నధికుఁడై యాపాండ్యవిభుని
బోలి యారాజును దోడ్కొన్న మధుర
కరిగి పట్టముగట్టు కారాజ్య మెల్ల
భరియించి యొకకొంత దానధర్మమ్ము
బూని యావైదికస్ఫూర్తిఁ బోనాడి
తాను వేదైవనశాస్త్రమ్ముల మించి
నప్పు డామూర్తినై త్రైలోక్యనాథు
నెప్పుడు మదినిల్పి యెలమిఁ బ్రార్థింపు
చును గంధమర్పించుచును శైవభక్తి
ననుదినమ్మును మించి యామైనవర్తి
నైకొనకుండంగఁ గరణిఁ బ్రేరణ
భూకాంతునకుఁ జెప్పి భూపాలుఁడపుడు

బెగ్గడిల్లిన మది భీతి నొందినను
బిగువు దప్పిన మేను బింకమ్ము వెడిన
మొగము గ్రుక్కినఁ గంపమునఁ బొందియున్న
బరిమళగంధమ్ము ఖాతి గాకున్న
మరువమ్ము గాదన్న మరుఁడొప్పకున్న
పరమేశు శ్రీపాదపద్మమ్ము లాన
తిరముగా నా కిది తిరుబాస యనుచుఁ
గరసాన నపుడు భీకరముగాఁ బట్టి
యురువడి ముంజేతు లొడ్డి రాచుచును
మునుకొని యా విధంబునఁ జందనమ్ము
ఘనముగాఁ దీసియుఁ గడు మూర్ఛనొంది
పడు నంతలోన నా భక్తవత్సలుఁడు
నుడురాజశేఖరుం డురగాంగదుండు
పశియంచినాథుఁ డాపత్సహాయుండు
నలరంగఁ బ్రత్యక్షమై యానతిచ్చెఁ
జాలు నోహో వీరశైవ ! మూ కిపుడు
చాలంగ నిటు గంధసారమ్ము వచ్చెఁ
బూని యాజైనసంబోధనకెల్ల
లోనైన రాజును లోబడిపోవు
గరముప్ప నొకకొంత కాలమ్మునకును
ధరణి సామ్రాజ్య మంతయు నేలి నీవు
మొనసి యా శివలోకమునకును రమ్ము.
అని యానతిచ్చి యాహాలాస్యనాథుఁ
డాకడ నిచ్చెనె నంతలోపలను
బోరు నామూర్తికిఁ బొందినయట్టి
వ్రణము లాక్షణమున వర్జింప నత్తఱు
త్రిణయను నాజ్ఞచేఁ దేజరిల్లగను
నంత నా పెట్టి రా నాత్మ శోభిల్ల
సంతోషచిత్తుఁడై సౌందర్యనాథు
గుడికిని బోయి పెక్కైన స్తోత్రశతక
నుతులుగఁ జేయుచు నున్న యుక్తిని
నిరవంత దొడ్డుల కెల్లలోనైన
నరనాథుఁడుంచిన నగరు మూర్తుల్ల

దారసి యారాత్రియందును మంటివాన
గురిసె యాతని గూర్చి ఘోరమ్ముగాను
నప్పుడాతని మంత్రు లాశ్చర్యమంది
యప్పరమేశ్వరు నాజ్ఞగాకనుచుఁ
బట్టణమ్ము దొల్లిఁటి పాండ్యభూవిభుని
పట్ట నొక్కని గట్టఁ బాడియా ననుచుఁ
బట్టణం బెంపును బరికించి చూడఁ
బట్టఁపేనుఁగుఁ బంప భద్రేభ మపుడు
పట్టణమ్మంతయుఁ బాటించి తాన
కట్టి సౌందర్యనాయకుఁ డుంపు నగరి
కరిగి వైశ్యోత్తముం డందున్న గాంచి
పరువడిఁ బోయి యాభద్రేభ మతని
నురువడి నెత్తి యత్యున్నతమ్ముగను
గరిమొప్పఁ దనమస్తకమ్మునఁ బెట్టు
కొని పట్టణమ్మునందున ప్రదక్షిణము
ననుపందగా వచ్చి యా మంత్రివరుల
ముందరఁ బెట్టిన ముదమంది వార
లందఱు నభిషేక మతనికిఁ జేయ
ఘన కిరీటము దాల్పఁగా వచ్చినంత
మునుకొని చూచి యా మూర్తి యిట్లనియె.
నీ భద్రజాతులుండ నేల మకుటము !
వీభూతి యుండంగ నిదు డభిషేక
మనువైనయట్టి రుద్రాక్షలుండగను
గనకభూషణము లగ్గలము మాకేల !
ననుచును సింహాసనాసీనుఁ డగుచుఁ
జని యప్పు డంత నా సౌందర్యనాథు
నగరికిఁ బోయి మన్ననగాంచి మూర్తి
జగదీశుఁ డట్టి యా సామ్రాజ్యమెల్లఁ
బూని యావైదికస్ఫూర్తి శోభిల్ల
జేసినసందోహ ముత్సాహమై పోవ
శ్రీ చొక్కనాథునిఁ జక్కన విల్చి
సోమార్ధశేఖర ! సోమసుందేవ !..
హరహర పన్నగాధ్యుత కేయూర

డొరసి యారాత్రియందును మంటివాన
గురిసి యాతని గూర్చి ఘోరమ్ముగాను
నప్పుడాతని మంత్రు లాశ్చర్యమంది
యప్పరమేశ్వరు నాజ్ఞగాకనుచుఁ
బట్టణమ్ము దొల్లిఁటి పాండ్యభూవిభుని
పట్టి నొక్కని గట్టిఁ బాడియౌ ననుచుఁ
బట్టణం బెండును బరికించి చూడఁ
బట్టఁ బేనుఁగుఁ బంప భద్రేభ మపుడు
పట్టణమ్మంతయుఁ బాటించి తాన
కట్టి సౌందర్యనాయకుఁ డుంపు నగరి
కరిగి వైశ్యోత్తముం డందున్న గాంచి
పరువడిఁ బోయి యాభద్రేభ మతని
నురుపడి నెత్తి యత్యున్నతమ్ముగను
గరమొప్పఁ దనమస్తకమ్మునఁ బెట్టు
కొని పట్టణమ్మునకును బ్రదక్షిణము
ననువందగా వచ్చి యా మంత్రివరుల
ముందరఁ బెట్టిన ముదమంది వార
లందఱు నభిషేక మతనికిఁ జేయ
ఘన కిరీటము దాల్పఁగా వచ్చినంత
మనుకొని చూచి యా మూర్తి యిట్లనియె.
నీ భద్రజటిలుండ నేల మకుటము !
నీభూతి యుండంగ నిదు దభిషేక
మనువైనయట్టి రుద్రాక్షలుండగను
గనకభూషణములు లగ్గలము నూకేల !
ననుచును సింహాసనాసీనుఁ డగుచుఁ
జని యప్పు డంత నా సౌందర్యనాథు
నగరికిఁ బోయి మన్ననగాంచి మూర్తి
జగతీశుఁ డట్టి యా సామ్రాజ్యమెల్లఁ
బూని యావైదిక స్ఫూర్తి శోభిల్ల
జైనసందోహ మత్యార్తమై పోవ
శ్రీ చొక్కనాథునిఁ జిత్తాన నిల్పి
రాజచంద్రశేఖర ! రాజమహాదేవ !
హారహార పన్నగాధ్యక్ష కేయూర

కలకంఠ నన్నిట్లు గాచితే యనుచు
శ్రీకంఠు గొలిచి యాశివు గుడివెడలి
ప్రాకటేంద్రియ నిగ్రహముగాగ నపుడు
రాజసమ్మున మధురాపురం బెల్ల
రాజితమ్ముగ మూర్తిరాజశేఖరుఁడు
శాసించి యొక కొంత కాలమ్మునకును
నా మహాదేవుని నాత్మలో నిల్పి
పరగంగఁ దొల్లింటి పాండ్యభూవిభుని
వెరవుతోఁ బిలిపించి విభుని గావించి
యరయ వైశ్యోత్తముం డామూర్తిసెట్టి
కరమొప్ప నేగెను కైలాసమునకు
నిదియు నఱువదిరెండు నిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుడి
యనుచు సన్మునులతో నా యగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియెం.

అఱువదిమూఁడవ లీల.

మఱియును నాపాండ్య మండలేశ్వరుఁడు
దురితదూరుఁడు జైనధూర్తుల నెల్లఁ
గ్రుంగించి మూర్తిభక్తుఁడు శివలోక
సంగతుండైన యాసమయమ్మునందుఁ
దప్పక యాపాండ్యధాత్రీతలంబు
నెప్పటి యట్లనె యేలుచునుండ
నత్తఱిఁ గార్యారి నార్యారు లనఁగ
నుత్తరదేశాన నుండి యాయిరువు
రాపాండ్యవిభునకు నధికకావ్యములు
నేపార రచియించి యెలమి నేతేరఁ
గాంతారమునను మార్గము దప్పివారు
భ్రాంతి విభ్రాంతులై భ్రమసి వర్తింప
నత్తఱి మధురేశుఁ డాచొక్కవిభుఁడు
చిత్తజదమను, డాశ్రితవత్సలుండు
సితకరార్ధధరుండు శ్రీ మహాదేవుఁ
డతికృపారస పూర్ణుఁడా దినాథుండు
పశుపతి యప్పుడా ప్రాంతమ్ము నందుఁ

నా కవీశ్వరులతో నప్పుడిట్లనియె
నీకావ్యమే మీర నెలమితోఁ బాండ్య
జననాథు పాలను జదువఁ బోయెదరు
వినుఁడు నాదొక్క కవిత్వమ్ము మీరు
జతనమ్ముగా నంచుఁ జదివిన నపుడు
నతివిస్మయంబంది యా కవులనిరి
యితఁడు గొల్లఁడు కాఁడ యెన్నని విధుల
నితఁ డీశ్వరాంశంబ యిదిసార్థ మనుచు
నా దేవుఁ జూచి హారతి వేడ్క తోడ
సాదరచిత్తులై సరవి నిట్లనిరి
యీ కవిత్వము నెల్ల నెలమి నాపాండ్య
భూకాంతు చేరువఁ బోయి చదివిన
నతఁడు మాకిచ్చిన యాధనంబెల్ల
వితతమ్ముగా నీకు వేడ్క నిచ్చెదము
త్రోవేది చెప్పు ప్రొద్దున మాకు నిపుడు
పోవలె మధురకు భోరున ననుచుఁ
దనర నీవింత సౌందర్యమానుఁడవు
ననఘాత్మ ! నీవెవ్వరంచు వారడుగ
నప్పు డాకార్యారి నార్యులకును
చెప్ప కిట్లనియె సౌందర్యనాయకుఁడు
గోపాలకుఁడ చొక్కనో నేరి పేరు
నీపట్టణమ్మున నేను వర్తింతు
పసులకాపరు లేడ ! బసదనం బేల !
పసలేదు నాకొద్ద పదివేలు నైన
మీకావ్యమున నర్థమిపుడు భావించి
చేకొని నామీఁదఁ జెప్పితి రేని
తెరువిత్తు లేక మీతెరువును జూప
నిరవందగా నన్ను నెలమిని వారు
మార్గమ్ము జూపు సమ్మతి నిత్తుమనిన
మార్గమ్ము జూపి యమా మార్గసహాయుఁ
డంత నదృశ్యుఁడై యరిగె నా స్వామి
యంతలేని విస్మయం బెసఁగె నా కవులు
శ్రీచొక్కనిధుఁ దమచిత్తానఁ దలఁచి

## ఇరువదినాల్గవ లీల.

ఆపాండ్య భూపాలుఁ డధికప్రతాప
దీప్తుఁడై యా పాండ్యదేశ మేలంగ
నట్టి కాలమ్మున నచట మాధుర్య
పట్టణమ్మున నొక బలుసెట్టి గలఁడు
నతివ వివాహమై యతిభక్తి కలిగి
సతతమ్ము జంగమార్చన చేసికొనుచు
మధురాధిపతి సేవ మదిని నేమఱక
నధికుఁడై బ్రతుకుచు నట్లుండు నంత
నాతని మాతులుం డతి ధర్మపరుఁడు
నీతివర్తనములు నెరయంగఁ గల్గి
యుత్తర భూమిలో నొకపురమ్మునను
నుత్తమ శ్లోకుఁ డత్యున్నతైశ్వర్య
సంపన్నుఁడై తన సాధ్వికిఁ బుత్ర
సంపద లేకున్న సతతమ్ము జంగ
మార్చన సేయుచు నభవుని నెపుడు
నర్చింపుచుండంగ హరుకృపవలన
వరగుణ రూపలావణ్యమ్ములకును
గుఱిసేయఁదగు నొక కూఁతురు గనియె
నాపిన్నపాప యత్యంత మోహన క
లాపయై పెరిగె నల్లారుముద్దుగను
నాకన్య యౌవన ప్రాప్తయైనంతఁ
జేకొని యా బాల శృంగారమెన్న
నాకురు లానెఱు లాగొప్ప కొప్పు
నాకన్ను లాచన్ను లాయారు తీరు
నామోము నాగోరు నాదంతపంక్తి
నా ముక్కు నా చెక్కు లా చక్కఁదనము
నా బాహు లామోహనాధరోష్ఠమ్ము.
నా బాగు లాలాగు లాకొను మేను
లాచేతు లారీతు లా కాళ్ళు వ్రేళ్ళు
లా చూపు లారూపు లా వరకటాంక.
మాతోడ లానడ లామెడ కరువు
నా తేట లామాట లా చిరునవ్వు వెల్ల

నా శోభ యా నాభి యా తిన్నదనము
లా శీల మా గుణ మా యొప్పిదంబు
మరునకునైనను మరులు పుట్టించు
సరసమోహనలీలఁ జాల నాబాల
నవ్వనితామణి నచటి బంధువులు
నెయ్యమునడిగిన నీక యాతండ్రి
తన మేనయల్లునిఁ దగు వేడ్కఁ బిలువఁ
పనిచెను సంఘర్య పట్టణస్థునకు
వెలయ నా యల్లుండు వేడ్కతోడుతను
బిలువఁగఁ బోయిన పెద్ద మన్నించి
తన యగ్రభార్యను దనయుల నందె
యనిచి బందుగులకు నొగి నప్పగించి
తడయక సోము సౌందర్య నాయకుని
గుడికిని జని మది కోరిక లెసఁగ
నళగయ బొక్క ! మోహాలాస్యనిలయ !
శశియంజినాయక ! పార్వతీరమణ !
వ్యాఘ్ర చర్మాంబర ! హరహర ! నాకు
శీఘ్రంబె యిష్టార్థ సిద్ధిగాఁ జేయు
మనుచుఁ బ్రార్థనచేసి యంతంత మ్రొక్కి
ఘనమతి సంగయ కన్నమ్మ గొల్చి
యా సెట్టి పరిణయంబాడ నుదీచ్య
దేశస్థునకును నంతే వేడ్కతోడఁ
దనబందుగులను గొందఱఁ గూడికొనుచుఁ
జనిరి సంబళములు సొలంగఁ గొనుచు
నరుగుచోనంతట నత్తమామలును
జ్వరపీడనమ్మున స్వర్గస్థులగుచు
నెల్లరతోడ నాయింటి నామేన
యల్లుని కిమ్మని యర్పించి చనిరి
యంటు బైనగతంబుచే నతని మేనల్లుఁ
డటుకును బోయిన నతని బందుగులు
కని యంద తానతనిఁ గొంగిటఁ జేర్చి
తన యత్తమామ వృత్తాంతముల్ చెప్పి
యీ కన్య నెవ్వరి కీక మాతోడ

నీకు నిమ్మని చెప్పి నీ మామ చనిరెం
ననివార లాభాల నా ధనరాసు
లును బహుధాన్యంబులును నొప్పగించి
ప్రేమతో నిచటనే పెండ్లియాడెదవా !
యా మధురాపురి కరిగెదో ! యనిన
మధురకుఁ దోడ్కొని మావారు చూడ
నధికమ్ముగాఁ బెండ్లియాడెద ననినఁ
బొమ్మని వారలు ప్రోదితో ననుప
నమ్మగువను సకలార్థముల్ గొంచు
వచ్చుచోఁ ద్రోవ నావనిత రాలేక
నొచ్చి రాఁ దనదు బంధుగులను బిల్చి
నడువ లేదీ బాల నలుగకయుండ
దోడుకొనివచ్చెదఁ ద్రోవ నొయ్యనను
నందఱు మీర లీయర్థమ్ము గొంచు
బొందుగా మాధుర్య పురమున కరిగి
యతులితమ్ముగ వివాహ ద్రవ్యములను
నతివేడ్కఁ బెండ్లికి నాయత్తపఱచు
డని వారలను బంపి యల్లనల్లను
వనితను దోడ్కొని వచ్చుచోఁ ద్రోవ
తిరుపెరుంబను నూరిదేవరఁ జేరి
దరిసింప వార లిద్దఱు నటువచ్చి
యాయూరి సర్వేశు నంబికాధీశు
సేవించి యచట వసించి రారాత్రి
యా సెట్టి యా శివాలయ మంటపమున
నాశీవిషాదష్టుఁడయ్యె నయ్యెడను
నింతి యావరపుల నేడ్చుచునుండ
నంత ప్రొద్దునను మంత్రౌషధ క్రియల
జాంగలికులు వచ్చి యయ్యన నెన్ని
భంగుల మంత్రించి పరిహరించినను
నావేళ మఱలక యా సెట్టి యచట
దైవికమ్మునఁ గాలధర్మమ్ము నందె
నప్పుడు వైశ్య కన్యామణి యచట
నప్పరమేశ్వరు నాశశాంకార్ధ

ఖాటు సన్నిధికి నే వచ్చుచుఁ బోయి మ్రొక్కి
నిలిచి తల్లియును దండ్రియును దోఁబుట్టు
గును లేక యున్న నాకును మేనబావ
యను దోడుకొని యొక్క సాధుని పట్న
మునకుఁ బోవుచు మిన్నలను దర్శించి
యుంపం డడ నహిపేష్టుఁ డీ సెట్టి మృతిని
బొందుట యిది మహాద్భుతము సర్వేశ !
హా దేవ ! యబలను నొంటి నైనతి
నాదిక్కు దెసఁ జూచి నాపాటుఁ జూచి
రతితో బత్నీశు రతిదేవి వేడ
పతిని బ్రతికించి యనిపిన యట్లు
శతరూప పురుషభిక్షము పెట్టుమనిన
బ్రతికించి దక్షునిఁ బాలించినట్లు
పరమేశ ! యీ సెట్టి బ్రతికించి నాకు
పురుషభిక్షము పెట్టి ప్రోవకయున్నఁ
బ్రణయాన ! నీ సన్నిధికి తృణమ్మునను
వ్రణముగా బ్రాణముల్ తెగువతో విడిచి
దేహమ్ము లన సందేహమ్ము లేక
నాదుగౌరవంనకు నాకోఱుతు లిత్తు
ననుచు దుఃఖింపుచు నబల యేడ్చుచును
మనమునఁ దెగియుండె మఱియు సంతటను
నాదయాపరమూర్తి యార్తరక్షకుండు
నా దేవదేవుండు నభయదాయకుండు
జ్ఞానసంబంధు నాథుఁ డామె రావించి
పూని యా సెట్టి కెప్పుడు విషహరణ
ముగఁ జేసి బ్రతికించి మోదమ్ముతోడ
మగువఁ బెండిలిచేసి మఱి వీరిఁ బనుపు
మని యానతిచ్చిన నతఁడును వచ్చి
తన దివ్యదృష్టి యాతనిమీఁద నిడిన
యంతట బ్రతికి చయ్యన లేచి వచ్చి
సంతోష మెసఁగ నాసతియును బతియు
నిమ్ముగ తిరువెఱుంబీశు సన్నిధికి
నరిగి సాష్టాంగమ్ము లంతంతఁ జేసి

దేవ ! సర్వేశ్వర ! దేవాదిదేవ !
భావజసంహార ! పాపవిదూర !
తిరుపెరుంబాపురాధీశ ! లోకేశ
తరుణేందుజూట యీ తరుణిని నన్ను
బ్రతికించితివి కృపాపారీణ హృదయ !
మఱి గొల్చి నేను నా మధురకుఁ బోయి
యీ యింతిఁ బెండ్లాడి యిల్లుకాలమ్ము
కాయజాంతక ! నీదు కరుణ నుండెదను
పోయెదమని వేగఁ బొలఁతియు నతఁడు
నా యీశునకు వందనార్థులై జ్ఞాన
సమ్మంధునకు మ్రొక్కి చనియెద మనిన
నమ్మహాత్ముఁడు వారి కానతి యిచ్చె
నరయఁ బ్రాణములు దేహము లనిత్యములు
తిరుపెరేశ్వరు సన్నిధిని వేడ్కతోడ
వైళంబ యిచట వివాహమై మీరు
హాలాస్యపురమున కరుగుడీ ! యనిన
సెట్టియిందులను నిషేధింతు రచట
చుట్టమ్ము లిదియాడఁ జాలు నా గాన
నరిగి యచటను బెండ్లాడెద మనిన
నుతియును జ్ఞానసంబంధుఁ డిట్లనియె
నందు కిజమ్మియు హరుఁడు కాపమ్ము
పొందుగా సాక్షి సెప్పెదు రిఁదు వైశ
వెరవక పెండ్లాడు వేడ్క నీవనిన
పరిణయంబాడె నాపడఁతిని సెట్టి
యాదంశతులు వచ్చి యతిపాదమునను
నా దేవునకును సాష్టాంగము జేసి
సమ్మంధవరునకు సద్భక్తి మ్రొక్కి
మమ్ము రక్షించితి మరువ మీ నన్నెఁడును
బోయెదమని చెప్పి పొలతియుఁ దాను
బాగాయక మాధుర్య పట్టణమ్మునకును
నేతెంచి తనవారి కెల్లఁ దాఁ బన్న
గాతురుండగుటయు నా స్వామి కరుణఁ
బ్రదికి యాయింతిని బరిణయంబగుట

దేవ ! సర్వేశ్వర ! దేవాదిదేవ !
శాపజసంహార ! పాపవిదూర !
తిరుపెరుంబాపురాధీశ ! లోకేశ
తరుణేందుజూట యీ తరుణిని నన్ను
బ్రతికించితివి కృపాపారీణ హృదయ !
మఱి గొల్చి నేను మా మధురకుఁ బోయి
యీ యింతిఁ బెండ్లాడి యెల్లకాలమ్ము
కాయజాంతక ! నీదు కరుణ నుండెదము
పోయెదమని వేగఁ బొలఁతియు నతఁడు
నా యీశ్వునకు వందనార్థులై జ్ఞాన
సమ్మంధునకు మ్రొక్కి చనియెద మనిన
నమ్మహాత్ముఁడు వారి కానతి యిచ్చె
నరయఁ బ్రాణములు దేహము లనిత్యములు
తిరుపెరేశ్వరు సన్నిధిని వేడ్కతోడ
వైశ్యంబ యుచటు వివాహమై మీరు
హాలాస్యపురమున కరుగుడీ ! యనిన
సెట్టియుఁ డులనః నిషేధింతు రచటి
చుట్టమ్ము లిదియెల్లడఁ జూలు నా గాన
నరిగి యచటను బెండ్లాడెద మనిన
నుఱియును జ్ఞానసంబంధుఁ డిట్లనియె
నందు కీజమ్మియు హరుఁడు కూపమ్ము
పొందుగా సాక్షి నెప్పుడు కిందు వైశ
వెరవక పెండ్లాడు వేడ్కనీవనిన
తరుణియుం బాడె నా వడఁతిని సెట్టి
యాదంపతులు వచ్చి యతిమోదమునను
నా దేవునకును సాష్టాంగముం జేసి
సమ్మంధవరునకు సద్భక్తి మ్రొక్కి
మమ్ము రక్షించితి మరువ మో నన్నఁడును
బోయెదమని చెప్పి పొలఁతియుఁ దాను
బాయక మాధుర్య పట్టణమ్మునకును
నేతెంచి తనవారి కెల్లఁ దాఁ బల్కె
గాతురుండగుటయు నా స్వామి కరుణ
బ్రదికి యీయింతిని బత్నియుంబగుట

వచ్చిన భర్తకు వడిఁ బాదయుగళ
మచ్చుగాఁ గడిగి యాహారమ్ము పెట్టి
యుల్లమ్ము రంజిల్ల నొగి విడె మిచ్చి
చల్లగా మృదువైన శయ్యాతలమ్ము
నత్తఱి నూరుల యందంద యొత్తి
చిత్తమ్ము రంజిల్లఁ జేయంగవలయు
నీ గుణమ్ములు గల యిల్లాలిఁ జూచి
బాగైన ఘనపుణ్యభామిని యంద్రు
వేయేల నిట్టి సాధ్విని నెవ్వఁడేని
పాయని వేడ్క నపాంగమ్మునందుఁ
బలుమారు నాత్మలోపలఁ దప్పఁజూచు
నల ద్రోహియైన దురాత్ముని కెపుడు
బడబానలము కంటె పావకు కంటె
సతత పతివ్రతాచార ప్రభావ
మతితీవ్రమై తాఁకు నా సాధ్వి చూపు
పాలిండ్లపైనున్న పయ్యెదమీఁద
గాలిపాటుగ నోడు కేడు జేతులెత్తు
నని పతివ్రత లక్షణమ్ములు గొంత
వినిపించి వినుఁడు నా వెలఁదిట్లు నడువ
నటు గొంతకాలమ్ము నత నగ్రభార్య
చిడిముడి పడి యుదాసీనమ్ము లాడి
రోసి ! నీ వెక్కడనో గూడి వచ్చు
దాసివి నాసరి దానవా ! యనిన
యానాతి లజ్జానతాస్యయై యేను
గూడివచ్చుటయును గుఱుతుగాఁ బెండ్లి
యాడివచ్చుటయును నాస్వామి యెఱుఁగు
తిరుపెరుంబాపురి దేవుండు జమ్మి
తరువు కూపమ్మును దగు సాక్షి గాక
యచ్చోట నే పెండ్లియాడి యిచ్చటికి
వచ్చితి నన్న యావనిత యిట్లనియె
నీవుజెప్పిన వారి నిచటికి సాక్షి
రావించినను బతివ్రత వౌదు నీవు
ననిన నా చొక్కనాయకుని సన్నిధికిఁ

జని తలోదరి నమస్కారమ్ము జేసి
యోసోమసౌందర్య ! యోకృపాధుర్య !
యో సదాసంజ్ఞాత్మ ! యోపరమాత్మ
యో మీనజాత్మేశ ! యోదుఃఖనాశ
యోకాముభస్మాంగ ! యోకృపాపాంగ !
యోకాలసంహార ! యోకృపాకార !
యోమధురానాథ యోచొక్కనాథ
నాపాలిదైవంబ ! నాపాలి వేల్ప !
నాపాలి సర్వేశ ! నాపాలి వరద !
పరమేశ నామనోభావమున తిరు
పరమేశుఁడు శమి కూపంబును సాక్షి
గాను బెండ్లాడి యిక్కడికి వచ్చినను
నేను టూటోటని నేఁడు నా సవతి
కన్నిచ్చవచ్చినకన్నె నీ వనుచు
నన్ను బోనాడె బాంధవు లెల్ల వినఁగ
దేవ ! నాకెవ్వరు దిక్కులేరాత్మ
భావింప నీవె నాపాలిదైవంబు
దాతయుఁ దల్లియుఁ దండ్రి వీవనుచు
నాతురమ్మున వస్తి నభవ యీ జమ్మి
వృక్షమ్ము కూపమ్ము వేగ నిచ్చటికి
సాక్షి రప్పించి యీజగ మెల్ల నెఱుఁగఁ
బెండ్లాడు విధము చెప్పింపక యున్న
గుండ్లతోఁ దలకొట్టుకొని చచ్చుదాన
తలపు లేటికి నింకఁ దప్ప నీమాట
పళియంజినాథ ! నీపాదమ్ము లాన
యని విన్నవించిన హాలాస్యవిభుఁడు
మనమున దయగల్గి మగువ యింటికినిఁ
బొమ్ము ముందరను నిప్పుడు మేము నుయ్యి
జమ్మి యచ్చటు వచ్చి సాక్షి చెప్పెదము
ననినను బ్రణమిల్లి యామాట నమ్మి
తనజాతి గూర్చి యత్తన్వియు నంతఁ
గావేరి దరినున్న ఘనశమి-నుయ్యి
యావైశ్య దరి మధురాపురమ్మునకు

స్థావరమ్ములు మాని జంగమరూపు
లై వచ్చి రెల్లరు నాశ్చర్యమందఁ
ఖాండీడు దుర్గాధిపతులు మన్నీలు
దండనాయకులు నందఱు వినుచుండ
వినువీథి సురలెల్ల వెఱగంది చూడ
వినిపించె నప్పుడా వృత్తాంతములు
తిరుపెరుంబాపురి దేవదేవునిని
దరిసించి వేడ్క నీతరుణి సెట్టియును
యారాత్రి వసియింప నావేళ సెట్టి
దారుణాశీవిషదష్టుఁడై యచట
మృతిపొంది నంత నీ మీనాక్షి దైవ
పతి సన్నిధిని దుఃఖపడి వినుతింప
నమ్మహేశ్వరుఁడు దయాళుఁడై జ్ఞాన
సమ్మంథు మంత్రరక్షను బ్రతికించి
యటు వైశ్యసతికి మేమందఱుఁ జూడ
నిటలాక్షుఁ డపుడు పెండిలి సేసె యనిశ
మిందుకు సందేహ మేదియు లేదు
సౌందర్యనాథుఁ డే సాక్షియౌ ననఁగ
నామధురేశ్వరుం డభవుఁ డవ్యయుఁడు
సోమశేఖరమూర్తి సురరాజనుతుఁడు
విభుఁడు మీనాక్షితో వృషభమ్ము నెక్కి
సభికులై యా దేవసంఘముల్ గొల్వ
మిన్నేరుజడలును మిక్కిలికన్ను
బున్నమరాయనిఁ బువ్వుగాఁ దాల్చి
పొడల దుప్పటి గట్టి భూతి మేనమర
నొడల రుద్రాక్షలు నొరవుగా మెఱయఁ
గప్పుగుత్తుక యొందుఁ గాంతి చెన్నొంద
నుప్పరమ్మున సుర లుప్పొంగి చూడ
వైశ్యకన్యామణి వైఖరు లెల్ల
వైశ్యకోటికి రాజవరులకుఁ దెల్ప
నాశ్రితజనుల నిట్లాడికొండనుచు
నాశ్రిత వాత్సల్యుఁ డభయదాయకుఁడు
పళియంజనాథుఁ డాపత్సహాయుండు

నళికలోచనుఁడైన హాలాస్యవిభుఁడు
శ్రీచొక్కనాథుండు జితమన్మథుండు
వాచామగోచరవర్ణితయశుఁడు
నడబావి జమ్మికి నడుమగా వచ్చి
పొడవున నిలిచెఁ దెంపున గానిపింప
నప్పుడచ్చటి జను లామహీవిభుఁడు
నప్పట్టులోనన యా వైశ్యవిభుఁడు
నత్యంతభక్తి సాష్టాంగమ్ము నెఱఁగి
సత్యంబు దెలుపంగ స్వామి విచ్చేసె
ననుచుండ నంతలో నద్రిజాజాని
వినువీథిఁ బ్రత్యక్షవిభవమ్ము మెఱసి
యచ్చట నున్నట్టి యందఱు వినఁగఁ
జెచ్చెరఁ దానిట్లు చెప్పంగఁ దొడఁగె
నొనరంగ నాలింపుఁడో వైశ్యులార !
యొనరంగ నాలింపుఁ డో జనులార !
యీవైశ్యసతికిని నీకళావతికి
నీవారిజాక్షికి నీగుణవతికి
నీముగ్ధ కీసాధ్వి కీసతీమణికి
నీమందగమనకు నీపతివ్రతకు
నొచ్చెమ్ముగలదన్న నొందు దోషములు
నొచ్చెమ్ము లేదన్న నొందుఁ బుణ్యములు
బావియు జమ్మియుఁ బలికినవిధము
భావింప నిజముగాఁ బరికింపకున్న
రౌరవనరకమ్ము రాకేల మాను
నారయ నిది నిజంబని పల్కె శివుఁడు
నావేళ సతిపతులాత్మ నుప్పొంగి
వేవేగ సౌందర్యవిభునిగా నెఱిఁగి
దండముల్ భక్తి నెంతయు నాచరించి
చండాంశునేత్రాయ సర్వేశ్వరాయ
కాలకూటధరాయ గంగాధరాయ
హాలాస్యనాథాయ యఘనాశనాయ
పరమపవిత్రాయ ఫాలనేత్రాయ
కరుణార్ద్రచిత్తాయ కాలకాలాయ

దుర్గాధినాథాయ దురితహరాయ
భర్గాయ తే నమో పార్వతీశాయ
కైలాసనాథాయ కాలకంఠాయ
లీలావిలాసాయ లేఖస్తుతాయ
పాహి జ్యోతిర్మయ ! భవ భయహరణ !
పాహి శంకర శివ పావనాకార
యపవాద మెడలించి యభవ యీవేళ
కృపగల్గి బ్రోచితే కృత్తిసద్వాస !
యని యిట్లు ప్రార్థింప వారుఁ డట్టివేళ
జను లందఱాలింప జగము కీర్తింప
నీమహాస్థలియందు నెంచి చూడంగ
కామాక్షికనఁ బతివ్రతలు లేరనియె
నప్పుడు సభవార లందఱు రాజు
నప్పుణ్యసాధ్వికి నందంద మ్రొక్కి
యిట్టిపుణ్యాంగన నెఱుఁగ మెందులను
సెట్టి యెంతటి పుణ్యశీలుఁడో ! యనుచు
జనపతి ప్రజలును జగము వారెల్లఁ
గొనియాడి రట నొక్క ఘోషమ్ముగాను
సురలు సంతోషించి సుమసారవృష్టి
గురియించి రప్పుడు కోర్కెలు నెలఁగ
మానుగా నాజమ్మ మాను మాపమ్ము
మాన కెప్పుడు నుండు మధురాపురమున
నాసాధ్వి యాసెట్టి యతిభక్తి గలిగి
శ్రీసౌందరేశ్వరు సేవఁ జేయుచును
బేరసారము లాడి ప్రేమతో జంగ
మారాధనము సేయు చట్లుండి రంత
నావేళ సకలలోకావనోదారు
భావజసంహారు భక్తమందారు
శ్రీచొక్కనాథుని క్షితిమండలమునఁ
బ్రాచుర్యమహిమతోఁ బట్టమ్ముగట్టి
భావించి సురలతోఁ బద్మలోచనుఁడు
నావిరించియును నింద్రాదిమునులు
పూజించి మధురేశ ! యోచొక్కనాథ !

రాజశేఖర ! నీవు రాజితమ్ముగను
గైలాసమున నుండుకరణి నీస్థితిని
వాలాయముగ మీరు వాసమ్ముసేయ
తెగాన మేము దేవరకు నీవేళ
పళియంజి పలికినిc బట్టమ్ముగట్టి
వేడుకc జూతుము వేదాంతవేద్య !
ఏడ నుద్దనిమీరు నెంచంగ వలదు
నంగజసంహార ! యానతిమ్మనిన
నంగీకరింప బ్రహ్మాదిదేవతలు
దదుపస్కర ద్రవ్యతతులెల్లc గూర్చి
సదమలచిత్తులై సంతోష మొదవ
పురిము శృంగారించి బుధవరేణ్యుండు
కర మొప్పcగా విశ్వకర్మను జూచి
నయ మొప్ప సింహాసనమ్ముc దెమ్మన్న
మయుc డంత సంతోషమానసుం డగుచు
భాసురరత్న ప్రభాసమ్మునైన
భాసమా నోజ్జ్వల భవ్యరత్నముల
నమరిన దివ్యసింహాసన మ్మపుడు
ప్రమదమ్ముతోcడ కపర్ది కీతగును
నని నిల్పి గనుగొను నమరు లావేళ
ఘనదుందుభిధ్వనుల్ గలయంగ మ్రోయ
గంగాజలమ్ములక్కలశ తోడ మంచి
బంగారుకుండల బాగుగcదెచ్చి
యుంచినc గనుగొని యుబ్బొంగి మది వి
రించాది సురులు వరించిన వేడ్క
శ్రీ చొక్కనాథు నాశ్రిత పారిజాతు
నాచొక్క మా పీఠి నమరంగ నునిచి
మంగళాలంకార మహితయౌ సర్వ
మంగళ నావెంత మహిమతో నునిచి
హరియును బ్రహ్మయు నమరనాయకుcడు
పరమునీశ్వరులు గీర్వాణకిన్నరులు
యభిషేక మొనరించి యాత్మ మోదించి
శుభగల రత్నాలపట్టమ్ము గట్టి

యెన్నాళ్ళు కైలాస మెన్నాళ్ళు గిరులు
నెన్నాళ్లు నాకసంబెన్నాళ్ళు భూమి
యెన్నాళ్ళు నక్షత్రమిలలోన నుండు
నన్నాళ్ళు మధురలో నఖిలలోకేశ !
పన్నగభూషణ ! వసియించి నాథ !
వాచామగోచర వారిధి శరధి !
శ్రీ చొక్కనాయక ! శ్రితపారిజాత
మీనాక్షి దేవితో మీఱిన వేడ్క
నీ నరకోటుల సేవతో మమ్ముఁ
బాలింపుచుండని పట్టమ్ము గట్టి
కేలులు మోడ్చిన గిరిశాయి మీఁదఁ
గురిసె పువ్వులవాన కోటుల కొలఁది
మొరసె దుందుభులు ముమ్మరముగా దివిని
నావేళ బ్రహ్మాదు లందఱుఁ గూడి
యోదేవ ! దేవేశ ! యో చొక్కనాథ !
హాలాస్య నాయక యభవలోకేశ
పాలింపవే మమ్ము బాలింపు మనుచు
వేడిన వారల వీక్షించి హరుఁడు
పోడిమి మన్నించి పురముల కనిచి
యాచంద్ర తారార్క మగునట్లు భువిని
శ్రీ చొక్కనాథుఁడంచి తలీల నుండె
నాపాండ్యభూపాలు డాభూమిప్రజలు
నీపాటవీవాసునికి సాటియైన
దైవంబు లేదని తగుభక్తితోడ
నమ్మి యా సౌందర్యనాథునిఁ గొల్చి
సమ్మదినున్నారు నిజపుణ్యులగుచు
మునులార ! యీవిధంబునఁ జొక్కనాథుఁ
డనుపంద నా మధురాపురంబునను
అలిఁ జతుష్షష్టి లీలావినోదముల
విలసిల్లె నాపురి విఖ్యాతిగాను
నందమై నారదవ్యాసులు విప్ర
స్కాంద పురాణార్థ సార మేర్పఱచి
భావించి చెప్పిరి ప్రాగల్భ్య బుద్ధి

గావించి రెంతయు గ్రంథరూపమున
నటుగాన మీరలు నాపుణ్య చరిత
దిటవుగా నన్నుఁ బ్రార్థించి వేడినను
నా మహా కావ్యమ్ము నాత్మలోఁ దలచి
వేమాఱు సద్భక్తి వినుతించి మించి
నలువొప్పగాఁ జొక్కనాథ చరిత్ర
మలరంగ మీరలు నందఱు వినఁగ
మెఱసి యా మహిమలు మించి వేర్వేఱఁ
బరగ సంక్షేప రూపమ్ముగఁ జేసి
నా నేర్చు విధమున నాదు జిహ్వకును
బూనిన మార్గమ్ముఁ బొసఁగఁ జెప్పితిని
మనమార నాస్వామి మహిమ లెంతైన
వనజాసనుండును వనజనేత్రుండు
వాసవయక్షగీర్వాణ కింపురుష
వ్యాసాది సన్ముని వ్రాతంబులకును
భావింపఁగా రాని పరమాత్మ నచట
నావశంబగునె వర్ణన సేయ మఱియు
నాస్వామి మహిమ లెయ్యెడ నెంచి చూడ
నా స్వామి యెఱుగుగా కనఘాత్ములార !
మఱి యదిగాక యమ్మధురలోఁ దక్క
నరువది నాల్గులీలా వినోదముల
నేపురి నటియించె నిందు శేఖరుఁడు
నాపురినేగాక యాశ్చర్య మెసగ
గా ననేకమ్ముల కాలకంధరుఁడు
వలనుగా రక్షించు వారెవ్వ రనినఁ
జిత్రదేశు రామయ్య సాంఖ్య తొండండు
నవిముక్తదేవుండు నటకేశి బ్రహ్మ
మడివాలుమాచయ్య మాదిరాజయ్య
బడవర బ్రహ్మయ్య భానరుసుగారు
కుమ్మర గుండయ్య గొగ్గరుసుగారు
జమ్మయ్య రెమ్మయ్య శాంతదేవుండు
కలకేత బ్రహ్మయ్య కాశిరాజయ్య
తెలుఁగెనుమనునయ్య! తెనుఁగుజొమ్మయ్య

శివరాత్రిసంగయ్య సింగిబొప్పయ్య
శివముద్దుదేవయ్య చిదిలిచందయ్య
సదమలచిక్కయ్య సంగమేశ్వరుఁడు
పుదరద రామయ్య పుండ బ్రహ్మయ్య
బాలర్పు భీమయ్య బండిదేపయ్య
హోలాస్యు మధురయ్య యాపెఱాబళయ్య
కన్నడ బ్రహ్మయ్య కవియ మల్లయ్య
కిన్నర బ్రహ్మయ్య గిరికి చెవ్వయ్య
కదలి నిమ్మయ్య యేకాంత రామయ్య
యుదయమరుసుంగారు యోగిరామయ్య
సమనిత్యనేముండు శరణమ్మగారు
నమురుతదేవుండు నరిది పొన్నయ్య
పిండయ్య బ్రహ్మయ్య యేలేశుకేశు
కొండగుడి శేషయ్య కుళికి సూళయ్య
యుత్తమాంగద కేశి కొన్నయ్య గండ
కత్తెర నాచయ్య కక్కయ్యగారు
గణరాశి మరుళయ్య కాలాగ్నిరుద్రు
నోణమేశు చిక్కయ్య యులుకు చందయ్య
పిమ్మ సంగయ్యయు పిండి బొమ్మయ్య
దొమ్మర బ్రహ్మయ్య ధూర్జటి కేశి
బాచిరాజయగారు భాస్కరయ్యయును
కేచిరాజయ్య చింకేశు బింకయ్య
శంకమంచయ్య నిజలింగ చిక్కయ్య
యంక బ్రహ్మయ్యయు ననిమిష కేశి
వీరలింగయ్యయు వీరనల్లయ్య
వీరమాచయ్యయు వీరనాగయ్య
మురుపాలు కేతయ్య ముసిడి చౌడయ్య
సురియ చౌడయగారు శూలద బ్రహ్మ
కపిలేశు విస్సయ్య కొసయ్యగారు
కపిల బ్రహ్మయ్య భిర్కల మలక్కయ్య
మల్లయ్యయునుగరహళ్ళి బొమ్మయ్య
ఒల్లెబ్రహ్మయగారు నోడలముల్లు
కల్లి దేవయ్య శంకరి మల్లనాథుఁ

డల్లను బ్రభుదేవుఁడరయంగ వీర
లాదిగా గల యసంఖ్యాత ప్రమథులు
నావరణస్థాన నలరు సాలోక్య
సామీప్యసారూప్య సాయుజ్య పదవు
లా మహాదేవుండు నటు వారికిచ్చె
నేమని వర్ణింతు నీశ్వరేశ్వరుని
బ్రహ్మాదులకునైన భావింపరాని
బ్రహ్మమై తగు పరబ్రహ్మంబు నతఁడు
నని యిట్లువారికి నత్యంత ప్రీతి
వినిపించి మఱియును వేడ్క నిట్లనియెఁ
జొక్క నాథాయన్న శుభములు నెందు
చొక్క నాథాయన్న క్షుద్రమ్ములుడుగు
చొక్క నాథాయన్న నురుగు దోషములు
చొక్క నాథాయన్న సులభమ్ము ముక్తి
చొక్క నాథాయన్న సుగుణమ్ము గలుగుఁ
చొక్క నాథాయన్న జూచు దారాద్రి
చొక్క నాథాయన్న శూరత్వ మెసఁగు
చొక్క నాథాయన్న సురనాథు పదవి
వెయ్యేల శ్రీచొక్క విభుఁడన్న జాలు
బాయు బ్రహ్మహత్యాది పాపమ్ము లెల్ల
నీ మహాకావ్యమ్ము నిచ్చలోనూని
వేమాఱు దృఢ భక్తి వేడ్కతో నెపుడు
చదివిన వ్రాసిన జవి మెయి వినిన
మదిలోన నునిచిన మఱి నుతించినను
వినుఁడు బ్రహ్మత్మత విట్ఛాభ్రదులకును
మనమున దలచు గామ్యార్థమ్ములొంది
పాయనిధనధాన్య భాగ్యముల్ వస్తు
వాహనమ్ములు గల్గి వసుధ బాలింతు
రాయురారోగ్యమ్ము లైశ్వర్య సిద్ధి
యిలలోన మఱియు ననేకకాలమ్ము
వెలయంగ నుందురు విమలాత్ములగుచు
ననిన సన్మునులెల్ల రతనికి మ్రొక్కి
మునినాథ! మీవల్ల ముక్తుల మైతి

మనిసంభ్రమమ్ముతో నానందమంది
తనువుల బులకాంకితంబులు గాఁదమ
హర్షాశ్రు పూరమ్ములక్షియుగ్మముల
వర్షధారల మాడ్కి వడి మించి దొరఁగ
గద్గదకంఠులై కలకంఠు సభవు
సద్గుణ చింతాంబుజాత షట్పదుని
నాత్మ నిల్పుచు దన్మయావస్థులగుచు
నాత్మానురక్తులై యామహాదేవు
చరితమ్మునకు మహాశ్చర్యమ్ము నంది
మఱియు గుంభజునిచే మన్ననల్ గాంచి
నారద వ్యాస సనకాది సంఘముల
నారీతిఁ జేరి సాష్టాంగముల్ చేసి
మఱియును మఱియు నమ్మహనీయ చరిత
మరసి పేర్కొని మెత్తురహర్నిశ నపుడు
శ్రీ కమలాక్షు సుస్థిర కృపాలబ్ధ
రాకాసుధాంశు నిర్మల కాంతి దేహ
యరుణాచలేంద్ర పూజా మోద విభవ
భరమించు సన్నందలి ? పురాఢ్యుడ
ప్రియబంధు వనచైత్ర ! శౌపాలగోత్ర !
దయసత్యదాక్షిణ్య ధర్మస్వరూప !
తగమించు వ్యాసతీర్థప్రియశిష్య
సుగుణాఢ్య సరసతీ సోదర చరిత !
బాహాయతోన్నత శౌర్యుఁడచ్యుతదేవ
రాయ ప్రతాప కార్యధురంధరుండ !
నంచిత కోదమ నాయంకర గండ !
మించి వర్తించు స్వామి ద్రోహగండ !
చేకొన్న సుకనూరి సింహ భుజాంక !
వాకిటిచిన్న భూవరసహితుండు
లెక్కింప జౌషష్టి శిలల వెలయు.
చొక్కనాథ స్వామి సుస్థిర భక్తి
యాయురారోగ్యమ్ము లనిశమ్ము వొసఁగఁ
బాయని సామ్రాజ్య పద్ధతి చే నెపుడు
నలరుచు బుత్ర పౌత్రాభి వృద్ధియును.

గలిగి వర్ధిల్లుచుఁ గారుణ్య ధర్మ
వినయ శౌర్యౌదార్య విస్ఫూర్తి మించి
చినరామ విభువర జ్యేష్ఠ సౌభాగ్య
బసవ భూవర తపః ఫల సత్కుమార !
వసుధ గల్గిన కమ్మవంశవర్ధనుఁడ !
బాగొప్ప దిబ్బమాంబా దేవి గర్భ
సాగరసంభవ సంపూర్ణ చంద్ర !
చిరకీర్తి యుతుఁడైన చిన్నరామప్ప
పురుషరత్నంబనఁ బొగడంగ మించు
లలితకీర్త్యభిరామ ! లావణ్య సోమ !
విలసిల్లు పెదరామ ! విభవసుత్రామ !
నరనాథ ! శ్రీ చొక్కనాథ సత్కృపను
ధర నేలు మాచంద్ర తారార్కముగను.
ఇది సర్వఘన సత్కవీంద్ర పాదాబ్జ
విదితపూజామోద విమలుండు పచ్చ
కప్పుర సౌరభ్యకలిత మానాంక
తిప్పరాజ సుపుత్ర తిరువేంగళేంద్ర
విరచితమ్మగు లోకవిఖ్యాతమైన
సగస లక్షణకావ్యసత్కవీంద్రాభి
నందిత శ్రీ చొక్కనాథ చరిత్ర
మందును నిసి నవమాశ్వాస మయ్యె

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

ఓం తత్సత్.

